# చైనా విప్లవచరిత్ర

(ప్రథమసంపుటి - తాయ్‌పింగ్, సోవియట్ విప్లవములు)




రచన:

నిడమర్తి అశ్వనీకుమారదత్తు.





ప్రగతి ప్రచురణాలయం.

# విషయసూచిక.



## రెండవ భాగం.

# 1 వ అధ్యాయం.

## చైనా జాతీయతకు చారిత్రక పునాదులు.

"మానవజీవిత ఆదిమదశలో మానవులు స్వార్ధపరులు. స్వప్రయోజన పరులుగాను ఉండేవారు. సాముదాయిక ప్రయోజనాలుండేవి కావు. మానవ సంబంధాల్లో కట్టుబాట్లు, నియమాలు లేక, అల్లకల్లోలంగా వుండేది.

"స్వప్రయోజనాలను చూచుకోక, ప్రజాబాహుళ్యపు కష్టాల్ని నివారిస్తో, వారిక్షేమానికి అహర్నిశలూ పాటుపడే రాజురాకతో యీపరిస్థితులు తారుమారయ్యాయి. పరిపాలనావిధుల భారంతో కృంగిపోతూకూడ రాజు అధికారాన్ని స్వార్థానికి ఉపయోగించుకునేవాడుకాడు. అందుకనే ఆస్వర్ణయుగంలో సూయీయూ, ఉక్వాంగ్‌లవంటి ఆదర్శప్రాయులైన రాజులవలె పరిపాలనాభారాన్ని వహించేందుకు ప్రజలెవ్వరూ కాంక్షించేవారు కారనడంలో ఆశ్చర్యం లేదు.

"క్రమేణా ప్రజలసొత్తంగా తమదేననీ, తమ భోగభాగ్యాలు, ఎదురులేనిఅధికారమే ప్రజాక్షేమం అనీ పరిగణింపసాగారు ప్రభువులు.

"స్వర్ణయుగంలో జాతీ, ప్రజలూ శాసకులు. ప్రభువులు సేవకులు. అందువలన ప్రజాప్రయోజనాన్ని కాపాడటమే చక్రవర్తి ప్రధానవిధిగా యెంచేవాడు. కాని యీరోజుల్లో చక్రవర్తి శాసకుడు, ప్రజలు బానిసలు అయ్యారు. పాలకుని అంతులేని అధికార, ధనలోభాలవలన పాలితుల జీవితానికి భద్రతలేదు. దుస్సహ పరిస్థితు లేర్పడ్డాయి. రాజ్యాంగాన్ని తనస్వంత ఆస్తిగా చేసుకునేందుకు వేలకొలది ప్రజలను రాజు చిత్రవధ చేశాడు. రాజ్యాధికారం తన పుత్రపౌత్రులకు చెందజేసేందుకు అడ్డమొచ్చినవారి నందరినీ అణగత్రొక్కాడు. తనకోసం ఖోరి మడిసిన వారి మీదకూడ ఆతనికి అభిమానంలేదు.

"ఈవిధంగా రాజ్యాధికారాన్ని హస్తగతంచేసుకుని ప్రజల రక్తాన్ని పీల్చనారంభించాడు. దాస్యం చేసేందుకు మొగపిల్లల్ని, కామ తృష్ణ తీర్చుకునేందుకు ఆడపిల్లల్ని తలిదండ్రులనుండి విడతీశాడు. ఇదంతా తన సహజహక్కని విర్రవీగుతో "నేను అనుభవించే భాగ్య భోగ్యాలు, నేనుచేసే పనిలోవచ్చిన అదనపులాభం" అని దర్పంతో హుంకరించసాగాడు.

"అందువలన ప్రజలకు తమయేలికకన్న గొప్పశత్రువు వేరేలేడు. మనల్ని నాశనం చేస్తోన్న యీచక్రవర్తి కౌరివితో తలగోక్కుంటామా? పూర్వకాలంలో తమరాజును తండ్రిగాభావించి గౌరవించడం, వినయ విధేయతలు చూపడం, భగవంతునివలె పూజించడంకూడా ఆకాలపు ప్రజలకు సహజం. ఈకాలపు ప్రజలకు యిప్పటి పాలకులను శత్రువులు గాను, దోపిడిగాళ్ళవలెను ద్వేషించడం సహజం. 'రాజు దేవాంశ సంభూతుడు, ఆతని ఆజ్ఞలు అనుల్లంఘనీయాలు కనుక యెట్టి షరతులు లేకుండా, రాజునకు ప్రజలు లోబడివుండాలి' అనిచెప్పే మెట్టవేదాంతుల పలుకులే ఆశ్చర్యం కలిగిస్తాయి. నిరంకుశులైన చై, చియూల దోపిడీ ప్రభుత్వాన్నుండి, వారినిచంపి ప్రజల్నిఉద్ధరించిన టాంగ్, ఊలనుకూడ వారు ద్రోహులంటారు. ఒక్కప్రభువంశం కొరకు లక్షలాది ప్రజలు కష్టించడం, ప్రాణాలు ధారపోయడం, ధర్మసమ్మతమంటారు. ఐతే కోట్లకొలది ప్రజల్లో సర్వసముడైన భగవంతుడు, ఏ ఒక్కమానవునో, ఏఒక్క కుటుంబాన్నో మాత్రమో అనుగ్రహించి, తక్కిన అందరి నాశ నం కోరాడని అనుకోవడం సబబుగా కనపడుతోందా?"

అంటూ పదిహేడవ శతాబ్దమధ్యభాగంలో వాంగ్‌లీచౌ అనే చైనాతత్వవేత్త ప్రజల్లో గొప్ప రాజకీయ ప్రచారం చేయనారంభించాడు. పద్దెనిమిదవ శతాబ్దంలో ఫ్రాంసు మొదలైన యూరప్ ఖండదేశాల నిరం కుశ చక్రవర్తుల సింహాసనాలను కుంకటిప్రేళ్ళతో పెగల్చిన వాల్టేరు,

రూసోలను యిద్దరు సామాజిక, రాజకీయ శాస్త్రవేత్తల ప్రబోధంవలెనే లీచౌ రాజకీయ సిద్ధాంతాలుకూడ చైనా ప్రజలను చైనాచక్రవర్తివంశ నిర్మూలనానికి ప్రోత్సహించాయి.

క్రీ. శ. 1368 వ సంవత్సరంనుండి చైనాదేశాన్ని పరిపాలిస్తోన్న మింగ్‌వంశ చక్రవర్తిని 1644 లో మంచూరియా దేశస్థులైన చింగ్ వంశజాలు పదభ్రష్టుని కావించి, చైనాను పరిపాలించ సాగారు. అంత వరకు చక్రవర్తి కొలువులో ఉన్నతపదవుల్లోవున్న కన్ఫ్యూషియను సిద్ధాంత వేత్తలకు పదవులు, ధనం ఆశచూపి, తమవంశానికి అనురక్తులుగా చేసుకున్నారు.

కాని, విదేశప్రభుత్వంమీద ద్వేషంతో మగ్గిపోయే చైనాప్రజలు అనేక రహస్య సంఘాల నేర్పాటుచేసి, తిరుగుబాటు సన్నాహాలు చేసే వారు, వ్యక్తిగత దౌర్జన్యచర్యలు జరిపేవారు. చింగ్‌వంశ నిర్మూలనం మింగ్‌వంశ పునఃప్రతిష్ఠాపన" మాత్రమే వారి ప్రధానాశయం. ఈకాలం లోనే వాంగ్‌లీచౌ రాజకీయ సిద్ధాంతాలు రాచరికంస్థానే ప్రజాతంత్ర రాజ్యాంగ స్థాపనకొరకు గొప్ప రాజకీయవిప్లవం చేయుటకు జాతిని సుసంఘటిత పరచాలనే భావానికి ప్రాముఖ్యతనిచ్చాయి.

## రహస్య సంఘాల ప్రాముఖ్యత.

అనేక శతాబ్దాలనుండి ప్రపంచంలోని వివిధదేశాలలోను ఆయా దేశాల రాజకీయ, ఆర్థిక జీవితంమీద రహస్యసంఘాల ప్రభావం అత్యమితంగా వుంటూవచ్చింది. ఈజిప్టు, పెర్షియా, జూడియా, గ్రీసు, రోమ్‌లలోని "ఏన్షెంటు" లని పిలవబడే రహస్యసంఘస్థుల రాజకీయ పలుకుబడి అందరూ యెరుగున్న విషయమే. 1789 లో ప్రారంభమైన బ్రహ్మాండమైన ఫ్రెంచి విప్లవంలో "ఇల్యూమినేట్" లు, 1816 లో దేశభక్తులు; 1830 లో "కార్బొనేరి"లనే విప్లవసంఘస్థులు గొప్ప రాజ

క్రియమార్పులకు కారకులయ్యారు. "ఫ్రెంచి ఫ్రీ మేసన్లు"ను సంఘస్థుల పలుకుబడి తరుణటర్కీ ఉద్యమానికీ, 1918 లో జర్మనీలో మ్యూనిక్ విప్లవానికీ, "అమెరికన్ మేసన్లు" 1911 లో చైనాలో జరిగిన విప్లవానికీ కొంతవరకు కారణభూతులు.

పాశ్చాత్య దేశాలలోలాగే ప్రాగ్దేశాలలోకూడ రహస్య సంఘాల ఆశయ, కార్యాచరణలే గొప్ప రాజకీయోద్యమాలకు, సంచలనానికీ, మార్పులకూ మూలకారణా లౌతూవచ్చాయి.

చైనాలోని రహస్యసంఘాలు పూర్తిగా రాజకీయసంఘాలేకావి మతసంబంధమైనవికావు. అతి ప్రాచీన కాలంనుండీ చైనీయులు, చక్రవర్తిని ఈశ్వరాంశ సంభూతుడవి యెంచి కొలిచేవారయినప్పటికీ ప్రజాపీడకుడైన దుష్టప్రభువును తొలగించేహక్కు ప్రజలకు కలదని భావించేవారు. మెన్షియస్‌అనే గొప్పబోధకుడు "ప్రజావిశ్వాసాన్ని కోల్పోయిన పాలకుడు భగవంతునిచే ప్రసాదింపబడిన పాలనాధికారాన్నికూడ పోగొట్టుకుంటాడు. అట్టి ప్రభువును హత్యచేయడం, దుష్టశిక్షణ మౌతుందికావి ఒకరాజును చంపడమవదు" అవి చాలకాలం క్రితమే ప్రచారంచేశాడు, ఈ ఉపదేశాన్నే తైపింగులు అనుసరించారు.

చైనా చక్రవర్తులు పురాతనకాలంనుండి అప్పుడప్పుడు చారిత్రక గ్రంధాలను తగులపెట్టివేసేవారు కనుక ప్రాచీన గుప్తసంఘాల చరిత్ర విపులంగా తెలియదు. క్రీ. పూ. 100 నుండి 210 క్రీస్తుశకం వరకూ చైనాను పాలించిన హాన్ వంశస్థులు తిరుగుబాటువలననే సింహాసనాసీను లయ్యారు. దుష్టశిక్షణ, శిష్టరక్షణకు న్యాయాన్ని నెలకొల్పేందుకుగాను పాలకునిమీద అసంతృప్తిచెందిన వారినందరినీ ప్రోగుచేసి ప్రభువును చంపివేయడమే అన్ని రహస్యసంఘాల పరమావధిగా వుండేది. హాన్ వంశానికి మూలపురుషుడు లియు పాంగు. ఆ కాలంలో చక్రవర్తి బహు దుర్బలుడు, నిరంకుశుడు. ప్రజల జీవనాధారమైన వ్యవసాయపరిస్థితులు

చాల ఒడిదుడుకులుగా వున్నాయి. వ్యాపారం క్షీణించింది. ప్రజలలో తీవ్రమైన అసంతృప్తి చెలరేగింది. కొట్లాటలు, సైనికులతో సంఘర్షణలు హెచ్చాయి ఈ విషమ పరిస్థితులలో లియుపాంగు ఆందోళనాపరులను కూడదీసి చక్రవర్తిని చంపి నూతన రాజవంశాన్ని స్థాపించేందుకు పూనుకున్నాడు. ప్రజలకు మూఢభక్తి విశ్వాసాలు కలిగేందుకు అశరీర వాణి తననే చక్రవర్తి కమ్మని ఆదేశించిందని ఒక కట్టుకథను ప్రచారం చేశాడు. అసంతృప్తి చెందిన ప్రజలను కూడగట్టి లియుపాంగు చైనాకు పాలకుడయ్యాడు.

ఈ సమయంలోనే చైనాలో "ఎర్ర కనురెప్పలు" "బియ్యపు దొంగలు," "పచ్చ పాగాలు," "అమర సైనికులు" మొదలగు అనేక రహస్య సంఘాలు పనిచేసేవి. శాశ్వత శాంతి స్థాపనయే యీ అన్ని సంఘాల లక్ష్యము. ఈ సంఘ సభ్యులందరూ రహస్యాలను వెలిబుచ్చమనీ, సంఘాశయాల కొరకు ప్రాణాల నర్పిస్తామనీ తమ రక్తంతో శపథాలు చేసేవారు. తరువాత స్థాపించబడిన "యాంగు త్రయం," "చాంగు త్రయం" అను సంఘాల నాయకులు "స్వర్గ సామ్రాట్టు," "మర్త్య సామ్రాట్టు" "మానవ సామ్రాట్టు" అను బిరుదులు కలిగి వుండేవారు. ఈ భావాలు, యీ బిరుదులే తైపింగుల కాలంలో కొలది మార్పులతో కనబడతాయి. క్రీ. శ. 68 వ సంవత్సరంలో చైనాలో బౌద్ధమతం స్థాపించబడింది. బౌద్ధులచే స్థాపించబడిన రహస్య సంఘాలలో "తెల్ల కలువ," తెల్ల తామర," "తెల్లసముద్రం," "పవిత్రోదకం," "తెల్ల విసన కర్ర," "ఈశ్వర న్యాయ" సంస్థలు ముఖ్యమైనవి. నాలుగవ శతాబ్దంలో మత సంఘాలుగా స్థాపించబడి, తర్వాత రాజకీయాశయాల కొరకై పనిచేశాయి. ఇంతవరకు జరిగిన అన్ని రాజకీయ విప్లవాలలోను యీ సంఘాలు పాల్గొంటూనే వున్నాయి. మంగోలియా వంశమైన యూంగు, చైనా వంశమైన మింగు, మంచూ వంశమైన సింగు వంశ ప్రభువుల పతనానికి వీరు పూర్తిగా తోడ్పడ్డారు.

చైనాను 1644 — 1911 వరకు పరిపాలించిన మంచూల కాలంలో రాజవంశ నిర్మూలనమునకు తిరుగుబాట్లు జరిగేవి. రహస్య సంఘ సభ్యుల కుట్రలు బయట పడినప్పుడు, చక్రవర్తి కుట్రదార్లను బహు క్రూరంగా హింసించేవాడు. 1808లో చక్రవర్తి జారీచేసిన ఆజ్ఞలో "వ్యాఘ్రవాలం," "న్యాయహస్తం," "కర్పూర హారతి" సంఘాలలో చేరినవారికి మరణదండన విధింపబడుతుందని ప్రచురించాడు. ఏడు సంవత్సరాల అనంతరం 1815లో, తరువాత 1900 సంవత్సరంలో మిక్కిలి ప్రసిద్ధిపడసిన "బాక్సర్సు" అనే సంఘం స్థాపించబడింది. కొన్ని మంత్రాలను పునశ్చరణ చేసి కర్పూరంతో ప్రతి నిత్యం హారతి నిస్తే కొన్ని అసాధారణ శక్తులు లభిస్తాయని విశ్వసించేవారు.

విద్వాంసులు, పండితులు పదవీ వ్యామోహంతో విదేశ మంచూ రాజవంశానికి దాసులై, దేశద్రోహం చేస్తూన్నందున వాంగ్‌లీచౌ, అతని అనుచరులు, చైనా పేదరైతులయందు తమ దృష్టిని కేంద్రీకరించి, అనేక జాతీయ విప్లవ సంఘాలను నెలకొల్ప మొదలెట్టారు. ఈ సంఘాలను చైనా రణదేవత పేరున 'హంగ్' సంఘాలని పిలచేవారు.

ఈ హంగ్ సంఘాలలో 'శాన్‌కోహుయి' (త్రిక సంఘం), 'టీన్‌టీహుయి' (స్వర్గ మర్త్య సంఘం), 'కోలోహుయి' (సోదరులు, పెద్దల సంఘం), 'తెల్ల రెక్క సంఘము,' 'దైవ న్యాయ సంఘము' అనునవి మిక్కిలి ప్రసిద్ధిచెందాయి. ఈ సంఘాల్లో హెచ్చుగా అసంతృప్తి చెందిన పేద రైతులు, కూలీలు, నిరుద్యోగులు ఉండేవారు. వీధి నాటకాలు, బుర్రకథలద్వారా ప్రజలలో ప్రచారం చేయబడేది. ఈ నాటకాలద్వారా దేశభక్తి భావాలు, విదేశ పాలకులమీద ద్వేషభావం వ్యాపింప చేసేవారు. ఈ సంఘాల్లో అస్పష్టమైన కమ్యూనిస్టు భావాలుకూడ వుండేవి.

"అంతులేని ఐశ్వర్యానికీ, దిక్కులేని దైన్యానికీ మధ్యనుండే విభేదాన్ని నాశనం చేసే పవిత్ర బాధ్యతను ఈశ్వరుడు మన మీద పెట్టాడు. తమ సంతృప్తికొరకు కోటానుకోట్ల ప్రజల ఆస్తుల్ని హరించి దుర్వినియోగ పరుచుకోండని, భూమాత, స్వర్గ పితలు కొద్దిమందికి హక్కులు యివ్వలేదు.

"లక్షలాది పీడిత ప్రజల శ్రమ ఫలితమైన ఐశ్వర్యాన్నంతా కొద్ది మంది శ్రీమంతులు, అధికారులు మాత్రమే అనుభవించాలని ఈశ్వరుడు యెన్నడూ వాంఛించ లేదు.

"విధి నిక్షేపాలతోతులతూగే భూమిని, కాంతితో వెలుగొందే సూర్యునీ, ఆనందదాయకమైన ప్రపంచాన్నీ కొద్దిమంది చేతుల్లోనుండి లాక్కొని, అందరూ అనుభవించాలి."

ఈ వాక్యాలను సంఘీయులందరూ పునశ్చరణ చేసేవారు. దుర దృష్టవశాత్తూ, యీ సంఘ సభ్యులందరూ విద్యాగంధంలేని రైతుకూలీ లగుటవలన, కమ్యూనిష్టు సిద్ధాంతవేత్తలు వీరిని అసహ్యించు కుంటూ, మంచూవంశ చక్రవర్తులకు వీరిని అణచడంలో అండగా నిలిచేవారు. అందువలననే, తైపింగు తిరుగుబాటు. బాక్సర్సు ఉద్య మాలు యీ రహస్య సంఘ సభ్యుల రక్తంతో ముంచెత్తబడ్డాయి. చక్ర వర్తి సైన్యాలలోకూడ హంగ్ సంఘ సభ్యు లనేకు లుండేవారు. హునాన్, హుపాయిలోయ దళాలు పూర్తిగా హంగ్‌సభ్యుల పలుకుబడికి లోబడి వుండేవి. బాక్సరు ఉద్యమాన్ని నడిపించిన 'టాటోహుయి' (పెద్దబాకు సంఘం) 'పాయ్‌లీన్‌చో' (తెల్ల కలువ) సంఘస్థులు ప్రథ మంలో "మంచూ వంశాన్ని నిర్మూలించండి! విదేశీయుల్ని నాశనం చెయ్యండి!" అనే నినాదాలతో బయలుదేరినప్పటికీ మంచూ రాజ్యాధి కారులు వారిని మాయమాటలతో మోసగించి పూర్తిగా పాశ్చాత్యులకు వ్యతిరేకంగా తిప్పారు.

అధికారుల లంచగొండితనం, మదాంధత, దుర్బలత్వము వల్లను, పాశ్చాత్యులు, విదేశీయులు మాటిమాటికినీ చేసే దురపమానములతో కృంగి, కృశించే చైనాలో జాతీయభావాలను యీ సంఘసభ్యులే కలిగించేవారు. అత్యున్నత నాగరికతా వైభవాలను ప్రజలజ్ఞప్తికి తెచ్చేవారు.

పందొమ్మిదవ శతాబ్దపు రెండవ అర్ధభాగంలో, యీ సంఘాల పలుకుబడిని గుర్తించి, ప్రభుత్వ ఉన్నతోద్యోగులుకూడ సభ్యులుగా చేరేవారు. యువాన్‌షీకేవంటి గొప్పసైనిక పలుకుబడి, అధికారం కలిగిన రాష్ట్ర గవర్నరుకూడా యీ సంఘాల్లో చేరాడు. విప్లవ మేధావులు కూడ చేరి, తిరుగుబాట్లను లేవదీయ జొచ్చారు. చైనా జాతీయ విప్లవపితయైన సన్‌యట్‌సేన్‌కూడ కోలోహుయిలో చేరి కొంతకాలం పని చేసిన తర్వాత, తన విప్లవ సంఘాన్ని నిర్మించాడు. ఇరవయ్యో శతాబ్దారంభంలో బయల్దేరి విస్తరించిన బ్రహ్మాండమైన ప్రజాతంత్ర విప్లవోద్యమాలకు యీ గుప్త సంఘాలే వెన్నెముక వంటివి. సన్‌యట్‌సేన్ ఆయన అనుచరులు యీ సంఘాలలోఅప్పటివరకు కొరతపడిన శిక్షణాయుతమైన విప్లవ కార్యక్రమాన్ని యిచ్చి, స్పష్టమైన విప్లవాశయాలను నిర్వచించి, మంచూవంశ నిర్మూలనం చేయగలిగారు.

## చైనాలో పాశ్చాత్య దేశాలు.

చైనా విప్లవభావనా పరిణామాన్ని సరిగా అర్థం చేసుకునేందుకు చైనా, పాశ్చాత్య దేశాల మధ్యనున్న సంబంధం తెలుసుకోవడం అత్యవసరం. సిల్కు, పింగాణీ సామాన్లు, టీ మొదలైన చైనా దేశపు సరుకులు యూరపు దేశాల్లో విరివిగా అమ్ముడయ్యేవి. రెండవ ఛార్లెసు రాజు యింగ్లండును పాలించేటప్పుడు టీ ప్రథమ పర్యాయం యింగ్లండు

చేరింది. అప్పటినుండి పాశ్చాత్యులు యీ సరుకులను విరివిగా దిగుమతి చేసుకొన నారంభించారు.

ప్రప్రథమంగా 13 వ శతాబ్దంలో కుబ్లయ్‌ఖాన్ మహాచక్రవర్తి కాలంలో వెన్నీసు వాస్తవ్యుడైన మార్కో-పోలో చైనా వచ్చి కొంత కాలం నివసించాడు. 16 వ శతాబ్దంలో పోర్చుగీసు వర్తకులు చైనాతో వర్తకం సాగించారు. 1594 లో చాలమంది డచ్చివర్తకులు కాంటన్ రేవులోదిగి, వర్తకం చేయ నారంభించారు. 1622 నాటికి పెస్కాడోరు ద్వీపాలను ఆక్రమించారు. అటుతర్వాత ఫార్మోజాలో స్థిరపడ్డారు.

ఈలోగా యింగ్లండులో పారిశ్రామిక విప్లవం వచ్చి ఆర్థిక, ఉత్పత్తి విధానాల్లో గొప్ప మార్పులను కలిగించింది. ఆంగ్లవర్తకులు దేశంలో తయారైన పారిశ్రామిక సరుకులను యితర దేశాలలో అమ్మేందుకు మార్కెట్లకొరకు వెదుక నారంభించారు. ఇండియాలో రాజకీయంగా బలపడి నిరాఘాటంగా వ్యాపారం సాగిస్తోన్న తూర్పుఇండియా కంపెనీ వర్తకుల దృష్టి కళలతో, కవిత్వంతో, సర్వసంపదలతో తుల తూగుతోన్న చైనాదేశంమీద పడింది.

1661 — 1722 వరకూ చైనాను పాలించిన కాంగ్‌హీ అనే మహాచక్రవర్తి కాలంలో యూరపియన్ మతబోధకులకు, వర్తకులకు చైనాలో యథేచ్ఛగా మెలగుటకు అనుజ్ఞ యిచ్చారు. కాని త్వరలోనే మతబోధకులు చైనీయుల ఔదార్యాన్ని దుర్వినియోగపరుస్తూ, కుట్రలు పన్నుతోందడం ఋజువయిన వెంటనే, విదేశ వాణిజ్యము, క్రిష్టియను మతవ్యాప్తి, చైనాలో నిషేధింపబడ్డాయి.

మంచూవంశ చక్రవర్తులలో నాలుగవవాడైన చీన్‌లుంగ్ చైనాను 1736 — 1796 వరకూ పాలించాడు. ఈయన ప్రభుత్వకాలంలో మధ్య ఆసియాలోని తుర్కిస్థాన్, టిబెట్‌లను, నేపాల్ దేశాన్ని జయించి సామ్రాజ్యాన్ని విస్తరింపచేశాడు. ఈయన సామ్రాజ్యంలో మంగోలియా,

మంచూరియా, తుర్కిస్థాన్, టిబెట్, నేపాల్ దేశాలున్నూ. కొరియా, అన్నాం, సయాం, బర్మాలను సామంత దేశాలునూ ఉండేవి. ఫ్రాంసు, అమెరికా దేశాలు విప్లవ జంయూ మారుతాలలో సంక్షోభించే కాలంలో మహాకవి, కళాపోషకుడు, పండితుడు అయిన చీన్‌లుంగ్ చక్రవర్తి దేశాన్ని సుభిక్షంగా పాలిస్తూండగా 1792 లో మూడవ జార్జిరాజు యింగ్లండునుండి మాక్ ఆర్ట్నీ ప్రభువుతో ఒక రాయబార వర్గాన్ని పెకింగ్ పట్టణం పంపించాడు. ఆ ప్రభువు కానుకలు సమర్పించి, చైనాతో వర్తకం చేసుకునేందుకు అనుజ్ఞ కోరాడు. అప్పుడు చీన్‌లుంగ్ ఒక పెద్ద ఉత్తరాన్ని పంపాడు. అందులోనుండి కొద్దిభాగాన్ని క్రింద ఉదహరిస్తాము.

"............... ఓ రాజా ! మా నాగరికతయొక్క లాభాన్ని పొందాలని అనేక వేల మైళ్ళ దూరంనుండి భక్తిపూర్వకంగా మావద్దకు రాయబార వర్గాన్ని పంపించావు ........... నీకు మాయెడల గల గౌరవాన్ని వెల్లడించేందుకు నీ దేశంలో తయారైన కొన్ని వస్తువులను కానుకగాకూడ పంపించావు. నీ వినతి పత్రాన్నికూడా మేము చదివాం.

ఈ మహా విశాల సామ్రాజ్యాన్ని పాలించే నాకు లోపరహితమైన పరిపాలనము కొనసాగిస్తూ, ప్రభుత్వ ధర్మాలను సక్రమంగా నిర్వర్తించాలనే ఒకేఒక ఆశయమున్నది. విలువైన కొత్తవస్తువులు నాకెట్టి సరదాయును కలిగింపవు ............... నీ దేశంలో తయారైన పారిశ్రామిక వస్తువులేమీ మాకు అవసరం లేదు. మా సామ్రాజ్యంలో అన్ని వస్తువులూ సమృద్ధిగా లభ్యమౌతాయి. అందువలన మీబోటి అనాగరికులచే తయారు కాబడిన వస్తువులను దిగుమతి చేసుకోవలసిన అవసరం మాకు లేదు. కాబట్టి ఓ రాజా ! యిక ముందునుండి మా సింహాసనముందెక్కువ భక్తి శ్రద్ధలు గలిగి ప్రవర్తిస్తో నీ దేశంలో శాంతి భద్రతలతో జీవింపుము ........

"మా ఆజ్ఞలను శిరసావహింపుము! అలక్ష్యం చేయ సాహసింపకు ................"

దక్షిణ దిశనవున్న కాంటన్ నగర వర్తకులు ఒక్క కాంటన్ పట్టణం ద్వారానే విదేశవ్యాపారం చేసుకునేందుకు అనుజ్ఞ నీయవలసిందిగా ప్రార్థించి ఒప్పించారు.

చైనావ్యాపారంలో బ్రిటను ప్రముఖస్థానం ఆక్రమించింది. చైనాకు యూరప్ పారిశ్రామిక వస్తువు లవసరంలేదు. కాబట్టి చైనానుండి యెగుమతి వ్యాపారమే జరిగేది. టీ, సిల్కులకు పాశ్చాత్యులు వెండి, బంగారాల నిచ్చుకోవలసి వచ్చేది. బ్రిటిషు తూర్పు యిండియా వర్తకులు నల్లమందు వ్యాపారం చేసి లాభాలను గడింప నారంభించారు. హానికరమైన యీ నల్లమందు వ్యాపారాన్ని చక్రవర్తులు నిషేధించినప్పటికినీ ఉన్నతోద్యోగులకు లంచాలిచ్చి దొంగవ్యాపారాన్ని బ్రిటిషువారు జోరుగా సాగించారు.

1834 తరువాత బ్రిటిషు ప్రభుత్వంవారు తూర్పు యిండియా కంపెనీ చేతులలోనుండే గుత్తవ్యాపారాన్ని రద్దుచేసి, స్వేచ్ఛా వాణిజ్యానికి అనుజ్ఞ యిచ్చారు. వెంటనే నల్లమందు వ్యాపారం అనేకరెట్లు పెరిగింది. చైనా ప్రభుత్వంచే యీ దొంగవ్యాపారాన్ని అణిచేందుకు నియమింపబడిన లిన్ అనే కమీషనరు విదేశ వర్తకుల వద్దనుండి ఒక్క కాంటన్ రేవు పట్టణంవద్ద 20,000 పెట్టెల నల్లమందును వశపరచుకుని ధ్వంసం చేశాడు.

లాభదాయకమైన నల్లమందు వ్యాపారానికి కలిగిన ఆటంకానికి సహించలేక 1840 లో బ్రిటన్ చైనాతో యుద్ధ మారంభించి, కాంటన్ మున్నగు రేవు పట్టణాలను ముట్టడించింది. ఇదే నల్లమందు యుద్ధమని చరిత్ర ప్రసిద్ధిపొందినది. రెండు సంవత్సరాల అనంతరం చైనాలొంగి, 1842 లో కాంటన్, షాంఘే, ఆమోయ్, నింగ్‌పో, ఫూచౌ అను ఐదు రేవుపట్టణాలను విదేశ వాణిజ్యానికి వదలివేస్తూ నాన్కింగు సంధిని

చేసుకుంది. వీటినే "సంధిరేవు పట్టణాలు" అని పిలుస్తారు. హాంగ్ కాంగును కూడా బ్రిటను స్వాధీన పరుచుకుంది.

ఈ విధంగా చైనాయొక్క ఏకాంతవాసం వదిలిపోయింది. ఇష్ట వ్యతిరేకంగా నల్లమందు వ్యాపారం రుద్దబడింది. ఈ సందు చూచుకొని యితర యూరపియను దేశాలు, అమెరికా కూడా చైనాను బెదరించి అనేక వాణిజ్య సౌకర్యాలు గుంజుకొన సాగినవి.

ఈ ఒడంబడికలు చైనీయులకు గాని, పాశ్చాత్య వ్యాపారులకు గాని సంతృప్తిని కలుగచేయలేదు. అందువలన అనేక సంఘర్షణలు జరుగ నారంభించాయి.

బ్రిటిష్ జండాను అవమాన పరచారనే స్వల్పనేరంమీద బ్రిటిష్, ఫ్రెంచి సైన్యాలు 1857 లో యుద్ధం ప్రకటించి, ముఖపట్టణమైన పెకింగు మీదకు దండెత్తినవి. చైనాచక్రవర్తి భయపడి కోరిన షరతులకు అంగీకరించి ఒడంబడిక చేసుకున్నాడు. ఆ సంధి షరతుల వసులు జరవడంలో మరల పేచీలు వచ్చి, బ్రిటిష్ సైన్యాలు మరల 1860 లో యుద్ధం ప్రారంభించి, రాజధానీ నగరమైన పెకింగును పట్టుకొని రాజ సౌధాన్ని ధ్వంసం చేయుటతో చక్రవర్తి లొంగి యుద్ధ నష్టపరిహారాన్ని యిచ్చుటకు అంగీకరించాడు. విదేశీయులకు కొన్ని ప్రత్యేక వలస పట్టణా లేర్పడ్డాయి. విదేశ వ్యాపారానికి, పరిశ్రమలకు నిలయమైన షాంఘై పట్టణం అంతర్జాతీయ వలసలలో ముఖ్యమైనది. విదేశీయులు చైనా న్యాయ చట్టమునకు లోబడక తమ న్యాయస్థానములందే విచారింపబడే హక్కు లేర్పడ్డాయి. చైనాలో యే ప్రాంతంలో నేరాలు చేసినప్పటికినీ చైనా న్యాయస్థానాలకు లొంగరు కనుక విదేశస్థులు యధేచ్ఛగా చైనీయులను తృణీకరించి, నేరాలు చేసేందుకు హక్కు కలిగింది. విదేశీయులే సుంకాలు విధించి వసూలు చేయ సాగారు. ఆ నాటినుండి విదేశ పారిశ్రామిక వస్తువులు చైనాలోనికి ధారాపాతంగా వచ్చి దేశీయ చేతిపరిశ్రమ

లను నాశనం చేశాయి భూస్వామ్య విధాన గాఁంకో పేగ్రగాంద్రు కృంగి పోయారు.

## తైపింగు తిరుగుబాటు

చైనాలో జరిగిన తిరుగుబాట్ల చరిత్రలో 1850 నుండి 1865 వరకూ 15 సంవత్సరాల కాలం జరిగిన తైపింగు తిరుగుబాటు గొప్ప విప్లవ స్వభావ, ప్రాముఖ్యతలు కలది. దక్షిణ రాష్ట్రాలలో ఉద్భవించిన యీ తిరుగుబాటు ఉద్యమ దావాగ్ని పండ్రెండు రాష్ట్రాలను దగ్ధం చేసి వేసింది చక్రవర్తి వంశవిధ్యాంలన మొక్కటేకాక సామాజిక, ఆర్థిక భావ విప్లవం కూడ యీ తిరుగుబాటుకు లక్ష్యాలుగా వున్నవి. "విశ్వ శాంతి", "విశ్వమానవ సౌభ్రాతృత్వం" "చైనా, చైనీయులదే." "దున్ని సాగుచేయువారిదే భూమి." "జాతి, మత, కులభేదాలు నశించాలి." "చక్రవర్తి పరిపాలన నశించాలి" అనే నినాదాలతో రైతుజన సామాన్యం ప్రభుత్వంపై తిరగబడ్డారు.

తిరుగుబాటుకు కారణాలు:—(1) సాగుబడి భూమికంటె వ్యవసాయంమీద ఆధారపడిన ప్రజలసంఖ్య విపరీతంగా పెరిగింది. 1661 లో వున్న 19 కోట్ల యకరాలనుండి 1883 నాటికి 25 కోట్ల యకరాల వరకూ సాగుబడిభూమి వృద్ధిచెందింది. అనగా అభివృద్ధి 35% మాత్రమే. కాని 1772 నుండి 1812 వరకు జనాభా 192% వృద్ధిపొందింది. ఇంత అత్యధికంగా వృద్ధిచెందిన రైతులకు స్వంత భూములు లేక దారిద్ర్యం హెచ్చింది.

(2) విదేశవ్యాపారం హెచ్చింది. అందువలన చేతిపరిశ్రమలు నాశనమై అందరూ వ్యవసాయంమీదనే ఆధారపడవలసి వచ్చింది. విదేశ వ్యాపారంచేసే షాహుకార్లు తమ విల్వధనంతో పెద్దపెద్ద జమీలను

సంపాదించుట వలన భాగ్యవంతులు మరీ భాగ్యవంతులౌతున్నారు. బీదలు మరీ బీదలవజొచ్చారు. ఈ విధంగా వృత్తులను కోల్పోయిన వారు స్థిరనివాసాలు, వృత్తులులేక దేశదిమ్మరులై 19 వ శతాబ్దారంభం నుండీ తండోప తండాలుగా తిరుగజొచ్చారు. వీరే తిరుగుబాట్లకు, విప్లవాలకు ముడిసరుకుగా ఉపయోగించారు.

(3) నల్లమందు దిగుమతి, వాడకము.

## నల్లమందు దిగుమతులు

| సంవత్సరములు. | పెట్టెలసంఖ్య | అమెరికన్ డాలర్లలో ఖరీదు. |
|---|---|---|
| 1818 | 3200 | 3,567,000 |
| 1820 | 4,770 | 8,400,000 |
| 1825 | 9621 | 7,608,000 |
| 1830 | 18,770 | 12,900,000 |
| 1832 | 23,670 | 15,338,000 |
| 1837 | 34,000 | 20,000,000 |
| 1847 | 50,000 | 35,000,000 |

(4) వాణ్యముల చలామణీ విధానంలో మార్పులు.

(5) అసమ, పురాతన భూమిశిస్తు విధానం.

(6) ప్రభుత్వ ఆదాయపు తగ్గుదల, పెరిగిపోతున్న ప్రభుత్వ ఖర్చులు.

(7) ఉద్యోగస్తుల లంచగొండితనం, చక్రవర్తి నిరంకుశపాలన.

(8) వెండి ఖరీదులో పెరుగుదల.

(9) కరువులు, జాడ్యాలు, దోపిడి గుంపులు.

(10) అల్పసంఖ్యాక జాతులైన భోమయోల అసంతృప్తి.

(11) 1842 లో ముగిసిన నల్లమందు యుద్ధం.

బలీయమైన యీ కారణాలవలన, క్వాంగ్సీ, క్వాంగుటంగు, హూనాన్ రాష్ట్రాల రైతులలో వ్యాపించిన అసంతృప్తిని ఆధారంగా తీసి కొని హంగ్స్వీ స్వీన్ తైపింగు ఉద్యమాన్ని లేవదీశాడు. తైపింగు ఉద్యమ ప్రధాన నాయకుడైన హంగ్స్వీస్వీన్కు, హంగ్జెజా, ఫెంగ్ యున్షాన్లు తోడయ్యారు. "మీ రందరు కలసి పనిచేస్తూ ఐకమత్యంగా జీవించాలి, స్నేహపాత్రులై, ఋజూమార్గగాములుగా సంచరించండి. పరులను ద్వేషించకండి. గ్రామాలు వెళ్ళినప్పుడు మీరు దొంగిలించ రాదు. యుద్ధంలో వెనుకంజ వేయకండి. ప్రత్యేక ధన స్వామ్య ముండ రాదు. డబ్బును, ఆస్తిని మీలోమీరు పంచుకోరాదు. ఏకమనస్కులై, విర్భీతితో స్వర్గపథంలో నడవండి." అంటూ హంగ్ బోధించేవాడు.

ప్రభుత్వోద్యోగాలు మంచూరియా దేశస్తుల కిస్తూన్న మంచూ చక్రవర్తులమీద ద్వేషంతోనున్న ధనికరైతులు కూడ, "చైనా చైనీయు లదే" అను నినాదాలతో యీ తిరుగుబాటులో జేరారు. తమ దారిద్ర్యా లను తొలగించుకునేందుకు బీదరైతులు జేరారు. కాని సామాజిక విప్ల వాన్ని విజయవంతం చేయగల్గిన సంస్కరణోద్యమాన్ని నడపకలిగే పావుకాళం తిరుగుబాటుదార్లకు లేకపోయింది. చైనాలో ప్రాచీనకాలం నుండి వ్రేళ్ల పాతుకున్న సాంప్రదాయాలు, మతసంస్థలన్నింటినీ తిరుగు బాటుదార్లు భగ్నం చేసేందుకు ప్రయత్నించగానే చైనామత బోధకులు, సనాతనులు కంగారుపడి, వారి ప్రయత్నాలను ప్రతిఘటింప సాగారు. అందువలన తైపింగులు ఆప్రయత్నాలను విరమించుకున్నారు. ప్రథ మంలో క్రైస్తవమత ధర్మములను హంగు బోధిస్తున్నాడని యెంచి వారికి సహాయం చేసిన పాశ్చాత్యులు, ఆ ఉద్యమం సామ్రాజ్యవాద వ్యతిరేక దృక్పథం ధరించగానే క్రమక్రమంగా పెకింగు ప్రభుత్వానికి తిరుగుబాటు నణచుటకు తోడ్పడజొచ్చారు.

క్వాంగ్సీ రాష్ట్రంలోని యంగ్యూవ్ అనే పట్టణంలో "స్వర్గ శాంతి రాజ్యము"ను 1851 లో హంగ్ స్థాపించాడు. క్వాంగ్సీ నుండి

ఉత్తరదిశగా తైపింగులు దండయాత్ర చేసి, హూనాన్‌ను ఆక్రమించి యాంగ్‌సీనది ఓడుగా వెళ్లి నాన్కింగు పట్టణాన్ని ఆక్రమించి తమ ప్రధాన కార్యాలయాన్ని నెలకొల్పారు. తిరుగుబాటు పంద్రెండు రాష్ట్రాలకు ప్రాకింది. 2 కోట్ల ప్రజలు నిరాధారులై, తలదాచుకోడానికి కొంపలు లేక అల్లాడారు. చక్రవర్తి అధికారం చెల్లలేదు. నామమాత్రుడయాడు. చైనాలో పౌరపాలన అంతమొందింది.

తైపింగు లోక కొత్త పరిపాలనా విధానాన్ని అమలుపరిచేందుకు ప్రయత్నించారు. సమానత్వంమీద ఆధారపడిన భూవిభజన విధానం, సర్వసంపదలను సమానంగా పునర్విభజించడం అను రెండు సూత్రాలతో కూడిన కర్షక కార్యక్రమాన్ని అమలు పరుస్తామని వాగ్దానం చేశారు. స్త్రీలకు సమాజంలో కొత్త స్థానమీయబడింది. సైనిక పారిపాలనలో కూడ వారికి పదవులు లభించాయి. తైపింగు ప్రభుత్వంలో వారికి మంచి స్థానమీయబడింది. స్యూయెర్, సైసాన్‌లను మహిళ బిడ్డలు యుద్ధరంగంలో గొప్ప ప్రఖ్యాతి బడిశారు. జూదపాట, నల్లమందు వాడకం, జారత్వం, హత్యచేయడం, దొంగతనము నిషేధింప బడ్డాయి.

తైపింగులలో అద్భుతమైన క్రమశిక్షణ వుండేది. నిర్మాణ యుక్తంగా వ్యవహరించేవారు. అన్నివిధాలా మంచూచక్రవర్తి సైన్యాలను మించి ఉండేవారు.

ముందు మూడువేలమంది పేదరైతులతోకూడిన హాంగుసైన్యం అనతికాలంలో ముప్పదిలక్షల వరకూ పెరిగింది. మధ్య, క్రింద తరగతి ప్రజల్లో, పట్టణ వాస్తవ్యులలోను పలుకుబడి కల్గిన రహస్య సంఘాల కూటమియైన త్రికసంఘంవారు 1852 లో తైపింగులతో కలిశారు. ప్రథమంలో ఐచ్ఛికంగానే ప్రజలు జేరేవారు కాని, క్రమేణా కుటుంబానికి ఒకరుచొప్పున సైన్యంలో జేరాలనే నియమం వలన పేదలు, భాగ్యవంతులు కూడ సైన్యంలో జేరారు. వారి వర్గ ప్రయోజనాలు, లక్ష్యాలు

విభిన్నమగుట వలన సైనికులలో పరస్పర వైషమ్యాలు హెచ్చాయి. దీనికి తోడు తైపింగులకు నవీన ఆయుధాలు లేవు. మందుగుండు యంత్రాగారాలు కూడ లేవు. రేవు సుంకాలను బ్రిటనుకిచ్చి, అనేక సౌకర్యాలను విదేశ ప్రభుత్వాలకు కలిగించుటకు పెకింగు ప్రభుత్వ మంగీకరించుటచే చివరిరోజులలో విదేశ సామ్రాజ్యవాదులు సరఫరా చేసిన ఆధునిక ఆయుధాలతో పెకింగు సైన్యాలు తైపింగులను ఓడించ గల్గాయి. ఆంగ్ల, ఫ్రెంచిసైన్యాలు చైనాదేశంలో చొరబడి చైనాప్రభుత్వ ఆహ్వానంమీద తైపింగుల నణచివేశాయి

1864 లో నాన్కింగును పోగొట్టుకున్న తర్వాత తిరుగుబాటు దార్లు చెదిరిపోయి క్వాంగ్సీ, క్వాంగుటంగు రాష్ట్రాలలోని పర్వతాలలో నివాసముండి, 1880 లో ఫ్రెంచివారు అన్నాము నాక్రమించినప్పుడు ప్రపంచం నివ్వెరపోవు తెరగున యీ శౌర్యధనులు పోరాడి అసువు లర్పించారు. సన్ యట్ సేన్ బంధువులలో తైపింగు తిరుగుబాటు దార్లు న్నారు. ఆ తిరుగుబాటు సాంప్రదాయములే ఆధునిక చైనా జాతీయోద్య మంమీద గొప్ప ప్రభావాన్ని చూపించాయి.

ఈ తిరుగుబాటు తాత్కాలికంగా అణచివేయబడినప్పటికీ తిరుగు బాటు కారణాలైన ప్రజాపీడన, రైతులదారిద్ర్యం, మంచూ వంశపరిపాల నలు నాశనమయ్యేవరకూ చైనీయులు ఒక విప్లవం తర్వాత మరొక విప్లవానికి ప్రయత్నించ సాగారు.

## ప్రజలు ఆర్థిక జీవితంలో మార్పు

తైపింగు విప్లవ పరాజయం తర్వాత ప్రజావిశ్వాసాన్ని కోల్పో యిన మంచూప్రభుత్వం పరాయి దోపిడీ ప్రభుత్వాల సైనికసహాయంపై సంపూర్ణంగా ఆధారపడింది. ప్రజాసామాన్యం యొక్క దారిద్ర్య దైన్యాలు

అపరిమితంగా పెరిగాయి. పాశ్చాత్య, అమెరికను వర్తకుల, పారిశ్రామికుల లాభకరమైన వాణిజ్య వర్తకములకు అనువుగా చైనా ఆర్థిక విధానం మార్చబడింది. దూరస్థ ప్రాంతాలనుండి సముద్రాలమీదుగా విదేశ సరుకులు ప్రవహించ నారంభించాయి. చైనాలోని ముడిపదార్థములు యెగుమతి చేయబడుతున్నాయి. విదేశనూలు, బట్టలవ్యాపారం దేశీయ చేనేత, రాట్న పరిశ్రమలను విధ్వంసం చేయజొచ్చాయి. చైనాదేశీయ వ్యాపారులు, పాశ్చాత్య వ్యాపారస్థులకు దళారీలు దిగుమతిదార్లుగాను తయారై, విదేశవ్యాపారం మీద ఆధారపడ్డారు. రైల్వేలు, బట్టలు, తదితర మిల్లులు విదేశస్థావరాలలోను, వలస ప్రాంతాలలోను వెలయడంతోనే ఆధునిక శ్రామికవర్గం ఉద్భవించింది.

ఈ విధంగా చైనాప్రజల ఆర్థికజీవితంలో తీవ్రమైన మార్పు కలిగింది. 1860 లో మంచూ సైన్యాలకు కావలసిన ఆయుధసామగ్రి, మందుగుండు తయారుచేయు ఫాక్టరీలు ఉక్కుమిల్లుల స్థాపనతో చైనాలో ఆధునిక పరిశ్రమలు జన్మించాయి. 1870, 1880 సంవత్సరాలలో చైనీయులచే నౌకాపరిశ్రమ నిర్మాణమునకు ప్రయత్నములు చేయబడ్డాయి. 1878 లో కైలింగు బొగ్గుగని పరిశ్రమ బ్రిటిషు పెట్టుబడితో ప్రారంభింపబడింది. ఆ కంపెనీ నామమాత్రంగా చైనీయులకు చెందియుండేది. 1890 లో చైనా పెట్టుబడిదార్లచే స్థాపింపబడిన మొదటి నూలుమిల్లుతో బట్టలయంత్రాలుద్భవించాయి. చైనా జపాను యుద్ధానంతరం, విదేశస్థులు గుంజుకొన్న హక్కుల మూలంగా జపాను, బ్రిటనులు ప్రత్తిమిల్లులను నెలకొల్పాయి. ఆకాలంలో చైనావారు స్వంతకర్మాగారాలను, బ్యాంకులను పెట్టేందుకుచేసిన ప్రతిప్రయత్నాన్నీ, విదేశసామ్రాజ్యవాదులు వ్యతిరేకించి పూర్తిగా అణచేవారు. తర్వాత చైనా బ్యాంకుగామారిన బ్యాంకు ఆధునిక పద్ధతులమీద చైనా పెట్టుబడిదార్లచే 1897 లో స్థాపింపబడింది. అమెరికా, యూరపు జపాను దేశాలకు ఉన్నత విద్యాభ్యాసమునకు పోయిన చైనావిద్యార్థులు ఆధునిక పారిశ్రామిక జీవితంతో అధోగతిలో నున్న

తమదేశ పరిస్థితులను పోల్చి, అట్టి మార్పులను తమదేశంలో కూడా తీసికొని రావలయుననే విప్లవ భావాలతో ఉద్రిక్తులయ్యారు. దేశీయ పెట్టుబడిదార్లు కూడా తమ మార్కెట్లను విస్తరింపజేయ ప్రయత్నించి, విదేశపారిశ్రామికుల పోటీకి నిలబడలేక వారిని ద్వేషింపసాగారు. తమ వ్యాపార విస్తరణకు అసమర్థుడైన చక్రవర్తి, దురాశాపాతకులైన విదేశ పారిశ్రామికులు అడ్డుగా నున్నారు కాన, వారిని నాశనంచేసి, తమ అవసరాలను తీర్చి సౌకర్యాలను కలుగజేసే ప్రభుత్వ యంత్రాన్ని నెలకొల్పాలని ప్రయత్నించ సాగారు.

ఈ విధంగా అసంతృప్తిచెందిన చైనారైతులు, మేధావులు, కూలీలు, ఉద్యోగులు, నిరుద్యోగ యువకులు, విద్యార్థులు విప్లవసంఘాలలో జేరి, విదేశీయులను తుదముట్టించేందుకు, చక్రవర్తిని నాశనం చేసేందుకు తీవ్రకృషి చేయసాగారు.

## కౌలుప్రాంతాల విచిత్రగాథ

1898 వ సంవత్సరంలో పాశ్చాత్య ప్రభుత్వాలు చైనాలో విచిత్రమైన నాటకమాడ నారంభించాయి. అంతవరకూ చైనా సామ్రాజ్యంలో దూరస్థభాగాలను కబళించుటతో తృప్తిపడిన విదేశసామ్రాజ్యవాదులు నాటినుండి చైనాదేశంలో యెవరికందుబాటుగా వున్న ప్రాంతాన్ని వారు కాజేయ జొచ్చారు. నల్లమందు యుద్ధంలోను, తైపింగు తిరుగుబాటు కాలంలోను చైనా ప్రభుత్వమెంత దుర్బలంగా నున్నదో చూచిన పాశ్చాత్యులు 1894 లో జపానుచే ఓటమినొందిన చైనానింక పూర్తిగా దొరకినంత మట్టుకు కాజేయ నారంభించారు చైనా చక్రవర్తికీ, ప్రజలకూ వారిదేశం అన్యులచేత ఆక్రమింప బడుతోందని తెలియకుండానే ఆ యా ప్రభుత్వాలకు కావలసిన ప్రాంతాలను చైనా చక్రవర్తినుండి 100 సంవ

త్సరాలకు కౌలుకు పుచ్చుకోసాగారు. తన అస్థిత్వానికే ముప్పు వస్తోన్న ఆదుర్భరావమాన పరిస్థితుల్లో చక్రవర్తి దేశంలోని చాల ప్రాంతాలను పాశ్చాత్యులకు కౌలుకిచ్చాడు. వారు తెచ్చిన కౌలు కాగితాలమీద వారు కోరిన షరతుల కంగీకరిస్తో, కోరిన ప్రాంతాలను వారికిచ్చివేశాడు కౌలు ప్రాంతాలన్నీ కౌలులో ఉదహరింపబడిన కాలం మేరకు, సర్వహక్కుల తోను కౌలుదారు కిచ్చివేయబడ్డాయి. కౌలుదారు తన కౌలుప్రాంతంలో నివసించే ప్రజలమీద సర్వాధికారాలు చలాయించవచ్చును వలసదేశంపై యెట్టి అధికారాలైతే వుంటాయో కౌలు ప్రాంతాలమీద కూడా అట్టి అధికారాలు, హక్కులు పొందారు.

## జర్మనీ

చక్రవర్తిని బెదరించి కౌలుప్రాంతాలను పుచ్చుకోవడం ప్రప్రథమంగా జర్మనీ ప్రారంభించింది. దారి దోపిడిగాండ్రు యిద్దరు జర్మను మిషనరీలను (మతబోధకులు) దోచి, చంపివేశారు. సమయంకొరకు, నెపంకొరకు వేచివున్న జర్మనులు "తోడేలు—మేకపిల్ల" సామెతను ఆచరణలో పెట్టారు. జర్మను మతబోధకులను చైనీయులు చంపారు కనుక చైనా చక్రవర్తికి బుద్ధిచెప్పేందుకు గాను, జర్మను యుద్ధనౌకలను కియోచౌకు పంపి ఆ ప్రాంతాన్ని ఆక్రమించారు. దుర్బలుడైన చైనా చక్రవర్తి నామమాత్రమైన తన అధికారాన్ని నిలుపుకొనేందుకు జర్మన్లతో కియోచౌ ఒడంబడికను చేసుకున్నాడు. ఈ ఒడంబడిక ప్రకారం కియోచౌప్రాంతం 99 సంవత్సరాలకు కౌలుకీయబడింది. రాజధానీనగరం వరకూ రైలుమార్గాలను నిర్మించి, రైళ్లను నడుపుకునే హక్కులు సంక్రమించాయి. ఈ రైలుమార్గం పొడుగునావున్న గనులను తవ్వుకునే అధికారం కూడ జర్మన్లకు లభించింది. షాంటంగు రాష్ట్రంలో జర్మనుల పర్తకానికి చాల నదుపాయాలు చేయబడ్డాయి. జర్మను సరుకు

లకు షాంటంగు వాస్తవ్యులు అధికృతనిచ్చి వాటినే కొనాలి. వారి వస్తువులను జర్మనులకే అమ్మాలి. ఈ హక్కులను, అధికారాలను గుంజుతున్న జర్మన్లు షాంటంగు రాష్ట్రంలో గొప్పదైన సింగుటో ఓడరేవును కట్టారు. మంచి రోడ్లను వేశారు. 250 మైళ్ల పొడుగు రైలుబాటను నిర్మించి, రైళ్లను నడిపారు. ఈ విధంగా యీ రాష్ట్రాన్ని జర్మనులు సంపూర్ణంగా కొల్లగొట్టు చూచారు. నిరాఘాటంగా సాగిపోతున్న యీ జర్మను దోపిడీవిధానం ప్రథమ ప్రపంచ మహాయుద్ధంలో తుద ముట్టింది చైనా తటస్థంగా వున్న సమయంలోకూడ సింగ్‌టో జర్మనుల వశంలో వున్నది కనుక జపాను 1914 లో బ్రిటిషు యుద్ధనౌకల సహాయంతో వచ్చి షాంటంగు తీరాన్ని ఆక్రమించింది.

వర్సెలీసు సంధిప్రకారంగా జర్మనీకి లోబడిన ప్రాంతాలన్నీ జపానుకు దఖలు పడ్డాయి జపాను యీ ప్రాంతాల్ని 8 సంవత్సరాలు నిరాఘాటంగా పరిపాలించింది. కాని చైనా జాతీయవాదులు అవమానాన్ని సహించలేక యీ అన్యాయాన్ని తుదముట్టించేందుకు యెడతెరిపిలేని ఆందోళన ప్రారంభించారు జపాను సరుకుల బహిష్కరణను అమోఘంగా సాగించారు బహిష్కరణాస్త్ర ప్రయోగానికి జపానువారు జంకి, 1922 లో వాషింగుటను సమావేశంలో కియోచౌ ప్రాంతాన్ని, సింగ్‌టో రేవుపట్టణాన్ని, రైల్వేను, చైనా ప్రజాస్వామికానికి కిచ్చి వేసెదమని వాగ్దానం చేశారు.

## రష్యా

జర్మనీ కియోచౌను ఆక్రమించగానే, చైనాలో యూరపియన్ దేశాల బలాలలో అసమత్వమేర్పడుతోందనే నెపంమీద రష్యా 1898 డిశంబరు మాసంలో టాలియెన్‌వాన్ జలసంధిలోని ఆర్థరురేవు పట్టణాన్ని సైన్యాలను పంపి పట్టుకొంది. అటుపిమ్మట చైనాచక్రవర్తిని

బెదరిస్తో రాయబారాలు సాగించారు. మంచుతో కప్పబడని రేవుపట్టణం ఒక్కటికూడ రష్యాకు లేదుకాబట్టి ఆర్థరు రేవుపట్టణాన్ని, డైరెన్. క్వాంగ్‌టంగు ప్రాంతాన్ని చైనా ప్రభుత్వం రష్యాకు 25 సంవత్సరాలకు కౌలుకిచ్చివేసింది రష్యావారు వెంటనే చైనా తూర్పు రైల్వేమార్గాన్ని తమ కొత్తరేవు పట్టణం వరకు విస్తరింప చేశారు కాని 1905 లో రష్యావారు జపానువారిచే ఓడింపబడగానే, రష్యా ఆక్రమిత ప్రాంతాలన్నీ జపానువారికి దక్కాయి. క్వాంగ్‌టంగు ద్వీపకల్పం, రైల్వే. తదితర రష్యను హక్కులు, దక్షిణ మంచూరియాలోని ఆస్తులు జపానువారికి సంక్రమించాయి. జపానువారు చైనాప్రభుత్వంనుండి పొందిన 21 కోరి కలవలన యీ కౌళ్లు 25 నుండి 99 సంవత్సరముల వరకు పొడిగింప బడ్డాయి.

## బ్రిటను

జర్మనీ, రష్యాలు చైనాలో విజృంభిస్తో విస్తారమైన కొత్త వలసు బడి ప్రాంతాలను, కౌలు రేవుపట్టణాలను సంపాదిస్తోంటే బ్రిటను చేతులు ముడుచుకొని కూర్చోలేకపోయింది. చైనాలో పాశ్చాత్యదేశాలు అసమంగా బలపడకూడదనే అధికార సమత్వ సిద్ధాంతాన్ని బ్రిటను అక్షరాలా ఆచరణలో పెట్టదలచింది.

తమ ఓడలకు కొన్ని "బొగ్గుస్టేషనులు" అత్యవసరంగా వున్నా యనే విషయం బ్రిటనుకు స్ఫురణకువచ్చి చైనాచక్రవర్తితో రాయబా రాలు సాగించింది. చైనా విధిలేక 1898 జూలై 1 వ తేదీని బ్రిటను కోరికలన్నిటినీ అంగీకరిస్తో ఒక సంధి చేసుకుంది. వీహైవీప్రదేశం, అక్కడున్న లంకలు బ్రిటనుకు కౌలుకీయబడ్డాయి. 1842 లోనే హాంగ్ కాంగు రేవుపట్నాన్ని శాశ్వతంగా చైనా బ్రిటిషు ప్రభుత్వానికిచ్చివేసింది. 1860 లో కీటూన్ అను కొంత భాగమును, మిగిలిన భాగము

1898 లోనూ బ్రిటనుకు లభ్యమయ్యాయి. చైనా జాతీయవాదులు, దేశభక్తులు, జాతీయప్రభుత్వం. యీ ప్రాంతాలను బ్రిటను చేతుల్లోనుండి లాగుకొనవలెననే తీవ్రవాంఛతో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలను యెడతెరిపి లేకుండా సాగిస్తో వచ్చారు. విదేశ సామ్రాజ్య వాదులకు బ్రిటిషుప్రభుత్వం ముందు నిలబడి వారి హక్కులను, కౌలుప్రాంతాలను కాపాడుతో చైనీయులందరి ద్వేషానికి గురియైంది.

## ఫ్రాంసు

కౌలుప్రాంతాల విచిత్రనాటకంలో ఫ్రాంసుకూడ ప్రముఖ పాత్రను ధరించింది. ఏయితర సామ్రాజ్యవాద దేశానికీ వెనుకబడలేదు. బ్రిటను అడుగుజాడలలో నడిచే ఫ్రాంసు. చైనాలో తనబలానికి లోటు రానీయ కూడదని నిశ్చయించుకొంది. 1874 లో అన్నాంకు స్వాతంత్ర్యం కావాలనేమిషతో. అన్నామును తన అధీనరాజ్యంగా చేసుకొన్న ఫ్రాంసుకు సామ్రాజ్యతృష్ణ తీరలేదు. 1898 లో ఏ యితర యూరోపియను రాజ్యానికీ వెనుకబడకూడదనే నిశ్చయంతో హాంగుకాంగుకూ, హైలాండు ద్వీపానికీ మధ్యనున్న క్వాంగ్‌చౌవాన్ అనే రెండువందల మైళ్ల పొడువుగల క్వాంగ్‌టంగ్ సముద్ర తీరాన్ని కౌలుకు పుచ్చుకుంది. యూనాన్ అను పలుకుబడి రాష్ట్రంలో రైల్వేనిర్మాణపు హక్కులు, ఆగ్నేయ చైనాకు పలుకుబడి ప్రాంతంగాను సంపాదించింది.

పెకింగు—హాంకో రైల్వేను ఫ్రెంచి యింజనీర్లు నిర్మించి నడిపే వారు. కాని తర్వాత చైనాజాతీయ ప్రభుత్వం ఆ రైల్వేను ఫ్రెంచి అధికారం నుండి తొలగించి. తన చేతులలోనికి తీసుకుంది.

యూనాన్‌లో మాత్రం ఫ్రెంచివారు తమ రైల్వేహక్కులను నిలుపుకోగలిగారు. హైఫాంగ్ నుండి, యూనాన్ఫూవరకు రైల్వేను

1910 నాటికి పూర్తిచేసి సర్వాధికారాలను కలిగివుండేవారు. షాంఘే, టీన్‌ట్సిన్, క్వాంటన్, హాంకోపట్టణాలలోని ఫ్రెంచివలసలలో మాత్రం ఫ్రెంచివారు సంపూర్ణాధికారాలను చలాయిస్తోందేవారు.

## సంధి రేవులు

చైనా—విదేశప్రభుత్వాలమధ్య జరిగిన ఒడంబడిక మూలంగా విదేశవ్యాపారానికి, నివాసానికి, చైనాలో తెరవబడిన రేవుపట్టణాలను సంధి రేవుపట్టణాలని పిలుస్తారు.

చైనాలో మొత్తంమీద యీ సంధిరేవుపట్టణాలు రెండు మూడు డజన్లుంటాయి. కాంటన్, స్వాటో, అమోయ్, పూఛా, నింగ్‌పో, షాంఘే, సింగ్‌టో, చెఫూ, టీన్‌ట్సిన్, న్యూచ్వాంగు, చింకియాంగు, నాన్కింగు, వూహూ, కియుకియాంగ్, హాంకో, చాంగ్షా, యిఛాంగు, చుంగ్‌కింగు వీటిలో ముఖ్యమైనవి.

## దత్తప్రాంతాలు (కన్సెషన్సు)

ఏ విదేశ ప్రభుత్వానికయినా ఆ దేశ ప్రజలు స్థిరంగా నివసించేందుకు సర్వాధికారాలతో, శాశ్వతకౌలుకీయబడిన సంధిరేవు దగ్గర వుండే ప్రాంతాన్ని దత్తప్రాంతమంటారు.

## వలసప్రాంతము (సెటిల్‌మెంటు)

భూములను సంపాదించుకునే హక్కులతో విదేశస్థులు నివసించేందుకు గాను సంధిరేవు పట్టణాలవద్ద చైనా చక్రవర్తిచే ప్రత్యేకించబడిన ప్రాంతాలు వలసప్రాంతాలని పిలువబడుతున్నాయి.

దత్త, వలసప్రాంతాలు రెండింటిలోను, విదేశస్థులకు పరిపాలనాధికారాలీయబడ్డాయి. వారి పరిపాలనతోను, ఆ ప్రాంతంలో నివశించే ప్రజలమీదను చైనాప్రభుత్వం జోక్యం కలుగచేసుకోరాదు.

చైనాలోని అంతర్జాతీయ వలసల్లో షాంఘై, హాంకోలు చాల ప్రాముఖ్యమైనవి మధ్యచైనా హృదయమనదగు హాన్, యాంగ్‌జీ నదుల సంగమప్రదేశమువద్ద నున్న మూడు పెద్ద నగరాలలోను హాంకో ఒకటి. (ఊచాంగ్, హాన్యాంగులు మిగిలిన రెండు పట్టణాలు). హాంకో పట్టణం వద్దనుండి, నదియొడ్డుపొడుగునా బ్రిటిషు, రష్యను, ఫ్రెంచి, జర్మను, జపానీసు దత్తప్రాంతాలున్నాయి. ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధానంతరం రష్యను, జర్మను దత్తప్రాంతాలు చైనావారియేలుబడిలోకి వచ్చాయి. 1927 జనవరి 3 వ తేదీని కమ్యూనిష్టుల, కొమింటాంగులోని అతివాదుల ప్రోద్బలంతో ప్రజాసామాన్యం గొప్ప ఆందోళనను లేవతీశారు. బ్రహ్మాండమైన ప్రదర్శనంచేస్తో, బ్రిటిషు దత్తప్రాంతంలోనికి వెళ్లారు. ఆ ప్రజాసమూహం ఆ ప్రాంతాన్నంతనీ చుట్టుముట్టివేసి, బ్రిటిషువారు ఆ ప్రాంతాన్ని చైనాప్రభుత్వానికి వశం చేయవలసిందని దౌర్జన్యయుతంగా కోరారు. అప్పుడా ఆందోళనకు జంకి, బ్రిటిషు ప్రభుత్వం చైనా విదేశాంగమంత్రియైన యూజెన్ చెన్‌తో ఆ ప్రాంతాన్ని వశంచేస్తామని రాయబారాలు జరిపారు.

## అసమసంధులు

### విదేశప్రాదేశిక న్యాయస్థాన విచారణాధికారం.

చైనానుండి విదేశసామ్రాజ్యాలు గుంజుకొన్న రక్షణ సౌకర్యాలలో ముఖ్యమైనది (1) 'విశేషప్రాదేశిక న్యాయస్థాన విచారణాధికారం.' ఈ అధికారంవలన చైనాలో నివసించే విదేశస్థులు చైనా న్యాయశాస్త్రానికి లోబడరు. చైనా న్యాయస్థానాలలోకాక ఆ యా దేశాల న్యాయస్థానాలలో మాత్రమే విచారింప బడుతారు. ఈ విశేషాధికారం వలన పరదేశస్థులందరూ చైనాలో స్వేచ్ఛగా, చైనా చట్టాలను ధిక్కరించేందుకు సావకాశం లభించింది. చైనీయ న్యాయస్థానాలయందు విరసన, తృణీ

కారభావం కల్గాయి. విదేశస్థులు చట్టధిక్కారం చేసికూడ చైనాలో స్వైరవిహారం చేయవచ్చును. (2) విదేశ స్వేచ్ఛావాణిజ్యానికి తెరువ బడిన సంధిరేవులు, వాటికి దగ్గరగా వుండే శాశ్వత వలసప్రాంతాలు. (3) చైనా ఎగుమతి దిగుమతి సుంకాలమీద విదేశ సామ్రాజ్యవాదుల అధికారం. సుంకాలు విధించే అధికారం విదేశస్థుల చేతులలో నుండుట చేత, విదేశసరుకులు ధారాపాతంగా చైనాలోకి రానారంభించాయి. దిగుమతి సుంకాలు నామమాత్రంగా విధింపబడుటచేత దేశీయపరిశ్రమలు పోటీకి నిలబడలేక తిరముగా దివాళాతీసేవి (4) విదేశ వర్తకపుటోడలు చైనా సముద్రాలలోను, నదులలోను స్వేచ్ఛగా తిరిగేందుకు అధికారం విదేశస్థులకు లభించింది. వర్తకపుటోడలతోబాటు విదేశ యుద్ధనౌకలు కూడ నిరాఘాటంగా తిరుగవచ్చును.

విదేశ సామ్రాజ్యవాదులు-దౌర్జన్యంగా లాగుకొన్న పైవిశేషాధికారాలవలన చైనాస్వాతంత్ర్యం నామమాత్రావశిష్టమైంది. అర్థవలస దేశపు రాజకీయ, ఆర్థిక ప్రతిపత్తిని మాత్రమే చైనా కలిగివుంది. విశేష ప్రాదేశిక న్యాయస్థాన విచారణాధికారం చైనాజాతీయ జీవితానికి తీరని కళంకం. చైనా జాతీయవాదులు అవమాన భారంతో కృంగిపోతూ విదేశస్థుల నతి తీవ్రంగా ద్వేషించేవారు. ఈ అధికారం వలన విదేశస్థునిపై చైనాప్రభుత్వ మెట్టి పన్నులను విధింపరాదు. చైనా రక్షకభటులు చైనాకు విద్రోహకరంగా ప్రవర్తించే విదేశీయుల గృహాలను సోదాచేయ జాలరు. అనుజ్ఞలేనిదే ప్రవేశించే అధికారం కూడ లేదు. చైనా సముద్ర తీరంలోను, దేశాంతర్భాగంలోని నదులలోను తిరిగే విదేశవాణిజ్య నౌకలలో చైనా సైనికులుగాని, పోలీసులుగాని యెక్కరాదు. విదేశస్థుల చైనీయ పరిచారకులుగాని, పనివారలుగాని వారి యజమానుల అనుజ్ఞ లేనిదే బంధింపబడరాదు. విదేశ పత్రికావిలేఖరులు, సంపాదకులు చైనా ప్రభుత్వాన్నిగూర్చి, చైనీయులనుగూర్చి నిర్భయంగా, తోచినవిధంగా వ్రాయవచ్చును.

చైనా విప్లవవాదులు చేసిన బాక్సరు విప్లవానంతరము 1902 లో బ్రిటిషువారు చైనా న్యాయచట్టం తమకు తృప్తికరంగా అభివృద్ధి చేయ బడిందని తోచినప్పుడు, తమ విశేషప్రాదేశిక న్యాయస్థాన విచారణాధి కారాన్ని రద్దుచేసికొంటామని ప్రకటించారు.

చైనాలో నివసించే అమెరికా, బ్రిటను, జపాను, ఫ్రెంచి, డచ్చి, బెల్జియను, స్వీడను, నార్వేజియను, ఇటాలియను, బ్రెజిల్, స్పెయిన్, పోర్చుగల్, మెక్సికో దేశస్థుల ఆస్తులను చైనాప్రభుత్వం ముట్టరాదు. వారి ఆస్తికి స్వల్పనష్టం పొరపాటున కల్గినా ఆయాదేశ ప్రభుత్వరాయ బారులు గగ్గోలుచేసి, చైనాప్రభుత్వాన్ని తక్షణమే నష్టపరిహార మిమ్మని తాఖీదులు పంపుతారు

అసమసంధులవలన కలిగిన అవమానకరమైన యీవిశేషాధికారా లను రద్దుచేయవలసినదిగా చైనా జాతీయవాదులు నిరంతరం ఆందోళన కావింపజొచ్చారు.

## ఉప్పు, కస్టమ్స్, తపాలాశాఖల పరిపాలన

షాంఘై ప్రాంతంలోని యెగుమతి దిగుమతి సుంకాల అధికారం బ్రిటిషువారికి 1854 లో లభించింది అప్పటినుండి 50 సంవత్సరాల వరకూ ఇన్స్పెక్టరు జనరలుగా బ్రిటిషు దేశస్థుడే నియమింపబడేవాడు. ఈశాఖ అంతా మొదటినుండీ అంతర్జాతీయపరంగా వుండేది. 100 కి 5 వరకూ దిగుమతి సుంకా లిస్తామని బ్రిటిషువారు ముందంగీకరించి నప్పటికీ, వారెన్నడూ 100 కి ఒకటి రెండుకన్న యెక్కువిచ్చిన పాపాన పోలేదు 1896, 1898 సంవత్సరాలలో చైనాప్రభుత్వం యెగుమతి దిగు మతి సుంకాలు, ఆంగ్లో, జర్మను ప్రభుత్వాలకు కుదువబెట్టి పెద్ద ఋణా లను తీసుకున్నారు అనాటినుండి సుంకాలమీద, చైనా విదేశవాణిజ్యం

మీద సర్వాధికారాలు విదేశస్థులకు దక్కేయి. కస్టమ్సు ఆదాయం నుండి, ఋణాలను, నష్టపరిహారాన్ని వసూలు చేయడమే విదేశరాయబారుల పరమపవిత్ర విధిగా యెంచేవారు.

1911 విప్లవం కస్టమ్సుమీద విదేశస్థులకు గల అధికారాన్ని మరింత బలపరిచింది. 1912 నుండి సంచి రేవులలో వసూలు చేయబడే సుంకాలను షాంఘే రక్షణబ్యాంకులలో నిలవచేయజొచ్చారు. చైనా జాతీయవాదులు విదేశ రక్షణబ్యాంకులనుండి నిల్వధనాన్ని జాతీయ ప్రభుత్వానికి తిరిగి యిచ్చివేయాలని తీవ్ర ఆందోళన చేసేవారు.

## తపాలా శాఖ.

1896 లో తపాలా శాఖకూడ విదేశస్థుల పాలబడింది. సర్ రాబర్టు హార్టు కస్టమ్సు, తపాలాశాఖలకు ప్రథమ ఇన్స్పెక్టరు జనరల్ అయ్యాడు కస్టమ్సుశాఖ బ్రిటిషువారి అజమాయిషీ, అధికారాలకు లోబడివున్నట్లుగానే, తపాలాశాఖ సంపూర్ణంగా తమపరం చేయబడాలని చైనా చక్రవర్తిని ఫ్రెంచివారు 1898 లో కోరారు. చక్రవర్తి వారి కోరికను మన్నించాడు. 1918 లో చైనా తపాలాశాఖ, కస్టమ్సు శాఖనుండి విడదీయబడి స్వతంత్రశాఖ చేయబడింది. జపాను, ఫ్రాంసు, [illegible] గ్రేటుబ్రిటను, అమెరికా, రష్యాలు 1923 వరకూ ప్రత్యేక తపాలాలు నడుపుకునేవి.

తపాలాశాఖ పరిపాలనను ఫ్రెంచివారి ఆధీనమునుండి తప్పించి చైనాప్రభుత్వ వశం చేసుకునేందుకు జాతీయాందోళన సాగింది.

## ఉప్పు శాఖ.

చక్రవర్తుల పరిపాలనాకాలంలోనూ, ప్రజాస్వామిక పాలనలోనూ ఉప్పు పరిశ్రమ ప్రభుత్వ గుత్తగావుండేది. ఈ పరిశ్రమవలన ప్రభుత్వానికి హెచ్చుఆదాయం వచ్చేది.

1913 లో యువాన్‌షీకే ప్రజాద్రోహి, చైనా ప్రజాస్వామికానికి అధ్యక్షుడుగా నుండి బ్రిటను, జపాను, రష్యా, ఫ్రాంసు, జర్మనీ బ్యాంకుల నుండి 2,50,00,000 పౌనుల ఋణాన్ని పుచ్చుకొని ఉప్పుశాఖనుండి వచ్చే ఆదాయాన్ని కుదువపెట్టాడు. పునర్నిర్మాణ ఋణపత్రంలోని షరతుల ప్రకారంగా ఉప్పుశాఖకు పెకింగు రాజధానిలో చైనీయ, విదేశీయ ఛీఫ్ ఇన్స్పెక్టర్లను ప్రతిజిల్లాలోను, జిల్లాచైనీయ, విదేశీయ జిల్లాసాల్టు ఇన్స్పెక్టర్లను నియమించాలి.

ప్రభుత్వాదాయాన్నంతటినీ విదేశీయులపరం చేసిన యీ ఋణపత్రాన్ని రద్దుచేసేందుకు చైనా జాతీయవాదులు కృషిచేయజొచ్చారు.

## తీరదేశాంతర్గత నౌకావ్యాపారం—విదేశయుద్ధనౌకలు—విదేశ సైన్యాలు.

అసమసంధులవలన విదేశీయులకు స్వేచ్ఛగా సముద్రతీరంలోనూ, నదులలోనూ నౌకావ్యాపారం కొనసాగించుకొనుటకు, యుద్ధనౌకలు తిప్పుకొనుటకు, సైన్యాలను కోటలుకట్టి వుంచుకొనుటకు అధికారాలు సంప్రాప్తించాయి.

సంధిరేవు పట్టణాలమధ్యనుండే సరుకులను, ప్రయాణీకులను జేరవేసే నౌకావ్యాపారమంతా బ్రిటిషు, జపాను ఓడల కంపెనీల చేతుల్లో వుంది. జార్డైన్—మాతీసజా, బటర్‌ఫీల్డు అండ్‌స్వైర్ కంపెనీలు బ్రిటిషు కంపెనీలలో ముఖ్యమైనవి. విదేశస్థులు ప్రత్యేక సౌకర్యాలకొరకై చైనామీద ఒత్తిడితెచ్చిన 1898 సంవత్సరములో దేశీయ నౌకాయాన నిబంధనలు చేయబడి 1902 లో స్థిరపరుపబడ్డాయి. చైనాదేశపు నదుల్లోను, తీరంలోనూ దర్పంగా విహరించే విదేశనౌకలను చైనాప్రభుత్వ సివిలు, మిలిటరీ ఉద్యోగులు యెక్కరాదు, సోదా చేయరాదు.

1858 లో చేసికొనబడిన టీన్‌ట్సెన్ సంధిలోని 52 వ నిబంధన ననుసరించి బ్రిటిషు యుద్ధనౌకలు చైనా సామ్రాజ్యంలోని అన్ని రేవుల లోను ఆగవచ్చును.

చుంకింగునుండి షాంఘైవరకూ 1500 మైళ్ళనిడివిగల యాంగ్‌జీ నదిలోను, కాంటన్ తీరంలోను బ్రిటిష్, జపాన్, అమెరికన్, ఫ్రెంచి ఫిరంగి నౌకలు గస్తీ తిరుగుతూ వుంటాయి

అర్ధశతాబ్దం పైగా విదేశయుద్ధ నౌకలు చైనా జిల్లాల్లో స్వైర విహారంచేసి అవసరమని యెంచినప్పుడల్లా, చైనాపట్టణాలమీద, సైని కులమీద ఫిరంగులను పారుచేస్తూ వుండేవి.

## విదేశసైనిక స్థావరాలు

బాక్సరు సంధి పత్రంవలన సంక్రమించిన అధికారం వలన ఉత్తరచైనాలో 1900 నుండీ విదేశసైనిక స్థావరాలు ఏర్పడ్డాయి. చైనీయ తూర్పు, దక్షిణ మంచూరియను రైల్వేప్రాంతాలను కాపాడేం దుకు గాను రష్యా, జపానుదేశాలు సైనికస్థావరాలను నెలకొల్పాయి. విదేశ శాశ్వత వలసకాలు ప్రాంతాల్లో విదేశీయుల ఆస్తిప్రాణాలను రక్షిం చేందుకుగాను సైనికుల నుంచేవారు.

బాక్సరులసంధిపత్రం వలన యీ దిగువ ప్రాంతాల్లో సైనిక స్థావ రాలేర్పరచ బడ్డాయి.

1. పెకింగునుండి సముద్రంవరకు వేయబడిన రైల్వేమార్గంలో.
2. రాజధానీనగరంలో రాయబారుల కార్యాలయాలున్న ప్రాంతాల్లో.
3. ఆర్థరు రేవుపట్టణ సైనికస్థావరం.
4. లియోటంగు.

## ఋణాలు — రైల్వేసౌకర్యాలు — బ్యాంకులు

ప్రతి పెద్దవిదేశానికి చైనాలో ఒకపెద్ద బ్యాంకు వుంది.

బ్రిటను :—హాంగ్‌కాంగు—షాంఘే బ్యాంకింగు కార్పొరేషను.

రష్యా :—రూసో—చైనీసు (తర్వాత రూసో — ఏషియాటిక్) బ్యాంకు.

జర్మనీ :—డ్యూష్ యేషియాటిక్ బ్యాంకు.

ఫ్రాంసు :—బ్యాంకు డీ ఇండోచైనా.

అమెరికా :—ఇంటర్నేషనల్ బ్యాంకింగు కార్పొరేషన్.

జపాను :—యోకహామా స్పీసీ బ్యాంకు.

చైనాలోని విదేశ ఋణాలు మూడు రకాలుగా వుందేవి.

1. ప్రభుత్వాదాయం, ప్రభుత్వగుత్తలను కుదువ బెట్టుకొని యిచ్చిన ఋణాలు (కస్టమ్సు, ఉప్పు ఆదాయాలు)
2. రైల్వే ఋణాలు.
3. ప్రభుత్వ హామీలేని ఋణాలు.

1894 లో యుద్ధనష్ట పరిహారంక్రింద జపాను కీయవలసిన డబ్బుకు గాను చైనాచక్రవర్తి కస్టమ్సు ఆదాయాన్ని జపానుకు హామీ యిచ్చాడు. అటు తర్వాత 1898 లో ఆంగ్లో జర్మను ఋణాలకు కూడ ప్రభుత్వాదాయం హామీ యివ్వబడింది.

చైనాలో విదేశస్థులు సాగించిన రాజకీయ, ఆర్థిక ఆక్రమణ విచిత్ర విధానంలో రైల్వేలను వేయుట అతిప్రధానమైనది. 1898 లో రష్యా, ఫ్రాంసు, జర్మనీ, బ్రిటనులు చైనాచక్రవర్తిని రైల్వే సౌకర్యాలు కలుగ జేయవలసినదిగా వేధించారు. దీనికి ఫలితంగా ఈ క్రింది రైలు మార్గాలు వేయబడ్డాయి.

1. మంచూరియాలోని రష్యను, చైనీసు యీస్టరన్ రైల్వే.
2. దక్షిణ చైనాలోని ఫ్రెంచి యూనాన్ రైల్వే.

3. సింగ్‌టో నుండి సినాన్ వరకు జర్మను షాంటంగు రైల్వే.
4. బ్రిటిషు రైల్వేలు (a) పెకింగు – ముక్డెన్. (b) షాంఘే – నాన్కింగు (c) షాంఘే – హాంగ్చౌ (d) క్వాంటన్ – కౌలూన్
5. ఫ్రాంకో. బెల్జియన్, రష్యన్ పెకింగు–హాంకో రైల్వేమార్గం (750 మైళ్లు)
6. 600 మైళ్ల నిడివిగల ఆంగ్లో–జర్మన్ టీన్‌ట్సిన్–పూకో రైల్వే మార్గం.
7. విదేశ సామ్రాజ్యవాదులు 19 వ శతాబ్దంలో ఆర్థిక, రాజకీయ సామ్రాజ్య విస్తరణకు గాను ఉపయోగించిన సున్నితమైన విధానం రైల్వే–నిర్మాణం.

## బాక్సరు యుద్ధనష్ట పరిహారం

<u>బాక్సరు ఉద్యమజననం</u> :—జపాను చేతిలో చైనా పొందిన అవమానకరమైన పరాజయమునుచూచి, చైనా రాజకీయ వేత్తలలో కొందరు తీవ్ర రాజకీయ సైనిక సంస్కరణలను ప్రవేశపెట్ట వలసిన అవసరాన్ని గుర్తించారు. 1898 సంవత్సరములో డోగరు మహారాణి, చక్రవర్తిని తన పదవిని పరిత్యజించ వలసినదిగా ఆజ్ఞాపించి, ఆయన చేసిన రాజశాసన ప్రకటనలను రద్దుపరచెను. సామ్రాజ్య తృష్ణతో యెట్టి దారుణమునకు వెరువకుండా మితిమీరి సంచరిస్తోన్న విదేశీయుల పైనను, వారికి తొత్తులుగా పనిచేస్తోన్న క్రిష్టియన్ల పైనను, నాటివరకూ రాజుకుంటూన్న విద్వేషాగ్ని, ఈ రాజకీయ పరివర్తనంతో అగ్ని పర్వతంవలె బ్రద్దలైంది. అనేక ప్రాంతాలలో పరదేశీయులను, క్రిష్టియన్లను ప్రజలు చుట్టుముట్టారు. విదేశాలలో 'బాక్సర్లు'అనీ, చైనాలో "ఇనోచ్వాన్" అనీ ప్రసిద్ధిచెందిన రహస్య సంఘీయులు యీ వుద్యమానికి నాయకత్వం వహించారు. డోగరు చక్రవర్తిని కూడా వీరికి ప్రథమంలో సహాయం చేసింది.

"బలిష్ఠమైన విదేశ ప్రభుత్వాలు మన సామ్రాజ్యంపైన పెద్ద పులుల వలె రక్త పిపాసతో కన్నులు వేసికొని అదునుకొరకు చూస్తున్నాయి. రాజప్రతినిధులు, రాష్ట్ర గవర్నర్లు ఐక్యమై యీ ఘాతాలకు బుద్ధిచెప్పాలి. వారి పెదవుల నుండి 'శాంతి' అనే పదాన్ని బహిష్కరించాలి. దేశీయుల గృహాలను, వారి పూర్వీకుల గోరీలు అపవిత్రం చేయకుండా పరదేశీయుల నుండి కాపాడాలి."

## ఉద్యమ వ్యాప్తి

చైనాలో నలుమూలలా ప్రాకుతోన్న విదేశ విద్వేషాగ్నిని అరికట్టేందుకు విదేశ మంత్రులు డంగ్ ఫ్యూసియాంగ్ సేనానిని ఆయన క్రిందనున్న ముంగ్లివిఒకాంద్ర సైన్యంతో ప్రయత్నం చేయవలసినదని కోరారు. కాని 1899 అక్టోబరు మాసంలో ఆయన సైనికులే బ్రిటిష్ సోల్జర్లమీద రాళ్లురువ్వి గాయపరచారు. బాక్సర్లు బహిరంగంగా సైనిక కవాతు చేస్తూ పరదేశీయులను, వారికి ఊడిగంచేసే దేశీయ సేవకులను భయపెట్టజొచ్చారు ఆ శీతాకాలంలో పరిస్థితులు మరీ విషమించాయి. పెకింగ్ నగర పరిసర గ్రామాల్లోని క్రిష్టియన్ల యిండ్లు తగులబెట్టబడ్డాయి. రైల్వే లైన్లను పీకివేసి మార్గాన్ని విధ్వంసం చేశారు. టాకూ నౌకాశ్రయంలోని ఓడలను, విదేశస్థావరాలను 340 సైనికులు రక్షిస్తున్నారు. బాక్సర్లు, వారితో కలసిన సామ్రాజ్య సైనికులు జూన్ 15 వ తేదీని 60 మరఫిరంగులతో టీన్‌సిన్ విదేశ స్థావరాన్ని ముట్టడించారు. జూన్ 24 వ తేదీని రష్యన్ల సహాయక సైన్యాలు వచ్చి టీన్‌సిన్ కోటలోని వారికి సహాయపడ్డారు. జపాన్ సైనికుల నుండి సహాయ సంపత్తులు నూతన సైనికులకు విరివిగా లభించాయి.

విదేశ స్థావరమును ముట్టడించి బాహ్య ప్రపంచముతో రాకపోకలు ఉత్తర ప్రత్యుత్తరములు లేకుండా బాక్సర్లు చేశారు. జూన్ 20 వ

తేదీని జర్మను మంత్రియైన బేరన్‌వాన్ కీట్లర్‌ను బాక్సర్లు చంపివేశారు. జపాన్, రష్యన్ సహాయక సైనికుల రాకతో యుద్ధపరిస్థితి తారుమారైంది. బాక్సర్లు నిలిచి పోరాడలేక చెల్లాచెదరైపోయారు. రాజధాని నగరమైన పెకింగ్‌పై రష్యన్ సేనలు పడగానే డోగర్‌రాణి, చక్రవర్తితో షెన్సీరాష్ట్ర ప్రధాన పట్నమైన లియాన్‌ఫూకు పారిపోయింది. చింగ్ రాజకుమారుడు లీహాంగ్ చాంగ్‌కు విదేశ ప్రభుత్వాలతో రాజీ పడుటకు సంపూర్ణాధికార మీయబడింది. బాక్సరిజంతో సంబంధమున్న వుద్యోగస్తులను తగు రీతిని శిక్షించుటకు, నష్టపరిహార మిచ్చుటకు, టాకూకోటను వారికి వశపర్చుటకు, ఆయుధముల దిగుమతిని నిషేధించుటకును, సుంగులీ విలుకాండ్ర సైన్యమును రద్దుచేయుటకును, అంగీకరించి ఒడంబడిక పైని సంతకములు చేసారు. బాక్సరు వుద్యమముతో సంబంధమున్న ట్వాంగ్, సైలాన్ రాకుమారులకు మరణశిక్ష విధించబడింది. ముగ్గురు వున్నతోద్యోగులు వురితీయబడ్డారు జర్మణా సేనానియైన వాన్‌కీట్లరు హత్యకుగాను క్షమార్పణ కోరుకొనుటకు చూన్‌రాజకుమారుడు జర్మనీకి వెళ్లాడు. విదేశ ఆస్తి ప్రాణాలకు నష్టం కలిగిందనే కారణంతో చైనాప్రభుత్వం మీద అరుకోట్ల డెభై ఎలక్షల పౌనుల యుద్ధ నష్ట పరిహారం రుద్దారు. ఆర్థికంగా దివాలా పరిస్థితిలో మన్న చైనా ప్రభుత్వం నూటికి నాలుగు చొప్పున వడ్డీతో చెల్లించేందుకు అంగీకరించింది. ఈ బాక్సరు నష్టపరిహార ఒడంబడికపై 1901 సెప్టెంబరు 7 వ తేదీనాడు సంతకములు జరిగాయి.

చైనాయొక్క పోరాట శక్తిని ఉద్ధరించేందుకు లేవదీయబడిన బాక్సరు వుద్యమమును రష్యన్ జారిష్టు ప్రభుత్వము సందేహ దృష్టితోచూచి బ్లాగోవెస్టచంక్ అను కోటను కట్టి దానిని దుర్భేద్యము చేశారు. ఆ కోటచుట్టూ నివసిస్తూన్న చైనా దేశీయులను గవర్నరు చిచిగోవు యిండ్లను వదలివేసి ఆమూర్ నది దాటి వెడలిపొమ్మని ఆజ్ఞా

పించాడు. వారు సందేహించగా సాయుధ రష్యన్ సైనికులు వారిని నదిలోనికి తరిమారు. ఈ దారుణ చర్యకు ఫలితంగా 450 మంది చైనీయులు అసువులను కోల్పోయారు.

చైనా ప్రథమప్రపంచ యుద్ధంలో మిత్రమండలి తరపున జేరినందుకు గాను యీ నష్టపరిహార పసూళ్లు 5 సంవత్సరములు మానివేశారు. ఈ ఋణాలను తీర్చుటకు గాను చైనా ప్రభుత్వం ప్రజలను పీడించి, అత్యధికంగా శిస్తులను వసూలు చేయవలసి వచ్చేది. శిస్తు, ఋణ పీడితులైన చైనా రైతాంగం విదేశ సామ్రాజ్యవాదుల ప్రాబల్య వినాశాన్ని కోరేవారు

అమెరికాకు చైనాప్రజలు వలసపోయి, ఆ దేశంలో స్థిరనివాస మేర్పరచుకోరాదని అమెరికనులు చేసిన శాసనమునకు వ్యతిరేకంగా, చైనీయులు 1905 లో అమెరికను వస్తువులను కొనకుండా తీవ్రమైన బహిష్కరణాందోళనను సాగించారు. 1908 లో జపాను వస్తువులను కూడా బహిష్కరించగా, అమెరికను వ్యాపారమునకు కలిగిన నష్టమునకు జంకి, ఈ ఋణం వసూలు చేయడంలోని అన్యాయాన్ని గుర్తించి, వ్యాప్తిచెందుతోన్న జాతీయోద్యమమును సమాధాన పరుచుటకుగాను 1908 లో అమెరికా ప్రభుత్వం తమ వంతులో సగభాగాన్ని వదులుకొని, మిగిలిన సగభాగంమీద వచ్చే వడ్డీతో సింఘువా విశ్వవిద్యాలయాన్ని నిర్మించి పోషించ మొదలుపెట్టారు.

# 2 వ అధ్యాయం.

## జాతీయ విప్లవ జననక్రమం.

---

### సన్‌యట్ సేన్ ప్రాముఖ్యత

చైనా విప్లవనాయకులందరిలో సన్‌యట్ సేన్ అగ్రగణ్యుడు. గొప్పత్యాగి. అద్భుతమైన మేధావి. ఆర్థిక, రాజకీయ శాస్త్రవేత్త. గొప్పనిర్మాణకర్త. భావవైశాల్యంలోను, విప్లవకర ఎత్తుగడలను వేయుటలోను ఆయన తదితర విప్లవనాయకులకు మిన్న. విప్లవతత్వము ఆయనలో మూర్తీభవించినది. ఈ అఖండ విప్లవ ప్రజ్ఞాధురంధరుని చైనా ప్రజాసామాన్యం భక్తితో అనుసరించింది. యుగయుగాల నిద్ర నుండి చైనాప్రజలను సన్‌యట్ సేన్ మేల్కొల్పాడు. జాతీయభావాలు కల్గించాడు. జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాన్ని సూచించాడు. ఆధునిక విప్లవచైనాలో నిర్మింపబడుతున్న సంస్థలన్నిటికీ ఆయనచే నిర్వచింపబడిన "మూడు ప్రజాసూత్రాలు" అనునవే మూలసిద్ధాంతాలయ్యాయి. సాంప్రదాయిక చైనాకు కన్ఫ్యూషియన్ ప్రవక్త అయినట్లే ఆధునిక చైనాకు సన్‌యట్ సేన్ సృష్టికర్తగా పరిగణింప బడుతున్నాడు.

### బాల్యము, యౌవనము.

క్వాంగుటంగు రాష్ట్రంలో సియాంగ్‌షాన్ జిల్లాలోని సూయిహెంగు అనే గ్రామంలో 1866 వ సంవత్సరం నవంబరు 12 వ తేదీని సన్‌యట్ సేన్ జన్మించాడు. సన్ తండ్రి అయిన సన్‌టోచ్వాన్ క్రిష్టియన్ మతం స్వీకరించాడు. ఆకాలంలో క్రిష్టియన్ మతాన్ని స్వీకరించిన వారికి పదవులుగాని, గౌరవంగాని లేనప్పటికీ తైపింగు తిరుగుబాటుదారుల యందు గల అభిమానమే మతస్వీకరణానికి ఆయనను ప్రోత్సహించింది. కాని ఆయన మిగిలిన గ్రామస్థులవలెనే గ్రామదేవతలను



డాక్టర్ సన్‌యట్‌సేన్.

కొలుచుమండెడివాడు. సన్‌యట్‌సేన్ క్రిష్టియనుగా జన్మించినప్పటికీ, చర్చికి వెళ్లేవాడుకాదు. క్రిష్టియన్ నీతులను పాటించేవాడుకాదు స్వర్గ రాజ్యాన్ని ప్రచారంచేస్తూ, సామ్రాజ్య, పెట్టుబడిదారీ విధానాలను తీవ్రంగా యెదుర్కొన్నాడు కమ్యూనిజాన్ని ప్రబోధిస్తూ ఆచరణలో వుంచాడు. ఒకరినొకరును, శత్రువులను కూడా ప్రేమించవలసిందిగా మానవులకు ప్రబోధించిన జీసస్ క్రైస్టును పరమోత్కృష్ట విప్లవవాదిగా బాల్యం నుండీ ఆయన పరిగణించాడు. తమ స్వప్రయోజనాలకొరకు విదేశీయుల సహాయం కోరి, చైనాయొక్క రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని హరిం చేందుకు వారికి తోడ్పడే చైనా క్రైస్తవుల చర్యలను, క్రిష్టియను తత్వ విరుద్ధమని గర్హించేవాడు. సన్ అసలుపేరు వేన్ యౌవనదశలో "ఉమింగ్" గా మార్చుకున్నాడు. కొద్దికాలం తర్వాత 'యట్‌సేన్' గా మార్చుకున్నాడు. సన్‌యట్‌సేన్ అనే నామమే ప్రపంచ ప్రఖ్యాతిని పొందింది. జపానులో రాజకీయ ప్రవాసిగా వున్నప్పుడు 'నకయామా' అను మారుపేరు పెట్టుకున్నాడు. 'నకయామా' అను పదానికి చైనాలో చుంగ్‌షాన్ అని అర్థం. అందువలన ఆయనను చైనాలో సన్‌చుంగ్‌షాన్ అని పిలుస్తారు. 1925 లో ఆయన చనిపోయినతర్వాత ఆయన గౌర వార్థం చుంగ్‌షాన్ నామంతో అనేక సంస్థలుద్భవించాయి.

గ్రామ దేవాలయంలో పెట్టిన చిన్న పాఠశాలలోనికి ఏడవయేట సన్ చదువుకునేందుకు ప్రవేశించాడు. చైనా పురాణగ్రంథాలను ఆ పాఠ శాలలో విద్యార్థులచేత వల్లెవేయిస్తూండగా సన్‌యట్‌సేన్ అనేక ప్రశ్నలు వేసి, అవి వల్లించటం నిరర్థకం అని వాదించ సాగాడు. ఆ బడి పంతులైన సన్‌యట్‌సేన్ పినతండ్రి తైపింగు తిరుగుబాటు దార్లలో ఒకడు కనుక సన్‌ను దండించక, తనతో తోటలలోనికి తీసి కొనివెళ్లి, తైపింగు తిరుగుబాటుదార్లయొక్క అద్భుత సాహసచర్య లను వర్ణించి చెప్పేవాడు. తైపింగు తిరుగుబాటు నాయకుడైన హుంగు- సియూచ్వాన్ వీరగాథలను విని చిరుతప్రాయమువనే, సన్ తానుకూడ

ఆయనవలె విప్లవనాయకుడు కావలెనని ఉవ్విళ్లూరు చుండెడివాడు. తోడి విద్యార్థులనందరను ప్రోగుచేసి, సిపాయిలవలె యుద్ధాలు చేస్తూ, తాను నాయకుడై వారిని నడిపించేవాడు. సన్ తండ్రి పేదరైతు కనుక, పగలంతా తండ్రికి సహాయపడుతూ, రాత్రికాలంలో చదువుకునేవాడు. బియ్యం చాలా ఖరీదుకనుక, దుంపలు తిని మాత్రమే ఆ నిరుపేద కుటుంబం జీవించేది. ఇట్టి పరిసరాల్లోనే సన్ విప్లవ భావాలను పినతండ్రి వద్దనుండి స్వీకరించి. స్త్రీలపాదాలను యినపచెప్పులలో బిగించడం, ఆడపిల్లలను అమ్మడం మొదలైన సాంఘిక దురాచారాలను యెదుర్కొనేవాడు.

1879 లో సన్ పదమూడవ యేట. పెద్దఅన్నగారు వ్యాపారం చేస్తోన్న హోనోలూలూకు వెళ్లి. ఆయన వృత్తిలో తోడ్పడసాగాడు. ఇచ్చటనే ప్రప్రథమమున పాశ్చాత్య నాగరికతతో ఆయనకు సంపర్కం కలిగింది. హైస్కూలులో ఆంగ్లవిద్య నభ్యసించి అన్నిక్లాసులలోను ప్రథముడుగా ఉత్తీర్ణుడయ్యాడు.

వేషభాషల్లోను, భావాల్లోను పాశ్చాత్యులను సంపూర్ణంగా అనుకరిస్తోన్న సన్‌ను చూచి భయపడి ఆయన అన్నగారు స్వగ్రామానికి సన్‌ను పంపించివేశాడు. కాని ఆ గ్రామంలో సన్ కుదురుగా కూర్చోలేదు. గ్రామదేవత విగ్రహాన్ని నిర్భీతిగా విరగగొట్టి సాంఘిక దురాచారాన్ని తీవ్రంగా విరసించ సాగేడు. గ్రామస్థుల్లో సన్ విప్లవకర చర్యలు గొప్ప ఆందోళన కలిగించాయి. అందువలన సన్‌ను ఆయన తల్లిదండ్రులు హాంగ్‌కాంగులోని కళాశాలకు పంపించివేశారు.

1886 లో క్వీన్స్ కళాశాలలో విద్యాభ్యాసం పూర్తిచేసిన తర్వాత సైనిక శిక్షణ కళాశాలలో జేరాలనుకున్నాడు కాని చైనాలో విదేశసైనిక శిక్షణాలయంలో గొప్ప రాజకీయ పలుకుబడి లేనిదే యెవ్వరినీ చేర్చుకునేవారుకారు. అందువలన 1887 లో కాంటన్ వైద్యవిద్యాలయం

లోను, మరుసటి సంవత్సరం హాంగ్‌కాంగులో క్రొత్తగా స్థాపింపబడిన వైద్యకళాశాలలోను చదువ నారంభించాడు. హాంగ్‌కాంగులో రాజకీయ చర్చలు, ప్రచారం హెచ్చుగా చేయటానికి సావకాశముంటుందనే అచ్చటికి సన్ వెళ్లాడు. 1892 లో ఉత్తమ తరగతిలో కృతార్థుడయ్యాడు.

## వివాహం, పునర్వివాహం.

18 వ యేటనే సాంప్రదాయానుసారంగా సన్‌యట్‌సేనుకు తలిదండ్రులు వివాహం చేశారు. ఆవిడకు రాజకీయభావాలేమీ లేనందున సన్‌కు కుటుంబ సౌఖ్యమేమీ లేకపోయింది. ఆమెను ప్రేమించలేకపోయేవాడు. 1912 లో ఆయన చైనా ప్రజాస్వామికాధ్యక్షుడైనప్పుడు, సూంగ్ చింగ్ లింగ్ అనే అందమైనకన్య ఆయనకు ప్రత్యేక ఇంగ్లీషు కార్యదర్శినిగా పనిచేసింది. వారిద్దరూ ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకున్నారు. కాని ప్రథమ భార్యవలన ఆయనకు సన్‌ఫో, సన్‌ఆఁ అను యిద్దరు సంతానం కలిగారు. ప్రజలలో వ్యతిరేకభావాలు కలుగుతాయేమోనని ఆయన అనుచరులలో చాలమంది వద్దని అభ్యంతరం చెప్పినను పెడచెవిని పెట్టి, మొదటిభార్యకు ఆమె యిష్టంమీదనే విడాకులిచ్చి, సూంగ్ చింగ్ లింగ్‌ను 1915 వ సంవత్సరం అక్టోబరు 25 వతేదీన జపాన్‌లో వివాహమాడాడు. ఈ వివాహం అన్నివిధాలా ఆదర్శప్రాయమైనది. సూంగ్‌సతి, భర్తయొక్క ఆశయాలు, ఉద్దేశాలు, జీవితవిధానాలతో సంపూర్ణంగా యేకీభవించేది. అనేక గ్రంథాలను వ్రాసేటప్పుడు ఆయనకామె తోడ్పడింది. సన్ మరణానంతరం ఆయన ఆశయాలను ఆమె ఒక్కతెయే సరిగా వెల్లడించకలదిగా పరిగణింప బడుతోంది.

## సిఙా చింగ్ హూయీ స్థాపన.

కాంటన్ వైద్యకళాశాలలో సన్ చదివేకాలంలో కోలాహూయి అనే రహస్యసంఘ నాయకుడైన చెంగ్ షీలియాంగ్‌తో సన్‌కు పరి

చయం కలిగింది. వారిద్దరూ రాజకీయ పరిస్థితులను గురించి తర్జన భర్జనలు చేస్తోండేవారు. మంచూచక్రవర్తి వంశాన్ని నిర్మూలించేందుకు ప్రయత్నించుచో, తనసంఘసభ్యులు, చక్రవర్తి సైన్యంలో వున్న తన అనుచరులూ సహా నాయకత్వానికి లోబడుతామనీ, తమ్మి నడుపవలసిన దనీ చెంగ్ పదేపదే సన్ను ప్రార్థించేవాడు. కాని హాంగ్ కాంగులో యింకా గొప్ప విప్లవావకాశాలు కలవని యెంచి, సన్ హాంగ్ కాంగు వెళ్లి, యచట చెన్‌షోపీ, యూషోవాజ, యాంగ్‌హూలీన్, లూహో దంగు అను వారలను విప్లవపక్షంపై పుకు త్రిప్పాడు.

హాంగ్ కాంగ్‌లో చెన్‌యియూ, యాంగ్‌లతో సేన్ విప్లవ సమస్యలను చర్చిస్తో కాలం గడిపేవాడు. ప్రపంచ విప్లవోద్యమాలను కూలంకషంగా అభ్యసించేవారు.

1892 లో పట్టం తీసికొన్న తర్వాత డాక్టర్ సన్ మాకోలో వైద్యం చేసే నెపంమీద జోరుగా విప్లవ ప్రచారం సాగించాడు. కాంటన్‌లో వున్న చెంగ్ షిలియాంగ్‌తో కలసి సిన్‌చింగ్‌హూయి (తరుణ చైనాపక్షము) ను 1894 లో స్థాపించి, మంచూ ప్రభువంశ నిర్మూలనానికి ప్రచండ రాజకీయ అందోళనను సాగించాడు. నిరంకుశ ప్రభుత్వంస్థానే శాసనబద్ధ రాచరికం కావాలని వీరు కోరారు. మంచూ చక్రవర్తుల స్థానే దేశీయ చక్రవర్తులను నెలకొల్పాలన్న తదితర రహస్య సంఘాలకన్న యీ సంఘ సభ్యులు ఒక అడుగు ముందుకు వేశారు. నిరంకుశంగా పరిపాలించేటప్పుడు ప్రభువులు మారినప్పటికీ ప్రజలకెట్టి మేలును కలుగదు కాబట్టి, రాచరికంలోనూ, శాసన నిర్మాణంలోనూ ప్రజలకు అధికారం కావాలని బహిరంగంగా కోరుతో, రహస్యంగా చక్రవర్తిమీద తిరుగుబాటుకు ప్రయత్నాలు చేశారు.

## 1895 కాంటన్ తిరుగుబాటు.

జపాన్ చేతుల్లో చైనా ఓడిపోయి అవమానాలపాలగుటతో,

మంచూ చక్రవర్తిమీద ప్రజలకు ద్వేషం ప్రబలింది. ఈ అవకాశాన్ని తీసుకుని డాక్టరు సన్‌యట్‌సేన్, ఛెంగ్ యింగ్ నాన్, మరిపుగ్గురు విప్లవ వాదులతో కలసి కొన్ని రాజకీయ సంస్కరణలను ప్రవేశ పెట్ట వలసినదిగా చక్రవర్తిని కోరుతూ ఒక మహజరు నివ్వాలని ప్రయత్నిం చాడు. చిహిలీ, హూపే రాష్ట్రాల పరిస్థితులను పరిశీలించేందుకు, టీన్ ట్సిన్‌లో వున్న రాజప్రతినిధిని సందర్శించి, ఆయన ద్వారా మహజరును చక్రవర్తికిచ్చేందుకును లూహూడంగును వెంటదీసుకుని డాక్టరు సన్ వెళ్లాడు.

రాజప్రతినిధి ఆయనకు దర్శనమీయ తిరస్కరించి, మహజరు మీద సంతకాలు పెట్టిన వారిమీద చర్యతీసికొన నారంభించాడు. దీనితో ఆయనకు సంస్కరణ విధానంలో నమ్మకం నశించింది. తమ ప్రార్థన మన్నించబడి, కొత్తపన్నులు మున్నగు ప్రజాపీడక శాసనాలు రద్దు చేయబడేవరకూ కాంటన్ పట్టణాన్ని స్వాధీనపరచుకోవాలనే ఉద్దేశంతో సరా కాంటన్‌కు తిరిగివచ్చాడు.

హాంగ్‌కాంగ్‌లో ఛెంగ్ యింగ్ నాన్, యాంగ్ చూయూన్, వాంగ్‌యుంగ్‌షాంగ్, చెన్‌షోపీ మున్నగు విప్లవవాదులతో వర్తక సంఘం పేరిట ఒక విప్లవసంఘాన్ని యేర్పాటు చేశాడు. కాంటన్‌లో లూహోడంగు, చెంగ్ షిలియాంగ్ మొదలైన వారితో కూడిన మరొక విప్లవ సంఘాన్ని, వ్యవసాయిక సంఘం పేరుతో స్థాపించాడు కాంటన్ పట్టణాన్ని పట్టుకునేందుకు తీవ్రప్రయత్నాలు సాగాయి. అనేక వందల మంది ప్రజలు, సైనికులు యీ సంఘంలో చేరారు. 500 పిస్తోళ్లను, లూహోడంగు తీసుకొని వస్తోండగా 1895 వ సంవత్సరం సెప్టెంబరు 9 వ తేదీన పట్టుబడి వెంటనే చియూసీ, చూచేన్‌లతో బాటు ఉరితీయ బడ్డాడు. 70 మంది అరెస్టు చెయ్యబడ్డారు. సన్‌యట్ సేన్‌ను పట్టి యిచ్చిన వారికి 2 లక్షల రూపాయల బహుమతి యిస్తామని చైనాప్రభుత్వం ప్రకటించింది.

ఈవిధంగా యీ తిరుగుబాటు ప్రయత్నం అణచివెయ్యబడింది. మూడురోజుల అనంతరం సన్‌యట్‌సేన్ యోకహోమాకు పరికొద్ది మందితో తప్పించుకుని వెళ్ళిపోయాడు.

## సన్‌యట్‌సేన్ ప్రథమ ప్రపంచ పర్యటనం.

ఈ ఉదంతం తర్వాత సన్‌కు రాచరికమందు సంపూర్ణ విముఖత్వం కలిగింది. ప్రజాస్వామిక ప్రభుత్వం స్థాపించాలనే సంకల్పం కలిగి జపాన్‌నుండి అమెరికాకు వలసవెళ్ళిన చైనీయుల్లో విప్లవప్రచారం చేసేందుకు అమెరికా వెళ్లాడు కాని అక్కడవున్న చైనీయులలో విప్లవ సానుభూతిపరులు చాలతక్కువమంది వున్నారు. అమెరికానుండి ఇంగ్లండుకు వెళ్ళాడు. లండన్‌లో చైనారాయబార కార్యాలయంవారు డాక్టరు సన్‌ను రహస్యంగా 1896 అక్టోబరు 11 నుండి 21 వరకు పదిరోజులు బంధించారు కాని ఆయన పాత ఉపాధ్యాయుడైన సర్ జేమ్సు కాంట్లీ ఆయనను చూచుట తటస్థించింది. వెంటనే బ్రిటిష్ విదేశాంగ కార్యాలయంవారు జోక్యం కలుగజేసుకుని ఆయనను బంధవిముక్తుణ్ణి చేశారు. ఈ ఉదంతం ఆయనకు ఇంగ్లీషు చదువుకున్న ప్రజలందరిలోను గొప్ప ప్రఖ్యాతిని కలిగించింది లండన్‌నుండి, కార్మిక, సోషలిష్టు నాయకుల పరిచయం కలిగించుకునేందుకు యూరప్‌ఖండ పర్యటనం సాగించాడు. లాంగెట్, లఫార్గ్‌ల ప్రోత్సాహంవలన మార్క్సిజాన్ని చదువ నారంభించాడు.

పెట్టుబడిదారీ సమాజంలోని వర్గభేదాలను, దారుణ అసమానత్వాన్ని, వాటిని తొలగించేందుకు యూరపియన్ కార్మికవర్గం జరుపుతోన్న పోరాటాలను సన్ చూచి, ఆదేశాలలో పేరుకు మాత్రమే ప్రజలకు రాజకీయహక్కులున్నాయనీ, ఆర్థికంగావారు పెట్టుబడిదారుల బానిసలేననీ గుర్తించాడు అందువలన మంచూరాజవంశ నిర్మూలనమే కాక ప్రజల ఆర్థిక, సామాజిక పరిస్థితుల్లో సంపూర్ణమైన మార్పు తీసి

కొని రావాలని తీర్మానించుకున్నాడు. అందువలన జాతీయస్వాతంత్ర్యం, ప్రజలకు రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాలు విప్లవం వలన సాధింపబడా లనే దృఢనిశ్చయం చేసుకుని, రెండు సంవత్సరాల అనంతరం జపాన్ తిరిగివచ్చాడు.

## వందరోజుల సంస్కరణలు.

గాలిదుమారమువలె వ్యాపిస్తోన్న విప్లవభావాలకు జంకి, ప్రజలను జోగొట్టుటకు క్వాంగ్సూ చక్రవర్తి 1898 జూన్ 11 నుండి సెప్టెంబరు 20 వరకు అనేక సంస్కరణలు ప్రవేశపెడుతున్నానని వ్యర్థప్రకటనలు చేశాడు. సైనికులకు పాశ్చాత్య సైనికశిక్షణ, ఆయుధాలు యిచ్చేందుకు ప్రయత్నాలు జరిగాయి. సైనిక విద్యాలయాలు తెరువబడ్డాయి. ప్రాథమిక మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు స్థాపింపబడ్డాయి. వేలకొలది సంవత్స రాలనుండి ఆచరణలోవున్న సాంప్రదాయాలకు విరుద్ధంగా యీ సంస్క రణలు జరిపేందుకు ప్రయత్నించిన చక్రవర్తిపై ఉన్నతోద్యోగులే డోగర్‌జీపే చక్రవర్తిని నాయకత్వం క్రింద తిరుగబడి, చక్రవర్తిని బంధించి ఆరుగురు సంస్కరణవాదులను ఉరిదీసి యీ సంస్కరణలను బుట్టదాఖలు చేశారు. ఈ విఫల ప్రయత్నంవలన విప్లవమూలకంగాగాని, చైనాలో యెట్టిమార్పులు చేయబడజాలవు అను సన్‌యట్‌సేన్ ప్రచారా నికి ప్రజల్లో గొప్ప పలుకుబడి కలిగింది.

## 1900 లో పరాజయం.

1895 లో విప్లవ ప్రయత్నం విఫలమైనప్పటికీ, విద్యార్థి దశ నుండి నిర్మించిన విప్లవసంస్థ విధ్వంసమైనప్పటికీ, సన్‌యట్‌సేన్ నిరుత్సాహపడక నిరంతర విప్లవప్రచారం కొనసాగించాడు. "చుంగ్‌క్వో జీవోమ" (చైనా దినపత్రిక) చెన్‌షోపీ సంపాదకత్వాన హాంగ్‌కాంగ్‌లో ముద్రించి చైనాలో వివిధ భాగాలకు రహస్యంగాపంపి విప్లవభావాలను

వెదజల్ల నారంభించారు. యాంగ్‌ట్సీలోయ ప్రాంతంలోని విప్లవకర్తులను సుసంఘటిత పరచేందుకు షిచీజాయూను పంపాడు. హాంగ్‌కాంగ్‌లో నెలకొల్పబడిన ప్రవాస విప్లవ కార్యస్థానంలో 1899 లో సీన్‌చుంగ్ హుయి, హంగ్ విప్లవనాయకుల సమావేశం జరిపారు. ఈసమావేశానికి క్వాంగ్‌టంగు, క్వాంగ్సీ, ఫూకీన్, యాంగ్‌జీ లోయలనుండి ప్రతినిధులు హాజరై వివిధ విప్లవ సంఘాలను ఐక్యపరచి, ఒక్క విప్లవ సమాఖ్య యేర్పరచి, దానికి సన్‌యట్‌సేన్‌ను ఏకైకనాయకునిగా యెన్నుకున్నారు.

ఈసమయంలోనే మంచూవంశ నిర్మూలనానికి ప్రారంభింపబడిన బాక్సరు తిరుగుబాటు, ప్రభుత్వోద్యోగుల చాకచక్యంతో విదేశీయ వ్యతిరేక ఉద్యమంగా మారింది. సన్ పలుకుబడిలోవున్న దక్షిణ చైనా ప్రాంతం యీ ఉద్యమంలో పాల్గొనలేదు

చెంగ్‌షీయూంగ్‌ను వైచౌకును, షిచీన్‌యూను కాంటన్‌కును విప్లవాలు లేపదీయుటకు సన్‌యట్‌సేణ్ పంపి జపానునుండి కొందఱు జపాను సైనికనిపుణులను వెంటబెట్టుకొని, చైనాలో సుశిక్షితులైన విప్లవసైనికులను తయారుచేసి, స్వయంగా విప్లవాన్ని నడిపించాలని హాంగ్‌కాంగ్ జేరుకున్నాడు. కాని అచ్చట అధికారులు ఆయనను గుర్తించి దేశంలోనికి రానీయనందున చెంగ్‌షిలియూంగ్‌మీద విప్లవం తెచ్చి, నడిపించే సంపూర్ణబాధ్యతనుపెట్టి, ఫార్మోజా జేరుకున్నాడు. ఫార్మోజా గవర్నరైన కోడమాసన్ విప్లవభావాలయెడ అభిమానం కలిగినవాడుకాన, విప్లవ పరిస్థితు లేర్పడినప్పుడు యుద్ధపరికరాలను సహాయం చేస్తానని వాగ్దానం చేశాడు.

కాంటన్ పట్టుకునేముందు సౌకాశ్రయప్రాంతాన్ని వశపరచుకోవలసిందిగా సన్, చెంగ్ షిలియూంగ్‌కు ఆజ్ఞాపించాడు. చెంగ్ అతిరహస్యంగా పందలాది రైతులకు, విప్లవవాదులకు సైనికశిక్షణ నిచ్చి,

ఆయుధాలు సమకూర్చసాగేడు. ఈ విప్లవపటాలాలు అకస్మాత్తుగా షిన్ యాన్ షేన్ చీ ప్రాంతాల్లోవున్న చక్రవర్తి సైన్యాలను ముట్టడించి, నిరా యుధులను చేశారు. వెన్వెంటనే లుంగ్ కాంగ్, టాన్ షుయి, యుంగ్ హుయి మరికొన్ని యితర ప్రదేశాలను ముట్టడించి వశపరచుకున్నారు. హూచౌ, సిన్యాంగ్ ల మధ్యనున్న తీరప్రాంతమంతయు ఆక్రమింప బడింది. ఈ లోగా చెంగ్ షీలియాంగ్ విప్లవసైన్యం పదిపేలవరకూ వృద్ధిపొందారు. ఆయుధాలు, మందుగుండు సామగ్రులతో డాక్టర్ సన్ యట్ సేన్ యేర్పాటు చేసుకున్న ప్రకారంగా వస్తాడని చెంగ్ యెదురు చూస్తో, అటుపైని విప్లవచర్యలను నిలుపుచేశాడు. కాంటన్ లో తిరుగు బాటు చేయించుటకు నియమింపబడిన షీచీన్ యూకు ఆ పట్టణంలో తగి నంత ప్రోత్సాహం, సహాయం లభింపనందున, ప్రజలలో అలజడి కలి గించుటకు, రాజప్రతినిధిమీద బాంబు విసిరాడు కాని అది పేలలేదు. షీని అనుమానించి ఉరితీశారు.

చైనాలో విప్లవం లేవదీసేందుకు సహాయం చేస్తామని వాగ్దానం చేసిన ఉన్నతోద్యోగులలో యీ సమయంలో మార్పులు వచ్చాయి. ఇటో ప్రధానమంత్రి అయ్యాడు. జపాను ఉద్యోగులెవరూ చైనా విప్లవసైన్యాల్లో చేరకూడదనీ, ఆయుధపరికరాలేమీ సప్లయి చేయరాదనీ శాసించాడు. ఈ నిషేధంవలన సన్ యేర్పాటులన్నీ తారుమారయ్యాయి. సన్ వెంటనే యమూడా అను జపాను విప్లవవాదిని, చెంగ్ వద్దకు యీ సమాచారం తెలిపేందుకు పంపేడు. చెంగ్ తన విప్లవ దళాలను రద్దుచేసి, కొద్ది వందలమంది విప్లవానుచరులతో హాంగ్ కాంగు జేరుకున్నాడు. యమూడా తిరిగి వచ్చేటప్పుడు చైనా ఉద్యోగస్థులకు పట్టుబడి ఉరితీయబడ్డాడు. చైనాకు ప్రథమ జపాన్ మిత్రుడైన యమూడా విప్లవ బలిపేదికపైన అసువులర్పించి చైనీయుల మన్ననలకు పాత్రుడై చిరస్మరణీయు డయ్యాడు.

మంచూ చక్రవర్తి ప్రభుత్వాన్ని తుదముట్టించాలని డాక్టర్ సన్

చేసిన రెండు ప్రయత్నాలు విఫలమైనప్పటికీ పైనా ప్రజలలో గొప్ప కలవరాన్ని బయల్దేరతీశాయి. విప్లవ వాదులను విషసర్పములుగా చూచే వారు కొందరు చాల తీవ్రంగా ఖడించ సాగారు. ఎనిమిది రాజ్యాల సైన్యాలు రాజధానీ నగరమైన పెకింగు నగరం మీదకు దండెత్తిరాగా, చక్రవర్తి కుటుంబంతో షెన్సీ పర్వతాల్లోకి పారిపోవడం, తర్వాత 45 కోట్ల టేయల్సు పరాయిప్రభుత్వాలకు నష్టపరిహారం యిచ్చేందుకు ప్రజల మీద కొత్తపన్నులు వెయ్యడం, విదేశబ్యాంకర్లు, పరిశ్రమదార్లు, వర్తకుల దయాదాక్షిణ్యాల మీద రాజవంశంవారు ఆధారపడడం చూస్తోన్న రాజకీయ చైతన్యం కలిగిన చైనీయు లందరు దుర్బలచక్రవర్తులమీద తిరుగబడి, ప్రజాస్వామికప్రభుత్వాన్ని నెలకొల్ప యత్నించే విప్లవవాదుల వైపు మొగ్గసాగారు.

# 3 వ అధ్యాయం.

## టంగ్ మెంగు హ్వా



### చైనా సంయుక్త విప్లవపక్షం.

పాశ్చాత్య భావసంపర్కం, పారిశ్రామిక వస్తువుల పోటీ, గృహ పరిశ్రమల విచ్ఛేదం, నిరుద్యోగం, చక్రవర్తి అశక్తదుర్బలత్వం, ఉద్యోగుల లంచగొండితనం, ప్రజల తిరుగుబాట్లు, సంస్కరణ ప్రయత్న వైఫల్యం, నిరంతర విప్లవప్రచారం చైనావిద్యార్థుల్లో అపూర్వమైన రాజకీయసంచలనం కలిగించాయి.

విదేశస్థుల అధికారానికి లోబడివున్న చైనా పట్టణాల్లోనుండి మంచూ వంశప్రతికూల ప్రచారం జోరుగా సాగింది. "సూపో" అనే పత్రిక తీవ్రమైన ఆందోళన సాగించింది. జపాన్‌లో చదివే విద్యార్థులు చక్రవర్తిని తొలగిస్తేనేగాని, చైనాకు దుర్దశ తొలగి, ప్రాచీన ఔన్నత్యం రాదని నిర్భీతిగా ప్రకటించ సాగారు. అనేక విప్లవకరపత్రాలు ప్రజలలో పంచిపెట్టబడుతున్నాయి. విప్లవభావాలు దావాగ్నిలా చైనాను చుట్టబెడుతున్నాయి.

పాశ్చాత్యసేనలు ఆధునికమారణ యంత్రాలతో, సుశిక్షిత సైన్యాలతో చైనా చక్రవర్తిమీద దండెత్తి వర్తక సౌకర్యాలను, వలసపట్టణాలను సంపాదించ సాగారు. 1838 లో 25 లక్షల పౌన్లు మాత్రమే వున్న విదేశవస్తువుల దిగుమతి, 1844 నాటికి 55 లక్షల పౌన్లు 1855 లో 115 లక్షల పౌన్లు, 1879 లో 245 లక్షల పౌన్లు, 1895 లో 1710 లక్షల టేల్సు, 1905 కు 4470 లక్షల టేల్సు వరకును విపరీతంగా పెరిగింది. విదేశ పారిశ్రామిక వాణిజ్యంతో పోటీచేయలేక, దేశీయ గృహపరిశ్రమలు ఛిన్నాభిన్నమయ్యాయి. లక్షలాది ప్రజలు నిరుద్యోగు

లయ్యారు. 1895 తరువాత చైనా దేశీయపరిశ్రమలుకూడ కొద్దిగా నెలకొల్పబడి, పల్లెలలో నిరుద్యోగులైన వారికి పనిచూపించాయి. ఈ విధంగా చైనాలోకూడ యంత్రపరిశ్రమలు విజృంభించుటతో విప్లవకరమైన కార్మికవర్గంకూడ పెరుగనారంభించింది. దేశీయపరిశ్రమల విస్తరణకు విదేశవ్యాపారపోటీ చాల ఆటంకదాయకంగా వున్నందున దేశీయ పెట్టుబడిదార్లలోకూడ తీవ్రమైన అసంతృప్తి వ్యాపించి, దుర్బలమైన చక్రవర్తి కుటుంబాన్ని నాశనంచేసి, దానిస్థానే తమ అవసరాలను తీర్చగల దృఢమైన ప్రభుత్వాన్ని యేర్పాటుచేయాలనే సంకల్పంకలిగి, విప్లవవాదులకు ప్రోత్సాహమీయ నారంభించారు.

విదేశాలకు వలసవెళ్ళిన చైనీయులు ప్రతిసంవత్సరం, కష్టపడి మిగిల్చినడబ్బు కొంత స్వదేశంలోవున్న బంధువులకు పంపుతున్నారు. ప్రజాప్రభుత్వదేశాల స్వేచ్ఛావాతావరణంలోవున్న చైనీయులు కూడ ప్రపంచంలోని శక్తివంతమైన రాజ్యాలలో చైనాకూడ అర్హస్థానం సంపాదించాలనే అభిలాషతో విప్లవవాదులకు పుష్కలంగా ధనసహాయం చేయజొచ్చారు.

ఇట్టి విప్లవానుకూల వాతావరణంలో డాక్టర్ సన్‌యట్‌సేన్ ప్రథమపర్యాయం బహిరంగంగా జపానులో చరిత్రప్రసిద్ధమైన "చైనా సమస్యయొక్క వాస్తవిక పరిష్కారమార్గం" అనే ప్రకటనను చేశాడు. హానోలూలూలో ప్రకటింపబడిన యీ నివేదికలో విప్లవోద్దేశం నిర్వచింపబడటమేకాక రాజకీయపరిస్థితుల వివరణకూడా కలదు. సాయుధ తిరుగుబాటుచేసి, మంచూరాజవంశాన్ని కూలదోసి, ప్రజాస్వామిక ప్రభుత్వం నెలకొల్ప వలసినదిగా చైనాప్రజలు హెచ్చరింపబడ్డారు. ఈ విప్లవానికి అండగా నిలువబడాలనీ నైతిక, ధనసహాయాలు చేయాలనీ పాశ్చాత్యులను కోరారు. "విజ్ఞానవంతమైన, అభివృద్ధికరమైన కొత్త ప్రభుత్వం పాతదాని స్థానాన్ని ఆక్రమించాలి. అప్పుడే చైనా రక్షింపబడి

ఆత్మరక్షణకు సమర్థురాలౌతుంది. గొప్ప నాగరికత, రాజకీయపరిజ్ఞానం కలిగినవారు ప్రజలలో అనేకులున్నారు. వారేనూతనప్రభుత్వయంత్రాన్ని నిర్మించి, సురక్షితంగా నడుపగలుగుతారు. పాతరాజరికాన్ని కొత్త ప్రజాస్వామిక ప్రభుత్వంగా మార్చేందుకు చాలాశ్రద్ధగా ప్రణాళికలు లోగడనే తయారుచేయబడ్డాయి.

శాసనబద్ధరాచరికాన్ని నెలకొల్పాలని వాదించే లియాంగ్చీచౌ మున్నగు సంస్కరణవాదుల ప్రచారానికి, మంచూవంశంస్థానే మరొక దేశీయచక్రవర్తి వంశాన్ని ప్రతిష్ఠించాలనే కొన్ని రహస్యసంఘాల ప్రయత్నాలకు యీనివేదిక పూర్తిగా స్థానంలేకుండా చేసింది. సన్యట్ సేన్ రెండవ ప్రపంచపర్యటనంలో 1905లో బ్రస్సెల్సు, బెర్లిన్, పారిస్ మున్నగు పట్టణాలలోవున్న చైనా విద్యార్థులు, విప్లవవాదులతో యీనివేదికలో నిర్వచింపబడిన విప్లవలక్ష్యాలను సాధించేందుకు ఒక నూతన సంఘంయొక్క అస్థిపంజరాన్ని యేర్పరచాడు.

ఈకొత్త పక్షానికి చైనా ఐక్యవిప్లవపక్షం అని పేరుపెట్టాడు. బ్రస్సెల్సులో జరిగిన విద్యార్థి సమ్మేళనంలో ప్రథమపర్యాయం వెల్లడించిన "శాన్‌మించుఐ" అని పిలువబడే "మూడు ప్రజాసూత్రాలు" యీ ఐక్యపక్ష ఆశయాలుగా స్వీకరించబడ్డాయి. ఈపక్షం తరఫున ప్రకటింపబడే పత్రికలో యీమూడు ప్రజాసిద్ధాంతాలు వివరింపబడ్డాయి. 1907 జనవరి 16 న "మిన్‌పో" వార్షికోత్సవ సందర్భమున కూడిన 5000 విద్యార్థుల సమావేశంలో సన్‌యట్‌సేన్ "జాతీయసంఘర్షణ సూత్రం", "ప్రజాస్వామిక సూత్రం", "ప్రజాజీవనోపాయసూత్రం" అనుమూడు ప్రజాసూత్రాలనువివరించాడు. "జాతీయసంఘర్షణాసూత్రం" అంటే తుచ్ఛమైన జాత్యహంకారంకాదు నాఅభిప్రాయం. ఒకజాతి మరొక జాతిచే రాజకీయస్వాతంత్ర్యాన్ని కోల్పోయి, పారతంత్ర్యం అనుభవించకూడదనే యీసూత్రంలోని ప్రధానోద్దేశం.... .... ....

"ఒకదేశప్రభుత్వం విదేశస్థులచేతిలో వుందంటే, ఆదేశస్థులకు దేశమేలేదన్నమాట. మనచైనీయులకు మాతృదేశం వున్నప్పటికీ అది మన స్వదేశం కాజాలదు ఆలోచించండి. మనకి స్వాతంత్ర్యం యెక్కడుందో? .... .... .. . మానవజాతిలో నాలుగవవంతు మనమున్నాం. మనజాతి అతిప్రాచీనమైనదీ, గొప్పనాగరికత కలదీ అయినప్పటికీ, యీ రోజున మనం బానిసలుగా బ్రతుకుతున్నాం! ఇది చాలా ఆశ్చర్యకరము, విషాదకరము అయిన విషయంకాదూ? .... .... .... మంచూ వంశాన్ని కూలద్రోసి, జాతీయస్వాతంత్ర్యాన్ని పొందాలి .... .... మనల్ని పీడించేవారిని, శత్రువులను, తప్ప యింకెవ్వరినీ మనం ద్వేషించం .... .... వీరితో కలసి ఒకేదేశంలో మనం నివసించజాలం. ఒక్క సంకుచితదేశాభిమానంతోనే మనంపనిచేస్తే చాలదు. రాజకీయ విప్లవానికి ప్రజాతంత్రరాజ్యాంగం లక్ష్యంగా వుండాలి. అందువలన ప్రస్తుత సమయంలో చైనాదేశీయుడే చక్రవర్తి అయినప్పటికీ మనం విప్లవం చేయవలసి వుంటుంది .... .... పూర్వ కాలంలో ఒకచక్రవర్తిని తొలగించి అతనిస్థానే మరొకనిని చక్రవర్తిని చేయడమే రాజకీయపరివర్తనలక్ష్యంగా వుండేది. విప్లవవాదులమైన—మనకుకూడా యిదేలక్ష్యమైతే, చైనాకుముక్తిలేదన్నమాటే. మనదేశం ఒకప్రత్యేకవ్యక్తియొక్క స్వంతఆస్థిగా వుండరాదు. అంతేకాకుండా ప్రస్తుతకాలంలో అన్యదేశీయులు చైనాను పీక్కుతింటున్నారు. అందువలన బలవత్తమమైన రాజ్యాంగాన్ని నిర్మించాలంటే రాజ్యాంగం ప్రజలందరికీ చెందాలి." మూడవసూత్రాన్ని విపులీకరిస్తో, స్పష్టంగా నిర్దుష్టమైన వాక్యాల్లో సోషలిష్టు సిద్ధాంతాలను తనదేశంలో ఆచరణలోపెట్టాలని చెప్పాడు. అమెరికాలోను, పాశ్చాత్య దేశాల్లోను అందరూ సుఖంగా జీవిస్తున్నారనే దుర్భ్రమను తొలగించాడు. "ఈదేశాల్లో ఆర్థిక సంపత్తి సమీకరణతో బాటు ప్రజాదారిద్ర్యం కూడా విపరీతంగా పెరిగిపోయింది. ఉదాహరణకు ఇంగ్లండులో కొద్దిమంది మాత్రమే భాగ్యవంతులు, బహుహెచ్చుమంది

విరుపేదలు. పెట్టుబడిదారీ శక్తులను మానవులు విరోధించలేక పోవడమే యిందుకు కారణం .... .... మానవ సమాజపరిణామాన్ని వ్యతిరేకించడం దుర్ఘటమైనపని పారిశ్రామిక నాగరికతలో మంచీవుంది. చెడుగూవుంది. మంచినంతా శ్రీమంతులును, చెడుగునంతా బీదలును అనుభవిస్తున్నారు, ఈవిధమైన సాంఘిక పరిస్థితులే చైనాలోకూడా అభివృద్ధిపొందుతున్నాయి. మెళకువగామనం ప్రవర్తిస్తే, పాశ్చాత్య దేశాల్లోకంటే, చైనాలో పెట్టుబడిదారీ వ్యతిరేక సంఘర్షణను తేలికగా కొనసాగించగలుగుతాము.

భూమివిలువలను నిర్ధారణచేసి, అదనపు ఆదాయాలను ప్రభుత్వం వశంచేసుకున్నట్లైతే సమానమైనభూమి, ఆదాయాల విభజన జరిగి చైనారైతుసమస్య పరిష్కరింపబడుతుందని సలహాయిచ్చాడు. "కొద్దిమంది మంచూవంశీయులే అన్నిసౌకర్యాలను పొందకండా వుండేటందుకుగాను మనం జాతీయవిప్లవం కావాలంటున్నాము. ఒకవ్యక్తే సర్వరాజ్యాధికారాన్నీ గుత్తకు తీసికోకుండా రాజకీయవిప్లవం కావాలంటున్నాము. కొద్దిమంది శ్రీమంతులే దేశసంపదనంతా స్వాధీనం చేసుకుని విర్రవీగకుండా సాంఘికవిప్లవం కావాలంటున్నాము. ఈమూడు లక్ష్యాలలో దేనిని సాధించలేకపోయినప్పటికీ, మనం సాధించబూనుకున్న మహత్తర కార్యం విఫలమైనట్లే. ఈమూడు సూత్రాలను ఆచరణలో పెట్టినప్పుడే మనదేశాన్ని చూచుకొని మనం గర్వించగలుగుతాము" సైనిక ప్రభుత్వం, ప్రబోధక ప్రభుత్వం, చట్టబద్ధప్రభుత్వం అనేమూడు దశల్లోగాని యిట్టిరాజ్యాంగం నెలకొల్పబడదని ఆయన నొక్కిచెప్పాడు.

ఐక్య విప్లవపార్టీ యీక్రింది ఆరులక్ష్యాలను వివరిస్తో మొదటి నివేదికను ప్రకటించింది.

1. దూష్యమైన మంచూవంశ వినాశనం.
2. చైనా ప్రజాస్వామిక ప్రతిష్ఠాపన.

3. ప్రపంచ శాంతిరక్షణ.
4. సమతా సిద్ధాంతంమీద భూమిపునర్విభజన.
5. చైనా జపాను ప్రజామైత్రిలో అభివృద్ధి.
6. చైనాపునర్నిర్మాణానికి అంతర్జాతీయ సహాయాన్ని అర్థించడం.

ఐక్య విప్లవపార్టీలో సింగ్‌చుంగ్‌హ్వీ (చైనా జాతీయోద్ధరణ సంఘం అను సన్ పాతవిప్లవసంఘం), హ్వాసీన్‌హ్వీ (చైనా ఆధునిక నాగరికతా పరివర్తినసంఘం), క్వాన్‌ఫూహ్వీ (చైనా పునరుద్ధారణ సంఘం) అను విప్లవసంఘాలు సంయుక్త పరచబడ్డాయి. మొదటి రెండు సంఘాలకు క్వాంగ్‌టంగ్, క్వాంగ్సీ, యునాన్‌రాష్ట్రాల్లో పలుకు బడివుంది. సన్‌సంఘానికి ప్రజాబాహుళ్యాన్ని పోషిస్తు సిద్ధాంతాను సారంగా ఆర్థికోద్ధారణ జరుగవలెనను సుస్పష్టమైన ఆశయంవుంది. మూడవసంఘనాయకులకు రాజకీయ చైతన్యం చాలా తక్కువ. వారికి మంచూవంశ నిర్మూలనం జరిగితే చాలును. పాతసాంఘిక విధానాన్నే నెలకొల్పాలనే ఉద్దేశం కలవారు కాబట్టి, వీరివలన భవిష్యత్తులో విప్లవవాదులలో స్వవినాశనకరమైన తగాదాలు వచ్చేందుకు సావకాశం యేర్పడింది.

## నిర్మాణస్వరూపం, ఆదాయం.

ఈ ఐక్యసంఘటనలో పరస్పర ఆశయవైరుధ్యంవున్న విప్లవ వాదులున్నప్పటికిన్నీ సన్‌యట్‌సేన్‌యొక్క మహనీయ వ్యక్తిత్వానికి అందరూ జోహారు లొనర్చేవారు.

" మంచూవంశ వినాశనానికి, చైనాప్రజాస్వామ్యహక్కులకొరకు ప్రజాస్వామిక ప్రభుత్వస్థాపనకొరకు, భూమిని సమానప్రతిపత్తిమీద పునర్విభజించేందుకు నాప్రాణాలొడ్డి పనిచేస్తాను. ఈసూత్రాలయందు విశ్వాసముంచుతానని ప్రతినబూనుతున్నాను. ఈ నాప్రమాణానికి విరు

ద్ధంగా పనిచేసినప్పుడు, అతితీవ్రమైన శిక్షకు బద్ధుడ నయ్యేందుకు నేను అంగీకరిస్తున్నాను."

అనే ప్రమాణాన్ని యీపార్టీలో జేరేటప్పుడు సభ్యులు చెయ్యాలి. రహస్యాలనెవ్వరూ వెలిబుచ్చ కూడదు.

ఈ సంఘ ప్రధాన కార్యాలయం టోకియోలో నెలకొల్పబడింది. ఒక్క కమ్సూ రాష్ట్రంలో మినహాయించి అన్నిచైనారాష్ట్రాలలోను శాఖా సంఘాలేర్పడ్డాయి. శాఖాసంఘాలనుండి కార్యనివేదికలు పంపబడేవి. ఈనివేదికలలో సభ్యులపేర్లుదహరింపబడేవికావు. ఒక్కొక్క సంఖ్య గుర్తుగా వుండేది పార్టీముద్రవేసిన కార్డుమీద ఒకసంఖ్యవేసి సభ్యునికిచ్చే వారు. ఒకశాఖాసంఘంలో సభ్యులుగావున్నవారిపేర్లు మరొక శాఖాసంఘ సభ్యులకుగాని, ప్రధానకార్యాలయంవారికిగాని తెలియవు చైనాదేశంలో వున్నవారిని జాగ్రత్తగా పరిశీలించిగాని సంఘంలో జేర్చుకునేవారుకారు. అన్యదేశంలోవున్న చైనీయులలోనుండి అభిమానులనందరినీ జేర్చుకునే వారు. వీరివద్దనుండి విరాళాలు వసూలుచేయబడేవి.

ఈపార్టీయొక్క కేంద్రవ్యవస్థకు సన్‌యట్‌సేన్ అధ్యక్షుడు. ఆయనక్రింద కార్యనిర్వాహక, శాసన, పర్యవేక్షణ సంఘాలుండేవి. కార్యనిర్వాహక సంఘంలో అనేకశాఖలుండేవి. అందులో సెక్రటేరి యట్, ట్రెజరీశాఖలు ముఖ్యమైనవి. కార్యప్రణాళికలను తయారు చెయ్యడం, కార్యవిధానాన్ని విమర్శించడం శాసనశాఖపని. పార్టీసభ్యు లలోవచ్చే వివాదాలను పరిష్కరించడం పర్యవేక్షణశాఖవిధి. ఈశాఖలు నెలకొక పర్యాయం సాధారణంగాను, అత్యవసరసమయాల్లో యెక్కువ పర్యాయాలును సమావేశమయ్యేవి.

పార్టీ ఆదాయాన్ని రెండురకాలుగా విభజించవచ్చును. జపాన్‌లో వున్న చైనావిద్యార్థులు నెలకు ఒకడాలరును, శ్రామికులు 10 సెంట్లును, అన్యదేశాల్లోవున్న వర్తకులు 100 — 500 డాలర్లవరకును చందా

లిచ్చేవారు. ఇవిగాక అభిమానులు గొప్పగొప్ప విరాళాల నిచ్చేవారు. చాంగ్ చింగ్ లియాంగ్ అను ప్రముఖవర్తకుడు పారిస్ లో వుంటూండగా సన్ విప్లవకార్య కలాపానికి ఆయన సహాయాన్నర్థించాడు. ఆయన కూడా యిస్తానని వాగ్దానంచేశాడు. 1907 లో తంతిమూలకంగా చాంగ్ చింగ్ లియాంగ్ నకు, ఆయనచేసిన వాగ్దానాన్ని జ్ఞప్తికితేగా ఆయన తనసర్వ స్వాన్నీ అమ్మివేసి 60,000 డాలర్లు పంపాడు. హానోయ్ లో కూరగాయ లమ్ముకునే హ్వాంగ్ చింగ్ నాన్ యిరవై సంవత్సరాలు కష్టించి మిగి ల్చిన 4000 డాలర్లు యిచ్చివేస్తూ, "అనేక వేలమంది ప్రాణాలకుతెగించి విప్లవకార్యక్రమంలో పాల్గొంటున్నారు. ప్రజలకోసం యితరులు త్యాగం చేస్తోన్నదానితో పోలిస్తే నా ఆస్తినంతా యివ్వడం అతిస్వల్పమైనకార్యం మాత్రమే". అనే ఉత్తేజకరమైన సందేశమిచ్చాడు. డాక్టర్ సన్ 1910 — 11 లో చేసిన ప్రపంచపర్యటనంలో 4,00,000 డాలర్లు ప్రోగు పడ్డాయి.

1908 లో జపాన్ లో ఉన్నతవిద్య నభ్యసింపవచ్చిన 1000 మంది విద్యార్థులు ఈ విప్లవ పార్టీలో సభ్యులుగాజేరి, తిరిగి స్వదేశంలో వలు మూలలావున్న విద్యాసంస్థలకు విప్లవసందేశాన్ని కొనిపోయారు. వేల కొలది విద్యార్థులు అత్యుత్సాహంతో విప్లవ పక్షంలోకి ఆకర్షింపబడ్డారు. సైనిక శిక్షణాలయాల్లో శిక్షణపొంది వచ్చినవారు చక్రవర్తి సైనిక దళాల్లో ముఖ్యమైన పదవులలో నియోగింపబడ్డారు. ఈ విప్లవంయొక్క తరువాత దశల్లో వీరు చాల తోడ్పడ్డారు. ఈ విద్యార్థుల్లో అందరూ జాతీయ విప్లవోద్దేశాలను సమగ్రంగా అవగాహన చేసుకున్నవారు కానందున కొందరు తరువాత విప్లవ వ్యతిరేకులుగా తయారయ్యారు.

## "మిన్ పో" పత్రిక.

చైనా ఐక్యవిప్లవపార్టీ "మిఙాపో" (ప్రజాపత్రిక) అనే పత్రికను ప్రకటించేది. ఈ పత్రిక ద్వారా జాతీయ విప్లవభావాలు వ్యాప్తిచేయ

బడ్డాయి. ఈ పత్రికలోని వ్యాసాలు ఉద్రేకపూరితాలుగాను, విప్లవాశయ సుబోధకాలుగాను ఉండేవి. వాంగ్‌చింగ్‌వీ. చాంగ్‌టేయెణా. చూచీసేన్ అనువారలు సంపాదకవర్గంలో వుండేవారు. సంస్కరణవాదాన్ని నీరస పరచి, విప్లవతత్వానికి యీ పత్రికలోని వ్యాసాలు ప్రాధాన్యత నిచ్చాయి. చాంచ్‌టేయిన్ గొప్ప విద్వాంసుడు. ఆయనకు పాశ్చాత్య భాషాసంస్కారం లేకపోయినప్పటికీ, చైనాభాషనంతా మధించాడు. ఈయనకు మంచూ రాజవంశ యెడల అపారద్వేషం కలదు. ఈయన వ్రాసిన వ్యాసాలే అనేక చైనామేధావులను విప్లవంవైపుకు త్రిప్పాయి. వాంగ్ చింగ్‌పీ ఒక పట్టభద్రుడు ఈయన ప్రజాస్వామ్య సిద్ధాంతాలను గూర్చి రాశేవాడు. చూచిన్‌మిన్ అర్థశాస్త్రవేత్త. సన్‌యట్‌సేణా మూడవ ప్రజాసూత్రమైన ప్రజాజీవనోపాయ సూత్రాన్ని గూర్చి ప్రజలకు సుబోధకంగా వుండేట్లా రాశేవాడు. అమ్ముపేయబడే 3000 ప్రతులు చాలక. అనేక వ్రాతప్రతులు తీయబడి. విరివిగా ప్రచారం చేయబడేవి. త్వరలోనే యీ పత్రిక చైనాలో నిషేధించబడింది. అందువలన అనేక రహస్య పద్ధతులమీద ప్రతికాపతులు చైనాలోని వివిధ ప్రాంతాలకు పంపబడేవి.

## విప్లవకర యెత్తుగడలు.

ఐక్య విప్లవసంఘ స్థాపనతో విప్లవచరిత్రలో నూతన శకారంభమైంది. సన్‌యట్‌సేన్ నాయకత్వాన విప్లవశక్తులు విస్తరించాయి. విప్లవభావాలు వ్యాపించాయి. చైనాలోవున్న 18 రాష్ట్రాలలోను 17 రాష్ట్రాలలో విప్లవపార్టీశాఖలు నెలకొల్పబడ్డాయి. విప్లవ సభ్యత్వం 1907 లో వున్న 10.000 నుండి అతిత్వరితంగా. ప్రజాస్వామ్యప్రభుత్వ స్థాపన కాలానికి 3,00,000 వరకు పెరిగింది.

1906 లో పింగ్‌లీ అనే పట్టణంలో కొందరు పార్టీసభ్యులు చక్రవర్తి సైన్యాలను విప్లవాభిముఖులుగా చేస్తోన్నట్లు ప్రభుత్వోద్యోగులు కని

పెట్టి వారిని ఉరిదీశారు. అందువలన, కేవలం ఆందోళన, నిర్మాణ కార్య క్రమాల్లో నిమగ్నులైన, పార్టీనాయకులు సైనికవిషయాలందు కూడ ప్రత్యేకశ్రద్ధ తీసికొనజొచ్చారు. డాక్టర్ సన్, హ్వాంగ్‌సింగ్, వాంగ్ చింగ్‌వీ హూహాన్‌మిన్‌లతో కూడిన ప్రత్యేక సంఘమొకటి ఏర్పాటు చేయబడింది ప్రార్టీకార్యక్రమాన్నంతా సమన్వయపరచి క్వాంగ్‌టంగ్, క్వాంగ్సీ రాష్ట్రాలలో తిరుగుబాట్లు చేయించే పనికి పూనుకుంది. ఈప్రత్యేక కమిటీవారు దక్షిణచైనాకు దగ్గరగావున్న అన్నాంలోని హనోయ్‌కు కార్యస్థానాన్ని మార్చారు.

చైనా చక్రవర్తి 1894 లో జపాను చేతుల్లో పరాజయం పొందిన తర్వాత సైనికశిక్షణలో ఆధునిక పద్ధతుల నవలంబించి, సైన్యాన్ని పునర్నిర్మింపసాగేడు ఉత్తరానవున్న యువాన్‌షీకే అధీనంలోవున్న సైన్యంలో యీనూతన మార్పులు ముందు ప్రవేశపెట్టబడ్డాయి. తరువాత దక్షిణానవున్న సైనికులనుకూడా జపాను మిలిటరీ కళాశాలల్లో పట్టాలు పొందిన విద్యార్థుల నాయకత్వాన క్రొత్తపద్ధతుల్లో తర్ఫీదు చేశాడు.

దక్షిణానవున్న సైనికుల్లో చాలమంది రహస్య సంఘాల్లో సభ్యులే. సైనిక సామాన్యంకూడా విప్లవవాదుల పలుకుబడిలో వున్నవారే. అందువలన విప్లవాభిమానుల ద్వారా గొప్పప్రచారం చేయబడింది. విప్లవపక్షానికి చెందిన మిలిటరీ ఉద్యోగులమీద సైనిక కార్యనిర్వాహణభారాన్ని పెట్టారు. తిరుగుబాటు చేసే సమయంలో యేదో మిషమీద విప్లవసైనిక దళాలు సైనిక కీలకస్థానాలకు వెళ్లి, తిరుగుబాటుదార్లకు సహాయంగా పనిచేసేందుకు యేర్పాటు చేసుకున్నారు. తాము తిరుగుబాటు చేయదలచు కున్న ప్రదేశానికి దూరంగా మరొకచోట గల్లంతుచేసి, సామ్రాజ్య సైనికదళాలను ఆవైపుకు మరల్చి, అనుకున్నచోట తిరుగబడాలనీ, పార్టీకినీ, విప్లవానుకూల సైనిక దళాలకును సంబంధం తెగిపోకుండా

కొందరు మధ్యవర్తులను యేర్పరచారు. సాధారణంగా విప్లవవాదులకు మందుగుండు సామగ్రి. డబ్బు లోటుగా వుండేవి. అంతేకాక విప్లవ వాదులలో క్రమశిక్షణకూడ తక్కువగా వుండేది. వారు వేసుకున్న ప్లానులన్నీ ముందే తెలిసి పోవడంకాని, కనుక్కోబడటం గాని జరుగు తూండటం వలన అసమయాల్లో సక్రమమైన యేర్పాటులన్నీ జరుగకుం డానే తిరుగుబాట్లు జరగడం, అవి అణచివేయబడటం జరిగేది.

ఒక సాయుధతిరుగుబాటు జరగాలంటే యెంతో ధనమవుసరం. అందువలన దేశాంతర చైనీయుల్లో విప్లవప్రచారం చేయబడి, ధనం వసూలు చేయబడేది. ఈ ప్రచారం చెయ్యడంలో వాంగ్‌చింగ్‌వీ గొప్ప ప్రఖ్యాతి పొందాడు.

## 1907-1909 వరకు మంచూ రాజవంశంతో పోరాటాలు

క్వాంగ్‌టంగ్, క్వాంగ్సీ, యూనాన్ రాష్ట్రాలలో 1907-1909 సంవత్సరాలలో ఆరు తిరుగుబాట్లు ప్రత్యేకసంఘం వారిచే లేవతీయ బడ్డాయి. అన్నాంలోని హానోయ్ పట్టణంలోవున్న ప్రధానకార్యాలయం నుండి డాక్టరు సన్ యీతిరుగుబాట్లన్నీ నడిపేవాడు, ప్రత్యేకకమిటీలోని మిగిలినవారందరూ స్వయంగా యీతిరుగుబాట్లలో పాల్గొన్నారు. క్వాంగ్‌టంగ్ రాష్ట్రంలో చోచా, హుూచా, సిన్‌చిన్‌చౌలలోను, క్వాంగ్సీలో చెంగ్‌నాన్‌క్వాన్‌లోను, యూనాన్‌లో హోకొవద్దను జరుప బడిన యీతిరుగుబాట్లన్నీ అణచివెయ్యబడ్డాయి. ఈ పరాజయాలవల్ల దేశంలో విప్లవవాదులసంఖ్య పెరిగింది. కాని టోక్యోలోనున్న విప్లవాభి మానుల్లో, విప్లవవిజయమందు ఆశ అంతరించింది. టోక్యోలోవున్న జాంగ్‌టీయెన్, చాంగ్‌చీలను విప్లవనాయకులు సన్‌ను అధ్యక్షపదవి నుండి తొలగించుటకు కుట్రలుపన్ని, పార్టీవిరాళాలను స్వంతానికి ఉప

యోగించుకుంటున్నాడనీ, అనేకమంది చైనాయువకుల ప్రాణాలను ఎన్నటికీ లభించని విప్లవవిజయానికిగాను త్యాగంచేస్తున్నాడనీ నిందలు మోపి, ఐక్య విప్లవపార్టీకి జపాన్ ప్రభుత్వోద్యోగి నొకవిని సలహాదారుగా నియమించారు. అందువలన జపాన్ ప్రభుత్వానికి విప్లవసంఘ చర్యలు, పన్నాగాలు తెలిసి, సమయం వచ్చినప్పుడు అణచివేయాలని చూస్తున్నారు. విప్లవవాదుల్లో కలిగిన చీలికలను పురస్కరించుకొని, చైనా ప్రభుత్వంవారు జపానుప్రభుత్వాన్ని ప్రోత్సహించి, మిన్‌పో పత్రికను 1908 లో అణచివేయించారు. ఫ్రాంసుకూడా విప్లవపక్షంలోజేరిన సభ్యులను శత్రువులుగా ప్రకటించినందున, చైనాకు పరిసరదేశాల్లో వుండటం దుర్లభమైనందున, పరొకపర్యాయం సన్‌యట్‌సేన్ ప్రపంచ పర్యటనకు పూనుకున్నాడు.

## రాజప్రతినిధి హత్యాప్రయత్నం.

విప్లవ ప్రయత్నాలన్నీ విఫలమగుటతో విప్లవవాదులలో నైరాశ్యత వ్యాపించింది. ప్రజలలో విప్లవవిజయమందు ఆశ క్షీణించింది. ప్రత్యేక విప్లవకమిటీ సభ్యుడైన వాంగ్‌చింగ్‌వీ మరల జపాన్ జేరుకుని, "విప్లవతరంగం", "విప్లవపక్షం" అను రెండు మిన్‌పో సంచికలను రహస్యంగా ముద్రించాడు. దేశాన్నంతా ఉద్రేకంలో వూపేశే ఉత్తేజకరమైన కృత్యమొకటి చేయవలెననే సంకల్పంతో చెన్‌కవ్ష, హ్వాంగ్‌పూసన్, యూయేన్‌చీ లను వారలు ప్రభుత్వంలో ముఖ్యులను హత్యచేయు సంకల్పంతో రాజధానీ నగరమైన పెకింగుకు వెళ్లారు.

వాంగ్‌చింగ్‌వీ కూడ, యీ ఆశయంకోనే బాంబు, డైనమైటు మున్నగు ప్రేలుడు సామాన్లతోను, రివాల్వర్లతోను, మిన్‌పో సంచికలతోను 1910 జనవరిలో పెకింగుకు బయల్దేరేడు. వాంగ్‌చింగ్ వీని జీవితో వప్పగించినయెడల ఒక లక్ష డాలర్లను, చంపినయెడల 50 వేల

డాలర్లను బహుమతి యిస్తామని చైనాప్రభుత్వం ప్రకటించి యుండినప్ప టికినీ వాంగ్ సాహసించి యువరాజును హత్యచేసి, విప్లవజ్వాలను రగు ల్కొల్ప నూహించాడు.

పెకింగునగరంలో రాజప్రతినిధి షికారుకు వెళ్లే ఒక నిర్జన మార్గ మధ్యంలో నున్న ఒకవంతెనకింద మూడు రాత్రులు చెన్‌కన్య, వాంగ్ చింగు పీలు పనిచేసి ఒక ఎలక్ట్రోబాంబును పెట్టారు. మూడవనాడు అనగా మార్చి 28 రాత్రి యువరాజు ఆ మార్గంవెంబడి వెడతాడుకదా అని వారు వేచియున్నారు. దురదృష్టవశాత్తూ, తెల్లవారుఝాము మూడు గంటల సమయంలో ఒక క్రామేడ్‌కాలు ఒక కుక్కకు తగిరి, అది మొరగ నారంభించింది. వెంటనే అక్కడవున్న యితరకుక్కలు కూడా మొరిగాయి. ఆ వంతెన యువరాజ ప్రాసాదానికి దగ్గరలో వున్నందున, ఆ పక్కనే ఒక పోలీసుస్టేషన్ వుంది. ఈ గంద్రగోళం విని పోలీసులు పలుమూలలా సెర్చిలైట్లు వేయసాగారు. అక్కడ వుండటం క్షేమకరం కాదని ఆ విప్లవవాదులు తమ నివాసస్థలానికి పారిపోయారు. పోలీసులు వెదకుతోవచ్చి, వంతెనవద్ద త్రవ్విన ఆనవాళ్లు చూచి పరిశీలించగా ఇనప తీగెలు, గొట్టాలు కనబడ్డాయి. ఒక నిపుణుడు వాటిని పరిశీలించి 50 పౌనుల బరువుగల భయంకరమైన డైనమైటు ప్రేలుడు పదార్థాలున్నట్లు చెప్పాడు. ఈ ఎలెక్ట్రోబాంబు రాజప్రతినిధి ప్రాణాలు హరించేందుకే ఉద్దే శింపబడిందని, ఆ కుట్రదారులను పట్టుకునేందుకు ఆ నగరంనిండా నిఘా హెచ్చుచేశారు.

తమ వద్దనున్న ప్రేలుడుమందు అయిపోయిందికాబట్టి మరల సంపాదించుకోవాలని, చెజాకన్య, లీ, యూలు టోక్యో వెళ్లారు. కాని వాంగ్, హ్వాంగ్‌లు మాత్రం అచ్చటనే వున్నారు. శాన్‌టాజీహటంగ్ అనే రహస్య చిరునామావద్ద వాంగున్ను, ఒక ఫొటోగ్రాఫరు స్టూడి యోలో హ్వాంగూ మకాం చేశారు. హ్వాంగ్ మరుసటిరోజు మధ్యాహ్నం

ఆ వంతెనవద్ద తాము పెట్టిన డైనమైటు యేమైందో చూడాలని వెళ్లాడు. ఆ ప్రదేశాన్ని రహస్యంగా కాస్తూన్న గూఢవారులు, అతనిని వెంబడించి, అతని మకామును పట్టుకుని పిట్టలనమ్మేవారి వేషాలతో ఆ స్థలాన్ని పరీక్షించసాగేరు. చెన్‌కన్యను, లీ, యూలను, రైల్వేస్టేషన్ వరకూ సాగనంపాలని వాంగ్‌చింగ్‌వీ వారితో స్టేషన్‌కు వెళ్లి, రైలు కదిలేటప్పుడు నెత్తినవున్న పాగాను తీసి, వీడ్కోలుచిహ్నంగా ఊపాడు. అప్పుడాతని నెత్తిమీద విప్లవ చిహ్నమైన కృత్రిమపు తలకట్టు తోకను ఒక గూఢచారి చూడటం తటస్థించి, ఆయనను వెంబడించాడు.

ఏప్రిలు 16 న వాంగ్, హ్వాంగులు దాగొనివున్న స్థలాలను చుట్టుముట్టి, పోలీసులు వాంగ్ గదిలోవున్న రివాల్వర్లను, ఎలక్ట్రిక్ తీగెలను పట్టుకున్నారు. వారు పస్తూన్న ధ్వనిని విన్న వాంగు రహస్య చిరునామాల పుస్తకాన్ని తగులబెట్టాడు. వాంగ్‌చింగ్‌వీని బంధించి, కేంద్ర పోలీసు స్టేషనుకు తీసికొనిపోయారు.

పోలీసు యినస్పెక్టరు అడిగినప్రశ్నలకు సమాధానంగా తనపేరు వాంగ్‌చింగ్‌వీ అని చెప్పాడు. ఈ సమాధానం వారికి ఆశ్చర్య, సంభ్రమాలను కలిగించింది. ఈ దురంతాన్ని చేయదలపెట్టడంలో ఆయన ఉద్దేశమేమిటని అడుగగా, "ప్రజలను మేల్కొల్పేందుకుగాను రాజధానీ నగరంలోనే ఒక అసాధారణ, ఉత్తేజకర కృత్యాన్ని వాంగ్‌చింగ్‌వీ చేయ తలపెట్టాడు" అని కాగితంమీద వ్రాసి యిచ్చాడు. "మిన్‌పో సంచికలను మీ బట్టలలో పెట్టి యెందుకు తీసికొని వచ్చారు?" అని అడుగగా, "ఈ మిన్‌పో పత్రికలో సిరాతో వ్రాసిన వ్యాసాలను రక్తంలో తడపాలని తీసికొనివచ్చాను." అని సమాధానమిచ్చాడు.

ఆ సమయంలో చైనాప్రభుత్వంలోని రాజకీయ, సైనికాధికారాలన్నీ రాజప్రతినిధియైన చున్, ప్రధానమంత్రి ఖిక్వాంగ్, పౌర వ్యవహార కార్యదర్శి షన్‌చీ, ప్రభుత్వాదాయ శాఖాకార్యదర్శి సాయేశే, నౌకా

శాఖాధికారి సాయ్‌టో, సైనిక శాఖాధికారి సాయ్‌సూన్. పదాతి సేనా నాయకుడు యూలియాంగ్ అను ఏడుగురు మంచూప్రభువుల చేతులలో వున్నాయి. వీరు వట్టి అసమర్థులు. లంచగొండులు. విప్లవవాదులంటే వీరికి చాలా భయం. ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకొని మేకపోతుగాంభీర్యం చూపిస్తూండేవారు. పోలీసు, గూఢచారి దళాలన్నీ వాంగ్‌చింగ్‌వీని పట్టుకునేందుకు విశ్వప్రయత్నాలు చేస్తూండగానే, నిర్భయంగా రాజధానీ నగరం జొచ్చి, రాజ్యాధికారియైన చున్ ప్రాణాలను తీయ సాహసించిన వాంగ్‌చింగ్‌వీ అపూర్వసాహసచర్య వారికి దిగ్భ్రమ కిలిగించింది.

సర్వాధికారాలు చేతిలోవున్న ప్రధానమంత్రి పట్టి భయస్థుడు ఈ సంగతి విన్న తక్షణమే కలవుపెట్టి యిల్లు కదలకుండా కూర్చు న్నాడు. వూలూచేన్ అనే విప్లవసంఘానికి చెందిన ఒక సామ్రాజ్య సైనిక దళాధిపతి, వెంటనే ప్రధాని యింటికిపోయి, విప్లవవాదులలో గొప్ప పలుకుబడి కలిగిన వాంగ్‌ను ఉరితీస్తే, విప్లవవాదులు పగతీర్చు కుంటారని చెప్పి మరింత భయపెట్టాడు

అందువలన వాంగ్‌చింగ్‌వీని ఉరిదీయకుండా యావజ్జీవ ఖైదు విధించారు. వాంగ్, హ్వాంగులను కాళ్లను, కరాలను చేతులను కలిపి, యినపసంకెళ్లతో బంధించారు జైలుసుకాచే వార్డర్లకు లంచాలు పెట్టేం దుకు వారివద్ద ధనం లేనందున, వారు చావుకు యెదురు చూస్తో, బాహ్య ప్రపంచంతో సంబంధంలేని చరిత్ర ప్రసిద్ధమైన ఫ్రెంచి బాస్టిలుజైలు వంటి ఆఖైదులో 1911 అక్టోబరులో విప్లవవాదులు విజయులయ్యేవరకు కాలం గడిపారు.

## 1911 మార్చి 29 పోరాటం

చైనా విప్లవచరిత్రలో వాంగ్, హ్వాంగ్‌లు చేసిన హత్యాప్రయ త్నం సుప్రసిద్ధమైనది. నిరుత్సాహులై, మందకొడిగానున్న విప్లవవాదు

లందరూ యీవార్తవిని ఉద్రేకపూరితులయ్యారు. వాంగ్ యిచ్చిన ఉత్తేజకరమైన సమాధానాలు రాజకీయభావాలు కలిగిన ప్రతి చైనీయుని హృదయంలోను విప్లవజ్వాలలు రేపాయి చైనా నలుమూలలా యీవార్త మారుమ్రోగింది.

డాక్టరు సన్‌యట్‌సేన్ తాను చైనాలో లేనికాలంలో హ్వాంగ్ సింగ్‌కు విప్లవాన్ని నడిపించే సర్వాధికారాలు యిచ్చాడు. హ్వాంగ్‌సింగ్, హూహాన్‌మిన్‌లు హాంగ్‌కాంగ్‌లో కేంద్రకమిటీనినెలకొల్పి, తరువాత క్వాంగ్‌టంగ్ రాష్ట్రాన్ని పశపరచుకొని, మిగిలిన చైనానంతా స్వాధీనపరచుకోవాలని కార్యక్రమం యేర్పాటు చేశారు

ఈ కార్యక్రమాన్ని అమల్లో పెట్టేందుకు, ప్రాణాలను తృణప్రాయంగా అర్పించేందుకు సిద్ధంగావున్న 100 పార్టీ సభ్యులూ, కాంటన్ పరిసరాల్లో పుంచబడిన విప్లవసానుభూతి కలిన 'నూతన సైన్యాలు' 10 వేల రివాల్వర్లను పోగు చేసేందుకు తీవ్రకృషి చేస్తోన్న రహస్య సంఘ సభ్యులు, 1910 ఆకురాలు కాలంలో ఒక విప్లవప్రయత్నం చేశారు. కాని నూతన సైన్యాలలో ఒక దళానికి అధిపతియైన నీయింగు టింగు నాయకత్వంలో కాంటన్‌ను పట్టుకునేందుకు వెడుతోండగా, చక్రవర్తి సైన్యాలెదిర్చాయి దురదృష్టవశాత్తూ నీ యింగుటింగు చంపబడగా, అతని సైన్యాలు చెల్లాచెదరై పోయాయి. ఈవిప్లవ విజయం మీద కొండంత ఆశపెట్టుకున్న హ్వాంగుసింగు హూహాన్‌మిన్‌లు నిరాశతో క్రుంగిపోయారు. అమెరికాలోవున్న సన్‌యట్‌సేన్ యీవార్త విని, పెనాంగుకు వచ్చి, వారిని అచ్చటికి పిలిపించి, ఒక్క దక్షిణ ప్రాంతంలోనే కాక, యాంగుజీనది లోయప్రాంతంలోకూడ విప్లవ ప్రచారం చేయవలసిందిగా సలహా యిచ్చి పంపాడు.

హ్వాంగుసింగు తిరిగి వచ్చి, కాంటన్‌లో దేశంకొరకు ప్రాణాలర్పించేదుకు సిద్ధంగావున్న 500 మందితో రాజ్యాధికారి, సర్వసేనాధ్య

ఘల కోటలను ముట్టడించేందుకును, నగరంలో వున్న పార్టీసభ్యులు, నూతనచక్రవర్తి దళాల్లోవున్న విప్లవసైనికులూ కలిసి కోటద్వారాలను ముట్టడించేందుకును నిర్ణయించుకున్నారు. మందు పెట్టెలలో పెట్టి, జపాన్‌నుండి మందుగుండు సామగ్రిని తెప్పించారు. పట్టణంలోవున్న విప్లవ వాదులు తమ భార్యలను, అప్పచెల్లెండ్రను, వదినలను వివాహం చేసుకుంటోన్నట్లు పెద్ద వేడుకలు జరుపుతోండగా, పెండ్లికానుకలక్రింద రివాల్వరు, మందుగుండు సామగ్రుల పెట్టెలను హాంగుకాంగునుండి పంపించారు. పట్టణంలోనున్న సంఘసభ్యులకు యోయూపెన్, చెన్‌చియంగుమింగు, హుయిషేంగులను నాయకులుగా ఏర్పాటు చేశారు. మార్చి 28 తేదీని విప్లవం చేయాలని యేర్పాటు చేసుకున్నారు.

మార్చి 25 వ తేదీకి హ్వాంగుసింగు కాంటన్ జేరుకుని విప్లవ ప్రయత్నాలన్నీ అనుకున్న ప్రకారంగా జరిగినవో లేవో చూడ నారంభించాడు. నూతనసైన్యానికి, రహస్యసంఘాలకు మధ్య సంబంధం నెలకొల్పవలసిన హుాయిషేంగు తన మనుష్యలను సన్నద్ధపరచలేదు. ఆయన చేసిన ఒక పొరపాటు మూలంగా తిరుగుబాటుకు సన్నాహాలు జరుగుతున్నాయని గూఢచారులు పసికట్టారు. హుాచౌనుండి తిరుగుబాటుదార్లను కాంటన్‌కు తీసికొని రావలసిన చెన్‌చియంగుమింగు, తన పనిని నెరవేర్చలేదు. జపాన్ నుండి మందుగుండు సామగ్రి 29 ఉదయానికిగాని రాదు. అందువలన ఒకరోజు వాయిదా వేయబడింది. ఈకుట్ర బయటపడటంవలన సామ్రాజ్యసైనికులు కాంటన్‌పట్టణ కోటద్వారాల వద్ద సైనికులను కాపలాబెట్టి, పట్టణంలో గొప్ప సైనికబందోబస్తు చేశారు. 26 నాటికే పట్టణమంతా రాజభక్తులైన సైన్యాలు వీధుల్లో దట్టించిన తుపాకులతో తిరుగనారంభించాయి. ఈ పరిస్థితుల్లో ప్రస్తుతం తిరుగబడకుండా వుండటం మంచిదని హుయిషెంగు, యోయూపెన్, చోపోశిన్‌లు గట్టిగా సలహా యిచ్చారు కాని, దేశంకొరకు ఆహుతవ్వా

లని ఉద్రేకపడుతోన్న హ్వాంగుసింగు 29 నాడే తిరుగుబాటు చేయాలని పట్టుబట్టి, హూహాన్‌మిన్‌కు తక్షణం రావలసిందని టెలిగ్రాం పంపాడు కాని అది ఆలస్యంగా 29 ఉదయానికి అందింది. 300 మంది పగలు హాంగుకాంగునుండి పడవలమీద కాంటన్‌కు రావడం అనుమానా స్పదంగా వుంటుంది కనుక రాత్రి బయల్దేరి, కాంటన్ చేరుకుని, మరు సటి రోజున తిరుగుబాటు చేద్దామని హూహాన్ మిన్ కబురు చేసినప్పటికీ, హ్వాంగుసింగు మనస్సు మార్చుకోక, మృత్యువుకు వెరువని 100 మంది పార్టీసభ్యులను వెంటబెట్టుకొని, రివాల్వర్లు, చేతిబాంబులతో రాజప్రతినిధి మందిరాన్ని అకస్మాత్తుగా ముట్టడించాడు. చైనా విప్లవచరిత్రలో రక్తాక్ష రాలతో లిఖింపబడిన, సుప్రసిద్ధమైన సంఘటనలలోకెల్ల యిది రోమాంచ మైనది. కొద్దిపాటి, కృతనిశ్చయులైన విప్లవవాదులు ప్రభుత్వసైన్యాలను తరిమివేసి, రాజప్రతినిధి మందిరాన్ని దగ్ధంచేశారు. ఇంతలో 2000 మంది చక్రవర్తి సైనికులు వీరిమీద గవిశారు. రాత్రి చీకటులమాటున ఆ విప్లవవాదులు కొదమసింగముల మాదిరి వారిపై లంఘించి, 6 గంటల కాలం పోరాడేరు. ఆ అసమయుద్ధంలో 49 గురు విప్లవవాదులు మరణిం చారు 23 గురు గాయాలు తగిలి సైనికులచేతుల్లో చిక్కారు. 30 మంది తప్పించుకోగలిగారు. బందీలను వెంటనే విచారణచేసి, ఉరితీయించారు. ఉరికంబాలమీద, "మంచూ బందిపోటుగాండ్రు నాశనమవ్వాలి! చైనా ప్రజాస్వామికం వర్ధిల్లాలి!" అంటూ సింహనాదాలుచేసి, ప్రాణాలు కోల్పోయారు.

హ్వాంగ్‌సింగు తప్పించుకొని ఒక సోదర విప్లవవాది యింటికి చేరుకున్నాడు. ఆయనకు పోరాటంలో రెండుచేతివ్రేళ్లు తెగిపోయాయి.

30 వ తేదీ ఉదయాన్ని హూహాన్‌మిన్ 300 మంది విప్లవ వాదులతో కాంటన్‌వచ్చాడు. కాని కోటతలుపులు మూయబడి వుండుట వలన, వెంటనే హాంగ్‌కాంగ్ వెళ్లాడు. హ్వాంగ్‌సింగ్‌ను కూడా

ఆ మధ్యాహ్నం హాంగ్‌కాంగ్‌కు రహస్యంగా పంపివేసి హాస్పిటల్లో కట్లు కట్టించేందుకు పంపారు. హాస్పిటల్లో వున్నప్పుడే హ్వాంగ్‌సింగు, హూహాన్‌మిన్‌కు జరిగిన వీరపోరాట వివరాలన్నీ చెప్పాడు. హూహాన్ మిన్ తనసోదరుడైన హూయీషెంగ్ లోపాలను దాచి, తప్పంతా చెన్‌చియంగ్‌మింగ్, యోయూపిన్‌లదని సన్‌యట్‌సేన్‌కు నివేదికను పంపాడు. ఈ తప్పుడు నివేదికను తెలుసుకున్నప్పటినుండీ, చెన్ చియంగ్‌మింగుకు హూహాన్‌మిన్‌మీద ఆరవిద్వేషం కలిగింది. ఇందు మూలంగా పార్టీలో అనేక విషాదకరమైన సంఘటనలు భవిష్యత్తులో జరిగాయి.

## 1911 అక్టోబరు 10 దండయాత్ర.

మార్చి 29 తిరుగుబాటు విప్లవపక్షంయొక్క పదవ విఫల ప్రయత్నం. ఐతేనేమి, యీ ఓటమి చాల మహిమాన్వితమైనది. ఈ విప్లవపోరాటంలో మరణించిన 72 విప్లవవాదుల త్యాగవార్త విద్యుచ్ఛక్తి ప్రసారంవలె క్షణంలో చైనా అంతటా వ్యాపించింది. విప్లవోత్సాహంతో యువకులంతా ఉగ్రూతలూగారు. విప్లవపార్టీ సభ్యత్వం వేల కొలదీ పెరుగజొచ్చింది. దేశంలో యెచ్చటజూచినా విప్లవ సంరంభమే. ఈ విప్లవ ఝంఝూమారుతం ప్రభుత్వసైనికుల్లోకూడ అద్భుత సంచలనం కలిగించింది. ఒక్కసారిగా వాతావరణమంతా విప్లవభావపూరితమైంది. వూహాన్‌లో వున్న సైనికపటాలాలు విద్రోహంలతో కుట్రచేస్తున్నారనే భయంతో వారిని జెక్వాన్ రాష్ట్రం మార్చారు. హూపేరాష్ట్ర ముఖ్యపట్టణమైన వూచాంగ్‌లో వున్న సైనికులు కూడా విప్లవభావాలు కలిగి వుండుటవలన, ముందుగా 1911 సంవత్సరం ముగిసేలోపుగా అచ్చటనే విప్లవం లేవదీయాలని నిర్ణయించారు. కాని దురదృష్టవశాత్తూ హాంకో పట్టణంలోని రష్యన్ భాగంలో వున్న ప్రాంతీయ విప్లవపార్టీవారి మందు గుండ్రు నిల్వకొట్టులో ఒక బాంబు ప్రేలింది. రష్యన్‌పోలీసులు వెదికి

బాంబులు, రివాల్వర్లు, విప్లవపతాక చిహ్నాలు వున్న యింటిని పట్టుకొన్న వైస్రాయి అయిన జుయిచెంగుకు తెలియపరిచారు. వెంటనే చైనా ప్రభుత్వ సైనికులు ప్రాంతీయ విప్లవకమిటీ కార్యాలయాన్ని చుట్టుముట్టి నూతనసైన్యంలో విప్లవానుకూలురుగా వున్న సోల్జర్ల పేర్లు రాయబడి వున్న జాబితాను పట్టుకున్నారు. ఈ వార్త తెలియగానే, చావు యెట్లాగా తప్పదని యెరిగిన మిలిటరీ కమేండర్లు సన్‌వూ, సియంగుపింగుకన్, సాయ్‌సేమిన్, చాంగుచెంగుపూల నాయకత్వమున అక్టోబరు 10 రాత్రి వైస్రాయి భవనాన్ని ముట్టడించారు. కాని అంతకుముందే ప్రాణాలు దక్కించుకునేందుకు వైస్రాయి షాంఘేనగరానికి పారిపోయాడు. తెల్లవారేలోపుగానే వూచాంగు నగరాన్ని విప్లవవాదు లాక్రమించారు. ఐతేనేం. విప్లవనాయకుడైన చెన్‌చీమీ షాంఘే పట్టణంలో విప్లవకార్యక్రమం కొనసాగించేందుకు అంతకుపూర్వమే వెళ్లియుండుటవలన వారికి సైనికానుభవంకల నాయకులులేక హ్వాంగుసింగ్‌కొరకు వేచియున్నారు. సన్‌వూ గాయపడినందున వారొక సమావేశం చేసి, ప్రభుత్వసైన్యంలో సేనానాయకుడైన లీయువాన్‌హంగును తాత్కాలిక నాయకునిగా యెన్నుకున్నారు. ఈవార్తను లీ కు తెలియపరచేందుకు సాయసేమిన్, చాంగు చెంగ్‌వూలు అతని యింటికి వెళ్లారు. కాని, వారు తనప్రాణాలు తీసేందుకు వచ్చారనే భయంతో ఒక గదిలోనుండి మరొక గదిలోనికి ప్రాణాలను కాపాడుకునేందుకు పారిపోవసాగెను. ఆఖరుకు, తన భార్య మంచంక్రింద దాక్కున్నాడు. ఈలోగా చాంగుచెంగ్‌వూ వెంబడించి వచ్చి, లీ కాలొకటి పైకి కనపడుతోన్నందున, అతనిని వెలుపలికి లాగేడు. లీ భయంతో వూ కాళ్లు పట్టుకొని ప్రాణభిక్ష పెట్టమని దీనంగా యేడుస్తూ పరిపరివిధాల ప్రార్థించసాగాడు. "సైన్యాధ్యక్షా! మిమ్ములను మేము నాయకునిగా యెన్నుకున్నాము. మీరు మీసైన్యంతోవచ్చి మాలో కలవండి. మాఆహ్వానాన్ని అంగీకరించండి; అంటూ వూ పలుకగా లీ తెప్పరిల్లి విప్లవసైన్యానికి సర్వసేనాధిపత్యం వహించి, మంచూ రాజ

వంశం కూలద్రోయబడిందనీ, విప్లవ సైనికప్రభుత్వం నెలకొల్పబడ్డదనీ, యిండ్లు తగులబెట్టడం మానభంగం చేయడం, వ్యాపారానికి అడ్డు తగలడం, దుకాణాలు దోచడం, మంచూ చక్రవర్తి అధికారులను దాచడం అను నేరాలకు ఉరిశిక్ష విధింపబడుననీ ప్రకటించాడు. భోజ్యపదార్థాలు అందజేసినవారికి, ప్రజల్లో విప్లవప్రచారం చేయువారికీ బహుమతు లీయబడతాయనీ, మంచూ ప్రభుత్వానికి సహాయం చేయని విదేశస్థుల ప్రాణాలు కాపాడబడుననీ, ప్రస్తుతం అమల్లోవున్న ఒడంబడికలు మన్నింపబడుననీ కూడ ప్రకటించాడు.

అకస్మాత్తుగా తగిలిన విప్లవాఘాతానికి ప్రభుత్వాధికారులు భయపడిపోయారు. హాన్యాంగ్, హాంకోలను, అచ్చటనున్న ఆయుధాగారాలను విప్లవవాదులు వశపరుచుకున్నారు. షాంఘైలోనున్న హ్వాంగ్‌సింగ్ చైనా అంతటానున్న విప్లవవాదులకు తిరుగుబాటు చేయమని సందేశమిచ్చి, అక్టోబరు 20నాటికి వూహాణ చేరుకున్నాడు. వూహాన్‌నుండి విప్లవజ్వరం చైనాఅంతటా వ్యాపించింది. జెక్వాన్, దాని తర్వాత హూనాన్, షెన్సీ రాష్ట్రాలు స్వాతంత్ర్యం ప్రకటించాయి. షెన్సీరాష్ట్రంలో ముఖ్యపట్టణమైన ఉన్‌ఫూలో మంచూరాజవంశ చిహ్నాలను తగులబెట్టి గవర్నరును చంపి, తాత్కాలిక విప్లవ ప్రభుత్వాన్ని యెన్‌పీషాన్ నాయకత్వం క్రింద నెలకొల్పారు కాంటన్‌లో హుహాన్‌మిన్ విప్లవ ప్రభుత్వాన్ని స్థాపించాడు. షాంటంగ్ పట్టణంకూడా విప్లవపక్షంలో చేరింది. మంచూప్రభువులు విప్లవాన్ని విరోధించలేరని 'డోగర్ చక్రవర్తిని' యువాన్‌షీకేను రెండు రాష్ట్రాలకు రాజప్రతినిధిగా చేసింది. చక్రవర్తినిచేత అంతక్రితం అవమానింపబడి యుండడంచే యువాన్‌షీకే తిరస్కరించాడు. అప్పుడు ప్రధాని వగైరాలు రాజీనామా ఇచ్చి, సర్వాధికారాలను ప్రజాప్రతినిధులతో కూడిన పార్లమెంటునకును, మంత్రివర్గ సభకును వదలి, శాసనబద్ధ చక్రవర్తినిగా నుండుటకు డోగర్‌చక్రవర్తిని

తన అంగీకారమును ప్రకటించింది. కాని యీలోపుగానే విప్లవం మహా వేగంతో దేశంలో నలుమూలలా వ్యాపించిపోయింది. నవంబరు 3వ తేదీన షాంఘేను, ఆపట్టణంలోవున్న గొప్ప ఆయుధాగారాన్ని చెణాచీమీ అనునతడు పట్టుకున్నాడు. నౌకాశ్రయం, కోటలు కూడా ప్రతిఘటన లేకుండానే పట్టుబడ్డాయి. నవంబరు 9వ తేదీని యూనాన్ తిరుగబడింది. దానివెంట కియాంగ్సీ, చెకియాంగ్ రాష్ట్రాలుకూడ చక్రవర్తిని అధికారాలను ప్రతిఘటించాయి. వూహాన్ పట్టణాలను తిరిగి పట్టుకునేందుకు పంపబడిన అడ్మిరల్ సాచిన్‌పెంగ్ నవంబరు 13న విప్లవపక్షంవైపు తిరిగాడు.

అక్టోబరు 30 వ తేదీనాటికి యువాన్‌షీకే రెండు రోజుల యుద్ధానంతరం హాంకోను విప్లవవాదులనుండి తిరిగి పట్టుకొని, వూహాన్ విప్లవ సంఘంతో సంప్రతింపులు సాగించాడు కాని, ఫలితమేమీ కలుగలేదు. ఈవిధంగా పదిపరాజయాల అనంతరం, విప్లవం బ్రహ్మాండమైన విజయం పొందింది.

# 4 వ అధ్యాయం.

## ప్రజాస్వామిక ప్రభుత్వ స్థాపన.

### నాయకత్వం లేని విప్లవం.

చైనా రాష్ట్రాలలో చాలవరకు విప్లవ పక్షానికి లొంగాయి. 2,50,000 మంది మంచూరియా దేశస్థులు చైనానుండి తమ దేశానికి వెళ్ళిపోయారు. 24,000 మంది సైనికులు యింకా యీ ప్రభుత్వాధికారంలో వున్నప్పటికినీ, డోగర్ చక్రవర్తిని విప్లవ విజయ తీవ్రతకు భయపడి, దిక్కు, తెన్ను తోచక యువాన్‌షీకేను తోడ్పడమని ప్రార్థించింది. అంతట అతను నవంబరు 7 వ తేదీన ఉత్తరచైనా ప్రభుత్వ సైన్యాలమీద సర్వాధికారం తీసికొని, విప్లవ పక్షాభిమానియైన వూలూ చెన్‌ను హంతకులచే రైల్వేస్టేషనులో చంపించివేసి ప్రభుత్వ సైన్యాలతో దక్షిణ చైనాలోని విప్లవాన్ని అణచుటకు యేర్పాట్లు చేయసాగాడు.

ఉత్తర చైనాలో యువాన్ చేసే పనులకు ప్రతిగా పెకింగ్, టీన్ ట్సిన్ పట్టణాలలోని విప్లవ పార్టీలను పునరుద్ధరించి, సైనికులలో తీవ్రంగా విప్లవప్రచారం చేయసాగారు. కాని యువాన్‌షీకే, చాంగ్‌చో చెంగ్‌ల అధికారంక్రింద వున్న సైనికులుమాత్రం విప్లవవాదులవైపు తిరుగలేదు.

ఉత్తర చైనాలోవున్న మంచూవంశ ప్రభువులను ఒక్కొక్కరినే హత్యలు చేసి, ప్రజలలో గొప్ప సంచలనం పుట్టించాలనే ఉద్దేశంతో బాంబు వాదులు (టెర్రరిస్టులు) ప్రయత్నించ సాగారు. షాంఘే ఆయుధాగారం విప్లవవాదుల చేతుల్లో పడ్డాక చెన్‌పీచూన్ కన్య, మరికొందరు పార్టీపక్షీయులతో చాల బాంబులను తీసికొని ఉత్తర చైనాకు వెళ్ళింది.

మంచూ ప్రభువులలో మిక్కిలి ధైర్యవంతుడైన లియాంగ్‌పీమీద పాన్ యూచింగ్ విప్లవపక్ష ఆజ్ఞానుసారంగా బాంబు విసిరి చంపివేశాడు. 1912 జనవరి 16 వ తేదీన నలుగురు విప్లవవాదులు యువాన్‌షీకే మీద కూడ బాంబు విసిరారు. కాని ఆతని గుర్రానికి, ఆత్మరక్షక భటులకు మాత్రమే గాయాలు తగిలాయి. ఉత్తర చైనాలో విప్లవ వాదులకు గల పలుకుబడిని యీ సంఘటన యువాన్‌కు తెలియబరిచింది.

డోగర్ చక్రవర్తిని సర్వ రాజకీయ, సైనికాధికారాలను యువాన్‌షీకే కిచ్చింది. కాని చిహ్లీ. హోనాన్, షాంటంగ్ రాష్ట్రాలు మూడు మాత్రమే మంచూ చక్రవర్తికి లోబడి వున్నాయి.

యువాన్ తన సైన్యాలతో విప్లవపక్షంతో కలిస్తే చైనా ప్రజాస్వామికానికి మొదటి అధ్యక్షునిగా చేస్తామని విప్లవపక్షం తరపున వాంగ్‌చింగ్‌వీ రాజీబేరాలు సాగించాడు కాని యువాన్ అంగీకరించక 20,000 సుశిక్షిత సైన్యాన్ని హోన్‌నది ఉత్తర ఒడ్డున వున్న హోన్యాంగ్ పట్టణాన్ని పట్టుకునేందుకు పంపాడు. ఆకాలంలో చైనాలోకెల్ల గొప్ప యోధుడని పేర్వడసిన హ్వాంగ్‌సింగ్ 3000 లసైనికులతో ఆ పట్టణం నుండి షాంఘైకు వెడలిపోయాడు దక్షిణచైనా రాజధాని పట్టణమైన నాన్కింగును హ్వాంగ్‌సింగ్ డిసెంబరు 3 వ తేదీన వశపరచుకున్నాడు. ఈ విజయం విప్లవ వాదులకు గొప్ప ప్రతిష్ఠ కలిగించింది.

చైనా రాజబొక్కసం శూన్యంగా వుండటం వలననూ, రాజభక్తి పరాయణుడైన ఒకేఒక చాంగ్‌చూన్ సేనాని ఓడిపోవుట వలనను, యువాన్‌కు నిరాశ కలిగి, మరల వాంగ్‌చింగ్‌వీతో రాజీసంభాషణలు సాగించాడు కాని నాన్కింగ్ రాజధానిలో వున్న హ్వాంగ్‌సింగ్ విప్లవ రాష్ట్రాలనుండి పంపబడిన ప్రజాప్రతినిధులతో గూడిన జాతీయ సమ్మేళనము నేర్పాటు చేసి, వాంగ్‌ను అచ్చటకు తక్షణమే రమ్మని కబురు చేశాడు. జాతీయ సమ్మేళనంవారు వెన్‌సుంగ్‌యో, వాంగ్‌చంగ్‌హ్వా,

యంగ్‌చెకా, వాంగ్‌చెంగ్‌టింగు, హూయింగు, ఫూటింగుఫాంగులతో కూడిన రాజీసంఘాన్ని యేర్పరచారు

యువాన్‌షీకే కూడా టాంగుషోయీని రాజీబేరాలకు పంపాడు. ఈ ఉభయులు షాంఘేలో కలుసుకున్నారు. వూటింగుఫాంగు స్పష్టంగా "మంచూవంశజుల రాజ్యపరిత్యాగం, ప్రజాస్వామిక ప్రభుత్వ స్థాపనలే" తాము కోరుతున్నామని చెప్పివేశాడు. ప్రభుత్వం తరపున వచ్చిన టాంగు కూడ వీరిలో కలసిపోయాడు.

అక్టోబరు 11 న జరిగిన వూచాంగు విప్లవకాలంలో డాక్టర్ సన్‌యట్‌సేన్ అమెరికాలో వున్నారు. విదేశాల్లోనే వుండి, విదేశ ప్రభుత్వాలను విప్లవవాదులకు అనుకూలంగా చేయుట, చైనాలోనుండి సైనిక కార్యాలను నడుపుట కంటె అవుసరంగా యెంచి, గొప్ప ప్రయత్నాలు చేయసాగాడు. చైనాదేశంతో సంబంధమున్న ముఖ్యరాజ్యాలలో ఫ్రాన్సు అమెరికాలకు మాత్రమే విప్లవ పక్షమందు సానుభూతి కలదు జపాకా. బ్రిటిషుదేశ ప్రజలకు విప్లవాభిమాన మున్నప్పటికినీ ఆ దేశ ప్రభుత్వాలు మాత్రం విరోధం చూపుతున్నాయి. అందువలన, సన్‌యట్‌సేన్ యింగ్లండు వెళ్ళి మంచూ ప్రభుత్వానికి బ్రిటిషు, జర్మన్, ఫ్రెంచి, అమెరికను బ్యాంకర్లీయ దలచిన పెద్ద అప్పునీయకుండా రద్దు చేయించాడు. బ్రిటిషు అధీన రాజ్యాలలోను, వలస దేశాల్లోను, సకాయట్‌సేన్ ప్రవేశించరాదను నిషేధాజ్ఞనుకూడ రద్దుచేయించాడు.

ఈసమయంలో సన్‌యట్‌సేన్ చైనాదేశంలో వుండకపోవడం వలన విప్లవపక్షాన్ని నడిపించగలిగిన సమర్ధమైన నాయకత్వం లేకపోయింది. సన్‌యట్‌సేన్‌కు వున్నంత పలుకుబడి ప్రజలలో మరెవరికినీ లేకపోవడంవలన, ఉపనాయకుడైన హ్వాంగ్‌సింగు ఆజ్ఞలకు అందరూ లోబడక విప్లవకార్యాలను సక్రమంగా కొనసాగించుటలేదు. విప్లవవాదులందరూ రహస్యజీవితం గడిపారు కనుక ప్రజలలో వారికి గొప్పపేరు ప్రతిష్ఠలులేవు. అందువలన అంతవరకు మంచూ చక్రవర్తుల క్రింద అధికారులుగా వున్నవారుకూడ జాతీయసమ్మేళనంలోనికి వచ్చారు.

## విప్లవశకారంభం

1911 డిశెంబరు 21 న డాక్టరు సన్‌యట్‌సేన్ హాంగ్‌కాంగు వచ్చి క్వాంగుటంగ్ రాష్ట్ర అసెంబ్లీవలన రాష్ట్రటట్టూ (గవర్నరు) గా యెన్నుకోబడిన హూహాన్‌మిన్‌ను వెంటబెట్టుకొని షాంఘైపట్టణం వెళ్ళాడు. చైనా జాతీయసమ్మేళన ప్రతినిధులు 1911 డిశెంబరు 29 న సన్‌యట్‌సేన్‌ను చైనా ప్రజాస్వామిక అధ్యక్షునిగాను, హ్వాంగ్‌సింగును సర్వసైన్యాధ్యక్షునిగాను, భార్య మంచంకింద దూరిన ధీరుడైన లీయు వాంగుహంగ్‌ను ఉపాధ్యక్షునిగాను యెన్నుకున్నారు.

1912 జనవరి 1 వ తేదీనాడు సన్‌యట్‌సేన్ అధ్యక్షపదవి నలంకరించిన నాటినుండి విప్లవశకారంభంగా చైనీయులు ప్రకటించారు. సన్ మంత్రివర్గంలో హ్వాంగుసింగు యుద్ధమంత్రి, వూటింగుమింగ్ విదేశాంగమంత్రి; వాంగుచంగ్‌హ్వా న్యాయమంత్రి, సేయువాన్‌పీ విద్యాశాఖామంత్రి, పెకింగు బ్యాంకరైన చెన్‌చిన్‌టో ఆర్థికశాఖామంత్రి, చాంగుచీన్ వాణిజ్య-పారిశ్రామిక శాఖామంత్రిగాను యెన్నుకోబడ్డారు. హూహాన్‌మిన్ గవర్నరు పదవికి రాజీనామాయిచ్చి, సన్‌యట్‌సేన్‌కు ప్రధానకార్యదర్శిగా పనిచేశాడు.

విప్లవప్రభుత్వంలో ఉన్నతపదవులలోనికి వచ్చినవారిలో చాల మందికి విప్లవసిద్ధాంతాలు తెలియవు. సరియైన విప్లవప్రభుత్వభావనకూడ లేదు. స్వార్థపరత్వంతో అనేకులు పనిచేయసాగేరు. నాటివరకు విరంకుశపాలనకు లొంగి, బానిసభావాలు కలిగివున్న ప్రజాసామాన్యంలో ప్రజాతంత్రభావాలు వ్యాపించేవరకూ విప్లవసైనిక ప్రభుత్వాన్నేర్పాటు చేసి, మిగిలిన రాష్ట్రాలనుకూడా వశపరచుకోవాలని షాంఘైకు రాగానే సన్‌యట్‌సేన్ చెప్పాడు. కాని మిలిగిన నాయకులు సేన్‌యొక్క "విప్లవసైనిక పరిపాలనాదశ", "ప్రజాతంత్ర ప్రబోధనాదశ", "ప్రజాస్వామిక ప్రభుత్వదశ" అను మూడుదశల సిద్ధాంతాన్ని అంగీకరించ

లేదు. అందువలన డాక్టరు సన్ అధ్యక్షపదవికి రాగానే, యువాన్‌షికే విప్లవపక్షంలో కలిసేయెడల తాను అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చి, యువాన్‌ను అధ్యక్షునిగా యెన్నుకుంటామని వాంగుచింగువీచే రాయబారం పంపించాడు. వాంగుకూడా ఒక వైపున సంధిసంభాషణలు సాగిస్తూనే, మరొకవైపున మంచూప్రభు వంశీయులను హత్యలుచేయ బాంబు లాదులను ప్రోత్సహించాడు.

యువాన్‌కు ప్రతికక్షులైన 46 గురు మంచూప్రభుత్వ సైన్యంలోని సేనానులు తాము విప్లవపక్ష సేనలను ప్రతిఘటించి యుద్ధం చేయమని వ్రాతమూలకంగా తెలియజేశారు. మంచూప్రభు వంశీకుడైన లియాంగు పేని హత్య చేశారు యువాన్‌మీదకూడ బాంబు విసిరారు. ఈ సంఘటనల వలన యువాన్ ధైర్యం చలించింది. మంచూచక్రవర్తి వంశీకులు సింహాసన త్యాగం చేసి, వారి అనుజ్ఞతో చైనా ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని స్థాపించుచున్నారనే ప్రకటనను యువాన్ చేశాడు. కాని వెంటనే సన్ యట్‌సేన్ చైనా విప్లవ ప్రభుత్వం పదవీత్యాగం చేసిన చక్రవర్తివలన స్థాపింపబడదనీ యువాన్ వారిని వదలి తమతో కలియుట కంగీకరించాలనీ, తక్షణం నాన్‌కింగు రావాలనీ తంతి పంపాడు.

కాని పెకింగు వదలితే తన పలుకుబడి, అధికారం పోతాయనే భయంతో, పెకింగునంతా కొల్లగొట్టేందుకు సైనికులకు రహస్యంగా యువాన్ ఆజ్ఞనిచ్చాడు. ఆ సైనికులు పెకింగును దోచి, గొప్ప నష్టం కలిగించారు. ఇది చూచి, యువాన్‌షికే పెకింగులోనే వుండేందుకు అనుజ్ఞ నిచ్చారు. అభివృద్ధి నిరోధకుడైన యువాన్ చైనా ప్రజాస్వామికాధ్యక్షుడుగా మండుట తమకు లాభదాయకమని గుర్తించిన బ్రిటిషు విదేశాంగ మంత్రియైన సర్ ఎడ్వర్డుగ్రే ప్రోత్సాహంతో విప్లవవాదులకు యువానుకు బ్రిటిషు రాయబారి సమాధానం కుదిర్చాడు.

యువాన్ ప్రజాస్వామికాధ్యక్ష పదవిని 1912 మార్చి 12 వ తేదీని స్వీకరించాడు. ఏప్రిల్ 1 వ తేదీని సన్ తన అధికారాలను వప్పగించాడు. జాతీయ అసెంబ్లీ మార్చి 10 వ తేదీనాడు తాత్కాలిక ప్రజాస్వామిక చట్టాన్ని ఆమోదించింది.

ఈ విధంగా విప్లవం విజయంపొందిన సమయంలో విప్లవ వాదులకు నిర్దుష్టమూ, సుస్పష్టమూ అయిన విప్లవ ప్రయోజనాలు లేకపోయినందున విప్లవాధికారాలన్నీ అభివృద్ధి విరోధకుడూ, స్వార్థపరుడూ అయిన యువాన్‌షికే చేతుల్లోకి పోయాయి. విప్లవవాదులు అపూర్వ త్యాగంతో మంచూవంశ రాచరిక నిరంకుశత్వాన్ని నిర్మూలించి, ప్రతిష్ఠించిన చైనా ప్రజాస్వామికానికి యువాన్‌షికే నామమాత్రంగా భక్తి చూపిస్తూ, వాస్తవానికి అధికారాన్ని ఆచరణలో తానే అవ్యాహతంగా చలాయించ నారంభించాడు.

# 5 వ అధ్యాయం.

## యువాణాషీకే విద్రోహం.

---

### రాజకీయరంగంనుండి డాక్టర్ సన్ నిష్క్రమణ.

డాక్టర్ సన్ బోధించిన మూడుదశల సూత్రాన్ని అమల్లో పెట్టుటకు యితర విప్లవనాయకులు ఏ నాడు నిరాకరించి, అంతవరకును విప్లవవిరోధులుగానున్న యువాన్‌షీకే, లీయువాన్‌హంగ్ లను అధ్యక్ష, ఉపాధ్యక్షులుగా యెన్నుకున్నారో ఆనాడే తాను రాజకీయ జీవితాన్నుండి విరమించుకుంటున్నాననీ, తన విప్లవసిద్ధాంతాల్లో మూడవదియైన 'ప్రజాజీవనోపాయ' సూత్రమందు విశ్వాసమున్న విప్లవవాదులందరూ రాజకీయరంగం నుండి తనతోబాటు నిష్క్రమించి ఆర్థిక, పారిశ్రామిక పునర్నిర్మాణ కార్యంలో తోడ్పడవలసిందనీ ఒక విజ్ఞాపనను సన్‌యట్‌సేన్ ప్రకటించాడు. 1789 లోని ఫ్రెంచి విప్లవంకూడా ప్రజాసామాన్యంలో ప్రజాతంత్ర సూత్రాలను అవగాహన చేసుకోగలిగిన జ్ఞానం లేనందుననే, ప్రథమంలో ప్రపంచప్రజల హృదయాలను త్తేజపరచి, కండ్లు మిరుమిట్లు కొల్పగలిగినప్పటికీ తరువాత నెపోలియన్‌యొక్క నియంతృత్వానికి, సార్వభౌమత్వానికి తావిచ్చింది. కాని ప్రస్తుత పరిస్థితులలో చైనావిప్లవానికి కూడా ఆదేస్థితి పట్టనుందని సన్ బోధించినను హూహాణామిన్, షూవాంగ్‌సింగ్, చెన్‌చీమీలు మాత్రమే పదవీపరిత్యాగంచేసి, ఆయనను అనుసరించారు, వాంగ్‌చింగ్‌వీ తనను నీడలాగు అనుసరించి అన్ని విప్లవోద్యమములలోను తనతో సమానంగా పాల్గొంటున్న చెణాపీచూన్ కన్యను వివాహమాడి, ఆగష్టు 1912 లో ఫ్రాంసు వెళ్లాడు.

## కొమింటాంగ్ (జాతీయ ప్రజాపక్షం) స్థాపన.

మిగిలిన ఐక్యవిప్లవపక్షీయు లందరూ తామింతకాలం శ్రమించి చేసిన త్యాగాలకు ఫలితం పొందదలచి తమ పదవులను వదులుకొన లేదు. నూతన ప్రజాస్వామ్య రాజ్యాంగ స్వరూపం సంగ్‌చియోజేన్ తయారుచేశాడు. ఈ నిబంధనలు యెక్కువగా ఫ్రెంచి ప్రజాస్వామ్య రాజ్యాంగపద్ధతులను పోలియుండుటవలన పార్లిమెంటరీపక్షాలు యేర్ప డుట అవుసరమైంది. అందుకుగాను సంగ్‌చియోజేన్ కొమింటాంగు అనే చైనాజాతీయ ప్రజాపక్షాన్ని, దానికి వ్యతిరేకంగా సియంగ్‌సీలింగ్, చాంగ్‌చీణా, లియాంగ్‌చీచోలు "చిన్‌పుటాంగ్ (అభ్యుదయపక్షము)"ను యేర్పరచారు. పార్లమెంటులో చిన్‌పుటాంగ్ యువాన్‌షికేను బలపరు స్తూండేది. ఈ పక్షానికి లీయువాంగ్‌హంగును ముఖ్యనాయకునిగా యెన్నుకున్నారు.

ఈ ప్రధాన రాజకీయ పక్షాలే కాకుండా పేయాంగు మిలిటరీపార్టీ చియోటంగుయీ అను రెండు పార్టీలు యువాన్ అనుచరులచేత స్థాపింప బడ్డాయి. యువాన్ సంపూర్ణంగా యీ పార్టీల సైనికశక్తి మీదనే ఆధార పడ్డాడు.

ప్రభుత్వ బొక్కసం ఖాళీగా వుంది. రాష్ట్రాలనుండి ప్రభుత్వాదాయ మేమీ రాలేదు. సైనికుల జీతాలు నెలల తరబడిగా బకాయీపడి వున్నాయి. ఈ విషమ పరిస్థితుల్లో యువాన్‌షీకే బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ అమెరికా బ్యాంకింగు కూటమితో ఋణానికై సంప్రతింపులు సాగిం చాడు. చైనాయొక్క ఉప్పు వ్యాపారంమీద వచ్చు ఆదాయంపైన, యెగుమతి, దిగుమతి సుంకాలమీద లోగడనే తమకున్న అధికారాల వంటి అధికారాల నిస్తే ఋణాన్నిచ్చేందుకు సిద్ధంగా వున్నామని ఆ బ్యాంకింగు కూటమివారు చెప్పారు. కాని యీ ఆత్మ వినాశకరమైన షరతులకు ప్రజాప్రతినిధి సభ (పార్లమెంటు) అంగీకరించ వందున

యువాన్‌షికే అనేక కుట్రలు పన్నసాగేడు. ప్రధాన మంత్రియైన టాంగ్ షోయీ, యువాన్ అధ్యక్షుడైన ప్రథమ దినాల్లో 20 లక్షల పౌనులు రూసో–బెల్జియం సిండికేటువారి వద్దనుండి బదులు తెచ్చాడు. కాని ఆ సొమ్మంతా మాయమైంది. పార్లమెంటు సభ్యులు జమాఖర్చులడుగ జొచ్చారు

యువాన్ కుట్రల్లో ప్రధానికూడా పాల్గొనేటట్లైతే, అతనికి మరణ శిక్ష తప్పదని కొందరు విప్లవపక్షసభ్యులు బెదరించగా ప్రధాని అకస్మాత్తుగా పారిపోయి రాజీనామాయిచ్చాడు పచ్చివెలగకాయ గొంతుకలో పడినట్లు యువాన్ బాధపడి, చివరకు జీతభత్యాలు ముట్టని సైనికులెదురు తిరుగుతారని పార్లమెంటును బెదరించి, పూర్తిగా తనకు దాసోహం చేసే మంత్రివర్గాన్ని యేర్పాటు చేసుకున్నాడు డాక్టర్ మారిసన్, బ్రిస్కో డిస్మేల్‌వంటి సుప్రసిద్ధ పాశ్చాత్యులను రాజకీయ, సైనిక సలహాదార్లుగా నెలకు 2500 పౌనుల జీతంమీద యేర్పరచి, యువాన్ పాశ్చాత్య బ్యాంకర్లకు అమ్ముడుపోయాడు.

సంగ్ చియోజెన్ మాత్రం పక్కీవచ్చే యెన్నికల్లో తమ పక్షం లోని ప్రతినిధుల నెక్కువగా గెలిపించి యువాన్‌ను అధ్యక్ష పదవినుండి తొలగించవచ్చునని ఆశించి, రాజ్యాంగచట్టం ప్రకారంగా 1913 వ జనవరిలో యెన్నికలు జరిపించమని పార్లమెంటులో గొడవ చేయసాగాడు. శాసనసభాందోళన వలననే యువాన్‌ను తొలగించుట సాధ్యమౌతుందని వారూహించారు. పైగా సన్‌యట్‌సేన్, అతని అనుచరులు రాజకీయానుభవంలేని భావవాదులనీ ప్రజలందరూ యెన్నడూ రాజ్యాంగ వ్యవహారాల్లో పాల్గొనలేరనీ, ఆ మాచరణలోపెట్టే విధానమే సరియైనదనీ ప్రగల్భాలు కొట్టసాగారు. వారు స్థాపించిన కొమింటాంగులో కేవలం నమ్మదగిన విప్లవవాదులే గాక, సమయానుకూలవాదులు, స్వప్రయోజనపరులు, అధికార వాంఛాపరులు జేరి దాని విప్లవ స్వభావాన్ని చాలవరకు కుపిష్కరింపజేశారు.

## యువాన్‌షికే చేసిన హత్యాకాండ.

బ్యాంకింగు కూటమివారినుండి ఋణం తీసుకునేందుకు తాను చేస్తూన్న ప్రతి ప్రయత్నానికీ కొమింటాంగు ప్రతినిధులు అడ్డుపడుతూండడం, నూతన యెన్నికలు జరిపించమని కోరటం చూచి, కొమింటాంగుకున్న నిజ బలాన్ని పరీక్షింపదలచి యువాన్, చాంగ్‌చెంగువూ, ఫాంగుపీలను విప్లవ నాయకులను, ఉపాధ్యక్షుడైన లీయువాన్‌హాంగు ఆహ్వానించినట్లు పిలిపించి, అకారణంగా చంపించివేశాడు ఈ హత్యావార్తను విన్న చైనాప్రజానీకం గగ్గోలుపెట్టసాగింది డాక్టర్‌సన్, హ్వాంగ్‌సెంగ్‌లు యీహత్యలకు కారణాలు చెప్పమని హుంకరించారు. చైనా ప్రజలకు కలిగిన క్రోధానికి జంకి, యువాన్ ఆశయాలను అత్యంత వైభవంగా సమాధి చేయించి డాక్టర్ సన్‌ను పెకింగుపట్టణం వచ్చి తనను సరియైనమార్గంలో నడిపించవలసిందిగా కోరాడు. చైనాదేశమంతటా రైల్వేలను నిర్మించాలని గొప్ప ప్రణాళిక వేసిన డాక్టర్ సన్‌ను రైల్వేల డైరెక్టర్ జనరల్ గాను, హ్వాంగుసింగును గనుల అధికారిగాను, గొప్ప జీతాలమీద నియమించాడు. వారికి విదేశాలనుండి అప్పు తీసికొనివచ్చి వీటిని అభివృద్ధిచేయుటకుకూడా అధికారాలిచ్చాడు.

అంతటితో దారుణ హత్యలవలన రేగిన క్రోధాగ్ని తాత్కాలికంగా ఉపశమించింది. యువాన్ మరల తన ప్రతికక్షులను లంచాలిచ్చి లోబరచుకొనిగాని, చంపివేసిగాని తనమార్గం నిష్కంటకం చేసుకోవాలని ప్రయత్నించసాగేడు. బాహ్య మంగోలియా స్వాతంత్ర్యాన్ని 1912 అక్టోబరు 21 వ తేదీన గుర్తించి రష్యన్లయొక్కయు, టిబెట్టు స్వాతంత్ర్యం గుర్తించి బ్రిటిష్‌వారియొక్కయు ప్రాపకం సంపాదించ ప్రయత్నించాడు. ఇందువలన టిబెట్టును బ్రిటిష్‌వారు గుప్పిటలో పెట్టుకోగలిగారు. మంచూరియాలో జపాన్‌వారికి వారి ముఖ్య రైల్వేలైనుల ననుసరించి

మరి 1100 మైళ్ళ రైల్వేలైను వేసుకునేందుకు అనుజ్ఞనిచ్చాడు. స్టాండర్డు అయిలు కంపెనీకి దేశంలోనున్న నూనెగనుల ప్రాంతాలను పరిశీలించే అధికారాన్నిచ్చేడు యూనాన్‌నుండి చైనామధ్యంగా కన్సూ వరకును, హోనాన్‌నుండి కియాంగ్సులోని హ్వాచౌ వరకును, రైల్వేలైనులను వేసేందుకు ఒక బెల్జియం కంపెనీకి అధికారం యిచ్చాడు. ఇంకా అనేక పరిశ్రమలను స్థాపించుకునేందుకు గ్రేట్‌బ్రిటనుకు హక్కులీయబడ్డాయి. ఈ విధంగా అన్యదేశ ప్రభుత్వాలకు అధికారాలిచ్చి, చైనాలో తన ప్రభుత్వం సుస్థిరంగా వుండేటందుకు వారి సహాయ మపేక్షించాడు.

ప్రజాప్రతినిధులసభలో ప్రతినిధుల యెన్నికలు జరిగి 586 సభ్యులలో 269 మందిన్ని, 274 గురు సెనేటర్లలో 123 రున్నూ కొమింటాంగు సభ్యులెన్నుకోబడ్డారు. యువాన్‌కు మెజారిటీ లేనందున, కొమింటాంగు నాయకుడైన సంగ్‌చియోజేన్ ప్రధానమంత్రియై, యువాన్ చేతులనుండి అధికారాలు తీసుకునేందుకు షాంఘే రైలుస్టేషన్‌లో అర్ధరాత్రి రైలెక్కబోవుచుండగా సంగ్‌ను ఒకడు హత్యచేశాడు. ఆ హంతకుని వెంటనే పట్టుకోగా, యీ క్రూరకార్యం చేసేందుకు 50 వేల డాలర్లు యువాన్ కుడిభుజమైన చోపింగ్‌చూన్‌చే ఈయబడినట్లు కొన్ని ఉత్తరాలు అతనివద్ద దొరికాయి.

ఈ హత్యమూలమున దేశంలో యువాన్‌షికే అంటె గొప్ప ద్వేషమేర్పడింది. ఈ సమయంలో అతనిని తొలగించుట చాల తేలికగా వుండేది. కాని పార్టీనాయకులలో అధికభాగం భీరుత్వంతో యువాన్‌మీద దండెత్తవద్దని, మరొకపర్యాయం సన్‌యట్‌సేన్ సలహాను నిరాకరించారు. పెకింగులో 1913 ఏప్రిల్ 8 నాడు జరుపబడిన పార్లమెంటు సమావేశంలో పాల్గొని, యువాన్‌మీద కొన్ని నేరారోపణలు చేశారు. కాని వారి పార్లమెంటరీ విధానం, చర్యలు, తీర్మానాలు, ఖండనయూ అరణ్యరోదనం మాత్రమే అయ్యాయి.

ప్రభుత్వ ఋణములు, ఖర్చులు మున్నగునవన్నీ పార్లమెంటులో ప్రవేశపెట్టి, వారామోదించిన పిమ్మటగాని చేయరాదనునిబంధన వున్నప్పటికినీ, యువాన్ నిరంకుశంగా, బ్యాంకింగు కూటమి వారివద్ద ఋణ పత్రంమీద సంతకం చేశాడు. ఈ విషయాన్ని సెనేట్ ఉపాధ్యక్షుడైన వాంగ్‌చెంగుటింగు తెలుసుకొని, పార్లమెంటులో యువాన్‌చర్య చట్ట విరుద్ధమనియు, యీఋణానికి చైనాప్రభుత్వం బాధ్యత వహించదనియు తీర్మానించారు డాక్టర్ సన్‌యట్‌సేన్ ఋణదాతలైన బ్యాంకర్లకూట మికి చెందిన ఐదు విదేశ రాజ్యాలకు ఒక ప్రకటన చేశాడు యువాన్ షికేయే సంగ్‌చియోజేన్ హత్యకు కారకుడని పార్లమెంటు చేసిన విచారణవలన తేలినందుననూ, పార్లమెంటు ఋణం చేయరాదని ఖచ్చితంగా తీర్మానించి నప్పటికినీ, లెక్కచేయకుండా నిరంకుశంగా యువాన్‌షికే వ్యవహరించుచున్నందునను దేశస్థులందరూ ఆగ్రహావేశ పరవశు లగుచున్నారు. ఒక్క చిన్న అగ్నికణం పడ్డా దవాగ్నివలె రాజుకునేందుకు సిద్ధంగా వున్నది. కాన, యువాన్‌షికేకు ఋణము నీయ నిరాకరించి ప్రజలను అంతర్యుద్ధపు రక్తపుటేరులనుండీ, యుద్ధంవల్ల కలిగే అనర్థ కాలమండీ రక్షించవలసిందిగా సన్‌యట్‌సేన్ కోరాడు.

చైనాలో విప్లవప్రభుత్వం దృఢపడటం కాంక్షించని పాశ్చాత్య ప్రభుత్వాలు వీరి ప్రార్థనలను మన్నించక అప్పునీయడమేకాక విప్లవ వాదుల నణచి దేశంలో శాంతి నెలకొల్పవలసిందిగా యువాన్‌కు ప్రోత్సాహమియ జొచ్చారు.

అనేక నెలలు పార్లమెంటులో ప్రజాప్రతినిధులు యువాన్ చర్యను ఖండిస్తూ అమూల్యమైన కాలాన్ని వ్యర్థంచేశారు. యువాన్ పెడచెవినిపెట్టి క్రమక్రమంగా విప్లవవాదులను తన మార్గంలో అడ్డురాకుండా ప్రయత్నింపసాగాడు. ఈ సమయంలో ఒక్క సన్‌యట్‌సేన్ మాత్రమే ప్రత్యక్షచర్య తీసుకుంటేనేగాని యువాన్ లొంగడనీ, పార్ల మెంటరీ విధానం వ్యర్థమనీ తలపోసి, అకస్మాత్తుగా అన్ని రాష్ట్రాల

స్వతంత్రంగా ప్రకటింపజేసి యువాన్ వ్యతిరేకోద్యమం లేవతీయ ప్రయత్నించాడు. క్వాంగ్‌టంగ్ లో స్వాతంత్ర్యం ప్రకటించవలసిందిగా హూహాన్‌మిన్‌కు తంతివార్త పంపాడు. కాని అతడు యుద్ధంచెయ్యడం మంచిదికాదని తలపోశాడు. ఇంతలో యువానే కియాంగ్సీ రాష్ట్రంలో లీలీచూన్‌ను గవర్నరు పదవినుండి తొలగించగా జూలై 10 వ తేదీనాడు కియాంగ్సీ, అటుతర్వాత కియాంగ్సు, యాన్‌హ్వే, జెక్వాన్, హూనాన్, క్వాంగ్‌టంగు రాష్ట్రాలు స్వాతంత్ర్యం ప్రకటించాయి. హ్వాంగ్‌సింగ్ విప్లవసైన్యాలకు సర్వసేనాధ్యక్షుడయ్యాడు. ఈ విప్లవం చాల ఆలస్యంగా చేయబడుట వలన యువాన్‌కు తన అధికారాన్ని బలపరచుకునేందుకు మంచి సావకాశం చిక్కింది. యువాన్ అప్పుగా తెచ్చిన డబ్బును విరివిగా ఖర్చుపెట్టాడు. అతనిక్రిందనున్న సైనికులకు మంచి ఆయుధాలు, మందుగుండు సామగ్రి పుష్కలంగా వున్నాయి. విప్లవవాదులకు తమ సైన్యాలను బలపరచుకునేందుకు కూడా వ్యవధి నివ్వక, యువాన్ గొప్పసైన్యాలను వారిమీదకు పంపి అన్ని రాష్ట్రాలలోను విప్లవవాదుల నోడించాడు. రెండు నెలల్లో అన్ని రాష్ట్రాలలోను విప్లవం అణచివేయబడినందువలన సన్‌యట్‌సేన్, హ్వాంగ్‌సింగు, తదితర విప్లవనాయకులు చైనాను వదలి వెళ్లిపోవలసి వచ్చింది. యువాన్‌షీకేను యెదిరించేవారు లేనందున పార్లమెంటు సభ్యుల నందరనూ పార్లమెంటు భవనంలోనే నిర్బంధించి, భయపెట్టి, అక్టోబరు 7 వ తేదీన యువానే శాశ్వత అధ్యక్షుడని వారిచే తీర్మానింప జేశాడు. అక్టోబరు 10 నాడు అధికారం తీసుకున్నాడు. చైనాపతనం కాంక్షించే విదేశప్రభుత్వాలు వెంటనే యువాన్‌షికే ప్రభుత్వాన్ని గుర్తించాయి. జూలై విప్లవంలో పాల్గొన్నారనే నేరంమోపి, నవంబరు 4 నాడు పార్లమెంటులోని కొమింటాంగు సభ్యుల నందరనూ తొలగించివేశాడు. ఆమరుసటి రోజున మంగోలియాను యించుమించుగా రష్యాకు అధీనంచేశాడు. 1914 జనవరి 10 వ తేదీనాడు పార్లమెంటును రద్దుపరచి, మంత్రివర్గాన్ని కార్య

దర్శులుగా మార్చివేశాడు. రాష్ట్ర శాసనసభలు కూడా మార్చి 10 వ తేదీ నాడు రద్దుచేయబడ్డాయి. చైనాలో యువాన్‌షీకేయొక్క నియంతృత్వం సాగింది. యువాన్‌షీకేనుండి చైనాలో రాజకీయ, వాణిజ్య, పారిశ్రామికాధికారాలను గుంజుకుంటోన్న పాశ్చాత్య, అమెరికాదేశాలు పత్రికల నిండా యువాన్‌షీకేను, అతని ధైర్యస్థైర్యాలను, రాజనీతిజ్ఞతను, అతని పరిపాలనలో ప్రజలు పొందుతోన్న సౌఖ్యాన్ని, శాంతిని వర్ణించసాగాయి. విప్లవవాదులను రక్తపిపాసులనీ, సర్వదా వారికి దేశంలో అశాంతీ, యుద్ధాలూ కావాలని కోరే దౌర్జన్యపరులనీ పడతిట్టారు.

కూలిపోతోన్న విప్లవసౌధాన్ని మరలనొక పర్యాయం సన్‌యట్‌సేన్ నిలబెట్ట ప్రయత్నించాడు. కొమింటాంగ్ పక్షాన్ని రహస్యవిప్లవ సంఘంగా మార్చేందుకు ప్రయత్నించాడు. ఈ సంఘాల్లో జేరు సభ్యులందరూ సన్ యెడల భక్తిగలిగి వుంటామని, చెప్పిందల్లా చేస్తామని, ప్రమాణం చెయ్యాలి. ప్రమాణపత్రికపై సన్‌యట్‌సేన్ వేలిముద్ర వుంటుంది. కాని యీ పద్ధతికి సన్‌యొక్క ముఖ్యానుచరులైన హ్వాంగ్ సింగ్, వాంగ్‌చింగ్‌వీలే ఆమోదించలేదు. అది వీరపూజ ఔతుందనీ, పార్టీలో ప్రజాతంత్ర సూత్రాలకు తావులేకుండా చేస్తుందనీ వాదించారు. మొత్తంమీద యీ ప్రయత్నం విజయవంతం కాలేదు.

## సార్వభౌమ పదవీ స్థాపనా ప్రయత్నాలు.

అంతవరకును యే యితర చైనా చక్రవర్తీ సాగించనంత అధికారాన్ని యువాన్‌షీకే చైనాలో చలాయించగలుగుతున్నాడు. చైనాలో వున్న బ్రిటిషుమంత్రి సర్‌జాన్‌జోర్డాన్, రాష్ట్రాలలోవున్న సైనికసలహాదారులూ మద్దతుగా పనిచేస్తున్నారు. 1915 ఆగష్టులో నామమాత్రావశిష్టంగా వున్న చైనాప్రజాస్వామిక శవపేటికను ఖననంచెయ్యాలనే ప్రయత్నం జరిగింది. యువాన్ ప్రోత్సాహంమీదట యాంగ్‌టూ,

యువాన్ను ప్రష్యన్ రాజ్యాంగ పద్ధతిని శాసనబద్ధ చక్రవర్తిగా ప్రకటించవలయుననే తీవ్రాందోళన చేయసాగాడు. "శాసనబద్ధ ప్రభుత్వం నెలకొల్పబడనిదే చైనా రక్షింపబడ జాలదు. రాచరికం లేకుండా శాసనబద్ధ ప్రభుత్వ మేర్పాటు కాదు. రాజ్యాంగచట్టం కొన్ని స్థిరమైన చట్టాలను, రాచరికం ఒక స్థిరమైన సార్వభౌముని కలిగివుంటాయి.... మహా ఘనత వహించిన యువాన్షికేగారు ప్రెసిడెంటుగా వుండేటంత కాలమే చైనాలో శాంతి, భద్రతలు నిలుస్తాయి. అధ్యక్షునకేదైనా తటస్థిస్తే, అన్నివ్యవహారాలూ స్తంభిస్తాయి. దుకాణాలు మూతపడతాయి, అశాంతి వ్యాపిస్తుంది, ప్రజలు భయోత్పాతంతో కంపిస్తారు, సైన్యాలు చెలరేగుతాయి, విదేశయుద్ధనౌకలు మన నౌకాశ్రయాలు ప్రవేశిస్తాయి........ ఈ అలజడి అంతా అనిర్దిష్టమైన అధ్యక్ష స్థానం గూర్చే........"

యువాన్కు ముఖ్య న్యాయశాస్త్ర సలహాదారైన గుడ్నౌ అనే అమెరికన్ దేశస్థుడుకూడా "పరిస్థితులను బట్టి, ప్రజాస్వామికానికంటె రాచరిక స్థాపనమే చైనాకు అనుకూలిస్తుంది"అని వ్రాశాడు. ఈ కుట్రలో పాశ్చాత్య అమెరికా దేశాలుకూడా పాల్గొన్నాయనడానికి సందేహంలేదు.

1915 జనవరి 15 నాడు జపానుదేశం జపాన్మంత్రి హియోకే ద్వారా 21 కోరికలను యువాన్షికేకు పంపి, మే 7 వ తేదీన ఒక అంత్య సందేశం పంపింది. ఆ కోరికల నంగీకరిస్తూ సంతకం చేస్తే యువాను షికే చక్రవర్తి అయ్యేందుకు చేసే ప్రయత్నాలలో తోడ్పడతామని జపానువారు వాగ్దానం చేశారు. ఈ కోరికలను అంగీకరించుచో చైనా దేశం జపాను ప్రభుత్వంయొక్క రక్షితరాజ్యం అవుతుంది. ఐనప్పటికీ స్వార్థపరుడైన యువాన్షికే అంత్యసందేశం నెపంమీద సంతకచేసి, జపాను సహాయాన్ని ఆపేక్షించాడు. చైనా పాలనాధికారం జపాను వాళ్ళకు సంక్రమించింది.

యువాన్షికే పరోక్ష కపట నాటక మాడాడు. "నేను చట్టబద్ధ ప్రభుత్వం నెలకొల్పబడేందుకు అంగీకరిస్తున్నాను" అని అచ్చువేయ

బడిన కాగితాలను మాత్రమే ప్రజలకిచ్చి, ప్రజాభిప్రాయం తెలియపరచ మన్నాడు. ప్రజలు ఆ కాగితాలనే యిచ్చారు. అక్టోబరు 12 వ తేదీన ప్రజలందరూ చట్టబద్ధ ప్రభుత్వాన్ని కోరుతున్నారని స్టేట్ కౌన్సిలువారు ప్రకటిస్తూ, యువాన్‌షికేను ప్రథమ చక్రవర్తిగా పాలించమని ప్రార్థించారు.

కాని చైనా ప్రజల్లో యీ కపట నాటకమూ, జపాన్ కోరికలూ గొప్ప గాలిదుమారాన్ని లేపాయి. జీవితం పొడుగునా చట్టబద్ధ రాచరికం నెలకొల్పబడాలని ప్రచారంచేసిన లియాంగ్‌చీచౌ తన న్యాయమంత్రి పదవికి రాజీనామా ఇచ్చి యువాన్‌షికే చైనా ప్రజాస్వామికానికి తీరని ద్రోహం చేశాడని ప్రకటన చేశాడు. ఈయన రాజీనామా ప్రభుత్వో ద్యోగులలో గొప్ప సంచలనం కలిగించింది. వెంటనే అనేకమంది రాజీ నామాలిచ్చి బహిరంగంగా ఖండించసాగారు. యుద్ధమంత్రియైన ట్వాన్ చీజూయి, పేయో అనే ఒక విప్లవయోధుడు యువాన్‌ను ధిక్కరించి పెకింగునుండి తప్పించుకుపోయారు.

నవంబరు 10 వ తేదీని షాంఘైదుర్గపాలకుడైన పెంగుకు ఫెంగ్ క్వోచాంగు పేవాలిని చంపవలసిందిగా యువాన్ ఆజ్ఞయిచ్చాడు. కాని పెంగు షాంఘైలోనున్న విప్లవవాదులతో కలిశాడు. డిసెంబరు 11 వ తేదీనాడు యువాన్‌షికే చైనాప్రజాస్వామికం రద్దుచేయబడి రాచరిక ప్రభుత్వం నెలకొల్పబడిందని ప్రకటించాడు. దేశంలో అనేక విద్రోహు లకు ప్రభువులు, వైకౌంటులు, బారన్‌లు, ప్రిన్సులు అనే బిరుదు లీయబడ్డాయి.

క్రిష్టమస్ పండుగనాడు పేయో నాయకత్వాన అకస్మాత్తుగా యూనాన్ రాష్ట్రం స్వాతంత్ర్యం ప్రకటించింది. క్వాంగ్సీకూడ పేయో అధికారాన్ని అంగీకరించింది. క్వాంగ్‌టంగు తిరుగబడి "కాంటన్ కసాయివాడు" అని ప్రఖ్యాతిబడసిన టంగుచీక్వాంగును తరిమివేసి, పన్

యట్ సేన్, హ్వాంగుసింగులను ఆహ్వానించారు. సన్‌యట్ సేన్, హ్వాంగ్‌సింగుల రాక గొప్ప విప్లవ సంచలనం కలిగించింది. "ప్రజాస్వామికాన్ని రక్షించండి" అనే ఉద్యమం జోరుగా సాగింది. యువాన్ షికే ప్రజాస్వామికానికి విద్రోహం చేస్తాడని ముందునుండీ సన్‌యట్ సేన్ చెప్పినపల్కులు ధృవపడగానే, ఆయనయందు ప్రజలకు విశ్వాసం హెచ్చింది.

సేయో క్షయవ్యాధి పీడితుడయ్యాడు. క్వాంటంగు సైన్యాలను నడిపించేందుకు సిద్ధంగావున్న మహా విప్లవసేనాని జ్వరపడి కాంటన్‌లో చనిపోయాడు కొద్దికాలం 1913 లో వలెనే యువాన్ విప్లవాన్ని అణచి వేస్తాడనిపించింది. కాని ఫెంక్వోచాంగు విప్లవపక్షంలో కలసి విప్లవ బలగాలకు చేయూత నిచ్చాడు. 1916 మార్చి నాటికి యావత్తుదేశం తిరగబడింది. సహాయకులందరూ తన్ను వదలివేసినందున యువాన్ ఓటమి నంగీకరించి మార్చి 22 నాడు సింహాసన పరిత్యాగం చేశాడు సామ్రాజ్య ప్రధానమంత్రి టాచెంగుసియాంగు తన పదవికి రాజీనామా దాఖలు చేశాడు. మరల పార్లమెంటరీ విధానాన్ని పునరుద్ధరించాలని యువాన్ ప్రయత్నించాడు. కాని విప్లవపక్షంవారు కాంటన్‌లో మరొక ప్రభుత్వాన్ని నెలకొల్పారు. కాంటన్ ప్రజాస్వామికానికి లియాంగుచీచోను ఉపాధ్యక్షుడుగాను, లియూన్ హుంగును అధ్యక్షునిగాను యెన్నుకున్నారు. తన ఆటలు సాగవని యెంచి మే 25 నాడు యువాన్ తానంతవరకు చైనా ప్రజాస్వామికం యెడల చేసిన ఘోరాపరాధాలను బహిరంగంగా అంగీకరిస్తూ ప్రకటించి, ఉపాధ్యక్షుడైన లీని తన తరువాత అధ్యక్షునిగా సూచించేడు. చైనాలోని 18 రాష్ట్రాలలోను అవిచ్ఛిన్నంగా విప్లవ ప్రజాస్వామిక పతాకం యెగురుతూండగా, తోకచుక్కవలె ప్రవేశించి తన ఔన్నత్యానికి కారకమైన ప్రజాస్వామికానికే విద్రోహంతలపెట్టి, దేశంలో ఐకమత్యాన్ని విచ్ఛిన్నం చేసిన మహావిద్రోహి యువాన్ జూన్ 6 నాడు గతించాడు.

# 6 వ అధ్యాయం.

## సంక్షోభం : కల్లోలం.



### ఆన్ఫూ, చిహిలీ ముఠాలు.

యువాన్ నాటిన విద్రోహబీజం మహావృక్షమై చైనా అంతటా వ్యాపించి, విషఫలాలను కాచింది. దేశమంతటా దురాశాపాతకులు, స్వాధికారకాంక్షులు విజృంభించి, కొలది సైన్యాలను పోగుజేసి, సైన్యాధికారులయ్యారు యువాన్‌షీకే పదవీపరిత్యాగంతో విప్లవం రక్షింపబడింది కాని కష్టాలు మాత్రం మహావృద్ధి పొందాయి. ఉత్తరంచైనా యువాన్ యొక్క పాతపీయాంగ్‌కు చెందిన యుద్ధప్రభువుల అధికారంలోను, దక్షిణచైనా విజయులైన సైనిక నాయకుల అధికారంలోను వుంది.

లీయువాన్‌హంగ్ అధ్యక్షుడై నాన్కింగ్ ప్రజాస్వామిక రాజ్యాంగ చట్టాన్ని పునరుద్ధరించాడు. కాని పార్లమెంటుకు నామమాత్రాధికారం మాత్రమే వుంది. ఫెంగ్‌క్వోచాంగ్ అనే సైనికవాది (యుద్ధప్రభువు) వుపాధ్యక్షుడయ్యాడు.

ఈ ప్రభుత్వం కొద్దినెలలపాటు సాగకుండానే జర్మనీతో రాజకీయ సంబంధాలను తెంచుకున్నామని 1917 మార్చి 14 న ప్రకటించారు. ట్వాన్ ప్రధానీ, విదేశాంగ మంత్రి ఊటింగ్‌ఫాంగులు తమ అధికారాన్ని నెలకొల్పేందుకుగాను జపాన్ ప్రభుత్వంతో రాయబారాలు సాగిస్తో పన్నుతోన్న కుట్రలను యుజేన్‌చేన్ అనే పత్రికాధిపతి బయటపెట్టాడు. (మే 1917) జర్మనీకి వ్యతిరేకంగా యుద్ధం సాగించే నెపంమీద జపాన్, అమెరికాల నుండి పెద్ద ఋణాలను, మందుగుండు సామగ్రిని తెచ్చి, దేశంలో తమకున్న వ్యతిరేకులనందరినీ హతమార్చాలని వారు కుట్ర పన్నారు. నిశిహరా అనే జపాన్ బ్యాంకరు చైనాలో ఋణాలిచ్చేందుకు

వచ్చాడు. జపాన్‌వారు కోరిన 21 కోరికలను బలపరుస్తో మిత్రమండలి యైన బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ వగైరా ప్రభుత్వాలు జపానుకు రహస్యంగా హామీని యిచ్చాయి. అందువలన విప్లవవాదులు ప్రథమ ఐరోపా మహాసంగ్రామంలో పాల్గొనరాదని ఆందోళన చేయసాగారు. ట్వాన్‌ప్రధాని నియంతృత్వాన్ని స్థాపించేందుకు చేసే ప్రయత్నాలను తీవ్రంగా విమర్శించసాగారు. అన్ఫ్వాసైనికవాదులు పార్లమెంటు సభ్యులను బెదరించారు కాని, అధ్యక్షుడైన లీ, అన్ఫ్వా సైనికవాదియైన ట్వాన్‌ను ప్రధాని పదవినుండి తొలగించి, ఊటింగ్‌ఫాంగ్‌ను ప్రధానిగా చేశాడు. కాని ట్వాన్, తన అనుచరులైన సైనిక ప్రభువులతో కూడి వేరేప్రభుత్వాన్ని నెలకొల్పి, అధ్యక్షుడైన లీని బెదిరించి, జూన్ 10 నాడు పార్లమెంటును రద్దుచేయించాడు వెంటనే చాంగసూంగ్ తన సేనలతో పెంకింగునగరం ప్రవేశించి, మంచూవంశీయులను మరల చక్రవర్తులుగా జూలై 1 వ తేదీని ప్రకటించాడు. కాని 12 వ తేదీని ట్వాన్‌చీపుయి, ఫెంగ్‌క్వోచాంగులు కలిసి అతనిని ఓడించారు. ఫెంగ్‌క్వోచాంగు అధ్యక్షుడుగాను, ట్వాన్ మరల ప్రధానిగాను నియమింపబడి, మరల ఒక కీలుబొమ్మ పార్లమెంటు యేర్పరచబడి స్వతంత్రంగా వున్న దక్షిణ రాష్ట్రాల మీద యుద్ధం చేసేందుకు ఋణాలను పుచ్చుకొనుటకును, మధ్య యూరప్ రాజ్యాలమీద యుద్ధం ప్రకటించుటకును నిర్ణయించారు.

## దక్షిణ చైనా.

యువాన్ శిష్యులైన సైనిక ప్రభువుల గుప్పిళ్ళలో ఉత్తరచైనా అల్లకల్లోలంగా నుండగా డాక్టర్ సన్ రద్దుచేయబడిన పార్లమెంటు సభ్యులతోను, నౌకాసేనాధికారియైన చెన్‌పి, క్వాంగులతోను కాంటన్ జేరుకొని దక్షిణ చైనాలో ఒక సైనిక ప్రభుత్వాన్ని నెలకొల్పాడు. సన్‌యట్‌సేన్ సర్వసేనాధ్యక్షుడుగాను, టాంగుచియో, లూయంగుటింగులు ఉపసేనా

సులుగాను, నియమింపబడ్డారు. పెకింగు గవర్నమెంటునుండి విడిపోయి ఉత్తర చైనాలోని అన్యూపైనిక ప్రభువులమీద యుద్ధం ప్రకటించారు. యూనాన్, క్వీచౌలకు టాంగుచియోయును; క్వాంగుటంగు, క్వాంగ్సీలకు లూయంగుటింగును సైనిక గవర్నర్లుగా వుండుటవలన దక్షిణ చైనాలోని సైన్యాలన్నీ వారి అధికారం క్రిందనే వున్నాయి. సన్‌కు మాత్రం నౌకాసైన్యంలో పలుకుబడి వుంది.

పెకింగ్ ప్రభుత్వంమీద దండయాత్ర సాగించగానే, 16 నవంబరు నాడు ట్వాన్‌చీజుయి అధికారం కోల్పోయాడు కాని దక్షిణసైన్యాలు శిక్షణారహితంగా వుండటంచేతను, లూయాంగ్‌టింగ్ సన్‌యట్‌సేన్‌కు వ్యతిరేకంగా పెకింగ్ ప్రభుత్వాధ్యక్షుడైన ఫెంగ్‌క్వోచాంగ్‌ను గుర్తించేందుకు కుట్రలు పన్నుతో, పార్లమెంటుచేత సర్వసేనాధ్యక్ష పదవిని రద్దుచేయించి, సమానాధికారాలు కలిగిన ఐదుగురు సభ్యులతో ఒక కౌన్సిలును నియమింపజేశాడు. అప్పుడు చేయునదిలేక డాక్టర్‌సన్ వాంగ్, హూ, లియోలతో కలసి, షాంఘైకు వెళ్లి విప్లవ సిద్ధాంతాలమీద, జాతీయ పునర్నిర్మాణంమీద పుస్తకాలను వ్రాయసాగేడు.

## విద్యార్థి యువజనోద్యమాలు.

1911 లో మంచూ చక్రవర్తులను రాజ్యభ్రష్టులనుచేసి ప్రజాస్వామ్యము స్థాపింపగానే నూతనస్వాతంత్ర్య శకంలో ప్రజలందరూ సకల సౌఖ్య విజ్ఞానాలతో తులదూగుతారని ఆశచెందిన విప్లవయువకులు యువాన్‌షీకై విద్రోహం వలన ప్రజాసామాన్యంయొక్క స్థితి మరీ దుర్భరమగుటను గమనించారు. సామ్రాజ్యవాద జమీందారీ వ్యవస్థలకు భావప్రతిబింబమైన సంస్కృతి, కన్ఫ్యూషియన్ ప్రోక్తమైన సిద్ధాంతాలు, కుళ్ళిపోయిన ఆచారములను, వాటిపై నిర్మింపబడిన సామాజిక, ఆర్థిక, రాజకీయ, వ్యవస్థలను నాశనం చేసినగాని, జాతీయభావాలు, స్వతంత్రేచ్ఛ పునాదులుగల స్థిరమైన స్వతంత్రోద్యమము నెలకొల్పబడదని సన్‌యట్

సేన్, ఆయన అనుచరులు, నూతన విప్లవ శక్తులను సృష్టించుటకు యువజన, మహిళా అభ్యుదయ, సంస్కృతీ ఉద్యమాలను స్థాపించారు. సన్‌యట్‌సేన్ దక్షిణ చైనాలో వ్యాపింపచేసిన జాతీయోద్యమం ఉత్తర చైనాలో వ్యాపించుటకు యువజనోద్యమం ముఖ్య కారణమైంది. నల్లమందు యుద్ధాల తర్వాత పాశ్చాత్య నాగరికతా సంపర్కంవలన కలిగిన నూతన విప్లవభావాలతో ఉద్రిక్తులైన యువకులు సనాతన జమీందారీ యుగాలనాటి విషపూరిత భావాలనూ, ఆనాటి విద్యాగోష్ఠులను, విరసించి ప్రకృతిశాస్త్ర విజ్ఞానాన్ని, సామాజికశాస్త్ర విజ్ఞానాన్ని ప్రచారం చేసి మానసిక వికాసము, నూతన వ్యక్తిత్వము తీసికొనిరావలయునను ఆతృతతో యీ నూతన ఉద్యమములు పనిచేయ జొచ్చినవి. దేనినికూడ విశ్వాసము మీద గ్రహించక, సహేతుకముగ తర్కించవలయుననే ప్రధానసూత్రం మీద యీ ఉద్యమం నిర్మింపబడింది "సరియైన ప్రజాపాలనము స్థాపించవలెనన్న, పాత రాజ్యాంగ పద్ధతులతోను, పాత సాంఘిక విధానముల తోను మనము పోరాడక తప్పదు. సరియైన ప్రకృతి శాస్త్రజ్ఞానమును మనమవలంబించవలెనన్న పాతరకపు బోధనలను, పాత నమ్మకలను, పాత విజ్ఞానమును చాలవరకు వ్యతిరేకించక తప్పదు" అని యీ యుద్యమ నాయకులలో ప్రధానులగు ఆచార్య చెన్‌టూస్యూగారు వ్రాశారు. భావస్వాతంత్ర్యము, మానవ సమానత్వము, ప్రజాపాలనము అనునవి యువకుల ఆదర్శములు. యువజనోద్యమము పక్షమున చాలా పత్రికలు ప్రకటింపబడుచుండెను.

మహాపండితుడైన ఎణాపూ చైనాలో డార్విన్‌యొక్క పరిణామవాదాన్నీ, ఆడమ్ స్మిత్‌యొక్క అర్థశాస్త్రాన్ని, మిల్లరుయొక్క నీతిశాస్త్రాన్నీ, మాంటెస్క్యూయొక్క సామాజిక శాస్త్రాన్నీ మరి యితర ప్రకృతిశాస్త్రాలను ప్రవేశపెట్టారు.

1917 వ సంవత్సరమున పెకింగులోని జాతీయ విద్యాలయమునకు డాక్టర్ సైయువాయన్‌పిగారు అధ్యక్షుడుగ నియమింప బడిననాట

ఉండి, ఆ విశ్వవిద్యాలయం విద్యార్థి ఉద్యమమునకు బలమైన కేంద్ర మైనది. ఆ సంఘము వేయిమంది సభ్యులతో ప్రారంభమైనది. ఆయన విజ్ఞాన వ్యాప్తికిగాను చైనాభాషయొక్క సంస్కరణను ప్రారంభించారు. చైనాలో అంతవరకు గ్రంధరచనకు వాడబడుచుండెడు భాష విద్యావంతు లకు తప్ప సామాన్యజనులకు అర్థముకాక క్లిష్టముగా నుండేది. అది మిగుల ప్రాచీనమైనదని, పవిత్రమైనదని దానిని మార్చుటకు పండితులు యిష్టపడకుండిరి కాని వీరి నాయకత్వమున యువజనులు గ్రాంధిక భాషను విడనాడి అందరికీ అర్థమగు 'మాండరిన్' అను వాడుకభాషను పత్రికలలోను, గ్రంధములలోను వాడుట మొదలిడిరి. ఈ ప్రజాభాష త్వరలోనే దేశమందంతటను వ్యాపించినది. సన్‌యట్‌సేన్ కూడ యీ ప్రజాభాషను ప్రోత్సహించి స్వయముగా యీ భాషలో గ్రంధరచన చేసెను. ఈ భాషావిప్లవం విజయవంతమై అనతికాలంలోనే జాతీయ ప్రభుత్వ భాష యైనది.

1917 నవంబరులో రష్యాలో జరిగిన బోల్షివిక్ విప్లవం ప్రపంచ దేశాలన్నిటికి ఒక నవ్యసందేశాన్నిచ్చింది. ఆనాటివరకు నూతన విజ్ఞాన పతాకాన్ని యెగురవేయడమే బూర్జువా విప్లవవాదుల ఆశయంకాని. రష్యా కమ్యూనిస్టు విప్లవం బూర్జువా విప్లవభావాలకంటె అనేక అడు గులు ముందుకు వేసి, నూతన లక్ష్యాలను, ఆశయాలను, అభివృద్ధి కాముల ముందు ఉంచింది. బూర్జువా భావాలు పాతబడి బలహీనము లైన, విదేశసామ్రాజ్య వాదం జమీందారీ విధానం ప్రేరేపించే సనాతన భావాల మొదటి దాడికి విప్లవనిరోధకశక్తికే విలువలేక కూలిపోగానే, చెన్‌టూస్యూ, లీటాచావ్‌లు మార్క్సిస్టుభావాలను వెదజల్లుతో విద్యార్థి యువజన మహిళా ఉద్యమాలకు నూతన ఆశయాలను కల్పించారు. 1918 లో సంఘసేవ చేయుటకు 'తరుణ చైనాసంఘము', నవీన వాఙ్మయ వ్యాప్తికి 'మానసిక వికాససంఘము'లు పెకింగు నగరమున స్థాపింప బడినవి. ఆచార్య చెన్‌టూస్యూగారు వాటి లక్ష్యముల నీ విధంగా

నిర్వచించారు. "యూరప్‌ఖండ మెటుల ప్రపంచములో నగ్రస్థానమలంకరించింది? తక్కిన ఖండములకన్న వెనుకబడియున్న స్థితి నుండి ఏ విధంగా అన్ని ఖండాలను మించిన అభివృద్ధిపొందింది? యూరపుఖండ చరిత్రయనగ మతసాంఘిక రాజకీయ స్వతంత్రపోరాటముల చరిత్రగాక మరియేమి? దీనికి ఆర్థికవిప్లవము కూడ చేర్చవలెను. దానికి యూరపు ఖండములోని రష్యా ముఖ్యస్థానమైనది. యువజన విద్యార్థిసంఘముల పక్షమున మనము పూర్తిగ స్వాతంత్ర్య భావములను ప్రజాసామాన్యంలోను, దేశమంతటను వెదజల్లి వ్యాపింపచేయవలెను. మనము ప్రజలభాషలో వ్రాయవలెను. పండితులమని గర్వపడువారి గ్రాంధికభాషతో మనకు పనిలేదు. పై తరగతులవారి కవసరమగు వాఙ్మయముతో పనిలేదు. ప్రజల కుపయుక్తమగు వాఙ్మయమును సృష్టించవలెను. పై తరగతులవారి యాధిక్యతను నిలవబెట్టు వాఙ్మయమును పడగొట్టవలెను. జనులందరు సమానమని బోధించు గ్రంధములను వ్రాయవలెను. పుక్కిటి పురాణములను వదలవలెను. సత్యమైన ప్రకృతిశాస్త్రములను వ్రాయవలెను బహిఃప్రపంచముతో సంబంధములేని వాఙ్మయమునకు బదులు ఇతర జాతులతో సంబంధము కలిగి వారితో సమాన ప్రతిపత్తిని పొందు గ్రంధసముదాయమును సృష్టింపవలెను మన భాషను, మన వాఙ్మయమును సర్వవిధముల నవీనముగను. నవీనజాతుల భాషలకును వాఙ్మయములకును వెనుకబడకుండా చేయవలెను." అటులనే చైనాభాషలో ప్రకృతిశాస్త్రములు, పరిశ్రమలు, వ్యవసాయము, కళలు, రాజకీయ సాంఘిక ఆర్థిక తత్వశాస్త్రములు, దేశచరిత్రలు, దేశభక్తిని ప్రజలహక్కులను బోధించు కవిత్వము, నాటకములు, నవలలు, అనేక స్వతంత్రగ్రంధములు నవీన విదేశ వాఙ్మయమునుండి అనేక భాషాంతరీకరణములును చైనాభాషలో వ్రాయబడి వ్యాప్తిచెందెను.

# 1919 మే నాల్గు ఉద్యమం

ప్రథమ ప్రపంచయుద్ధము 1918 వ సంవత్సరములో మిత్రమండలివారి విజయముతో ముగిసింది. పశుబలం అంతమై స్వయంనిర్ణయ సూత్ర మన్నిజాతులకును వర్తింపచేయబడెడి నూతన శకము ప్రారంభమైనదని చైనీయులు కూడ ముందు నమ్మిరి. కాని యుద్ధకాలమున మిత్రమండలి రాజకీయవేత్తలు ఏకరువుపెట్టిన ధర్మపన్నాలనీ వట్టి బూటకములని పారిసుసంధి సమావేశమున జరిగిన విషయములను బట్టి అందరకూ వెల్లడిఅయింది కరడుగట్టిన సామ్రాజవాదులకు రాజ్యతృష్ణ తీరలేదు వెనుకబడిన దేశాలను అధీనరాజ్యాలుగాను, పలుకుబడి ప్రాంతాలుగాను పునర్విభజించుకుంటోన్న బ్రిటను, ఫ్రాంసు, జపాను ప్రభుత్వాల యత్నాలు పీడితదేశాల ప్రజలకు విస్మయక్రోధాలను కలిగించాయి. చైనారాష్ట్రమగు షాంటంగును స్వయంనిర్ణయ సూత్రప్రకారము చైనాకు తిరిగి యిచ్చివేయక మిత్రమండలివారు జపానుకిచ్చునటుల తీర్మానించినటుల మే నెల 2 వ తేదీరాత్రి తెలియగానే చైనా యువజనులలో తీవ్రమైన అసంతృప్తి, ఆగ్రహం కలిగాయి చైనాప్రజలకు ప్రాతినిధ్యం వహించని దేశద్రోహులు స్వార్ధపరత్వముతో, దేశగౌరవమును మంటగలిపి, దోపిడీగాండ్రైన సామ్రాజ్యవాదులకు లోబడుచుండగా వేయిమంది చైనావిద్యార్థులు మే నెల 3 వ తేదీ మధ్యాహ్నం ఒంటిగంటకు బహిరంగసభలో సమావేశమైరి. చైనాప్రభుత్వము లంచగొండితనము చేతను, దౌర్బల్యము చేతను జపాను పక్షపాతులగు మిత్రమండలికి లొంగిపోవుచున్నదని తీవ్రముగా ఖండించిరి చైనా ప్రభుత్వముతోను, మిత్రమండలితోను, నాలుగు పద్ధతులలో పోరాడుటకు విద్యార్థివీరులు నిర్ణయించారు. (1) దేశప్రజలలో తీవ్రమైన ప్రచారంచేసి, వారిని పోరాటంలో జేర్చుకొనుట (2) పారిసునందున్న చైనాదేశపు ప్రతినిధులకు సంధిపత్రము మీద సంతకములు చేయవలదని తంతిని పంపుట.

(3) మే 7 వ తేదీని అన్ని రాష్ట్రములలోను 'జాతీయావమాన దినము'గ నలుపుట. (4) మే నాలుగవ తేది ఆదివారంనాడు పెకింగు నగరమున నున్న విద్యార్థులందరు జేరి గొప్ప అసమ్మతి ప్రదర్శనము కావించుట.

మే నెల 4 వ తేదీనాడు ఉదయము పది గంటలకు పెకింగులోని అన్ని విద్యాలయములలో చదువుచున్న పదివేలమంది విద్యార్థులు న్యాయ శాస్త్ర కళాశాల యావరణములో సమావేశమైరి. 'స్వయంనిర్ణయము' 'అన్ని జాతులకు న్యాయము' 'జపానుయొక్క ఇరువదియొక్క షరతులను రద్దుపర్చుడు' 'మా షాంటంగు రాష్ట్రమును మాకివ్వండి' 'దేశద్రోహులను కూలద్రోయుడు' అని నినాదములు వ్రాసిన కాగితపు పతాకములను వారు ధరించిరి. ఆ సమావేశములో చైనా ప్రభుత్వోద్యోగుల అవినీతిపై దండెత్తవలయునని తీర్మానించబడెను. ఈ లోగా ఒక విద్యాశాఖాధికారి వచ్చి సభను చాలించవలసినదని యుత్తరు విచ్చినను లెక్కించక పదివేలమంది విద్యార్థులు పెకింగు పురవీధులలో చిరస్మరణీయమైన అసమ్మతి ప్రదర్శనం జరిపిరి. విదేశ రాయబారులున్న ప్రాంతము లోనికి పోలీసులు వారిని రానివ్వలేదు. వారు సౌజులిన్ అను మంత్రిని ఆయన యింటివద్ద చూచుటకు ప్రయత్నించగా, కాపలాయున్న పోలీసులు నిరోధించిరి. విద్యార్థులలో కొందరు 'దేశద్రోహులు నశించాలి' అని నినాదములు చేయుచు వెనుకకు తిరిగి వెళ్లుచుండగా, సైనికులు విద్యార్థులమీద తుపాకులను కాల్చిరి. ముప్పదియిద్దరు విద్యార్థులను అరెస్టుచేసి తుపాకి మడమలతో పొడిచి, సంకెళ్లువేసి చెరసాలకు తీసికొనిపోయిరి. విద్యార్థులయెడ సానుభూతితో నున్నాడను సందేహంతో విద్యాశాఖమంత్రిచే రాజీనామా యిప్పించారు. మరునాడు విద్యార్థులందరూ సమావేశమై, ఖైదుచేయబడిన విద్యార్థులను ప్రభుత్వం వదలువరకు ఎవ్వరూ విద్యాలయములకు పోగూడదని తీర్మానించిరి. పత్రికాధిపతులును, వర్తకులును విద్యార్థుల కోరికలతో సానుభూతిని చూపుచు

ప్రభుత్వమునకు తంతులను పంపారు ప్రజలకోపాగ్నికి భయపడి ప్రభుత్వము 7 వ తేదీని విద్యార్థులను వదిలివేసిరి కాని పెకింగు విశ్వవిద్యాలయమును మూసివేయ నిశ్చయించిరి తోడనే పెకింగులోని ఉపాధ్యాయులలో చాలమంది రాజానామాల నిచ్చిరి. దీనితో దేశములో గొప్ప సంచలనము కలిగి ప్రభుత్వముపై ఒత్తిడి హెచ్చింది. ఐనను ఆందోళనకారులను నెపంమీద అనేకమంది విద్యార్థులను జైలులో పెట్టి విద్యార్థి యుద్యమము నణచుటకు ప్రభుత్వం పూనుకుంది. ఈ నిర్బంధవిధానానికి బదులుగా విద్యార్థులు మే నెలాఖరు వరకు పాఠశాలలను బహిష్కరించారు విద్యార్థినులు కూడ సమ్మెలో చేరారు. విద్యార్థులు సభలు, ప్రదర్శనములు చేయుచు నిరంతరాందోళన చేయుచుండిరి ప్రజలందరూ విద్యార్థులతో జేరి ప్రజాస్వామ్యము వర్ధిల్లుగాక! విద్యార్థులకు విజయమగుగాక! అని కేకలువేయజొచ్చిరి ఈ ప్రజోద్యమము నణచుటకు వందలాదిగా విద్యార్థుల నరెస్టువేసి జైళ్లను నింపుచుండిరి.

పెకింగులోని వర్తకులు విద్యార్థులను వదలునంతవరకూ సమ్మెలు చేయుటకు తీర్మానించి అంగళ్ళను మూసిరి. షాంఘేలోకూడ హర్తాళము జరుపబడెను. ఈ ప్రజాప్రతిఘటనకు జంకి ప్రభుత్వము జూన్ 6 వ తేదీన విద్యార్థులను వదలివేసిరి కాని దేశద్రోహం చేస్తోన్న ముగ్గురు మంత్రులు రాజీనామా చెయ్యాలనీ, విద్యార్థులకు వాక్సభాపత్రికా స్వాతంత్ర్య మీయాలనీ, వారిపై జరిపిన దుండగములకు ప్రభుత్వం క్షమాపణ నీయాలనీ కోరుతూ, అట్లు చేయనిచో తాము జైళ్ళనుండి బయటకు పోవుటకు నిరాకరించిరి. ప్రభుత్వం లొంగి పోలీసుఉద్యోగులచే క్షమాపణ నిప్పించి విద్యార్థులను సగౌరవంగా వదలివేసిరి.

ఆ దినమున విద్యార్థులకు ప్రజలు అఖండస్వాగతమిచ్చి బ్రహ్మాండమైన ఊరేగింపు చేశారు. దేశద్రోహులగు ముగ్గురు మంత్రులు రాజీనామా నిచ్చారు. మొత్తం మంత్రివర్గమంతా మారింది. పారిసులోనున్న

చైనాప్రతినిధులు సంధిపత్రంమీద సంతకాలుచేయ నిరాకరించారు. చైనా అధ్యక్షుడు ప్రజాభిప్రాయమునకు తలవొగ్గి సంతకములు చేయవద్దని పారిసులోనున్న తమ ప్రతినిధులకు తంతులను పంపాడు. ఈ విధముగా విద్యార్థులు, విద్యార్థినులు చేసిన నిరుపమానమైన త్యాగ ఫలితముగా అంతర్జాతీయ వ్యవహారములలో చైనాకు అఖండమైన జయము లభించింది. యువజనోద్యమ మందు ప్రజలకు అకుంఠిత విశ్వాసం కలిగింది. నాటినుండి చైనా విద్యార్థులు జపానుసరకుల బహిష్కరణను, సామ్రాజ్య వ్యతిరేకోద్యమమును, ప్రయోజన విద్యా వ్యాప్తియును, సంస్కృతీ విప్లవమును కొనసాగించు చుండిరి.

"మే నాల్గు ఉద్యమానికి పూర్వం చైనా సంస్కృతి, ప్రజోద్యమాలు పాతరకపు ప్రజాస్వామికానికి సంబంధించి ఉండేవి కాని మే 4 తర్వాత పూర్తిగా ఒక క్రొత్త సంస్కృతి వికసించింది. అది కమ్యూనిస్టు భావసంజనితమైన సంస్కృతి కమ్యూనిస్టు ప్రపంచ దృక్పథం, వారి సామాజిక సిద్ధాంతమూ వీటికి పునాది. ఈ ఉద్యమంతో రాజకీయ రంగంలో విద్యార్థులూ, యువకులూ, ప్రజాసామాన్యమూ ప్రముఖపాత్ర వహింప నారంభించారు. ఈ ఉద్యమాలు మహత్వ పూర్ణమై చైనా రాజకీయరంగంలో నూతన విప్లవశక్తులను, విప్లవకార్యాచరణ పద్ధతులనూ ప్రవేశపెట్టాయి.

## సన్‌యట్ సేన్ ప్రాబల్యం.

ఉత్తరాన ఫెంగుక్వోచాంగ్, ట్వాన్‌చీజూయిలు అధికారం కొరకు పోరాడుతో, తుదకు యువాన్‌షీకే క్రింద ప్రభుత్వ కార్యదర్శిగా వున్న సుషీచాంగ్‌ను అధ్యక్షుడుగా అక్టోబరులో యెన్నుకున్నారు. సుషీ దక్షిణ ఉత్తర చైనాలను ఐక్యపరచడం తన ఉద్దేశమని ప్రకటించాడు. కాని సంధి ప్రయత్నాలు విఫలమయ్యాయి. యువాన్‌షీకే పరిపాలన కాలంలో రాష్ట్రగవర్నరులు (టుచూన్లు) గా వున్న వారందరూ తాము సామంత

ప్రభువులుగా యెంచి వారిలో వారు కలహించసాగారు. ఈ లోగా 1920 జూలై లో ట్వాన్. అతని అన్ఫూ ముఠాయు. ఓడిపోయాడు ట్వాన్ తన పాత పొరపాట్ల నన్నిటినీ అంగీకరిస్తూ సన్‌యట్‌సేన్‌ను సహాయం చేయమని కోరాడు.

కాంటన్ ప్రభుత్వాన్ని లూయంగుటింగు తన అధికారంలో ఉంచాలని చూస్తోన్న సమయంలో క్వాంగుటంగు సైన్యాన్ని తన అను చరుల సహాయంతో నడిపి, డాక్టర్‌సన్ కాంటన్‌ను పట్టుకొని, క్వాంగు టంగులోవున్న లూయొక్క క్వాంగ్సీ సైన్యాల నోడించి, క్వాంగుటంగు రాష్ట్రాన్ని తన అధికారం క్రిందకు తెచ్చాడు. చెన్‌చియంగుమింగును క్వాంగుటంగు రాష్ట్ర గవర్నరుగా నియమించాడు. 1921 ఎప్రిల్ 6 వ తేదీనాడు కూడిన ప్రత్యేక పార్లమెంటు సభాను అధ్యక్షునిగా యెన్ను కుంది. క్వాంగ్సీ, యువాన్, క్వీచౌ, జెక్‌వాన్‌రాష్ట్రాలున్ను, హూనాన్‌లో కొంత భాగమును, ఆయన అధికారంలో వున్నాయి.

## సన్‌యట్‌సేన్‌పై చెన్ తిరుగుబాటు.

1922 ఆగస్టు 22 నాడు లూయంగుటింగు సంపూర్ణంగా ఓడింప బడి, సన్ అధికారంలోకి వచ్చునప్పటికి, క్వాంగుటంగు రాష్ట్రం చాల అల్లకల్లోల పరిస్థితుల్లో వుంది. లూకాలంలో జూదపాట, నల్లమందుల వలనను, ప్రజలనుండి బలవంతంగా లాగుకోవడం మూలాన మాత్రమే రాష్ట్రాదాయం వచ్చేది. సన్‌యట్‌సేన్ జూదపాటను, నల్లమందు వ్యాపా రాన్ని నిషేధించాడు. కాంటన్‌ను ఆధునిక పద్ధతులపై నిర్మింప బూను కున్నాడు. కాంటన్ పట్టణంలో ఒక పురపాలక సంఘ మేర్పరచబడి సన్ కుమారుడైన సన్‌ఫో మొదటి పురపాలకాధ్యక్షుడుగా యెన్నుకో బడ్డాడు. వాణిజ్యము, పరిశ్రమలు వృద్ధిపొందాయి. 1920 లో వున్న 180 లక్షల డాలర్లనుండి 1921 లో 318 లక్షలవరకూ రాష్ట్రాదాయం పెరిగింది.

హూహాన్‌మిన్, వాంగ్‌చింగ్‌వీలచే తయారు చేయబడిన సైన్యానికి చెన్‌చియింగుమింగు సేనాధిపతిగా వున్నాడు. రెండవ సైన్యమును సూచింగ్‌చీ తయారుచేసి సేనాధిపతి అయ్యాడు. సన్‌యట్‌సేనాయందు సూచింగుకు అపరిమిత భక్తిగౌరవాలు కలవు. కాని చెన్‌చియంగుమింగ్ దురాశ కలవాడు. సర్వాధికారి కావలయుననే దురుద్దేశంతో యూనాన్, క్వీచౌ, జెక్‌వాన్, హూనాన్‌లలో వుండే సైనిక ప్రభువులు కోరుతోన్న స్వతంత్ర రాష్ట్రాలతో కూడిన సంయుక్త ప్రభుత్వాన్ని యేర్పరచాలని ఆందోళన చేయసాగాడు. వీరు డాక్టర్ సన్ చెప్పే కేంద్ర ప్రభుత్వాన్ని యెదుర్కొన్నారు. కేంద్రప్రభుత్వ మేర్పడితే, తమకు స్వేచ్ఛ వుండదనీ కాంటన్ ప్రభుత్వంలో సన్ అధికారానికి లోబడాలనీ వీరు తీవ్రంగా రహస్య ప్రతిఘటన సాగించారు.

అధ్యక్షుడైన సన్‌నుకూడ ధిక్కరించి సివిలు, మిలిటరీ అధికారాలన్నీ చేతుల్లో వుంచుకున్న చెన్ స్వతంత్రంగా యిష్టంవచ్చినట్లు ప్రవర్తించసాగాడు.

ఈ లోపుగా పెకింగు ప్రభుత్వాధికారులైన వూపీపూ, సోకణాలకును, చాంగ్‌సోలిన్, ట్వాన్‌చీజూయిలకును వైరం హెచ్చగగా, సన్‌యట్‌సేన్ ఊపీపూని ట్వాన్ సహాయంతో తరిమివేసి, చైనావంతనూ ఐక్యం చేయాలనే ఉద్దేశంతో రెండవ క్వాంగ్‌టంగు సైన్యంతో క్వాంగ్సీ ముఖ్య పట్టణమైన క్వీలిన్‌కు వెళ్ళాడు. కాంటన్‌లోనే వున్న చెన్ తన అధికారాన్ని బలపరచుకొని, సన్‌కు ధనంగాని, ఆహార పదార్థాలనుగాని పంపలేదు. అందువలన ఏప్రిల్ నెలలో తిరిగివచ్చి, చెన్‌ను సేనానాయకత్వంనుండి తొలగించాడు.

ఊపీపూ చాంగ్‌సోలిన్‌ను ఓడించి ఒక రాజధానిగాని, అధ్యక్షుడుగాని లేకుండానే దేశాన్ని జూన్ 4 నుండి పాలించసాగాడు. కాని విదేశస్థులు తన ప్రభుత్వాన్ని గుర్తించరనే భయంతో లీయాంగ్‌హంగ్‌ను అధ్యక్షునిగా యేర్పాటుచేసి, 1913 లోని పార్లమెంటును పునరుద్ధరించి,

పార్లమెంటు యేర్పడింది కనుక దక్షిణచైనా ప్రజాస్వామికాన్ని రద్దు చేయవలసిందిగా సన్‌యట్‌సేన్‌కు ఒక తంతి పంపాడు.

ఈ తంతివార్త విని చెన్‌చియంగ్‌మింగ్ తన సైనికులతో అకస్మాత్తుగా సన్ యింటిని చుట్టుముట్టాడు. ఈ విద్రోహచర్య జరిగేందుకు ఒక గంట ముందు యీ కుట్రవిషయమై యిద్దరు కాప్రేడ్సు తెలియ చేయగా సన వారితో కలసి. యంగ్‌ఫెంగ్ అనే చిన్న యుద్ధనౌకలోకి వెళ్లిపోయాడు. సన్‌యట్‌సేన్ సతి కొంతమంది అనుచరులతో ముట్టడి వేసిన సైనికులమీద అకస్మాత్తుగా తుపాకులు పేలుస్తో గుండ్లు మధ్య మంచి తప్పించుకొని వెళ్లిపోయింది. సన్ భవనం ధ్వంసమైపోయింది. అందులోవున్న "ప్రజాతంత్ర సిద్ధాంతం", "ప్రజాజీవనోపాధి సూత్రం" అనే వ్రాతప్రతులు దగ్ధమై. తీరని అపకారం జరిగింది. "ప్రజా జీవనోపాధి సూత్రా"న్ని గూర్చి నేటికి కూడా సన్‌యట్‌సేన్ అనుచరులు సరియైన భావాలులేక, తగవులాడుకుంటున్నారు.

16 జూన్ నుండి ఆగష్టు 10 వరకూ యంగ్‌ఫెంగ నౌకలోనే సన్‌వుండి, తన రెండవ క్వాంగ్‌టంగ్ సైన్యాన్ని కూడా చెన్ ఓడించుట వలన వాంగ్‌చింగ్‌వీ. జంగ్‌కైషేక్ లతో కలసి ఆగష్టు 15 కు షాంఘై జేరుకుని, చెన్ వలన ఓడిపోవుటకు కారణాల నుదహరిస్తో ఒక నివేదిక ప్రకటించాడు. పెకింగు ప్రభుత్వం ఊపీపూ చేతులలోనికి వచ్చినప్పుడు కూడా ఊ, యువాన్‌ను అనుకరించ బోతున్నాడనీ, విప్లవ విద్రోహి ఔతాడనీ, సన్ చేసిన ప్రకటన యదార్థంగా జరుగుట చూచిన ప్రజలలో సన్‌యట్‌సేన్‌కు ప్రతిష్ఠ హెచ్చింది.

1922 అక్టోబరు 2 వ తేదీనాడు సూచంగచీ ఫూచౌను పట్టుకున్నాడు. వెంటనే సన్ జంగ్‌కైషేక్‌ను తన ప్రతినిధిగా పంపి క్వాంగ్‌టంగును కూడా జయించవలసిందిగా ఆజ్ఞయిచ్చాడు. యాంగ్‌పీమిన్ అధికారంలో వున్న యూవాన్‌సైన్యం. లియుచెన్‌హ్వాన్ యొక్క క్వాంగ్సీ సైన్యాలు రహస్యంగా చెన్‌సైన్యాలను చుట్టుముట్టగా చెన్

కాంటన్‌ను వదలి తూర్పునది యొడ్డుననున్న సైన్యాలవద్దకు వెళ్లాడు. ఈ విధంగా క్వాంగ్‌టంగు రాష్ట్రం సణాకు లోబడింది. కాని షెన్‌హంగ్ యింగు ఊపీఫూతో రహస్యంగా కుట్రలు పన్నుతోండగా అతనిని యాంగ్, లియూలు ఓడించివేశారు. కాని వీరిద్దరూ కూడా కొమింటాంగు సభ్యులుకారు. సన్‌యట్‌సేన్ ప్రతిష్ఠ నాధారంగా చేసికొని వీరిద్దరూ అనేక దారుణకృత్యాలు సేయ నారంభించారు.

చెన్ సైన్యాలను పూర్తిగా ఓడించవలసిందిగా వీరిద్దరుకు ఆజ్ఞాపించినప్పుడల్లా, కొంతడబ్బు కావాలని తీసికొనిపోవడం, మరల ఉత్తచేతుల్తో రావడం, డబ్బుకావాలని వేధించడం సాగించగా సన్ విసిగిపోయి కొమింటాంగును పునర్నిర్మించ ప్రయత్నించాడు.

విప్లవ విజయానంతరం చైనా శాంతి, అభివృద్ధులతో విరాజిల్లుతో, సిరి, సంపదలతో తులతూగుతుందని అందరూ భావించారు. కాని, పండ్రెండు సంవత్సరాల తర్వాత కూడా సైనిక ప్రభువులు, కలహకారులు చైనాలో ప్రజాస్వామిక ప్రభుత్వం స్థిరపడకుండాచేసి, చైనాను అల్లకల్లోలం జేసివేస్తున్నారు. విప్లవవాదులు బలపడడం యిచ్చగించని ,విదేశప్రభుత్వాలు కూడా యీ అంతర్యుద్ధాలను రేపి. ప్రజల యిక్కట్టుల వినుమడింపజేశారు.

ఉత్తరచైనాలో పెకింగు ప్రభుత్వాన్ని ఊపీఫూ వశపరచుకొని పార్లమెంటును కీలుబొమ్మలాగు ఆడించసాగేడు. మంచూరియా షోలిణా, చెచియాంగ్ లూయంగ్‌సియాంగ్ మున్నగు సైనిక ప్రభువుల చేతులలో వుంది. పైకి విప్లవరాష్ట్రాలని చెప్పుకుంటూన్నా జెక్‌వాన్, హూనాన్, యూనాణా, క్వీచౌ రాష్ట్రాలుకూడా సైనికప్రభువుల చేతులలోనే వున్నాయి. వీరు తరచుగా తమలో తాము కలహించడం, తమ యేలుబడిలోవున్న ప్రదేశాల్లోని ప్రజలను పీడించడం మూలాన్ని చైనా కేంద్ర ప్రభుత్వం లేక చాలా దుర్బలమైంది.

# 7 వ అధ్యాయం.

## బోల్షివిక్ రష్యా, విప్లవచైనాల సఖ్యత.



చైనా విప్లవ సంఘాలవలెనే పోరుగునవున్న రష్యాలోకూడా బోల్షివిక్కులు రష్యా నిరంకుశ ప్రభువైన జారు పరిపాలనను అంత మొందించేందుకు 19 వ శతాబ్దాంతిమభాగంనుండి, 20 వ శతాబ్దాంతంలో 1917 సం॥రం వరకును యెడతెరపి లేని విప్లవ పోరాటాలను సాగించారు. చైనాలోని విప్లవవాదుల వలె గాక, రష్యను బోల్షివిక్కులకు నిర్దిష్టమైన విప్లవ ప్రయోజనాలును, సుశిక్షితమైన పార్టీయున్ను కలవు. 1911 లోనే విప్లవవిజయం పొందిన చైనా 1924 నాటికికూడా అంతః కలహాలతో, సైనికప్రభువుల నిరంతర సంఘర్షణలతో అశాంతికి గురి అయింది. 1917 నవంబరు విప్లవంతో రాజ్యాధికారం హస్తగతం చేసుకున్న రష్యను బోల్షివిక్కులు, ప్రపంచ సామ్రాజ్యవాదుల ప్రోద్బలంతో బయల్దేరతీయబడిన అంతర్యుద్ధంలో విజయులై అపూర్వమైన నూతన సాంఘిక, ఆర్థిక విధాన నిర్మాణానికి పునాదులు వేసి, ఒక విజయం తర్వాత మరొక విజయం పొందగలగడానికి వారికిగల సుస్పష్టమైన కమ్యూనిస్టుభావాలే కారణం.

రష్యాలో సోవియట్ విప్లవం జరిగిననాటినుండీ, సన్ యట్ సేన్ రష్యాయందెక్కువ శ్రద్ధవహింప నారంభించాడు. రష్యను పీడిత ప్రజానీకపు విప్లవ పోరాటం విజయం పొందినందుకు లెనినుకు సన్ తన సంతోషాన్ని వెలిబుచ్చుతూ సందేశాన్ని పంపాడు. ప్రపంచ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా తృతీయ అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థను లెనిన్ మహాశయుడు నెలకొల్పినట్లు విని చాల సంతసించాడు. 1920 సెప్టెంబరు 27 నాడు సోవియట్ ప్రభుత్వం తరపున కరహాను జారిస్టు రష్యా చైనానుండి పొందిన అక్రమపు లాభాలతో కూడిన ఒడంబడికలు

రద్దు చేసుకున్నామని, చైనాదేశ భాగాలను వదలుకున్నామనీ, అందు కొరకు పరిహారం కోరమనీ ప్రకటించాడు. ఈ ప్రకటన చైనా యువకుల్లో సోవియట్ ప్రభుత్వం యెడల గొప్ప అభిమానాన్ని కలిగించింది. 1921 లో లెనిన్ మాలిన్ అనే తన కార్యదర్శిని చైనాకు పంపాడు. ఉత్తర చైనాలోవున్న ఊపీఫూను, దక్షిణ చైనా నాయకుడైన సన్‌యట్ సేన్‌ను మాలిన్ కలుసుకొన్నాడు సన్ గొప్ప ఉత్సాహంతో రష్యా విప్లవాన్నిగూర్చి, నూతన ఆర్థిక విధానం గూర్చి, జాతీయ, సాంఘిక, ప్రభుత్వ పునర్నిర్మాణాన్ని గూర్చి మాలిన్‌ను అనేక ప్రశ్నలడిగాడు.

చైనాలో పర్యటన చేసేకాలంలో మాలిన్ చైనాలో కమ్యూనిష్టు పార్టీ నిర్మాణానికి తోడ్పడ్డాడు. కొన్ని ఆదర్శాలును, కార్యక్రమమును కలిగివున్న వ్యక్తి చైనాలో ఒక్క సన్‌యట్ సేన్ అనీ, లెక్కించవదగిన పార్టీ ఒక్క కొమింటాంగేననీ, బలమైన సైన్యాలు కలవాడు ఊపీఫూయే అనీ మాలిన్, లెనిన్‌తో చెప్పాడు. 1923 ఫిబ్రవరి 7 వ తేదీన పెకింగు-హాంకో రైలుపనివారు సమ్మెచేయగా, వారిని ఊ మరఫిరంగులతో కాల్పించాడు. ఆనాటినుండి ఊతో సంబంధం వదలుకొని, సన్‌తో మాత్రమే స్నేహంతో మెలగవలయునని చైనా కమ్యూనిష్టులకు కోమింటర్ను సలహాయిచ్చింది.

## చైనాకమ్యూనిష్టుపార్టీ జననం.

యువాన్‌షికే విద్రోహం, సైనికనాయకుల స్వైరవిహారం, జమీందార్ల దోపిడీ, భూమిశిస్తు విధానం, దుర్బలప్రభుత్వం, బందిపోటు దోపిళ్లు, విదేశపరిశ్రమదార్ల పోటీ, వృత్తుల నాశనం, జమీందారీ ఆర్థిక విధాన విచ్ఛేదం, పెట్టుబడిదారీవిధానపు చెడుగుల తీవ్రత, కాంటన్ విప్లవ ప్రభుత్వపు అశక్తతలు చైనాదేశంలో సంక్షోభ దుమారాన్ని లేపాయి. రైతులు నిరంతర క్షామపీడితులయ్యారు. దుర్భర దారిద్ర్యభారంతో అల

మటించాడు. జాతీయ విప్లవ విజయభానుడు, దారిద్ర్యగాంధాంధకార విచ్ఛేదంచేసి, సుఖజీవితం కలిగిస్తాడని ఆశించిన దౌర్భాగ్య రైతు కూలీలు కొమింటాంగు విప్లవపక్ష అశక్తతను చూచి, నేలకంటిపోయే శోచనీయ పరిస్థితుల్లో కమ్యూనిష్టు ధ్రువతార చైనాలో ఉదయించి కార్మిక, కర్షకులకొక నవ్యసందేశాన్నిచ్చింది; నూతన కార్యాచరణకు పురికొల్పింది. మానవులలో లెక్కకు రాని పేదరైతు, కమ్యూనిష్టు శంఖారావం ఆలకించి, నూతనసమాజ స్థాపనకు అసువుల నర్పించేందుకు సంసిద్ధుడయ్యాడు. చైనా కమ్యూనిష్టుపార్టీ జననంతో, చైనా విప్లవ చరిత్రలో నూతన శకారంభ మయింది.

నేటికి వేయి సంవత్సరాల క్రిందటనే ఒక సామాజికార్థిక సిద్ధాంతంవలె కమ్యూనిజాన్ని దాని పురాణరూపంలో చైనాలో ఆచరణలో పెట్టుటకు ప్రయత్నాలు చేయబడ్డాయి. సంగు రాజవంశజుడైన 'షెన్ సంగు' పరిపాలనలో రాజకీయ చట్ట సంస్కరణలను ప్రవేశపెట్టుటకు వాంగ్‌యాన్‌షీ ప్రధానికి అనుజ్ఞ యీయబడింది. చక్రవర్తి కొలువులోని సనాతనులకు, సంస్కరణవాదులకు కలతలు వచ్చాయి. వాంగ్‌ప్రధాని తన అనుచరులతో యీ క్రింది సంస్కరణలను సూచించి అందులో కొన్నింటిని అమలు జరిపాడు.

1. ప్రభుత్వ ఆదాయ వ్యయములు.

(క) ప్రభుత్వ ఆదాయ వ్యయముల బడ్జెటును తయారుచేయుట కొక ఉద్యోగవర్గ నియామకము.

(ఖ) సామర్థ్యంతో వ్యవసాయాన్నికొనసాగించేందుకు, ఊడ్పుల కాలంలో వడ్డీలేకుండా దీర్ఘవాయిదాలమీద తీర్చుకునేందుకు వ్యవసాయదారులకు ఋణాలనిచ్చుట.

(గ) వెట్టిచాకిరి, నిర్బంధపు పనులను మాన్పి కూలి వేతనముల మీదనే పనిచేయించుట.

(ఘ) సరియైన భూమి కొలతవిధానము నమలుపరచుట.

(జ) వాణిజ్యము జాతీయము చేయుట.

(చ) అదనపు సరుకుల రవానా సమానంగా విభజించుట.

(ఛ) ఒకే జిల్లాలో నివసించే కుటుంబాల బాధ్యతను ఆ జిల్లాలోని అందరూ ఉమ్మడిగా వహించుట.

2. సైనిక రాజకీయ వ్యవహారములు.

(క) సైన్యమును చాలవరకు తగ్గించి ప్రభుత్వ వ్యయమును తగ్గించుట.

(ఖ) సైనిక విధానమును అమలు పరచుట.

3. విద్య.

(క) పౌర వుద్యోగ పరీక్షా విధానమును పునర్నిర్మించుట.

(ఖ) సైనిక, వైద్య, న్యాయశాస్త్రముల ప్రోత్సహించుట.

షెకాసంగు చక్రవర్తి మరణంతో యీ సంస్కరణలన్నీ తుడిచి వేయబడ్డాయి. ఈ విధానాన్ని కమ్యూనిజం అనజాలం కాని కొంతవరకు అవి అభివృద్ధికరంగానే వున్నాయని చెప్పక తప్పదు.

రష్యన్ నవంబరు బోల్షివిక్ విప్లవం చైనాయువకుల దృష్టిని ప్రప్రధమంగా కమ్యూనిజంపై పు మరల్చింది. వర్సైలీస్ శాంతిసమావేశం చైనా హక్కులను తృణీకరించుటవలన యువకులందరూ కోపోద్రిక్తులై పాశ్చాత్య నాగరికతయందు నమ్మకాన్ని కోల్పోయారు. ప్రాచీన సాంప్రదాయాలే చైనావిస్సహాయతకు, అధఃపతనానికీ కారణమని యెంచి, చైనాజాతిని పునరుజ్జీవింపచేసేందుకు "ప్రజలు", "మార్గదర్శి", "అగ్రగామి" అను పత్రికలున్నూ 1916 లో చెన్‌టూస్యూచే స్థాపింపబడిన పత్రికయున్నూ అపారమైన సేవ చేశాయి. వర్సైలీస్ సమావేశం జరిగిన మరుసటి సంవత్సరం పెకింగు విశ్వవిద్యాలయంలో అధ్యాపకులుగానున్న లీటాచో, చెన్‌టూస్యూలు మార్క్సు సిద్ధాంతాలచే ఆకర్షింపబడి

"మార్క్సిస్టు పరన సంఘము"ను పెకింగులోను, "కమ్యూనిస్టు యువ జన సమితి"ని షాంఘేలోను స్థాపించారు. ఈ రెండు సంఘాలు అనేక వందలమంది యువకులను, మేదావులను ఆకర్షించాయి. ముందు అరాజక వాదులు చేరారు. కాని క్రమేణా యీ సంఘాలు కమ్యూనిస్టుపార్టీగా ఘనీభవించాయి. సోవియట్ రష్యా విదేశ వ్యవహార ఉపకమిస్సారైన కరహాన్, చైనాలో జారిస్టు రష్యాకుండే సర్వాధికారాలను, ప్రత్యేక హక్కులను, సౌకర్యాలను వదలివేసుకున్నట్లుగా 1919 లో చేసిన ప్రకటన చైనాప్రజలకు సోవియట్ రష్యాయందు అపారమైన అభిమానాన్ని కల్గించి, కమ్యూనిజంవైపు మార్గాన్ని సుగమం చేశాయి.

చైనాలో మొదటి కమ్యూనిస్టు ముఠా షాంఘేలో 1920 లో యేర్పడినట్లుగా కనపడుతుంది, తరువాతసంవత్సరం మే నెలలో డాక్టర్ సన్‌యట్‌సేణ్ పెకింగు ప్రభుత్వానికి ప్రతికక్షిగా అధికారం చలాయిస్తోన్న కాంటన్ ప్రభుత్వానికి అధ్యక్షుడుగా యెన్నుకొనబడినప్పుడు చెన్‌టుస్యూ షాంఘేలో కమ్యూనిస్టులను సమావేశపరిచాడు. ఈ సమావేశంలో చైనాకమ్యూనిస్టు పార్టీ అధికారరీత్యా నిర్మింపబడింది. "సిన్‌మిన్‌స్యూహ్వీ" అను హూనాన్‌రాష్ట్ర విప్లవసంఘ నాయకుడైన మోసీడంగు, వాంగ్‌క్వోటో, బోహీ్వషెంగు, మున్నగు 12 గురు ప్రతినిధులు పాల్గొన్నారు. కేంద్రపార్టీ కమిటీలో చెన్‌టుస్యూ (1933 నుండి నాన్కింగు ప్రభుత్వ ఖైదీ) చాంగ్‌క్వోటో (ఇప్పుడు ఎర్రసైనిక నాయకుడు), చెన్‌కంగుపో (యిప్పుడొక కొమింటాంగు ఉద్యోగి), షేసంగ్ దంగ్ (ప్రస్తుతం నాన్కింగు ఉద్యోగి) సన్‌యువాన్, లూలీహాన్‌సేన్ (1927 లో వుహాన్‌లో చంపివేయబడ్డాడు), లీటా (తర్వాత ఉరితీయబడ్డాడు), లీసూణాలు సభ్యులుగా యెన్నుకోబడ్డారు. త్వరలోనే యీ వుద్యమం అన్ని రాష్ట్రాలలోనికి ప్రాకింది.

చైనాలో కమ్యూనిస్టుపార్టీ జన్మించినపుడే, ఫ్రాన్సులో కూడా అచ్చట చదివే చైనా విద్యార్థికార్మేడ్సు ఒక చైనా కమ్యూనిస్టుపార్టీని

నిర్మించారు. చౌఎన్‌లై, లీలీశాన్, నేహూపెంగు భార్యయైన షాంగు చెన్‌యూలు యీ ఫ్రెంచిపార్టీ నిర్మాణకర్తలు. కొద్దికాలం తర్వాత చూటే, క్వోయూహాన్ మున్నగువారు జర్మనీలోను, చూచాయూపే మున్నగువారిచే మాస్కోలోను, చౌఫూహేచే జపానులోను చైనా కమ్యూనిస్టుపార్టీలు స్థాపింపబడ్డాయి.

1922 మేలో మోసీడంగ్ నాయకత్వాన హూనాన్ రాష్ట్రంలో గనికూలీ, రైల్వే, మునిసిపల్, అచ్చుపనివారల సంఘాలు మొత్తము 20 నిర్మింపబడి తీవ్రమైన కార్మికోద్యమం నడుపబడింది. కార్మికుల లోను, విద్యార్థులలోను మాత్రమే కమ్యూనిస్టుపార్టీవారు పనిచేసేవారు. రైతులలో యింకనూ ఆరంభబడలేదు. 1922 శీతాకాలంలో హూనాన్ రాష్ట్రగవర్నరు చో, హేంగ్‌టీ అను యిద్దరు కార్మిక సేవకుల నురి తీయించినందుకుగాను బ్రహ్మాండమైన ఆందోళన చేయబడింది. రాష్ట్ర మంతటా గొప్ప కార్మికసమ్మెలు, ప్రదర్శనాలు జరిగాయి ఈ శీతాకాలం లోనే అఖిలచైనా కమ్యూనిష్టుపార్టీ ద్వితీయ సమావేశం రహస్యంగా షాంఘైలో జరుపబడింది

చైనాకమ్యూనిష్టుపార్టీ నిర్మాణకర్తయైన చెన్‌టుస్యూ 1920 లోనే తృతీయకమ్యూనిస్టు అంతర్జాతీయ సంస్థయైన కోమింటరన్‌తో సంబంధ మేర్పరచుకున్నాడు. ఆ వెంటనే చైనా కమ్యూనిస్టుపార్టీ సంఖ్యలో చిన్నదైనప్పటికీ గొప్పమేధావులను, విప్లవవాదులను కలిగియుండుటచే మంచిపలుకుబడి సంపాదించి వృద్ధిపొందింది.

చైనాకమ్యూనిస్టుపార్టీ మూడవ వార్షిక సమావేశం కాంటన్‌లో 1923 లో జరిగింది. ఈ సమావేశంలోనే కౌమింటాంగులో జేరి పని చేయాలనే చరిత్రాత్మకమయిన నిర్ణయం చేయబడింది. అనేక చైనీయ కమ్యూనిస్టులు ఆనాటికే కౌమింటాంగులో చేరారు. పెకింగు జాతీయ విశ్వవిద్యాలయాధ్యాపకుడైన లీటాచో కౌమింటాంగులో చేరిన కమ్యూ

నిస్టులలో ప్రథముడు. సజాను షాంఘైలో లీ కలుసుకొని తానొక కమ్యూ నిస్టుననీ, మూడు ప్రజాసూత్రాల నంగీకరించి కొమింటాంగులో చేరు టకు సిద్ధంగా నున్నాననీ చెప్పినమీదట సన్‌యట్‌సేన్ కమ్యూనిస్టులను సభ్యులుగా చేర్చుకొన నారంభించాడు.

1922 డిశెంబరు నెలలో సోవియట్ ప్రత్యేకరాయబారియైన అడోల్ఫుజోఫీ, సన్‌యట్‌సేన్‌తో దీర్ఘంగా చర్చించిన పిమ్మట 1923 జనవరి 26 నాడు వారిద్దరూ కలిసి ఒకనివేదికను ప్రకటించారు. ఈ నివే దికయే కొమింటాంగు—సోవియట్ మిత్రమండలికి ప్రాతిపదిక ఐనది.

"చైనాలో కమ్యూనిస్టు సమాజంగాని, సోవియట్ విధానంగాని ప్రస్తుతం అమలుజరిపేందుకు అనుకూలించు పరిస్థితులు లేవు అని సన్ యట్‌సేజా భావించుచున్నాడు. జోఫీ యీ అభిప్రాయంతో ఏకీభవించుటే గాక, ఐక్యత, సంపూర్ణ జాతీయ స్వాతంత్ర్య సమస్యలు నేడు చైనాలో మిక్కిలి ప్రాధాన్యత వహిస్తాయని నమ్ముచున్నాడు. ఈ మహత్తర కార్యసాఫల్యత కొరకు రష్యనుప్రజల సానుభూతి కలదని, చైనాకు రష్యా సహాయం లభిస్తుందనీ జోఫీ వాగ్దానం చేశాడు.

"చైనామీద జారుప్రభుత్వం విధించిన ఒడంబడిక షరతులను, పొందిన అక్రమ సౌకర్యాలను సోవియటు ప్రభుత్వం ఉపసంహరించు కున్నదని, 1920 సెప్టెంబరు 27 వ తేదీనాడు చేసిన ప్రకటనను జోఫీ పునరుద్ఘాటించాడు.

"చైనా తూర్పు రైల్వే మేనేజిమెంటు విషయంలో ప్రస్తుతమున్న మేనేజిమెంటును తాత్కాలికంగా గుర్తిస్తో, ఉభయ దేశములకు నష్టం లేని పద్ధతిని చైనా, రష్యా ప్రభుత్వములు సమాధానమునకు రావలెను. ఈ సందర్భంలో చాంగ్‌సోలిన్ సేనానితో సంప్రతించవలయునని సజా యట్‌సేజా సూచించాడు.

బాహ్య మంగోలియాలో సామ్రాజ్యవాద విధానాన్ని అమలు జరుప సోవియటు ప్రభుత్వం ఉద్దేశించుట లేదనీ, చైనానుండి విడదీయ

కోరుట లేదని ప్రకటించాడు. అందువలన బాహ్య మంగోలియా నుంచి సోవియటు సైన్యాలు తక్షమే వెడలిపోవుట ప్రస్తుత పెకింగు ప్రభుత్వ దుర్బలత వలన చైనా శ్రేయస్సుకే భంగదాయకమనీ సన్‌యట్‌సేన్ భావించుచున్నాడు."

ఈ సంయుక్త ప్రకటన వలన సామ్రాజ్యవాదుల వెదుర్పుటలోను, జాతీయ విప్లవాన్ని కొనసాగించి చైనాను ఐక్యపరచుటకును సోవియటు ప్రభుత్వం కొమింటాంగుకు సంపూర్ణ సహాయం చేస్తానని వాగ్దానం చేసింది. సామ్రాజ్యవాదవ్యతిరేక యుద్ధాన్ని కొనసాగించేందుకు రష్యాతో స్నేహంగా వుండటం అత్యవసరమని సన్ గుర్తించి, జంగ్‌కైషేక్‌ను రష్యా పరిస్థితులను పరిశీలించుటకు గాను పంపాడు. జంగ్‌కైషేక్ రష్యాలో ఆరు మాసాలుండి, తరుచుగా స్టాలిన్, ట్రాట్స్కీలను సందర్శించేవాడు. వారుకూడా కమ్యూనిస్టుపార్టీ నిర్మాణాన్ని గూర్చి, శిక్షణా విధానంగూర్చి, ఎర్రసైన్యంగూర్చి, రాజకీయ, ఆర్థిక విషయాలనుగూర్చి విపులంగా బోధించారు జంగ్‌కైషేక్ చైనా వచ్చి రష్యను విధానం గూర్చి మంచి అభిప్రాయం వెల్లడించగా, సన్‌యట్‌సేన్ ఆ పద్ధతుల మీదనే కొమింటాంగును పునర్నిర్మించాలని ప్రయత్నించసాగాడు. "మార్క్సిజాన్ని అర్థం చేసుకోని వాంగ్‌చింగ్‌వీ, హూహాన్‌మిన్‌లు రష్యన్ విప్లవపద్ధతిని అంగీకరించరు. అందువలన యీ ప్రయత్నంలో వారు పాల్గొనవలసిన అవసరం కూడా లేదు." అంటూ సన్ జంగ్‌కు వ్రాశాడు.

1923 అక్టోబరు నెలలో పెకింగులోవున్న సోవియట్ రాయబారి యైన కరహాన్‌వద్దనుండి పరిచయపత్రం పుచ్చుకొని, బోరోడిన్ కాంటన్ వచ్చి సన్‌ను దర్శించాడు. బోరోడిన్‌కు నిర్మాణ సమస్యలయందు గొప్ప అనుభవం కలదు. కెమాల్‌పాషాకు సలహాదారుగా నుండి టర్కిష్ విప్లవానికి అద్భుతంగా తోడ్పడి టర్కిష్‌జాతియొక్క మన్ననలను



డా రో డి న.

పొందాడు. "చైనా జాతీయవిప్లవానికి నా సర్వశక్తులూ ధారపోయడానికి వచ్చాను. చైనాలో జాతీయవిప్లవాన్ని అభివృద్ధిపరచడమే మా విధానం. చైనాకమ్యూనిస్టుపార్టీ కూడా, యిట్టి కార్యక్రమమునే అనుసరించవలసినదిగా తృతీయ అంతర్జాతీయ కమ్యూనిస్టు మహాసంస్థ సలహానిచ్చింది. చైనా జాతీయ విప్లవవిజయం కమ్యూనిస్టు విజయానికి తోడ్పడుతుందా అనే విషయాన్ని కూడా మేము దీర్ఘంగా చర్చించినపిదప, ప్రజాజీవనో పాధి అయిన 'మూడవ ప్రజాసూత్రం' పెట్టుబడిదారీ విధానాన్ని ప్రతిఘటిస్తుంది కనుక కొమింటాంగు. కమ్యూనిస్టుపార్టీల ఆంత్యాశయాలలో వైరుధ్యం లేదనే నిర్ణయానికి వచ్చాము. చైనా సాంఘిక పరిస్థితుల ననుసరించి, తగిన కార్యక్రమాన్ని, పద్ధతులను మాత్రమే అమలులో పెట్టాలి. చైనాదేశ భక్తులందరూ, కమ్యూనిస్టులు సహా మూడు ప్రజాసూత్రాల నంగీకరించి కొమింటాంగు జండాక్రింద, మీ నాయకత్వాన నడవాలి అని బొరోడిన్ సన్‌తో చెప్పాడు.

ఐతే కొమింటాంగ్‌లో చాలాగొప్ప లోటుపాటులున్నాయి.

(1) కొమింటాంగ్ నిర్మాణం అసంపూర్ణమైనది. అందులో చెప్పుకోదగిన శిక్షణలేదు.

(2) కొమింటాంగులో లంచగొండులైన ఉద్యోగులు, స్వార్థపరులు, అవినీతిపరులు, ఏ యెండకాగొడుగు పట్టేవారు, పార్టీ ప్రధాన సూత్రాలే తెలియనివారు ఉన్నారు.

(3) కొమింటాంగు, ప్రజాసామాన్యంలో వేళ్లుపాతుకున్న ప్రజాపార్టీగా లేదు.

ఈ లోట్లన్నీ సరిదిద్దబడినప్పుడే కొమింటాంగు బలవత్తమమైన విప్లవసాధనంగా వుండగలదని బొరోడిన్ చెప్పిన సలహాతో సన్ యేకీభవించి, బొరోడిన్‌ను కొమింటాంగుకు సలహాదారుగా నియమించాడు.

బొరోడిన్ నియామకం దూరప్రాచ్యదేశాలలో బ్రహ్మాండమైన మార్పును తీసుకొనివచ్చింది. కొమింటాంగు పునర్నిర్మాణం అద్భుతమైన పద్ధతులమీద నడిచి, చైనాలో విప్లవవాదుల రాజకీయ పలుకుబడిని వృద్ధిచేసింది.

## కొమింటాంగు ప్రధమ జాతీయ సమ్మేళనం.

బొరోడిన్‌చే తయారు చేయబడిన పార్టీ నిబంధనావళిని వాంగ్ చింగ్‌వీ, హూహాన్‌మిన్, ఛేచీటో, ఓయోమంగ్‌కేలు అంగీకరించి, ఎక్కువ ఉత్సాహంతో పనిచేయ నారంభించారు.

పునర్నిర్మిత పార్టీకి ప్రాథమికపార్టీ కణములు (సెల్సు) పునాది కింద వుంటాయి. పార్టీ అధికారానికి, బలానికి యివి మూలంగా వుంటాయి. సమగ్రమైన ప్రజాతంత్ర విధానం వీటిలో అమలు జరుపబడుతుంది. ప్రతి పక్షమునకు ఒకసారి సభలు జరుగుతాయి. ఈ సమావేశాల్లో నిర్మాణం, శిక్షణ, ప్రచారములమీద అధికారం వుండే కార్యనిర్వాహకవర్గాన్ని, జమాఖర్చులు. పార్టీ నియమాలను సభ్యులు సరిగా అమలు జరుపుట. శిక్షణను వ్యతిరేకించకుండుట మున్నగు విధులను చూచుపరిశీలకసంఘాన్ని యెన్నుకుంటారు. ఐదుగురు సభ్యులతో కూడిన ప్రాథమిక కణములు తాలూకా సంఘములకు లోబడి వుంటాయి. తాలూకా సంఘాలకుకూడ యీ నిర్మాణసూత్రాలే వర్తిస్తాయి. ప్రతినిధుల సమావేశం నెలకొకపర్యాయం జరుగుతుంది జిల్లాసంఘ ప్రతినిధుల సమావేశం మూడు నెలలకొక పర్యాయమున్ను, రాష్ట్రసమావేశం ఆరు నెలలకున్ను, కేంద్రసంఘ ప్రతినిధుల కాంగ్రెసు సంవత్సరమునకున్ను జరుపబడతాయి.

జాతీయ కాంగ్రెసునకు సర్వాధికారాలు వుంటాయి. ఈ కాంగ్రెసు యేడాదికొక మారు ఒకటి, రెండు వారాలు సమావేశమౌతుంది. సాంవత్సరిక సమావేశముల మధ్యకాలంలో కేంద్రకార్య

నిర్వాహకవర్గం పార్టీపనులను సాగిస్తుంది. కేంద్ర జిల్లా కమిటీలను నడిపే అధికారం, ముఖ్య సమస్యలపై నిర్ణయాలను చేసే బాధ్యత యీ కార్య నిర్వాహక వర్గానికే వుంటుంది. జాతీయ కాంగ్రెసు నిర్ణయాలకు విరుద్ధంగా యీ కమిటీ ప్రవర్తించరాదు. మొత్తం పార్టీకంతటికీ ప్రాతినిధ్యం వహిస్తుంది. విచ్ఛిన్న రాజకీయ భావాలు, దృక్పథాలకేగాక, చైనా ప్రాదేశిక విభజనకు, దేశాంతర చైనీయ సమస్యలకు, ప్రాతినిధ్యానికిగూడ బాధ్యత వహిస్తుంది ఈ అఖిలచైనా కాంగ్రెసు కమిటీ కనీసం ఆరు నెలల కొక పర్యాయమైనా సమావేశమై అన్ని ముఖ్య విషయాలపైన నిర్ణయాలు తీసుకుంటూ వుండాలి.

పార్టీసభ్యుల సమావేశాల్లో అన్ని విషయాలపైన సభ్యులందరూ తమ అభిప్రాయాలను వెల్లడించి తీవ్రంగా చర్చించవచ్చును. కాని ఒక పర్యాయం అధిక సంఖ్యాకులచే చేయబడిన నిర్ణయాన్ని వ్యతిరేకాభిప్రాయులైన అల్పసంఖ్య సభ్యులు ఆచరణలో పెట్టాలి. శిక్షణకు కట్టుబడక సభ్యులలో చీలికలు దెచ్చువారిపై పైకమిటీలు చర్య తీసికొనవచ్చును. పైకమిటీ నిర్ణయాలకు క్రింది కమిటీలు లోబడాలి. అప్పీలు చేసుకునే హక్కు కలదు. అన్ని తగవులను తీర్చుటకు, అంత్యనిర్ణయాలను చేసేందుకు జాతీయ కాంగ్రెస్సుకే సర్వాధికారాలు కలవు.

ఈ నిబంధనావళి పార్టీజీవితంలో గొప్ప విప్లవకరమైన మార్పు తీసికొనివచ్చింది. ఇంతవరకును డాక్టర్ సన్‌యట్‌సేన్ తోచినరీతిగా నిర్ణయాలను చేసి అధికారాన్ని చలాయించేవాడు. పార్టీసభ్యులు నిర్ణయాలను చేసేవారు కారు. నిర్ణయాలపైన బహిరంగ చర్చలు జరిగేవి కావు. నిర్ణయాలను మార్చేందుకు సావకాశం లేదు. అందువలన ప్రజాస్వామ్యాన్ని కోరే విప్లవవాదులు మనస్ఫూర్తిగా కొమింటాంగులో పని చేయజాలకపోయేవారు. ఈ పునర్నిర్మాణం పార్టీనిర్మాణంలో ప్రాథమిక మార్పును తీసికొనివచ్చింది.

చైనాలోని పద్దెనిమిది రాష్ట్రాలనుండేగాక మంచూరియాలోని మూడు తూర్పురాష్ట్రాలనుండీ, మంగోలియా, టిబెట్టు, తుర్కిస్థాన్‌లనుండీ సిడ్నీ, న్యూయార్కులనుండీ కూడా 199 గురు ప్రతినిధులు ప్రధమ కాంగ్రెసునందు పాల్గొన్నారు. సంగ్‌చింగ్‌లింగ్ (శ్రీమతి సన్‌యట్ సేన్), చెన్‌పిచూన్ (శ్రీమతి వాంగ్‌చింగ్‌వీ), హోసియాంగునింగ్ (శ్రీమతి లియోచంగ్‌కే) అను స్త్రీలుకూడా ప్రతినిధులుగా వచ్చారు. విభిన్న దృక్పధాలు కలవారు అభివృద్ధి నిరోధకులనుండి అరాజకవాదుల వరకూ, పారిశ్రామిక యజమానుల నుండి కమ్యూనిస్టులవరకూ యీ సమావేశంలో పాల్గొన్నారు.

సన్‌యట్‌సేన్ ప్రారంభోపన్యాసంలో అంతవరకూ తమపార్టీ నిర్మాణంలోని లోపాలను పేర్కొని పార్టీని పునర్నిర్మించవలసిన అవసరాన్ని నొక్కిచెప్పాడు ఆ సమావేశంలో సన్‌యట్‌సేన్‌ను పునర్నిర్మాణ సూత్రాల విషయంలో చాలమంది ప్రతినిధులు తీవ్రంగా ప్రతిఘటించినమా, చివరకు ఆ విధానాన్ని సంపూర్ణంగా ఆమోదించారు. జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమంకూడా ఆమోదింపబడింది.

ఈ సమావేశంలోనే చరిత్ర ప్రసిద్ధమైన ప్రధమ కాంగ్రెస్ కరపత్రం ప్రకటింపబడింది. "మంచూవంశ ప్రభుత్వాన్ని కూలద్రోయడంలో విప్లవవాదులు విజయులైనప్పటికీ, దేశంలోని అభివృద్ధి నిరోధకులైన సైనికప్రభువుల చేతిలోనికి అధికారంపోయి, విప్లవం పరాజయం పొందింది. సామ్రాజ్యవాదులు వీరికి అండగా నిలువబడి చైనాదేశీయ పరిశ్రమలను నాశనంచేసి, ప్రజలను దోచుకొంటున్నారు రాజకీయంగానే కాకుండా ఆర్థికంగా కూడా చైనాజాతి తుడిచిపెట్టుకొనిపోయే స్థితిలో వుంది. నిస్పృహ దేశమంతటా వ్యాపించింది. మధ్యతరగతి ప్రజలు దుర్భరకష్టాల ననుభవిస్తున్నారు. చిన్న దుకాణదారులు దివాళా తీస్తున్నారు. చేతిపరిశ్రమదార్లకు వృత్తి పడిపోవుటవలన నిరుద్యోగులై,

బందిపోటుగాండ్రు, బికారులు బౌతున్నారు. భూములను సాగుచేయలేక చిన్నరైతులు భూములను తెగనమ్ముకుంటున్నారు. జీవిత వ్యయప్రమాణం దినదినం పెరిగిపోతూంది. వస్తువులధరలు విపరీతంగా పెరిగాయి. విదేశ సామ్రాజ్యవాదులు చైనామీద అంతకంతకు హెచ్చు అధికారం చలాయిస్తున్నారు. చైనా రోజురోజుకూ దిగనారిపోతో, దుర్భరమైన వలసదేశ స్థితికి వచ్చింది. జాతీయ విప్లవంచే సాధించబడిన మూడు ప్రజాసూత్రాలమీద ఆధారపడిన ప్రజాప్రభుత్వమే యిట్టి దుస్సహస్థితి నుండీ ఉద్ధరించగలదు" అను భావాలు యీ ప్రకటనయందు కలవు.

## మూడు ప్రజా సూత్రాలు (శాన్ మిన్ చుఐ).

జాతీయత, ప్రజాస్వామ్యం, ప్రజాజీవనోపాధి అను యీ మూడు ప్రజాసూత్రాలు కోమింటాంగుయొక్క ఆశయాలు.

1. జాతీయోద్ధరణ సూత్రంయొక్క భావం కాలక్రమేణా మార్పు చెంది, ప్రథమ ఐరోపా యుద్ధానంతరానికి చాలా విశాలమైంది.

(అ) సామ్రాజ్యవాదుల పీడననుండి చైనాప్రజలను విముక్తులను చేయడం.

(ఆ) చైనా ప్రజాస్వామ్యంలో వున్న జాతులయొక్క సంపూర్ణ సమానత్వం; విడిపోయే హక్కు కలిగి వుండటం.

అల్పసంఖ్యాక తెగలవారి ప్రయోజనాలను కాపాడుతూ, స్వయం నిర్ణయహక్కునుకూడా వారికిచ్చుటకు ప్రథమ ప్రజాసూత్రంలో కాంగ్రెస్సు అంగీకరించింది.

2. ప్రజాస్వామ్య సూత్రం: సన్‌యట్‌సేన్ ప్రథమంలో యీ సూత్రాన్ని నిర్వచించినప్పటి వివరణకంటె, పార్లమెంటరీ విధానం విఫలమయ్యాక ఆయన భావన సంపూర్ణంగా మార్పు చెందింది. ప్రజా స్వామ్యం పేరిట ధనికవర్గం చేతుల్లోనికి సర్వాధికారాలూ పోయే పార్ల

మెంటరీ విధానం చాల లోపభూయిష్టమని, ఆయన యువాణాషీకే విద్రోహ పాలన నాటినుండి వాదించసాగేడు. ప్రధమ కాంగ్రెసు సమావేశానంతరం ప్రకటింపబడిన "జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమం" అను కరపత్రమును చైనా ప్రజాస్వామిక రాజ్యాంగ చట్టంగా భావించవచ్చును. రాజ్యాంగచట్టం సంపూర్ణంగా అమలు జరుపబడునప్పుడు మాత్రమే ప్రజలందరకూ నాలుగు ప్రజాహక్కులు ప్రసాదింపబడతాయి అని 19 వనిబంధనలో వ్రాశారు. ప్రధమ కాంగ్రెసు నాటినుండి ప్రజాతంత్రసిద్ధాంతం మానవుల స్వాభావికహక్కు అనే ఊహాజనిత ఆశయ దృక్పధంగా గాక, విప్లవచైనాయొక్క ఆచరణ సాధ్యమైన అవసరాలను బట్టి నిర్వచించారు. "విప్లవ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేసే వారికి పౌరసత్వ సౌకర్యాలు కలుగజేయరు. విప్లవభక్తులు, సామ్రాజ్యవాద వ్యతిరేకులు మాత్రమే యీ హక్కులను పొందగలుగుతారు. ప్రజాశత్రువులు, దేశద్రోహులు పౌరసత్వహక్కుల నుపయోగించుకొనజాలరు." ఈ ప్రకటనలో పార్టీనియంతృత్వానికి పునాదులు వెయ్యబడ్డాయి. విప్లవవాదులకే ప్రభుత్వాధికారాలన్నీ వశం చెయ్యబడ్డాయి.

3. ప్రజాజీవనోపాధి సూత్రం: పార్టీలోనున్న అధికసంఖ్యాకుల ఆమోదం బడయలేదు. 1911 విప్లవంవరకూ పార్టీలోని భాగ్యవంతులు యెవ్వరూ యీ సూత్రాన్ని ప్రచారం చెయ్యకుండా సన్‌యట్‌సేనును మాన్పించాలని అనేక తీవ్రప్రయత్నాలు చేశారు. నాన్కింగు తాత్కాలిక ప్రభుత్వ సమయంలో సంగ్‌చియోజెన్, "ప్రజాజీవనోపాధి సిద్ధాంతాన్ని వదలి మిగిలిన రెండు సూత్రాలను గూర్చి మాత్రమే ప్రచారం చెయ్యండని" సేన్‌కు సలహాయిచ్చాడు. రష్యను నవంబరు విప్లవానంతరం యీ సూత్రానికి గొప్ప ప్రాముఖ్యత వచ్చింది. "ప్రజాక్షేమం కొరకు, ప్రజాజీవనోపాధి కల్పననిమిత్తమే విప్లవముద్దేశించబడింది. జీవనోపాధి సూత్రాన్ని వదలుకోవడమంటే, విప్లవాన్ని సంపూర్ణంగా వదలుకున్నట్లే" అని సన్ అసందిగ్ధ వచనాల్లో చెప్పాడు. 1913 వరకూ భూమిని

రైతులందరికూ సమానంగా పంచడమనీ, దీనినే సోషలిజమంటారనీ చెప్పే. సన్‌యట్‌సేన్‌కు మార్క్సిస్టు అయిన చూచీసేన్ యీ వివరణ అసంపూర్ణమనీ, పెట్టుబడినికూడా ప్రభుత్వపరం చేసుకుంటేనే కాని, సోషలిజం సంపూర్ణంగా అమలు జరుగదనీ తెలియజెప్పాడు. ఈలోగా చైనాలో కూడ బట్ట, సిల్కు మిల్లులు వృద్ధిపొంది, పారిశ్రామిక పెట్టుబడి చాలా హెచ్చి విదేశ పారిశ్రామికులతో పోటీ పడడం, అందువలన పారిశ్రామిక కూలీల పరిస్థితులు దుర్భరమడవం, చాలమంది నిరుద్యోగులవడం జరిగింది. 1902 లో 5,64,000 కదుళ్లతో 17 బట్టలమిల్లులుండేవి. 1911 లో 8,31,000 కదుళ్లతో 32 న్ను. 1924 లో 21,12,154 కదుళ్లతో 73 చైనా పారిశ్రామికుల మిల్లులును, 12,18,544 కదుళ్లతో జపానుమిల్లులు, 2,50,516 కదుళ్లతో బ్రిటిషుమిల్లులు వున్నాయి. చైనాలో 1912 లో ఆధునికబ్యాంకులు 9 మాత్రమే. కాని 1913 లో 14 వరకును, 1926 లో 41 వరకును విపరీతంగా పెరిగాయి. చైనాలోని పారిశ్రామిక పెట్టుబడి విజృంభణను, రైతు, కూలీల విపరీతమైన పీడితనాన్ని చూచి సన్‌యట్‌సేన్ యీ సూత్రానికి క్రింది విధమైన అర్ధంకల్పించాడు. "రైతు, కూలీలు పాల్గొంటేనేకాని జాతీయవిప్లవం విజయం పొందదు. రైతు, కూలీ ఉద్యమాలను నిర్మించుటలో సహాయపడుటకును, రైతుకూలీల ఆర్థిక పరిమాణాన్ని అభివృద్ధి చేసేందుకును, కొమింటాంగు ప్రతిన తీసుకుంటోంది. సైనికవాదులకు, సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా చేసే పోరాటాన్ని విజయవంతం చేసేందుకు కొమింటాంగులో జేరమని కార్మిక, కర్షకులను కోరుచున్నాము."

"ప్రజారాజ్యమునందు ప్రజలకు ప్రజాప్రతినిధులమీద సంపూర్ణాధికారము లుండవలెను. పాశ్చాత్య, అమెరికను ప్రజారాజ్యములలో పేదలకు ఓట్లు లేవు. ఒకసారి ప్రతినిధిగ నెన్నుకొనబడిన పిమ్మట, ఎన్నిక గడువు కాలములో, ఆ ప్రతినిధి యెటుల ప్రవర్తించినను, ప్రజలేమియు చేయజాలరు. అటులంగాక ప్రతినిధి ప్రవర్తనము అక్రమముగ మున్నచో

గనుపుకాలములోపలనే ఆతనిని తొలగించు హక్కు ప్రజలకుండవలెను. భాగ్యవంతులు జాతీయ ధనమునంతను అపహరించి, పేదవారిని ఎక్కువ పేదరికములోను, కష్టములలోను, తమక్రింద దాస్యములోను ముంచుచుండగ పాశ్చాత్య జాతులలో సోదరత్వ, సమానత్వము లెక్కడ గలవు? ప్రజారాజ్యములను పేర ఐశ్వర్యవంతుల రాజ్యము స్థాపిత మైనది. చాల దేశములలో స్త్రీలకు, పేదవారికి ఓట్లు లేవు. బీదలకు జాతీయ ధనములో సరియగు భాగము కావలెనని కోరు ఉద్యమములను, భాగ్యవంతుల పలుకుబడిక్రింద నున్న ప్రభుత్వములు క్రూరముగ నణచు చున్నవి .... మనము చైనాలో స్థాపించుచున్న ప్రజాస్వామ్యమునందు భాగ్యవంతులకు పలుకుబడి గలిగి, పేదవారికి దాస్యపీడనలు కలుగు నటులగాక, జనసామాన్యముయొక్క క్షేమమే ప్రధానలక్ష్యముగా నుండవలెను. కావున ప్రజల జీవనోపాధి అను సూత్రము చైనా జాతీ యోద్యమమున కొక పునాదిగ చేయబడినది."

"ప్రభుత్వము పారిశ్రామికులగు షాహుకార్ల మధ్యవర్తిత్వ మప సరము లేకుండ పౌరులకందరకును సరానరి ఆర్థికలాభములను కలుగ చేయవలెను పాశ్చాత్య షాహుకార్ల ప్రభుత్వములు పెట్టుబడిదార్లకును, పారిశ్రామికులకును ధనోత్పత్తికి మార్గములను అవకాశములను కలుగ చేసి, దేశములోని జనసామాన్యముయొక్కయు సంపదయొక్కయు, జీవనో పాధియొక్కయు బాధ్యతను ఆ పారిశ్రామికుల మీదను, షాహుకార్ల మీదను వదలివేయుచున్నవి. అటుల వదలివేయుట అక్రమము. గావి మన పద్ధతి కారలుమార్క్సు సూచించిన పద్ధతికాదు. సోవియట్ విధా నమును బలవంతముగ ప్రవేశపెట్టి రష్యాప్రభుత్వము ఆర్థిక సమానత్వ మును రష్యాప్రజలలో స్థాపించుటకు యత్నించుచున్నది. అది యెంత వరకు జయప్రదమగునో సందేహముగనున్నది. మనము వేరొక విధా నము నవలంబింతము. జాతీయ ధనోత్పత్తి యంతయు స్వరాజ్యప్రభు

త్వము చేతిలో నుంచుదము. బ్యాంకులు, గనులు, అడవులు, నదీప్రవాహములు, రైళ్లు మొదలగు రాకపోకల సాధనములు, విద్యుచ్ఛక్తి టెలిగ్రాములు టెలిఫోనులు మొదలగు ప్రజలకుపయోగించునవి, భారీ పరిశ్రమలు మన ప్రభుత్వముయొక్క యాజమాన్యమున నుండవలెను. మన దేశముయొక్క పారిశ్రామికాభివృద్ధి వలనను ఐశ్వరాభివృద్ధి వలనను కలుగు లాభమంతయు కొందరు వ్యక్తులు మాత్రము పొందగూడదు. మన దేశములోని ప్రజలకందరకును చెందవలెను."

మూడవ ప్రజాసూత్రం వలన ఆకర్షింపబడి కొమింటాంగులోనికి వచ్చిన శ్రామికవర్గ ప్రతినిధులు బలపడకుండా బ్యాంకర్లు, పారిశ్రామికులు, ధనికులు, జమీందార్లు కుట్రలు పన్నసాగేరు. ఈ కుట్రలే అంతకంతకు అధికమై 1927 లో దేశానికి అనర్థదాయకమైన కొమింటాంగు లోని చీలికలకు కారణమైంది చైనా ధనికవర్గంయొక్క స్వప్రయోజనాభిలాషవలన అడుగడుగునకు శ్రామికులకు కష్టములు కలుగజొచ్చాయి. శ్రామికవర్గ ప్రయోజనాలను కాపాడేందుకు కమ్యూనిస్టులు తీవ్రంగా పని చేస్తూ వర్గసంఘాలను నిర్మించ సాగారు.

# 8 వ అధ్యాయం.

## కొమింటాంగు ప్రాబల్యం.



చైనాలో వున్న విదేశ సామ్రాజ్యవాదుల ప్రత్యేక అధికారాలను వలసలను, ఎగుమతి దిగుమతి సుంకాలమీది అధికారాన్ని, విప్లవవాదుల కోరికను తిరస్కరించి, యువాన్‌షీకే కిచ్చిన ఋణాలను రద్దుచేయవల సిందిగా కొమింటాంగు ఆందోళన ప్రారంభించింది. జిల్లాలలో స్థానిక పరిపాలనను ప్రవేశపెట్టమనీ, రైతుకూలీల చట్టాలను చేయాలనీ, వాక్సభా పత్రికా స్వాతంత్ర్యాలను యివ్వాలనీ ప్రచారం జోరుగా సాగింది.

కొమింటాంగులో కమ్యూనిస్టులు చేర్చుకోబడ్డారు. రష్యన్ విప్లవ నిర్మాణ పద్ధతులను అనుకరించాలనీ, శిక్షణకు లోబడాలనీకూడ తీర్మా నించారు. కేంద్ర కార్యనిర్వాహక వర్గంలో ముగ్గురు కమ్యూనిస్టు సభ్యు లును, ఉప సభ్యులలో కొమింటాంగు ప్రతినిధులకంటె కమ్యూనిస్టులు హెచ్చుగాను యెన్నుకోబడ్డారు.

కొమింటాంగుపార్టీ కేంద్రాలయం కాంటన్‌లో నెలకొల్పబడింది. దేశమంతటా తుపానువలె ప్రచారంసాగి, అనేక శాఖాసంఘాలు నిర్మింప బడ్డాయి. ఆశయ పూరితులు, నిర్భయులు అయిన యువకులు వేలకొల దిగా యీ సంఘాలలో జేరి, విప్లవ ప్రచారం సాగించారు.

రైతు, కూలీ, విద్యార్థి, యువజన సంఘాలు యేర్పాటు చేయబడి వీనిలో వేలకొలదీ ప్రజలు జేరసాగారు. కార్మిక, కర్షక శాఖ ప్రత్యేకంగా నెలకొల్పబడి, లియోచుంగుకే ప్రధానాధికారిగా నియమింప బడ్డాడు. పార్టీసైన్యానికి ఉద్యోగులను తయారు చేసేందుకు, వాంపోవా మిలిటరీ శిక్షణాలయాన్ని రష్యను పద్ధతులమీద నిర్మాణం కావించారు. సోవియట్ రష్యాలో సైనిక శిక్షణను పొందిన జంగ్‌కై షేక్‌ను దానికి డైరెక్టరుగా

నియమించారు. రష్యను సలహాదార్లు, ప్రొఫెసర్లు నియమింప బడ్డారు. ఈ శిక్షణాలయానికి కావలసిన ధనం, పరికరాలు సోవియట్ రష్యాయే యిచ్చింది. ప్రజాసంఘాలను స్థాపించి నిరంతర ఆందోళన, సేవాకార్యక్రమాల్లో పాల్గొనే కమ్యూనిస్టులపై మితవాదులకు యీర్ష్య జనించి, వారిని కొమింటాంగునుండి బయటకు నెట్టుటకు కుట్రలు పన్నసాగారు. కమ్యూనిస్టులు అతివాదులకు సహాయం చేస్తో బలపడజొచ్చారు.

## వర్తకుల తిరుగుబాటు.

రైతు, కూలీలలో విప్లవ వర్గ చైతన్యం వృద్ధిపొందడం షాంఘె బ్యాంకర్ల ముఠాకును, కాంటన్ వర్తకులకును కన్నెర్ర కలుగజేసింది. వారొక వర్తక వలంటీరు దళాన్ని నిర్మించి, 10 వేల రైఫిళ్ళు, 30 లక్షల తూటాలను తెప్పించి తిరుగుబాటు ప్రయత్నాలు చేస్తోంటే, వారిని కార్మిక మంత్రివర్గంక్రింద వున్న బ్రిటిషు ఉద్యోగులు ప్రోత్సహించ నారంభించారు. కొమింటాంగు ప్రభుత్వం తరపున సన్‌యట్‌సేన్ బ్రిటిషు కార్మిక మంత్రివర్గపు కుట్రలను బహిరంగ పరచి, యింతట నుండీ, విదేశ సామ్రాజ్యవాదుల దుండగాల్ని తామెదుర్కొంటామని ప్రకటించాడు.

విద్యార్థులు, రైతులు, కూలీలు, స్త్రీలు, దుకాణాలలో పనిచేసే వారు, చైనా స్వాతంత్ర్య దినోత్సవం జరుపుతూంటే, వర్తక వలంటీరు దళంవారు కాల్చి అనేకులను చంపారు. ఈ వలంటీరు దళంలో దొంగలు, రౌడీలు, జూలాయికోర్లు, జేరుటవలన యీ వలంటీరు దళాన్ని అణచేందుకు అక్టోబరు 15 నాడు క్వాంటంగు సైన్యాలు యుద్ధమారంభించి రెండు రోజుల్లో పూర్తిగా ఓడించి, నిరాయుధులను చేసివైచారు.

## సన్‌యట్‌సేన్ ఉత్తర చైనా ప్రయాణము, మరణము.

కాంటన్‌లోని పరిస్థితులు విప్లవ ప్రభుత్వానికి అనుకూలించగానే ఉత్తర చైనాలోని ఫెంగు, ట్వాన్‌ల కోరికమీద సన్‌యట్‌సేన్

పెకింగుకు జపాను మీదుగా బయల్దేరాడు. జపానులో చైనాకంతకూ కలిపి జాతీయ ప్రజా సమావేశాన్ని యేర్పరచాలని సన్ గొప్ప ఉపన్యాసముల నిచ్చాడు. ఆయన వెళ్ళిన చోట్లలో అపూర్వమైన సన్మానాలు పొందాడు. డిసెంబరు 4 వ తేదీని టీన్‌ట్సిన్ జేరుకొని, కార్మిక, విద్యార్థి, రైతు, కూలీ, సైనిక, రాజకీయ సంఘాలనుండి యెన్నుకొనబడిన ప్రతినిధులతో ఉత్తర, దక్షిణ చైనాలకంతటికినీ కలిపి ఒక జాతీయ ప్రజాసమ్మేళన మేర్పాటు చేసి, దేశంలోని చిక్కులను తొలగించుట, అసమ సంధులను రద్దుచేయుట మున్నగు కార్యములను చేయవలయునని ప్రచారం సాగించాడు. ఉత్తర చైనాలోని యువజనులందరూ అత్యుత్సాహంతో యీ ప్రచారాన్ని హర్షించి బలపరిచారు.

నిరంతరం విప్లవ కార్యక్రమంలో నిమగ్నుడైయున్న సన్ ఆరోగ్యం నానాటికి క్షీణించి, చాల ఆదుర్దా కలిగించినందున, 1925 జనవరి 26 నాడు ఆయనను పెకింగు వైద్యాలయంలో జేర్చారు. ఇంత వరకును డాక్టర్ సన్ యొక్క మహత్తర వ్యక్తిత్వం వలన కూడివున్న విప్లవవాదులందరూ యికముందు చెల్లాచెదరై, కొమింటాంగు వినాశనానికి కారకులౌతారేమో అను సందేహంతో చాలమంది ఆందోళన చెందారు. ఉత్తరమునసున్న సైనికనాయకులు కొమింటాంగులోని అతివాద, మితవాద నాయకుల కక్షలను జూచి సంతోషించ సాగారు. ఈ విషమ పరిస్థితుల్లో చైనా విప్లవనాయకుడైన సన్‌యట్‌సేన్ సోవియట్ రష్యాకు తన దేశానికి యధాప్రకారంగానే సహాయంచేస్తూ వుండవలసిన దనీ, తన అనుచరులకు మూడు ప్రజాసూత్రాల ననుసరించి పనిచేయవలసిందనీ అంత్య సందేశమిచ్చి "శాంతి" — "పోరాటం" — "చైనాను రక్షించండి" అని ఉచ్చరిస్తూ, 1925 మార్చి 13 ఎ తేదీ ఉదయం 9—30 గంటలకు ప్రాణాలను వదిలాడు.

## సన్‌యట్‌సేన్ మరణశాసనం.

"ప్రపంచ జాతులలో స్వేచ్ఛా, సమతల మీద ఆధారపడిన సమాన గౌరవ, ప్రతిపత్తులు చైనాకుకూడ కలిగించాలనే యేకైకలక్ష్య సిద్ధికిగాను నలభై సంవత్సరాలు ప్రజావిప్లవంకొరకు నా జీవితాన్ని ధారపోశాను.

"ఈ లక్ష్యాన్ని జేరుకోవాలంటే ప్రజలలో సంపూర్ణమైన రాజకీయ జాగృతిని కలిగించి, సమాన ప్రతిపత్తితో మనలను గౌరవించి, సహకరించే ప్రపంచ ప్రజలతో యేకమై పోరాటాన్ని కొనసాగించాలని యీ నలభై సంవత్సరాల జీవితంలో గడించిన అనుభవాన్ని బట్టి నేను విశ్వసిస్తున్నాను.

"విప్లవం సాధించవలసిన పని యింకా పూర్తి కాలేదు. మన కామ్రేడ్సందరూ నేను నిర్వచించిన 'జాతీయ పునర్నిర్మాణ ప్రణాళిక' 'జాతీయ పునర్నిర్మాణ ప్రాథమిక సూత్రాలు', 'మూడు ప్రజాసూత్రాలు' ప్రథమ జాతీయ సమావేశంచే ప్రకటించబడిన కరపత్రములను అమలు పరచేందుకు హృదయపూర్వకంగా ప్రయత్నించాలని కోరుతున్నాను. అన్నిటికంటె ముఖ్యంగా యీమధ్య జాతీయ సమావేశానికై తీవ్రప్రయత్నాలను ఆలస్యం చేయకుండా అమలు జరపాలి.

"ఇదే నా దేశీయులకు నా హృదయపూర్వకమైన తుది సందేశం."

ఈ మరణ సందేశాన్ని చైనాప్రజలు నేటికీ మీరకూడని పవిత్ర శాసనంగా భావించి పూజిస్తారు.

## సోవియట్ రష్యాకు సన్‌యట్‌సేన్ అంతిమ సందేశం.

"పాశ్చాత్య సామ్రాజ్యవాదులచే దాదాపు వలస రాజ్యముగ చేయబడిన పీడిత చైనా దేశమునకు స్వాతంత్ర్యమును సంపాదించ వలెనని కొమింటాంగు పక్షీయులను కోరుచున్నాను. అందుకొరకు కొమింటాంగు సంస్థను మీతో (సోవియట్ రష్యా) నిరంతరాయంగా, సన్నిహిత

సంబంధమును కలిగియుండ వలసినదని, యాజ్ఞాపించుచున్నాను నా దేశమునకు, నేటివరకూ చేయుచూవచ్చిన విధముననే సహాయమును, ఇక ముందు కూడ చేతురని దృఢముగ విశ్వసించుచున్నాను. ప్రియ సోదరులారా! అనతికాలములో స్వతంత్రశ్రీతో విలసిల్లే బలీయమైన చైనాకు సోవియట్ ప్రజాస్వామ్యమువారు స్వాగతమిచ్చు సుదినము రానున్నదనియు, అప్పుడు ఆ రెండు జాతులు కలసి ప్రపంచములోని బానిస, పీడిత జాతుల స్వేచ్ఛకొరకు జరుగు గొప్ప విముక్తి పోరాటములకు సహాయము చేసి, జయము పొందగలరనియు ఆశించుచున్నాను."

## క్వాంగుటంగు సైనిక ప్రభువుల పరాజయం.

సన్ యట్ సేన్ అస్వస్థత కాంటన్‌లోని చెన్‌చియంగ్‌మింగ్, టాంగ్, యాంగ్, లియూలకు వారి అధికారాన్ని తిరిగి నెలకొల్ప ప్రయత్నించేందుకు అవకాశాన్ని కలుగజేసింది. కాని జంగ్-కై-షేక్ అధిపత్యాన, రష్యను ప్రొఫెసర్లచే శిక్షణ యీయబడి ఆధునికపద్ధతుల పైన పునర్నిర్మింపబడిన జంగ్ సైన్యాలు, సూ సైన్యాలతో కలసి ఫిబ్రవరి 23 వ తేదీన కాంటన్‌మీద దండువెడలిన చెన్ సైన్యాలను పూర్తిగా ఓడించాయి.

వెంటనే కాంటన్‌ప్రభుత్వ కేంద్రకార్యనిర్వాహకవర్గంలో సైన్యాలన్నీ ప్రభుత్వవశం చేయబడాలనీ, సైనికులకు రాజకీయవిద్యాజ్ఞానం ప్రసాదించబడాలనీ ఒక తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరించబడింది. ఈతీర్మానం ప్రత్యేకసైన్యాలు కలిగి, ప్రభుత్వాన్ని లోబరచుకోవాలని కుట్రలు పన్నుతోన్న యాంగ్, లియూల అధికారాన్ని నాశనం చేసేందుకే ఉద్దేశింపబడినది. ఐనప్పటికీ జూదపు ఆటపన్ను వసూలుచేసి కోట్లకొద్దీ డబ్బును కూడబెట్టిన వారిద్దరూ రక్తాన్ని తెగపీల్చి, కదలలేక పడివుండేటంతగా బలిసిన జలగలవలె కదలకుండా వూరుకున్నారు. జంగ్-కై-షేక్ నాయకత్వాన ప్రభుత్వసైన్యాలు యాంగ్‌మీద దండె

న్నాయి. జూన్ నెల ఆరంభంలో వైచౌ వశపడింది. కాంటన్‌కు వచ్చే మార్గంలో యాంగును ఓడించి కాంటణా పారిపోతూన్న సైన్యాలను వెన్నంటి తరిమి జూన్ 12 నాటికి కాంటన్‌లో శత్రుశేషం లేకుండా చేశాయి. ఈ యుద్ధంలో జంగ్‌కై షేక్ రష్యను ఫిరంగుల నుపయోగించి అతిత్వరలో శత్రునాశనం చేసి కీర్తి పొందాడు.

## కొంటణాలో కొమింటాంగు ప్రభుత్వ స్థాపన.

యాంగ్, లియూల పరాజయానంతరం జూన్ 13 నుండి 28 వరకూ కొమింటాంగు సమావేశం జరిగింది. ఉపసేనాధ్యక్షుడైన హూహాన్‌మిన్ సర్వసేనాధ్యక్ష పదవినీ, కొమింటాంగు అధ్యక్షపదవినీ, ఆక్రమించాలని రహస్యంగా ప్రయత్నిస్తూన్నందున అందులకు ప్రతిగా యీ సమావేశంలో కొమింటాంగు అధ్యక్షపదవి సన్‌యట్‌సేన్ మరణానంతరం ఆయన స్మృత్యర్థమెల్లప్పుడును ఖాళీగానే వుండాలనే తీర్మానం కేంద్ర కార్యనిర్వాహక వర్గంచే చేయబడింది. ఈ కేంద్రకమిటీ అధికారానికి లోబడి వుండు సైనిక, రాజకీయ సంఘాలు నెలకొల్పబడ్డాయి. ఈ శాఖలకు సంబంధించిన విషయాలన్నిటినీ పరిశీలించేందుకు ప్రత్యేక పార్టీ ప్రతినిధులు నియమింపబడ్డారు.

## హాంకాంగ్ షామీన్ సమ్మె.

నల్లమందు యుద్ధాలనాటినుండి విదేశ సామ్రాజ్య దురాక్రమణ పరులు చైనానుండి హింసాపూరిత 'ఫిరంగి నౌకారాజ్యతంత్రంతో' గుంజుకున్న ప్రత్యేక హక్కులను, అధికారములను, కౌళ్ళను స్వార్థపరులగు సైనికప్రభువుల అంతఃకలహమువలన చైనాప్రభుత్వము రద్దు చేయ నశక్తతతో నుండెను. 1924 సంవత్సరము మే నెల 30 వ తేదీన చైనాలోగల సమస్త ప్రత్యేక అధికారములను కౌలుప్రాంతములను సామ్రాజ్యవాద విరోధులు బలహీనజాతుల మిత్రులూ అయిన సోవియట్

రష్యా ప్రభుత్వంవారు వదలుకొన్నామని ప్రకటించారు. ఆంగ్ల, ఫ్రెంచి, అమెరికను, జపాను సామ్రాజ్యవాదులకు యీ ప్రకటన గొడ్డలిపెట్టు అయింది. సోవియట్ రష్యావారు చైనావారితో సమాన ప్రతిపత్తినిమాత్రం కలిగియుండుట కొప్పుకొని పెకింగు ప్రభుత్వంతో సంధిచేసుకొని, చైనా చట్టములకు లోబడి పన్నులు చెల్లింప మొదలిడిరి. రష్యావారి సైన్యములను, పోలీసులను చైనానుండి తీసివేశారు. చైనానుండి రష్యాకు పోవు యెగుమతి దిగుమతి సరుకులమీద సమానమైన పన్నులనే వేయు చున్నారు. చైనా, రష్యాలకు ధారాళమైన వర్తకము సాగుచున్నది. వారి వెనుక జర్మనులుకూడ తమ ప్రత్యేక హక్కులను వదలుకొనిరి. కాని కరడుగట్టిన సామ్రాజ్యవాదులైన ఆంగ్ల, అమెరికను, జపాను, ఫ్రెంచి వారు మాత్రము చైనా జాతికి అవమానకరమగు పాత పద్ధతులలోనే నడుచుచు, చైనా, రష్యాలకుండు యీ సత్సంబంధములను పాడుచేయ ప్రయత్నించుచుండిరి. మిగిలిన విదేశజాతుల యధికారమును పలుకు బడిని ప్రత్యేక హక్కులను పూర్తిగా రద్దుచేయుటకు చైనాప్రజలు పోరాటం తీవ్రతరం చేశారు.

1925 వ సంవత్సరం మే నెల 30 వ తేదీన సోవియట్ రష్యా ప్రభుత్వం చైనాలోగల ప్రత్యేక హక్కులను వదలివేసిన ఒడంబడిక యొక్క ప్రధమ సంవత్సరోత్సవం చైనాదేశమంతటా బహు ఉత్సా హంగా ప్రజలు ఉత్సవాలు చేశారు.

ఆ దినమున షాంఘేలోని అంతర్జాతీయ వలసలో చైనావిద్యార్థు లును, కార్మికులును గొప్ప ఉత్సవము చేసి సభలు జరిపిరి. ఆ సభలలో విదేశీ పెట్టుబడిదార్లచే స్థాపింపబడిన బట్టలమిల్లులలోని కార్మికుల దుస్థితినిగూర్చి ఉపన్యసించారు. షాంఘే విదేశ వలస పట్టణ మునిసి పాలిటీ అమెరికను అధ్యక్షుని ఆజ్ఞలవలన బ్రిటిషు పోలీసు వుద్యోగి అనేకమంది విద్యార్థులను, కార్మికులను సభలో అరెస్టుచేసి కొనిపోగా

వేలకొలది చైనీయులు వారిని వెంబడించారు. బ్రిటిషు ఉద్యోగి వారిని పది సెకండులలో చెదరిపొమ్మని ఆజ్ఞ యిచ్చి, అటుతర్వాత భారతీయ సిక్కు సిపాయీలచే వారిపై కాల్పించెను. ముప్పదిమంది చైనాదేశీయులు మరణించారు వారిలో ఆరుగురు విద్యార్థులు కలరు.

ఈ దారుణ చర్యను నిరసిస్తూ దేశమంతటా అసమ్మతి సభలు, ప్రదర్శనాలు జరిగాయి. జూన్ 23 నాడుకాంటన్‌లో విద్యార్థులు, రైతులు కూలీలు, వర్తకులు గొప్ప ఊరేగింపుతో పురవీధులన్నీ తిరిగారు. ముందు కార్మికులు, వారివెనుక రైతులు, వర్తకులు, వారి వెనుక విద్యార్థులు, విద్యార్థినులు, వారి వెనుక వాంపోవా సైనికులు బారులు తీర్చి నడిచారు. కాంటన్‌లోని ఆంగ్లో, ఫ్రెంచి, వలసవున్న షామీన్ దీవి వద్దకు యీ ప్రదర్శనం చేరగానే, లూయీఫిరంగులతో ఫ్రెంచిసైనికులు కాల్చారు. 52 రు తక్షణమే చనిపోయారు. 117 మందికి బలమగు గాయాలు తగిలాయి. నిరాయుధులైన ప్రదర్శకులమీద దౌర్జన్య ప్రయోగం చేయడం విని, కాంటన్ పురవాసులందరూ ఆగ్రహపరవశు లయ్యారు. హాంకాంగ్‌లో, బ్రిటిషువలసలలో పనిచేస్తోన్న 2 లక్షలమంది కార్మికులు సమ్మెచేసి, షామీన్‌ను వదలి కాంటన్ వచ్చివేసి, కాంటన్ ప్రభుత్వ సహాయాన్ని, రక్షణను కోరారు. ఈ సమ్మె 15 నెలలు కొనసాగింది. ప్రపంచంలో నేటివరకూ యింత యెక్కువమంది పాల్గొన్న సమ్మె యింత దీర్ఘకాలం యే దేశంలోనూ, యెన్నడూ జరుగలేదు. కాంటన్ ప్రభుత్వం 3 లక్షల డాలర్లు వీరికొరకు వ్యయం చేసింది. సమ్మెను నడిపించుటలో కమ్యూనిస్టులు అత్యధిక శ్రద్ధను కనబరిచారు. ప్రజాసామాన్యంలో వారి పలుకుబడి అనేకరెట్లు పెరిగింది.

కాంటన్ కాల్పులసంగతి వినగానే చైనాదేశమంతా మితిలేని ఆగ్రహముతో ఉడికిపోయింది విదేశీయుల యెడల ఆగ్రహం పొంగి పొరలింది. కార్మికులు మొదలు స్వదేశక్రైస్తవ సంఘములవరకు తీవ్ర

మైన ఆందోళన చేయనారంభించారు. పెకింగుప్రభుత్వము విదేశీయుల చర్యలను ఖండించింది. విదేశీయులతో జరిగిన అక్రమసంధులన్నీ రద్దు కావాలనీ, చైనీయులను చంపినందుకు గొప్ప నష్టపరిహారం వసూలు చేయాలనీ ఫెంగుసేనాని ప్రకటించాడు. విదేశీయుల హక్కులను వెంటనే తొలగించుటకు, చైనాదేశంలోని సమస్త జాతులును గట్టిగా పూనుకోవాలని కొమింటాంగువారు తీర్మానించారు. "మేనాల్గు" ఉద్యమమునుండి బలపడిన విద్యార్థి కార్మికసంఘాలు షాంఘై, కాంటన్ కాల్పులు జరిపిన ఆంగ్లేయులపై తీవ్రమైన బహిష్కరణాయుధమును ప్రయోగించారు. యుపజనులు తండోపతండములుగ బయల్దేరి చైనా దేశమంతటను ఆంగ్లేయులపై, మానవచరిత్రలోకెల్ల బలవత్తరమైన బహిష్కారమును చేశారు. 1919 లో జపాను సరకులపైనా, 1925, 26 లలో బ్రిటిషు సరకులపైనా, బహిష్కరణ జరుగుటవలన అమెరికను వ్యాపారులు లాభంపొందారు. అందువలన యీ బహిష్కారమునకు ప్రతీకారంగా సైన్యాలతో కాంటన్‌ను ముట్టడించుటకు ఆంగ్లేయులు రమ్మని కోరగా అమెరికనులు తిరస్కరించారు.

1924 సంవత్సరములో యాంగ్ట్సీనది యెగువభాగమున స్వదేశీ పడవల యజమానులకు, విదేశ స్టీమరు యజమానులకు కలిగిన స్పర్ధలలో వాన్‌సెన్ పట్టణమునకు సమీపమున విదేశస్టీమరులలో పనిచేయకుండా చైనాకార్మికులు సమ్మెచేశారు. విదేశీయులకును చైనాకార్మికులకును యీ సందర్భమున జరిగిన కలహములలో చైనీయులు కొందరును, ఒక అమెరికను చనిపోయిరి. వెంటనే ఒక బ్రిటిషు సైనికోద్యోగి చైనావారిని కొందరిని జంపి, అచ్చటి మాజిస్ట్రేటును ఖైదుచేసి, అమెరికావాని మరణమునకు నష్టపరిహారమును చైనాప్రభుత్వమునుండి వసూలు చేసెను. పిమ్మట రెండుసంవత్సరముల కచటనే మరల చైనావారికిని ఆంగ్లేయులకును కలహము కలుగగా, ఆంగ్లసైనికులను చైనాప్రభుత్వ సైనికులోడించి వెడలగొట్టిరి. ఆ కలహమునకు దోషమంతా ఆంగ్లేయు

లదేనని పెకింగుప్రభుత్వం ఆరోపణచేయగా ఆంగ్లప్రభుత్వం క్షమార్పణ కోరుటయేగాక చైనావారిని చంపినందుకు నష్టపరిహారమిచ్చింది. ఈ విధంగా మేనాల్గు, హాంగ్‌కాంగు షామీన్ సమ్మెలు, బహిష్కరణో ద్యములవలన విదేశీయులనిన చైనావారికి భయంపోయింది.

హాంగ్‌కాంగ్‌షామీన్ సమ్మె మూలమున ప్రభుత్వానికి ఆర్థిక చిక్కులు హెచ్చాయి. విప్లవవాదులలో వైరాలు పెరిగాయి. కాని రాజ కీయ, సైనిక ఐక్యతవిధానాన్ని అమలుపరుస్తో, సైన్యాలకు ప్రాదేశిక నామములను రద్దుచేసి, వాంపోవా శిక్షణను పొందిన జంగ్‌కైషేక్ సైన్యానికి ప్రథమ సైన్యమనీ, టాన్‌యెన్‌కే హూనాన్ సైన్యానికి రెండవ సైన్యమనీ, చూపీట్ యూనాన్ సైన్యానికి మూడవసైన్యమనీ పేర్లుపెట్టి సైనికసంఘాధికారంలో వుంచారు. సైనికసంఘానికి చెందిన రాజకీయ శిక్షణశాఖాడైరెక్టరు యీ సైన్యాలకు రాజకీయ డైరెక్టర్లను నియమించాడు 25 వేలమంది సైనికులతో కూడిన క్వాంగుటంగు సైన్యాలు సూచంగ్‌చీ అధికారంలో ప్రత్యేకసైన్యంగా యేర్పాటు చెయ్య బడ్డాయి.

పెకింగుకు పారిపోయిన లీ, యూలు, కాంటన్‌లోనే వుండి సర్వ సైన్యాధ్యక్షపదవిని అన్నగారైన హూహాన్‌మిన్‌కు చెందజేయాలని ప్రయత్నించే హుయిషెంగు, కమ్యూనిష్టులను కొమింటాంగునుండి వెడలిగొట్టాలని చూచే దేశీయ ధనికవర్గమూ కుట్రలు పన్నుతోనప్పటికీ, కొమింటాంగు బలపడి, విదేశసామ్రాజ్యవాదులను ధైర్యంతో ప్రతిఘ టించి, క్వాంగుటంగ్ రాష్ట్రంలోని సైనిక ప్రభువులను అణచివేసింది.

## కొమింటాంగు కమ్యూనిస్టు కలతలు.

చైనా ప్రజాసామాన్యంలో నిరంతర ప్రబోధం కావించి, ప్రజా సంఘాలను నిర్మించుటలో కమ్యూనిష్టులు అహర్నిశలు కృషిచేసి, అతి ముఖ్య పదవులలోనికి వస్తోంటే కొమింటాంగు మితవాద నాయకులకు

చాల ఆందోళన కలిగింది. బాగా హెచ్చుచున్న యీ చీలికలను గమనించి "1924 లో కొమింటాంగు పునర్నిర్మింపబడిన నాటినుండి కొమింటాంగులో యీ పునర్నిర్మాణాన్ని బలపరచేవారు, వ్యతిరేకించేవారు అను రెండు మురాలుగా చీలిపోయారు. పునర్నిర్మాణానికి అనుకూలురను అతివాదులనీ, వ్యతిరేకులను మితవాదులనీ పిలుస్తున్నారు. ప్రస్తుత పరిస్థితుల్లో అతివాదులే విజయం పొందితీరుతారు. కాని యీ అతివాదుల లోనే చీలికలు వస్తాయేమోననే విషయమే చాల ఆందోళన కలిగిస్తోంది. భవిష్యత్తులో కలుగబోయే కష్టాలను నివారించేందుకు, అతివాదులలో ఐక్యాభిప్రాయాన్ని కలుగజెయ్యడమొక్కటే మార్గం" అని దొరోడిన్ సలహా యిచ్చాడు.

వాంపోవా సైనిక శిక్షణాలయంలో యీ విభేదాలు మరీ తీవ్ర రూపం దాల్చాయి. మూడవ అంతర్జాతీయ కమ్యూనిస్టు మహాసంస్థ 1924 మే లో వాంపోవా సైనిక శిక్షణాలయం స్థాపింపబడినప్పుడు 8వేల రైఫిళ్ళిచ్చి, దానికయ్యే ఖర్చుకుగాను చాలవిరాళం యిచ్చినప్పటినుండీ, యీ సంస్థపై కమ్యూనిస్టులకు పలుకుబడి హెచ్చింది. ధనిక వర్గానికి చెందిన విద్యార్థులకు, కమ్యూనిస్టు విద్యార్థులకు అభిప్రాయభేదాలు కలిగాయి. అక్కడ శిక్షణ పొందేవారిలోను, ప్రొఫెసర్లలోనుకూడా వైషమ్యాలు పెరిగాయి. కొమింటాంగు వాదులు సన్ యట్ సేన్ పేవాసంఘమును, కమ్యూనిస్టులు సైనిక యువజన సంఘాన్ని నెలకొల్పారు. సన్ యట్ సేన్ పేవాసంఘానికి మొదటి సైన్యంలోను, సైనిక యువజన సంఘానికి రెండవ, మూడవ సైన్యాలలోను గొప్ప పలుకుబడి కలిగి తరుచుగా కలహించుకొన జొచ్చారు. వాంగ్, జంగ్, లియోలు వైరాన్ని తొలగించి, సామరస్యాన్ని కూర్చాలని ప్రయత్నించారు.

ఈలోగా హూయిషెంగు, హాంకాంగు వర్తకులు కాంటన్ జాతీయ నాయకులను హత్య చేసినవారికి 70 లక్షల రూపాయ లిచ్చుటకు గొప్ప

కుట్ర సల్పిరి. తత్ఫలితంగా కొంటజా ప్రజాస్వామికంలో ప్రముఖ నాయకుడైన లియోమ, కొందరు హంతకులను నియమించి 1925 ఆగస్టు 25 నాడు చంపివేశారు. ఈ హత్య దేశంలో గొప్ప ఆందోళనను కలుగజేసింది. పట్టుబడిన ఒక హంతకునివలన దోషులెవ్వరో తెలిసినందున హంతకులలో చాలమందిని పట్టుకొని ఉరితీసివేశారు. సూ సైన్యాలలోని ముఖ్యులను నిరాయుధులను చేసి, మరల ఒక కొత్త సైనిక దళాన్ని యేర్పాటు చేశారు. ఆర్థికమంత్రిగా టి. వి. సూంగ్‌ను నియమించారు. విప్లవ వ్యతిరేకుల కుట్రలు సన్నిటిని అణచి వాంగ్‌చింగ్‌వీ, జంగ్ కై షేక్‌లు దృఢచిత్తంతో పార్టీలో ఐకమత్యాన్ని రక్షించేందుకు పని చేశారు. పార్టీభావాలు కలిగి, విప్లవోత్సాహంతో కూడుకున్న సైన్యాన్ని నడిపిస్తో నిరంతరం విప్లవ కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టి ప్రజలలో సన్‌యట్‌సేన్ తరువాత గొప్ప పలుకుబడి సంపాదించిన జంగ్, వాంగ్ ఇద్దరూ సహకారంతో మెలగడం వలన వారికంటె చాల హెచ్చు మందిగా నున్న అభివృద్ధి నిరోధకులను కూలద్రోయగలిగారు. 1925 డిసెంబరు 3 వ తేదీనుండి సైనిక, పౌర, ప్రభుత్వాదాయ అధికారాలన్నీ కేంద్ర కార్యనిర్వాహకవర్గంచే యేర్పాటుచేయబడిన రాజకీయ సంఘంలో కేంద్రీకరింప బడ్డాయి. ఏ సైన్యంగాని స్వతంత్రించి ప్రభుత్వాదాయ విషయాల్లో జోక్యం కలుగ చేసుకొనరాదనీ, సైనిక సంఘాధికారానికి లొంగి వుండాలనీ, శాసింపబడింది.

బొరోడిన్ సలహాపై జంగ్‌కైషేక్‌ను ముఖ్య సేనాధిపతిగా నియమించి తూర్పురాష్ట్ర దండయాత్రకు కొమింటాంగు ప్రభుత్వం పంపింది. రష్యన్ సేనానాయకుడగు మార్షల్ బ్లూషర్, బొరోడిన్‌లు అసమాన ప్రతిభతో 1925 అక్టోబరు 8 వ తేదీని తూర్పురాష్ట్ర దండయాత్ర నారంభించి ఆనెలలోనే వైచౌను, నవంబరు 6 నాడు స్వాటౌను ఆక్రమించుకొని, నవంబరు 16 నాటికి తూర్పునది జిల్లాలనుండి శత్రువులను పారద్రోలి అఖండ విజయాన్ని సాధించారు. టాంగ్‌షెంగుచీ

అను సైనిక ప్రభువు సెప్టెంబరు నెలలో పార్టీలో జేరేందుకు వచ్చాడు. ఆయనతోబాటు ఆయన సైన్యాలుకూడా ప్రభుత్వానికి అండగా నిలిచాయి. చాంగ్‌ఫాక్వీ అనే సేనాని తూర్పురాష్ట్ర దండయాత్రలో గొప్ప యుద్ధ నైపుణ్యం గనపరచి 'ఉక్కు-సేనాని' అనే బిరుదు గడించి, దక్షిణ క్వాంగుటంగు రాష్ట్రమునుండి శత్రువులను పారద్రోలి, శాంతిని నెల కొల్పాడు. 1926 జనవరిలో హైనాను దీవికూడా పట్టుబడింది. ఈ విధంగా క్వాంగుటంగు రాష్ట్రమంతా కొమింటాంగు జాతీయ ప్రభుత్వం క్రిందకు వచ్చింది.

## మితవాదుల కుట్రలు.

కొమింటాంగు ప్రభుత్వానికి అఖండమైన సైనిక విజయాలు కలిగి దేశమంతటా పలుకుబడి హెచ్చుతోండగా, 'పాత కామ్రేడ్లు' కాంటన్ నుండి షాంఘే, పెకింగులకు వెళ్లిపోయి, కమ్యూనిష్టులతో, అతివాదులతో కూడిన కాంటన్ ప్రభుత్వాన్ని కూలద్రోసేందుకు కుట్రలు పన్నజొచ్చారు. కొమింటాంగు ప్రభుత్వ కేంద్ర కార్యనిర్వాహకవర్గ సభ్యులలో నుండి సెచీ, సౌలూ, లిన్‌షెన్, చాంగ్‌చీ మున్నగువారు పెకింగు సమీపంలో వున్న పడమటికొండలవద్ద సమావేశమై తమరే సిసలైన కొమింటాంగు పార్టీ సభ్యులనీ, కాంటన్‌లోని ప్రభుత్వం అశాస్త్రీయమైనదనీ ప్రకటించి, మరలనొక కొత్త కేంద్రకార్య నిర్వా హక వర్గాన్ని యెన్నుకున్నారు. వాంగ్‌చింగ్‌వీని పార్టీనుండి తొలగించి, వాంగ్, జంగ్‌లమధ్య విరోధం కలిగించేందుకు అనేకమందిని వియోగించారు.

పడమటికొండ ముఠావారు మోపిన నిందలకు సమాధానంగా వీరి సమావేశం అశాస్త్రీయమైనదనీ, పెకింగును లోబరచుకున్న ట్వాన్‌చీజుయి సైనికప్రభువు డబ్బుతో వీరీవిధంగా లోకాన్ని మోసగిం

చాలని చూస్తున్నారనీ ప్రకటించారు. ఈ ముఠావారు లంచగొండులైన ఉద్యోగులు, అభివృద్ధినిరోధకులైన సనాతనవాదులు, బ్యాంకర్లు, పారిశ్రామికయజమానుల యేజెంట్లు, అరాచ్యాదులని కూడా వెల్లడించారు.

ఐతే కొమింటాంగ్ ప్రభుత్వసేనలలో సన్యాట్ సేనా ముఠావారికిని, కమ్యూనిస్టులకును మధ్య ద్వేషాలు పెరిగాయి. సన్యాట్ సేనిస్టులు కమ్యూనిస్టులను తరిమివెయ్యాలని గొప్పబహిరంగ ప్రచారం చేస్తూయీ ఒక్క విషయంలోనూ పడమటి కొండల ముఠాను బలపరచసాగారు. ఈ కలతలను నివారించేందుకు సేనాధిపతియైన జంగ్ కై షేక్ యీ క్రింది ప్రకటనను చేశాడు.

వాంపోవా సైనిక శిక్షణాలయంలో కమ్యూనిస్టులు, తదితర పక్షీయులుకూడ వున్నారు. డాక్టర్ సన్ సూత్రాల నమలు పరచేందుకు అన్ని ముఠాలవారును కొమింటాంగు జండాక్రింద పనిచేస్తున్నారు మూడు ప్రజాసూత్రాల కొరకును, కమ్యూనిజం కొరకును యుద్ధంచేసి, ప్రాణాలను బలియిచ్చిన ఆత్మ త్యాగుల ప్రక్కనే నేనుకూడ మరణించాలని కోరుకుంటూన్నాను, అందుచేత మీలో మీరు కలహించవద్దనీ, వైషమ్యాలు పెంచుకొన వద్దనీ, మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. కలిసి జీవించండి కలిసి మరణించండి. జాతీయ విప్లవం యెడ మనకుగల బాధ్యతను, అందరూ ఐకమత్యంతో భుజంభుజం కలిపి పోరాడి నిర్వర్తించండి. ఒకరినొకరు ప్రేమించుకుంటో, ఐకమత్యంతో కలసి పనిచేసి, డాక్టర్ సన్ 'మూడు ప్రజాసూత్రాలను' అంతర్జాతీయ కమ్యూనిజాన్ని సాధించండి................

"డాక్టరు సను మూడు ప్రజాసూత్రాలు లేకుండా జాతీయ విప్లవమున్ను, కమ్యూనిజం లేకుండా అంతర్జాతీయ విప్లవమున్నూ సిద్ధించవు. ప్రపంచ విప్లవంలో చైనా విప్లవం భాగమనే విషయాన్ని కాదని మనం వాదించలేము. మూడు ప్రజాసూత్రాలను సాధించడమంటే కమ్యూ

విజాన్ని సాధించడమన్నమాటే. ప్రపంచ విప్లవంనుండి చైనావిప్లవాన్ని వేరుపరచ లేమనే విషయం తెలిసివుండికూడా మూడు ప్రజాసూత్రాలు కమ్యూనిజాలను గూర్చి మనలో మనమెందుకు కలహించాలి?........"

ఈ వ్యాసం వ్రాసినప్పటికే, జంగ్‌కైషేక్ సైన్యాధికారాలలో ముఖ్యమైనవాటిని కొమింటాంగు పార్టీవారికే యిస్తో రాజకీయ ప్రచారం మాత్రం కమ్యూనిస్టుల చేతులలో వుంచాడు వాంగ్‌చింగ్‌వీ కూడా సివిలు శాఖలో ముఖ్యపదవులన్నీ కొమింటాంగు పార్టీవారికిచ్చి, కమ్యూనిస్టులను తొలగించసాగేడు. సన్‌యట్ సేన్ కాలంలో వలె శక్తి సామర్థ్యాలను పరిశీలించి పదవులిచ్చే ఆచారాన్ని వీరిద్దరూ మాని పక్షపాత బుద్ధితో పనిచేయసాగేరు. చియాంగ్‌కైషేక్ అన్ని సైనిక వ్యవహారాల లోను బొరోడిన్‌తో సంప్రతించి నిర్ణయాలు చేసేవాడు. కాని వాంగ్ మాత్రం ఆయనను చాల దూరంగా వుంచేవాడు. ఈ విధంగా వాంగ్, చియాంగులు మాటల్లో అతిపదభావాలూ, చేతల్లో ఉద్యమవృద్ధి నిరోధక చర్యలనూ, చేస్తో తమ బలాలను వృద్ధి చేసుకొన జొచ్చారు.

## రెండవ జాతీయ కాంగ్రెసు సమావేశం.

క్వాంటంగు రాష్ట్రం సంపూర్ణంగా కొమింటాంగుకు లోబడిన తర్వాత ఉత్సాహంతో 1926 జనవరి 1 వ తేదీని రెండవ జాతీయ కాంగ్రెస్సు మహా వైభవంగా కాంటన్ నగరంలో సమావేశమైంది. ఎని మిది రాష్ట్రాలనుండి మాత్రమే ప్రతినిధులు హాజరయ్యారు. 19 వ తేదీ వరకూ యీ సమావేశం జరిగింది. విదేశ సామ్రాజ్యవాదుల అసమ సంధుల రద్దుకొరకును, విదేశస్థులుకూడ దేశీయ న్యాయస్థానాలకు లోబ డాలని, దేశంలో దోపిడి, సైనిక ప్రభువుల అధికారం నాశనం చేయ బడాలని, సామ్రాజ్యవాదుల తొత్తులైన దేశీయ వ్యాపారస్థులు నశించాలనీ తీర్మానించారు. ఈ తీర్మానాలను సాధించేందుకు రాజకీయ చైతన్యం కలి

గిన బలవత్తమమైన ప్రజాసైన్యం నిర్మింపబడాలనే నిర్ణయం చేయ బడింది. పీడితులగు చైనా రైతుకూలీలనే గాక శైశవావస్థలో వున్న చైనా పరిశ్రమలనుకూడా ఉద్ధరించుటకు తీర్మానించబడింది డాక్టర్ సన్ యొక్క ఆదేశానుసారంగా కమ్యూనిస్టులు కొమింటాంగులో చేర్చుకో బడతారు గాని, పార్టీలో ప్రధాన సభ్యులుగా గాక సహాయక సభ్యులుగా మాత్రమే పరిగణింప బడతారు. ఏ కొమింటాంగు సంఘంలోనూ, మూడవ వంతుకంటె హెచ్చుమంది కమ్యూనిస్టు లుండరాదు. ఈ సమా వేశంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాధికారాలు, సంబంధాలు కూడ నిర్వచింప బడ్డాయి. పడమటి కొండల మురావారిని పార్టీనుండి తొలగించారు. కొత్త కేంద్ర కార్యనిర్వాహకవర్గంలో చియాంగ్ కై షేక్, చెన్ కంగ్ పో, కాన్ నేక్వాంగు లను కొత్తగా చేర్చుకున్నారు. కేంద్ర కార్యనిర్వాహక వర్గంలో ప్రథమ పర్యాయం స్త్రీ సభ్యులనుకూడా జేర్చుకున్నారు. సన్ యట్ సేన్, హోసియంగ్ నింగ్ సతులు కార్యనిర్వాహక వర్గానికి, చెన్ పిచూన్ సతి కేంద్ర పరిశీలక సంఘానికియెన్నుకోబడ్డారు.

# 9 వ అధ్యాయం.

## ఉత్తర రాష్ట్ర దండయాత్ర.

కాంటన్ విప్లవ ప్రభుత్వానికి, ఒక్క క్వాంగుటంగు రాష్ట్రమే లోబడి వుంది, మిగిలిన రాష్ట్రాలు సైనిక ప్రభువుల అధికారానికి లోబడి వున్నాయి. అందువలన ఉత్తర రాష్ట్రాలలోని ఊపీఫూ మున్నగు సైనిక ప్రభువులనుండి క్వాంటంగు రాష్ట్రాన్ని కాపాడి చైనానంతటినీ రాజకీయంగా ఐక్యపరిచేందుకు వాంగుచింగువీ, చియాంగ్ కైషేక్, కమ్యూనిస్టు నాయకులు తీర్మానించారు సైనిక ప్రభువులతో పోరాటం సాగిస్తూన్నంతకాలం క్వాంటంగు రాష్ట్ర ఆదాయం చాల తక్కువగా వుండేది కాని టి. వి. సూంగ్ ఆర్థికమంత్రి అయిన కొద్దికాలంలోనే ప్రభుత్వాదాయం చాలా వృద్ధిపొందింది. ప్రభుత్వ సైన్యాలు 90,000 వరకూ పెరిగాయి. రాష్ట్రంలో కొలదిగా పునర్నిర్మాణ కార్యక్రమం సాగింది, విద్యార్థి, కూలీ, రైతు, స్త్రీ, యువజన సంఘాలు నిర్మింపబడి, ప్రజలలో రాజకీయ చైతన్యం హెచ్చింది. ఈ పరిస్థితులలో జంగ్ కైషేక్ నాయకత్వాన ఉత్తర రాష్ట్ర దండయాత్రను కొనసాగించేందుకు నిశ్చయించబడింది. యుద్ధప్రయత్నాలు తీవ్రంగా కొనసాగాయి. ప్రక్కనున్న క్వాంగ్సీ రాష్ట్రంలో సైనిక నాయకులుగా వున్న లీసంగ్-జేన్, హ్వాంగుషోసియంగు, పేచంగుసీలతో రాయబారాలు జరిపి కాంగ్సీరాష్ట్రాన్నికూడ కొమింటాంగు ప్రభుత్వంలో కలిపివేశారు. సైన్యాలతో వారుకూడ ఉత్తరరాష్ట్ర దండయాత్రకు వచ్చేందుకు అంగీకరించారు. వారి సైన్యాలనుకూడా కొమింటాంగు సైనిక పద్ధతులమీద పునర్నిర్మాణం కావించి, గొప్ప రాజకీయ ప్రబోధం చేశారు. టాంగ్ షెంగుచీ కొమింటాంగులో జేరి ఊపీఫూకు వ్యతిరేకంగా యుద్ధం చేసేందుకు సన్నద్ధుడయ్యాడు.

1926 ఫిబ్రవరి 25 వ తేదీనాడు ఊపీఫూ దేశద్రోహి అనీ, చైనానంతటినీ ఐక్యపరిచేందుకు డాక్టర్ సన్‌యట్‌సేన్ చేసిన ప్రయత్నాలను భగ్నం చేశాడనీ, విదేశ ప్రభుత్వాలకు లోబడి వారి తొత్తుగా పనిచేస్తున్నాడనీ అతనిని దేశంనుండి పారద్రోలేందుకు తమకుసహాయం చేయవలసిందిగా దేశస్థులందరికీ ఒక విజ్ఞాపన చేశారు. ఇదే యుద్ధప్రకటనక్రింద పరిగణింపబడింది.

రెండవ జాతీయ కాంగ్రెస్ సమావేశంలో బొరోడిన్ జమీందారులవద్ద నుండి ప్రతిఫలం యివ్వకుండా భూములు లాగుకొని పేదరైతులకు పంచాలని ఒక తీర్మాణం ప్రవేశపెట్ట కోరగా, జమీందారీ ఏజెంట్లు, భూఖామందులు ప్రతిఘటించి, నిరాకరించారు. రైతు ప్రణాళికనూ, ప్రజాజీవనోపాధి సూత్రాన్ని ఆచరణలో పెట్టవలసినదిగా రైతు, కూలీ సంఘాలలో ప్రచారంచేసే కమ్యూనిష్టులు వాంగ్, చియాంగ్‌ల అభివృద్ధి విరోధక ప్రయత్నాలను వెల్లడిచేయ నారంభించారు. అప్పటినుండి చియాంగ్, కమ్యూనిష్టులు తన మార్గంలో నుండి, ఒత్తిడి కలుగజేస్తున్నారని కక్షవహించి సైనిక, యువజన సంఘాల కార్యకలాపం సాగకుండా అడ్డంకులు కల్పించ సాగేడు. పడమటికొండల ముఠావారు వాంగ్‌మీద ద్వేషం పుట్టించేందుకు చియాంగ్ పరివారంలో వారికి లంచాలుపెట్టి, చాడీలు చెప్పించారు. కమ్యూనిష్టులు వాంగ్‌తో కలిసి చియాంగ్‌ను అధికారభ్రష్టుని చేయ సంకల్పించారనీ, యంగ్‌ఫెంగ్ అనే ఫిరంగి ఓడమీద అందుకొరకే తిరుగుతున్నారనీ చెప్పారు.

నిరంతరం యిట్టి విషపూరిత ప్రచారాన్ని వింటో కమ్యూనిష్టులను నాశనంచేసి తన వ్యక్తిప్రాబల్యం, పెట్టుబడిదారులు, జమీందారుల ప్రభుత్వాన్ని స్థాపించుటకు తరుణముకొరకు వేచియున్న చియాంగ్‌కైషేక్, రష్యన్‌సైనిక సలహాదార్ల గృహాలను సైనికులచే ముట్టడించి, పార్టీకమీషనర్లను అరెష్టు చేయించాడు. సైనిక సంఘంయొక్క అనుజ్ఞ

లేకుండా నిరంకుశంగా మార్షల్‌లా అమలుపరచినందుకు వట్టి పుకారు మీద వాంగ్‌ను అనుమానించినందుకు, సైన్యం రాజకీయశాఖ అధికారానికి లొంగివుండక, నిరంకుశంగా ప్రవర్తిస్తున్నారనీ, సైనిక నియంతృత్వాన్ని నెలకొల్పేందుకు యీ చర్య దారితీయవచ్చుననీ యెంచి వాంగ్ చింగ్‌వీ రహస్యంగా మే నెలలో ఫ్రాన్సు వెళ్ళిపోయాడు. ఈయన చర్య వలన చియాంగ్, వాంగ్‌లమధ్య తీవ్ర భేదాభిప్రాయాలేర్పడి, విప్లవ ప్రభుత్వ వినాశ ప్రయత్నములు జరుగలేదు.

రష్యన్ సలహాదార్లను చియాంగు అరెస్టు చేయించుట పడమటి కొండల మురావారికిని, కమ్యూనిస్టు వ్యతిరేకులకు చాల సంతోషం కలిగించింది. వారు ముక్త కంఠంతో చియాంగును అభినందించారు. కాని చియాంగు ఏప్రిలు 3 వ తేదీని రష్యాతో మైత్రి మునుపటి వలెనే వుందనీ విప్లవ వ్యతిరేకులూ, అభివృద్ధి నిరోధకులూ కాంటన్‌లో కాలు పెడితే తక్షణమే నిర్బంధము దుంచబడతారనీ ప్రకటించాడు. ఏప్రిలు 16 వ తేదీని వాంపోవా సైనికాలయంలో ఉపన్యసిస్తో చైనా విప్లవం ప్రపంచ విప్లవంలో అంతర్భాగ మగుటవలన కొమింటాంగు, తృతీయ కమ్యూనిస్టు అంతర్జాతీయ సంస్థ అధికారానికి లోబడి వుండాలనీ జంగ్‌కైషేక్ చెప్పాడు. ఏప్రిల్ నెలాఖరుకు బొరోడిన్, హూహాన్‌మిణ మాస్కోనుండి తిరిగి వచ్చారు. హూహాన్‌మిన్‌కు చియాంగ్‌తో సరిపడనందున షాంఘైకు వెళ్ళిపోయాడు. బొరోడిన్ నియమించిన సలహాదార్లను చియాంగ్ అంగీకరించి ఆయన సలహాలను మన్నించ సాగేడు. చియాంగ్ కొమింటాంగు కేంద్ర కార్యనిర్వాహకవర్గ విస్తృత సమావేశాన్ని పిలచి యంగ్‌ఫెంగ్ కేసు కల్పితమనీ, తామ తొందరపాటుతో చేసిన పనికి శిక్షించ వలసిందనీ కోరాడు సభ్యులు క్షమించారు. కమ్యూనిస్టులను కొమింటాంగులో జేర్చుకునే విధానాన్ని ఆమోదించారు. కాని, కమ్యూనిస్టులెవరూ ప్రభుత్వ శాఖలకు ప్రధానోద్యోగులుగా నుండ కూడదని కూడ తీర్మానించారు.

## దండయాత్ర ప్రారంభం.

టాంగ్‌షెంగ్‌చీ కొమింటాంగు ప్రభుత్వంతో రాయబారాలు జరుపు తోండటం కనిపెట్టిన ఊపీఫూ హూనాన్ గవర్నరైన చోహెంగ్‌టీని, టాంగ్‌ను పదవినుండి తొలగించ వలసిందిగా ఆజ్ఞాపించాడు. ఉపీఫూ పంపిన సైన్యాలతో చో, టాంగ్‌ను హూనాన్‌నుండి తరిమివేశాడు ఈలోగా జాతీయ ప్రభుత్వం దండయాత్ర సన్నాహాలు పూర్తిచేసుకుంది. 1926 మే 28 వ తేదీని చియాంగ్ కైషేక్ సర్వసేనాధ్యక్షుడుగా నియమింప బడ్డాడు. బొరోడిన్ సలహాపిలన అన్ని సైనిక, రాజకీయ, పార్టీ అధికారాలు చియాంగ్ కీయబడ్డాయి. ప్రతి రాష్ట్రములోను కార్మిక, యువజన, కమ్యూనిస్టు సంఘాలవారు ప్రజలలో గొప్ప జాతీయ ప్రచారము చేయుచు దేశాభిమానము కలిగించుచుండిరి.

సైనిక సంఘానికి లోబడి ఏడు సైన్యాలున్నాయి. ప్రతి సైన్యం లోను మూడు డివిజన్లున్నాయి. ఒక్కొక్క డివిజనులో 1620 రైఫిళ్ళతో కూడిన 3 రెజిమెంట్లున్నాయి. ఈ సైన్యాలన్నిటిమీద సర్వాధికారాలను రష్యను సలహాదారైన గాలెన్సు (మార్షల్ బ్లూషర్) కలిగి వుండటమే గాక, మొదటి సేనకు నాయకుడుగా వుండి నడిపాడు. టాణాయెన్‌కే రెండవ సైన్యానికి, చూపీటే మూడవ సైన్యానికి, లీచీసేన్ నాల్గవ సైన్యానికి, లీఫూలిన్ ఐదవ సైన్యానికి, చెంగ్‌చీన్ ఆరవ సైన్యానికి, లీసంగ్‌జేన్ ఏడవసైన్యానికి కమేండర్లుగా నియమింప బడ్డారు.

టాంగ్‌షెంగ్‌చీ, ఊపీఫూ సైన్యాలచే ఓడింపబడి యూనాన్ రాష్ట్ర ముఖ్యపట్టణమైన చాంగ్షానుండి తిరోగమనం సాగించుచున్న సమయంలో 1926 జూలై నెల మొదటివారంలో కాంటన్ నుండి చెన్ మింగ్‌షు, చాంగ్‌ఫాక్వీ, పేచంగ్‌చీల నాయకత్వంలో మూడు డివిజన్ల విప్లవసైన్యాలు వచ్చి కలిశాయి. వెంటనే టాంగ్ విజృంభించి చాంగ్

షాను తిరిగి స్వాధీనపరచుకున్నాడు టాంగ్‌ను కొమింటాంగులో జేర్చు కుని, ఆయన సైనికులను ఎనిమిదవ సైన్యంగా చేసి, దండయాత్ర నారంభించారు.

ప్రథమమున ఊపీఫూమీద దండెత్తిన కొమింటాంగు సైన్యాలకు అనేక యుద్ధాలతర్వాత ఊహాన్ పట్టణం అక్టోబరు 10 నాడు వశమైంది. తత్ఫలితంగా హూనాన్, హూపే రాష్ట్రాలు కొమింటాంగు పద్ధతికి లోబడ్డాయి. విప్లవసైన్యాల విజయాలను కాంచి, విస్మయం పొందిన కియాంగ్సీ, కియాంగ్సు, ఫూకీన్, అన్‌హ్వీ, చెకియాంగు రాష్ట్రాల అధిపతియైన సన్‌చ్వాఙఫాంగ్ ఊపీఫూతో కలిశాడు. అందువలన సన్ చ్వాన్ మీద కూడ యుద్ధం ప్రకటింపబడింది.

ఊఫీపూ, సన్‌చ్వాన్‌ఫాంగుల సైన్యాలతో అనేక పోరాటాలు జరిగాయి కొన్ని ప్రదేశాలు అనేకపర్యాయాలు చేతులు మారాయి. నవంబరు 8 నాడు రెండవ, ఆరవసైన్యాలు కియాంగ్సీ రాష్ట్రాన్ని లోబరచుకున్నాయి. టాన్‌యెన్‌కే, చూపీటే, చెంగ్‌చీన్‌లకు తోడుగా జంగ్ అదనపుసైన్యాలను పంపుటవలన డిశెంబరు నెలలో ఫూకీన్ పట్టుబడింది. ఫూకీన్ నుండి చెకియాంగ్ మీదకు దండువెడలి రెండునెలలు హోరాహోరీ యుద్ధంచేసి, అనేకసార్లు పరాజయం పొందిన తర్వాత 1927 ఫిబ్రవరి 18 నాడు చెకియాంగ్‌ను వశపరచుకున్నారు. చెకియాంగు నుండి యింకా ఉత్తర రాష్ట్రాలమీదకు మిగిలిన సైన్యాలను పంపి, యిరతవరకును కియాంగ్సీ రాష్ట్రంలో నాన్చాంగ్ పట్టణంలో వున్న చియాంగ్ అకస్మాత్తుగా షాంఘైనగరంమీద పడ్డాడు. అంతక్రితమే చౌఎన్‌లే అను కమ్యూనిస్టు యువకుడు షాంఘైలోనున్న కార్మికులచే విప్లవం జేయించి మార్చి 22 న లోబరచుకున్న సమయాన చియాంగ్ తేలికగా షాంఘైను పట్టుకున్నాడు. షాంఘై విప్లవయోధులైన కార్మికులు ఆయనకు స్వాగతమిచ్చారు. ఆలసించక పురాతన రాజధానియైన నాన్కింగును 24 వ తేదీన లోబరచుకున్నాడు.

ఈ యుద్ధాలలో చియాంగ్‌కై షేక్ చాల పర్యాయాలు ఓడిపో యాడు. ఉక్కు సేనాని అని ప్రసిద్ధిచెందిన చాంగ్ ఫాక్వీ ప్రతి పోరాటం లోను అఖండవిజయం పొందుటవలన కొమింటాంగులో ఆయన పలుకు బడి హెచ్చుతోందని చియాంగు అకస్మాత్తుగా షాంఘైముడపడి జయించి మార్చి 27 న నగరంలో ప్రవేశించాడు కొమింటాంగులో తన అధి కారం నిలబెట్టుకునేందుకు షాంఘైలో నున్న దేశీయధనాఢ్యవర్గాన్ని కూడ గట్టుకొనుట అవసరమని యెంచి. కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా మాట్లాడి. వారి సహాయాన్ని పొందాడు

## కమ్యూనిస్టుల పలుకుబడి.

వాంగుచింగ్‌వీ ఫ్రాంసు వెళ్లాడు. క్రమంగా అభివృద్ధినిరోధకుల వైపు మొగ్గుతోన్న చియాంగు యుద్ధకార్యాలలో నిమగ్నుడయాడు. ప్రభుత్వవ్యవహారాలను చూచే టాన్‌యెన్‌కేకు రాజకీయసిద్ధాంత పరి జ్ఞానంలేక, గాలివేసినవైపు తిరుగుతున్నాడు. కేంద్రకార్యనిర్వాహక వర్గాధ్యక్షుడైన చాంగుచింగ్‌జంగ్‌పై పడమటికొండల ముఠాకు చెందిన వాడను అనుమానం పార్టీసభ్యులకు కలిగింది. ఈ పరిస్థితుల్లో అహర్ని శలు ప్రజానిర్మాణ కార్యక్రమంలో నిమగ్నులై యుండే కమ్యూనిస్టులకు కొమింటాంగు పార్టీపై పెత్తనంవచ్చింది టాన్‌పింగ్‌షాన్, మోపీ యాంగులవంటి ప్రముఖ కమ్యూనిస్టులు ప్రభుత్వశాఖలలోని ఉన్నతో ద్యోగముల నుండి తొలగింపబడినప్పటికీ పార్టీశాఖ లన్నిటిపైనను కమ్యూనిస్టులే పెత్తనం వహించారు. కమ్యూనిస్టుల కార్యక్రమం ప్రజా సామాన్యాన్ని వారివైపు ఆకర్షించింది. కమూనిస్టు అంతర్జాతీయ సంస్థ చైనాప్రభుత్వమునకు చైనా విప్లవమునకు చేయుచున్న సహాయం సోవియట్ ప్రభుత్వం తమ ప్రత్యేకహక్కులను వదులుకోవడం, కమూనిస్టుల బలుకుబడిని అనేకరెట్లు వృద్ధిపరచింది. ఉత్తరరాష్ట్ర దండ

యాత్రలో మార్షల్ బ్లూషర్ బొరోడిన్‌ల యుద్ధనీతివలననే చైనాజాతీయ సైన్యాలకు విజయపరంపర కలుగుతోందనే ప్రతిష్ఠకలిగింది. రష్యన్ సలహాదార్లు, కమ్యూనిస్టులు యీ అనుకూల పరిస్థితుల్లో ప్రచారాన్ని చాల జోరుచేశారు. కేంద్రకార్యనిర్వాహక వర్గంలో సూచీన్, డాక్టర్ సన్‌యట్ సేన్ కుమారుడైన సన్‌ఫోలు కమ్యూనిస్టు విధానాన్ని బాగా బలపరిచేవారు

1926 అక్టోబరు 15 వ తేదీనాటినుండి వివిధ రాష్ట్ర పార్టీ ప్రతినిధులతో కూడిన కేంద్ర కార్యనిర్వాహకవర్గ ద్వితీయ విస్తృత సమావేశం జరిగింది. దక్షిణచైనా అంతటా విప్లవ ప్రభుత్వానికి లోబడుటవలన ఉత్పన్నమైన సమస్య లనేకములు చర్చింపబడి ముఖ్యమైన నిర్ణయాలు చెయ్యబడ్డాయి. రాష్ట్ర ప్రతినిధులతోను, కేంద్ర కార్యనిర్వాహక వర్గం వారిచే నియమింపబడిన వారితోను కలసిన కమిటీలచే పాలింపబడు విధానం రాష్ట్రాలలో నెలకొల్పుటకు తీర్మానించబడింది. పారిశ్రామిక రక్షణ, చట్టవిరుద్ధమైన పన్నుల విధానాన్ని రద్దుచేయుట, నాలుగవవంతు వ్యావసాయిక పన్నుల తగ్గింపు, వడ్డీరేట్లను తగ్గించుట పేద్యదారులకు జిరాయితీ హక్కుల నిచ్చుట, సమ్మె హక్కుతో కూడుకున్న కార్మిక చట్టాలు, కార్మిక పారిశ్రామికదార్ల తగవుల పరిష్కార సంఘాలు , నెలకొల్పుట మున్నగు కొమింటాంగు పార్టీ కనీస ప్రణాళిక ఆమోదింపబడింది. విప్లవప్రభుత్వానికి లోబడిన ప్రదేశం విస్తరించుటచేత కాంటన్ నుండి ప్రభుత్వస్థానాన్ని వూహాన్‌కు మార్చేందుకుకూడా నిర్ణయించారు. చియాంగుయొక్క నిరంకుశ ప్రైఖరిని గమనిస్తూన్న అతివాదులు యూరప్‌లో విశ్రాంతి తీసుకుంటూన్న వాంగుచింగ్‌వీని మరల చైనాకు తీసికొని రావలయునని గొప్ప ఆందోళన చేశారు. వ్యక్తిగతంగా అధికారాన్ని స్థిరపరచుకోవాలని ప్రయత్నించే చియాంగు ప్రయత్నాలను అరికట్టుటకుగాను చియాంగు వ్యతిరేకోద్యమాన్ని కమ్యూనిస్టులుకూడ బలపరిచారు.

1927 మార్చినాటికిచియాంగు కియాంగ్సు, అన్‌హ్వీ, చెకియాంగు పూకీణ రాష్ట్రాలను అధికారంలోకి తెచ్చుకొవి లీచీసేన్, హ్వాంగుషోసి యంగ్‌ల ద్వారా క్వాంటంగు, క్వాంగ్సీలలో స్వాధికారం చలాయించ గలిగాడు. కేంద్రకార్యవర్గానికీ, జాతీయ ప్రభుత్వానికీ హూనాణ, హూపే కియాంగ్సీలు లోబడి వున్నాయి వాంగు చైనాకు తిరిగి వచ్చేందుకు యిష్టపడని చియాంగ్‌కైషేక్ షాంఘే పట్టుబడి తన అధికారం దృఢంగా పాతుకున్న తర్వాత, కమ్యూనిస్టుల నణచేందుకుగాను వాంగుచింగ్‌పీని చైనా రమ్మని వత్తిడి చేయనారంభించాడు.

## తృతీయ విస్తృత సమావేశం.

కేంద్ర కార్యవర్గంవారు ఊహాన్‌లో మూడవ విస్తృత సమావేశం జరిపారు. చియాంగ్‌కైషేక్ యిందులో పాల్గొన లేదు. కమ్యూనిస్టులు చాల హెచ్చుగానుండుటవలన సమావేశంలో వారి విధానము ననుసరించి నిర్ణయాలు చెయ్యబడ్డాయి ఇంతవరకును వాంగుచింగుపీ అధ్యక్షుడుగా వుంటూన్న రాజకీయ సంఘంలోని అధ్యక్ష పదవిని రద్దుచేసి, ఏడుగురు సభ్యులతో కూడిన పాలకవర్గం-(ప్రెసీడియం) యేర్పాటు చేశారు. జాతీయ ప్రభుత్వ అధ్యక్ష పదవి రద్దుచెయ్యబడి, 5 గురు సభ్యులతో కూడిన స్టాండింగు కమిటీయును, సైనికసంఘ అధ్యక్షపదవి రద్దుచెయ్యబడి యేడుగురు సభ్యులతోకూడిన ప్రెసీడియమును యేర్పాటు చేయు నట్లుగా సవరించారు. వ్యక్తుల ప్రాబల్యం తగ్గించి వ్యక్తినియంతృత్వానికి స్థానం లేకుండా చేసేందుకు కమ్యూనిష్టుసభ్యులు యీ ప్రయత్నాన్ని చేశారు. కేంద్రకార్యవర్గం, కొమింటాంగు నాయకత్వంకూడా అధిక సంఖ్యాకుల వలన కమ్యూనిస్టులకు లభించాయి. కమ్యూనిస్టు అంతర్జాతీయ సంస్థ ప్రతినిధి అయిన కమ్యూనిస్టు నాయకుడు టాన్‌పింగ్‌షాన్

కర్షక శాఖామంత్రిగాను, హాంకాంగు సమ్మెలో ప్రసిద్ధిబొందిన సుషో చింగు కార్మికశాఖామంత్రిగాను నియమింపబడ్డారు.

1927 ఏప్రిలు మొదటితేదీనాడు వాంగుచింగుపీ షాంఘైరాగానే చియాంగ్‌కైషేక్, చాంగుచింగ్‌జంగ్, వూచీహుయి, లీషీచెంగ్ మున్నగు అనుచర బృందంతో ఎచ్చి వాంగును కలుసుకున్నాడు. కేంద్ర కార్యవర్గం, పార్టీ కమ్యూనిస్టుల పలుకుబడిలోకి వచ్చాయి కనుక తాను వాటిని గుర్తించవలుచుకో లేదనీ. తన సూచనల నంగీకరిస్తే వాంగు నాయకత్వాన్ని అంగీకరిస్తాననీ చెప్పాడు. బొరోడిన్‌ను చైనానుండి వెడలగొట్టుట, కమ్యూనిస్టులను కొమింటాంగు నుండి వెడలగొట్టుట అను యీ రెండు చియాంగు సూచనలనూ వెంటనే అమలుపరిచవలయు నని నిష్కర్షగా చెప్పాడు. కేంద్ర కార్యనిర్వాహక వర్గమూ, జాతీయ ప్రభుత్వమూ ఊహాణాలో వుంటే యీ పను లెట్లా సాగుతాయి ?" అని వాంగు అడిగాడు. కేంద్ర కార్యవర్గం, జాతీయప్రభుత్వం కమ్యూనిస్టుల అధికారంలో వున్నాయి. కనుక బొరోడిన్‌ను, కమ్యూనిస్టులను తొలగించాలని మాత్రమే మనం ప్రయత్నం చేస్తున్నాము"అని జంగు సమాధాన మిచ్చాడు. రాజ్యాంగ చట్ట నిబంధనల ప్రకారంగా యీ పని జరిపేందుకు వీలు లేదంటే, ఊచీహ్వీ "అమాట నిజమే కాని, మనకి రాజ్యాంగ చట్టంతో పనేముంది ?" అని అన్నాడు.

చియాంగ్‌కైషేక్ బృందం పార్టీపైన తమ అధికారాన్ని నిలుపుకునేందుకు పన్నే కుట్రలకు, చేసే తిరుగుబాటు యత్నాలకు వాంగుచింగ్‌పీ తాత్కాలికంగా లొంగలేదు వాంగుకు పార్టీ రాజకీయ వ్యవహారాలను వదలి, సైనికాధికారాన్నంతా తన గుప్పిటలో ఉంచుకొనవలెనని చియాంగు చేసే ప్రయత్నాన్ని వాంగు హర్షించలేదు. ఈ అధికారాలను వ్యక్తులకు కేంద్ర కార్యవర్గమేయివ్వాలి. కాని చియాంగుకైషేక్‌కు అధికారం లేదనీ కమ్యూనిస్టులను కొమింటాంగులో జేర్చుకోవడం, రష్యాతో స్నేహంగా ప్రవర్తించడం అను యీ రెండు విధానాలూ డాక్టర్ సన్ చేత అమలు జరుపబడ్డాయి. కనుక వాటిని నిరంకుశంగా మార్చుటకు

వీలులేదనీ వాంగు అభిప్రాయాన్ని వెళ్ళబుచ్చాడు. ఈ విధంగా యేఒక్క వ్యక్తియైనా నియంతవలె పార్టీ కార్యవర్గాన్ని ధిక్కరించి పనిచేస్తే, పార్టీ నిర్మాణమే విచ్ఛిన్న మవుతుందనికూడా వాదించాడు పునస్ఫూర్తిగా సర్వకాల సర్వావస్థలయందు విప్లవం కొరకు పనిచేసే కమ్యూనిస్టులను కొమింటాంగునుండి వెడలగొడితే పార్టీయందు స్వార్థపరులూ, అభివృద్ధి నిరోధకులూ, విప్లవ వ్యతిరేకులు మాత్రమే జేరుతారనికూడా వాంగ్ చెప్పాడు. ఇనప్పటికీ కమ్యూనిస్టుభావాలను వ్యాపింపచేస్తూ కొమింటాంగులో హెచ్చు పలుకుబడి సంపాదించిన కమ్యూనిస్టులను మాత్రం పార్టీలో ఉండనీయ కూడదని చియాంగుతో యేకీభవించాడు.

చియాంగ్‌కైషేక్ మురావారు వాంగుతో 5 రోజులు కమ్యూనిస్టుల మీద కొండెములు చెప్పారు. తుట్టతుదకు కమ్యూనిస్టులు ప్రభుత్వంమీద తిరగబడి సోవియట్ విధానాన్ని అమలు పరిచేందుకు ప్రయత్నిస్తారని కూడ వాంగ్‌తో చెప్పగా, కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శియైన చెన్ టుస్యూను పిలిపించాడు చెన్‌టుస్యూ యీ నిందలన్నీ నిరాధారాలని చెప్పి వాంగ్‌తో కలసి ఒక నివేదికను ప్రకటించాడు. మూడు ప్రజా సూత్రాలను ఆమోదించి, కొమింటాంగులో జేరిన కమ్యూనిస్టులు సన్‌జోఫే నివేదిక యెడల విశ్వాసంతో వుండాలనీ, వాంగు, స్ట్యూ లిన్టాకూడా కమ్యూనిస్టు కొమింటాంగు అంతిమ ఆశయాలు భిన్నమైనవనీ, భవిష్యత్తులో విడిపోవుట తప్పనిసరి యనీ గుర్తించుచున్నప్పటికినీ, ప్రస్తుతంలో మాత్రం కమ్యూనిస్టులు కొమింటాంగుకు లోబడి వుండాలనీ యీ నివేదికయందు వ్రాశారు. కొమింటాంగులో కమ్యూనిస్టుల పలుకుబడినిసహించని వాంగ్ కేంద్ర కార్యవర్గంలో వున్న 12 గురు కొమింటాంగు సభ్యులను కూడగట్టి తృతీయ విస్తృతసమావేశంలో చేయబడిన నిర్ణయాలనుమార్చుటకుగాను ఊహాన్‌రాష్ట్రంలోని హాంకోకు ప్రయాణమై వెళ్ళాడు. కేంద్ర కార్యవర్గంలో 5 గురు మాత్రమే కమ్యూనిస్టు సభ్యులున్నారు. అందువలన చతుర్థ విస్తృత సమావేశాన్ని నాన్కింగు నగరంలో పెట్టి జంగు కైషేక్ ముఠానుకూడ కూడగట్టుకొని రావలెనని యెత్తు యెత్తాడు.

# 10 వ అధ్యాయం.

## కొమింటాంగ్ లో చీలికలు



### జంగ్ కై షేక్ విద్రోహం.

షాంఘే, నాన్కింగులను జంగుకై షేక్ వశపరచుకున్న వెంటనే, ఆ పట్టణాలలో వున్న దేశీయ పరిశ్రమదారులు, బ్యాంకర్లు, భూకామందులు, వ్యాపారస్తులూ జంగ్ కై షేక్ చుట్టూచేరి కమ్యూనిస్టులపై ద్వేషమును పురిగొల్ప నారంభించారు. ప్రజా సామాన్యంలో కమ్యూనిస్టులకు పలుకుబడి హెచ్చడం, కేంద్రకార్యవర్గంలో తనకు స్థానం లేకపోవడం జంగుకు బొరోడిన్ మీద, కమ్యూనిస్టులమీద తీవ్రమైన వైరం కలిగించాయి. వాంగు వచ్చి తనకు సంపూర్ణంగా తోడ్పడి, తన అధికారాన్ని నిలుపుతాడేమో అనుకుంటే, వాంగు పార్టీ నిబంధనా వళిని అతిక్రమించకూడదని ధర్మపన్నాలు చదివాడు. వ్యక్తి నియంతృత్వానికి వ్యతిరేకతనుకూడా తెల్పాడు. అందువలన, జంగుకై షేక్ కేంద్ర కార్యవర్గాన్ని, జాతీయ ప్రభుత్వాన్ని ధిక్కరించి, కమ్యూనిస్టులను నాశనంచేయ పూనుకున్నాడు. మితవాదులు, ధనాఢ్యవర్గమూ అతని పక్షాన చేరారు. జమీందార్లు, పారిశ్రామిక యజమానులు నిర్దాక్షిణ్యంగా కార్మిక, కర్షకోద్యమాలను అణచివేయమని తమ మార్గం నిష్కంటకం చేయమనీ తొందరపెట్టసాగారు. జంగుకై షేక్ కు కమ్యూనిస్టులను నాశనం చేసేందుకుగాను పుష్కలంగా డబ్బు లభించింది. ఈ విప్లవ వ్యతిరేకుల నందరినీ జేర్చి అభివృద్ధి నిరోధక ప్రభుత్వాన్ని నాన్కింగులో స్థాపించాడు.

అకస్మాత్తుగా 1927 ఏప్రిల్ 12 వ తేదీని జంగుకై షేక్ షాంఘే లోని కమ్యూనిస్టులను, అభిమానులను వేలకొలది అరెస్టు చేయించాడు. ఏ కూలీలైతే సమ్మెసాగించి తన శతృవులకు వత్తిడి కలిగించి, తన

విజయానికి కారణభూతులయ్యారో, ఆ షాంఘై కార్మికుల మీదనే నిష్ఠారిణంగా ఫిరంగులతో కాల్పించి వేలకొలది కూలీలను చంపించాడు. కమ్యూనిస్టు అనిగాని, కమ్యూనిస్టు ఉద్యమాభిమాని అనిగాని అనుమానం ఉన్నవారినల్లా నిర్బంధించి బాధించాడు.

ఏప్రిల్ 15 నాడు నాన్కింగు వెళ్ళి ఊచీహ్వా, లీషీసెంగు, చాంగుచింగుజంగు, షేయువాన్‌పీ, హూహాన్‌మిన్, చెన్‌కోఫూ లతో పరొక కేంద్ర కార్యవర్గాన్ని 18 వ తేదీని కొత్త జాతీయ ప్రభుత్వాన్ని నెలకొల్పి, పవిత్రోద్యమం పేరుతో కమ్యూనిస్టు వ్యతిరేక ఉద్యమాన్ని అమలు జరుపసాగాడు.

షాంఘై హత్యలు, కమ్యూనిస్టు నిర్బంధాలు దేశంలో గొప్ప అలజడిని కలిగించాయి. దేశమంతా అట్టుడికినట్లు ఉడికిపోయింది దేశంలో నాలుగు మూలలా వున్న కమ్యూనిస్టులందరూ యీ హత్యలకు కారకుడైన జంగుమీద ఆగ్రహావేశంతో మండిపడ్డారు. పారిశ్రామిక కార్మికులందరూ యీ దారుణ చర్యను గర్హిస్తూ ప్రదర్శనాలు జరిపారు. రైతులు జంగును విప్లవ ద్రోహి యని ఖండించారు.

## ఊహాన్ పరిస్థితులు.

జంగ్ హాంకో ప్రభుత్వంపై యెదురు తిరిగి మరొక ప్రభుత్వాన్ని నాన్కింగులో నెలకొల్పాడనే వార్త వాంగ్‌కు విస్మయ, క్రోధాలు కలిగించింది. వెంటనే ఏప్రిల్ 17 నాడు కేంద్రకార్యనిర్వాహకవర్గ సమావేశం జరిపి జంగ్‌కైషేక్, ఊచీహ్వాలను, నాన్కింగు తిరుగుబాటులో పాల్గొన్న అందరినీ పార్టీనుండి తొలగించివేశారు. అన్నిపదవులనుండీ తీసివేశారు. సినలైన కొమింటాంగు వాదులందరూ వాంగ్ చుట్టూచేరి కమ్యూనిస్టులను అధికారాలనుండి తొలగించి, అణచియుంచుటకు తీవ్రంగా వాంగ్ నాయకత్వాన పనిచేశారు.

ఊహాన్‌లో 3 లక్షలమంది కార్మికులు సమ్మెచేశారు. పారిశ్రామిక కార్యకలాపాలన్నీ స్తంభించాయి. ఫాక్టరీలన్నీ మూయబడ్డాయి యజమానులు, పనివారలు కలహిస్తున్నారు. కమ్యూనిస్టుల ఆధికారంలోవున్న హూపేలోని హన్యాంగుజిల్లాలో 15 యంత్రాగారాలను కార్మికసంఘాల యాజమాన్యంలో నడిపించుటకు పూనుకున్నారు ఈ పనివలన ప్రభుత్వాదాయం పూర్తిగా పడిపోయింది. వ్యక్తుల నుండి యంత్రాగారాలను ఏకపరచుకొని ప్రభుత్వమే నడిపించాలని కార్మికులు కోరారు. కాని యజమానులు అనేక పన్నాగాలు పన్ని కొమింటాంగు వాదులపై కూలీలను అణచవలసిందిగా ఒత్తిడి తేనారంభించారు. ఈ కల్లోలపరిస్థితులలో ప్రభుత్వ బలహీనత మరింతగా వెల్లడైంది. అప్పుడు పార్టీని సమావేశపరచి, ఎన్నుకోబడిన కమ్యూనిస్టు సభ్యులనందరినీ హన్యాంగు శాఖ నుండి తొలగించివేసి, కొమింటాంగు పక్షీయులతో కూడిన సంఘాన్ని నియమించవలసిందనీ, లేనిచో ప్రభుత్వాదాయం పడిపోతుందనీ, వ్యాపారం, ఉత్పత్తి క్షీణిస్తాయనీ వాంగు వాదించి, ఆ విధంగా చాలా కష్టంమీద అమలుజరిపాడు.

పట్టణాలలోనే కాక పల్లెప్రాంతాలలోకూడ గొప్ప సంచలనం పుట్టింది విదేశ సామ్రాజ్యవాదులు చైనాను యంత్రపు సరుకులతో ముంచెత్తుచుండుట చేతనూ, దేశంలోకూడ విరివిగా యంత్రాగారాలు నెలకొల్ప బడుటచేతనూ, చేతిపరిశ్రమలు నాశనమై పల్లెప్రాంతాలలోని ప్రజలందరూ వ్యవసాయ వృత్తి మీదనే ఆధారపడ్డారు. సేద్యగాండ్రు హెచ్చుటతో భూమికి మక్తాలు, కట్టుబళ్ళు చాల విపరీతంగా హెచ్చాయి. రైతుల ఋణం విపరీతంగా పెరిగిపోయించి సైనిక ప్రభువుల నిరంతర సంఘర్షణ వలనను, దోపిడిగాండ్ర ముఠాల వలనను పల్లెటూళ్ళలో శాంతి భద్రతలు కొదువ అయాయి. జమీందార్ల, భూఖామందుల దోపిడీ విధానం వలన రైతుల కష్టా లపరిమితమై, అక్కడక్కడ మితిలేని

ఆగ్రహంతో రైతులు జమీందార్లను హత్యలు చెయ్యడంకూడ జరుగుతూండేది. రైతులలో సహజంగా వున్న భూతృష్ణకు తోడుగా, కమ్యూనిస్టు భావప్రచారం అగ్నికి, వాయువు తోడైనట్లుంది. రైతులు కమ్యూనిస్టు భావాలను చాల త్వరగా స్వీకరించారు. కష్టించేవారికే భూమి చెందాలనే వినాదాన్ని రైతులాచరణ యందుంచుటకు తొందరపడ సాగారు. చైనాగ్రామీణులను మూడురకాలుగా విభజింపవచ్చును. భూకామందులు, వ్యవసాయదారులు, నిర్వ్యాపారులు. వ్యవసాయదారులు, వ్యవసాయ కూలీలు తరుచుగా ఋణగ్రస్తులై, తమ ఆడబిడ్డలను భూమందులకు అమ్ముకోవలసిన దైన్యపరిస్థితుల్లో వుంటారు. వీరి కష్టాలపరిమితం నిరంతరం కష్టజీవితానికి పేరుబడిన చైనారైతుకు రోజుకొక్కపూట తిండికూడా సంవత్సరం పొడుగునా లభించేదికాదు. ఈ దుర్భరపరిస్థితులు చాలవన్నట్లు జమీందార్లు భోగభాగ్యాలతో తులతూగుతో, అనేక అత్యాచారాలు చేసేవారు రైతులను నిర్దాక్షిణ్యంగా హింసించేవారు. జమీందార్లు మింటువాన్ అను స్వంతసైన్యాన్ని పోషిస్తో, రైతులమీద దౌర్జన్యాలు చేసేవారు. దుర్బలులు, నిరంకుశులు అయిన చక్రవర్తుల పాలనలోగాని, చక్రవర్తిని తొలగించిన తర్వాత దేశాన్ని పీడించిన సైనికప్రభువుల పరిపాలనలోగాని రైతుకు రక్షణలేదు. విద్యాగంధంలేని రైతు, ఆర్థికంగా కృంగినరైతు, పౌరసత్వ హక్కులు లేనిరైతు చాల దైన్యంగా జీవితాన్ని గడిపేవాడు. అట్టి రైతులలో కమ్యూనిస్టులు నిరంతర ఆందోళన వలన ఆత్మాభిమానాన్ని రేకెత్తించి, వర్గచైతన్యాన్ని కలిగింపజొచ్చారు. రాజకీయసంఘంలో ఒకపర్యాయం కమ్యూనిస్టులు జమీందార్లవద్దనుండి భూములను జప్తుచేసి వ్యవసాయదార్లకివ్వాలి అనే ప్రణాళికను ప్రవేశపెట్టేందుకు ప్రయత్నించారు కాని వాంగుచింగ్‌వీ పూర్తిగా వ్యతిరేకించారు జమీందార్లు, ధనికవర్గప్రయోజనాలను రక్షింపజూచే తదితర కొమింటాంగు నాయకులు రాజకీయసంఘంలో యీ తీర్మానాన్ని ఓడించారు. హునాన్ రాష్ట్రంలో ప్రథమమున యీ విధానాన్ని

అమలుజరిపి పరీక్షించవలసిందిగా కమ్యూనిస్టులు పట్టుబట్టారు. అత్యధిక సంఖ్యాకులైన చైనారైతులోకం రాజకీయ రంగంలో ప్రవేశిస్తేనేకాని చైనావిప్లవం విజయవంతం కాజాలదనీ, రైతులు రాజకీయరంగంలోకి రావాలంటే వారికి వర్గచైతన్యం కలగాలనీ, అందుకుగాను భూమిని జప్తుచేసి, వారికి పంచాలనీ కమ్యూనిస్టులు వాదించారు. కాని సైన్యాలలో భూకామందుల పుత్రులు అధికార్లుగా వున్నారనీ యీ విధానం అమలు జరిపితే వారందరూ విప్లవప్రభుత్వానికి ప్రతికూలురౌతారనే సాకుతో వాంగ్ యీ సూచనలను త్రోసిపుచ్చాడు ఐతే, రైతులలో యీ అగ్ని రాజుకుంటూనేవున్నది. తరుణంకొరకు చూస్తున్నారు.

టాన్‌యెన్‌కే, చెంగ్‌చీన్, టాంగ్‌షెంగుచీల అధికారంలో వున్న ఉద్యోగులందరూ హూనాన్, హూపే రాష్ట్రాలలోవున్న జమీందార్ల కుటుంబాలకు చెందినవారే. రైతు సమస్యల విషయంలో జమీందార్ల వర్గలాభాలకు నష్టం రాకుండా వుండునట్లు చూచేవారు. ఈ అధికార్లు తిరుగబడతారని వాంగ్ అపరిమితంగా భయపడేవాడు. అందువలన కొమింటాంగు సభ్యులు తమ ప్రభుత్వం ద్వారా రైతుకు ఉపకరించే పెద్ద మార్పులను తీసికొనివచ్చుటకు వ్యతిరేకించడమే కాక అట్టి ప్రయత్నాలను అణచివేసేవారు.

రైతు సమస్యమీద చైనా కమ్యూనిస్టుపార్టీలోనే తీవ్రమైన అభిప్రాయభేదాలు వచ్చాయి. పార్టీకి సలహా యిచ్చుటకు కొత్తగా వచ్చిన యమ్. యన్. రాయ్ చైనాలో వెంటనే జమీందార్ల, భూకామందుల భూములను పరిహారం యివ్వకుండా స్వాధీనం చేసుకునే విధానాన్ని అమలుపరచ వలసిందని బోధించాడు. మొందుమండీ కొమింటాంగు కార్యక్రమాన్ని నడిపిస్తో, కొమింటాంగు పక్షీయుల మనస్తత్వాన్నీ, బలాన్నీ సంపూర్ణంగా యెరిగివున్న బొరోడిన్ యీ విధానం వెంటనే ఆచరణలో పెట్టకూడదని వాదించాడు. కొమింటాంగు కేంద్ర కార్య

నిర్వాహక వర్గంలో సభ్యుడుగా వున్న టాకాపింగ్‌షాన్ కూడా యీ ఉద్దేశాన్నే కలిగి వున్నాడు. అయినప్పటికీ తృతీయ అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థలో బుఖారిన్ మున్నగువారు వెంటనే ప్రపంచ విప్లవం తీసికొని వచ్చేందుకుగాను, చైనాలో భూములను జప్తుచేసి రైతులకు పంచి రైతు సైనిక దళాల నేర్పరచాలని నిర్ణయించారు ఈ నిర్ణయాన్ని యమ్. యన్. రాయి అమలు జరిపించ ప్రయత్నించాడు. తత్ఫలితంగా 1927 మే 21 నాడు హూనాన్‌రాష్ట్ర ముఖ్యపట్టణమైన చాంగ్షాలో కొమింటాంగు తీర్మానించిన 'భూమి దున్నేవారిదే' అను విధానాన్ని కమ్యూనిస్టులు అమలు జరువ ప్రయత్నించుటవలన ఊహాకా ప్రభుత్వ సైనికులలోని భూస్వాములు కలహించసాగారు ఆ రాష్ట్ర కొమింటాంగు పార్టీయున్ను, రాష్ట్రప్రభుత్వమున్ను కమ్యూనిస్టుల ప్రాబల్యంలో వున్నప్పటికినీ, సైనికులలో సంఘర్షణలు జోరుగా సాగాయి. ఈ కలహాలకు కారణభూతులైనవారిని శిక్షించవలసిందని బొరోడిను, కేంద్ర కార్యవర్గంలోని కమ్యూనిస్టు సభ్యులూ చెప్పినప్పటికినీ వాంగ్ పెడచెవిని బెట్టి, కలహకారకులైన కొమింటాంగు సైనికులను వెనుకవేసుకొని వచ్చాడు.

హాంకో ప్రభుత్వ విదేశాంగ కార్యదర్శి అయిన యుజేన్‌చేకా విదేశ సామ్రాజ్యవాదులకు చైనాలోగల కౌలుభూములు, వలస పట్టణాల విషయంలో దృఢమైన కార్యవిధానాన్ని అమలు జరిపేవాడు కాదు. ప్రజలందరూ యీ అవమానాన్ని సహించలేక, ఉద్రిక్తులై గొప్ప వ్యతిరేక ప్రదర్శనాలు చేశారు. ప్రజలలో వ్యాపించిన యీ అసంతృప్తిని ఉపయోగించి ఒత్తిడి తీసుకొనివచ్చి చైనా సంపూర్ణ స్వాతంత్ర్యం సంపాదించవలసిందని బొరోడిన్ సలహా యిస్తూన్నప్పటికీ యుజేకాచేకా పెడచెవిని పెట్టేవాడు. హాంకో, కియుకియాంగ్‌లలో బ్రిటిషువారు అనుభవించుచున్న అక్రమపు కౌలు భూములను రద్దుచేయు విషయంలో 1927 జనవరి నెలలో బొరోడిన్ రాయబారాలు జరిపి, బ్రిటిషు ప్రభుత్వంచే యీ కౌళ్ళను రద్దుచేయించి హాంకో ప్రభుత్వానికి గొప్ప ప్రతిష్ఠ కూర్చాడు.

1925 జూన్ 23 వ తేదీని షామీన్ కాల్పులు జరిగినప్పుడు ఉద్రేక పర వశులైన సైనికులు కాంటన్ ఆంగ్లో, ఫ్రెంచి వలసను ముట్టడిస్తామన్నప్పుడు, ఒక్క రాష్ట్రంలోకూడా కొమింటాంగుకు సరియైన బలం లేనప్పుడు ఆ ప్రయత్నం చేస్తే బ్రిటిషువారు, ఫ్రెంచివారు కొమింటాంగును దౌర్జన్యంగా అణచేందుకు సైనిక ప్రభువులకు తోడ్పడతారని కూడా బొరోడిన్ చెప్పాడు. అట్టి బొరోడినే 1927 లో కొమింటాంగు బల పడిన తర్వాత సామ్రాజ్యవాదులను బెదరించి, వారనుభవిస్తూన్న కౌళ్ళను రద్దు చేయవలసిందిగా సలహా యిచ్చాడు. కాని జంగ్‌కై షేక్ అతని అనుచర బృందము, యూజేన్‌చేన్ మున్నగువారు బ్రిటను, ఫ్రాన్సు, మున్నగు దేశాల పట్ల అణకువగా వుండి వారి దయసంపాదించి వ్యక్తి గత ప్రాబల్యము, ధనికవర్గ ప్రాబల్యము కొరకూ ప్రాకులాడారు. కాని కొమింటాంగు ప్రచారం వలన సామ్రాజ్య వ్యతిరేక భావాలు కలిగిన ప్రజలు హూనాన్, హూపే రాష్ట్రాలలో బ్రిటిషు, ఫ్రెంచి వలసలను, విదేశస్థులను యెదుర్కొన జొచ్చారు. ఈ రాష్ట్రాలలో ప్రచారం చేసే కమ్యూనిస్టులే, యీ అల్లర్లను ప్రోత్సహిస్తున్నారని యూజేన్‌చేన్ నిందలు మోపాడు. హాంకో ప్రభుత్వం తాము సామ్రాజ్యవాద వ్యతిరేకులైనప్పటికీ, విదేశస్థులకు వ్యతిరేకులు కారనీ వారి ఆస్తికి ప్రాణాలకు నష్టం కలిగించరాదనీ ప్రకటించారు.

కొమింటాంగు పార్టీ కేంద్ర కార్యవర్గంలోని కొమింటాంగు సభ్యులు వాంగ్ ప్రోత్సాహంమీద ముందు సమావేశమై ఆలోచించి, తీర్మానాలుచేసి, వాటినే తక్కువగావున్న కమ్యూనిస్టులమీద కూడా రుద్దేవారు. వివిధసైనిక రంగాల్లోనూ కొమింటాంగు పరిస్థితులు ఒడిదుడుకుగా వుండుటచేత కమ్యూనిస్టులను పార్టీనుండి అప్పుడే వెళ్ళగొట్టలేదు.

కొమింటాంగు పార్టీనుండి వెళ్ళగొట్టబడిన జంగ్‌కై షేక్, హాంకో ప్రభుత్వంమీద దండెత్తేందుకు సన్నాహాలు చేశాడు అదే సమయంలో హూనాన్ రాష్ట్రంలో హాంకో ప్రభుత్వసైన్యాలు చాంగ్‌ఫోలిన్ సలన

ఓడింపబడ్డాయి. చాంగ్‌సోలిన్ హోనాన్ రాష్ట్రంమీద దండెత్తేందుకు కూడా సిద్ధంగా వున్నారు ఈ ఒడిదుడుకు పరిస్థితుల్లో రాజకీయసంఘం 1927 ఏప్రిల్ 19 వ తేదీని చాంగ్‌సోలిన్‌ను యెదుర్కొనేందుకే నిశ్చయించారు. టాంగుచెంగ్‌చీ సర్వసైన్యాధ్యక్షుడుగా నియమింపబడ్డాడు కొమింటాంగు సైన్యాలలోకెల్ల ఉత్తమమైన 8,35,36,4,11 సైన్యాలు టాంగుషెంగ్‌చీ. ఉక్కుతునక అని ప్రసిద్ధిచెందిన చాంగ్‌ఫాక్వీల నాయకత్వాన చాంగ్‌సోలిన్ మీద పడుటకును, ఫెంగ్‌యుసియాంగ్ పడమటినుండి ముట్టడించుటకును తీర్మానించుకున్నారు చాంగ్‌చంగ్‌చాంగ్ సైన్యాలతో షాంటంగునుండి నాన్కింగుమీద పడతాడనే భయంతో జంగ్‌కైషేక్ ఆత్మరక్షణలో ఉండిపోయాడు.

1927 మే మాసంలో చాంగ్‌సోలిన్‌కును, కొమింటాంగు సైన్యాలకును భీషణయుద్ధంజరిగింది చాంగ్‌సోలిన్ ముక్డెన్ సైన్యాలు సంఖ్యలోను, ఆయుధసామగ్రిలోను చాలహెచ్చుగా మన్నప్పటికీ రాజకీయ సిద్ధాంతాలు, విప్లవప్రయోజనాలు కలిగిన కొమింటాంగు సైన్యాలు పట్టుదలతో పోరాడసాగాయి. అనేక ఘోరయుద్ధాల అనంతరం ప్రభుత్వ సైన్యాలు విజయంపొంది పెకింగు-హాంకో రైలుమీద చెంగ్‌చౌ వైపు వెళ్లాయి ఈ యుద్ధంలో 70 వేలమంది నష్టపడ్డారు మే 28 వ తేదీని చాంగ్‌సోలిన్ సంపూర్ణంగా ఓడిపోయి, యెల్లోనది ఉత్తరపు వైపునకు సైన్యాలను మళ్ళించుకు పోయాడు. హోనాన్‌లో చెంగ్‌చౌ, కైఫెంగు నగరాలను పట్టుకోవడంతో యుద్ధం ముగిసింది. జంగ్‌కైషేక్ కూడా టీన్‌ట్సిన్, లూంఘే రైల్వేలను పట్టుకొని, శత్రుసైన్యాలను ఓడించాడు.

## కోమింటర్న్ — చైనా కమ్యూనిస్టుపార్టీ.

కొమింటాంగులో కమ్యూనిస్టులను జేర్చుకొనిన నాటినుండి. సన్‌యట్‌సెన్ సోవియట్ రష్యాయందు అపరిమితమైన అభిమానం చూపుతూవచ్చారు. అందుకు ప్రతిఫలంగా 1923 నుండి 1927 లో వచ్చిన

చీలికల పర్యంతమూ సోవియట్ రష్యానుంచి జాతీయచైనాకు అత్యమిత మైన సహాయం లభించేది 1926 వరకూ జినోవీవ్ కమ్యూనిస్టు అంత ర్జాతీయ సంస్థయైన కోమింటర్నుకు అధ్యక్షుడుగా వుండేవాడు. ఆ సమ యంలో కోమింటర్నునుండి చైనాజాతీయ విప్లవానికి సైనిక, రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక సహాయం లభించింది. కోమింటర్న్ సహకారంతో కొమింటాంగు అత్యధికంగా బలపడింది. 1926 నుండి కోమింటర్నులో స్టాలిన్ అనుచరులకునూ, ట్రాట్స్కీ అనుచరులకును తీవ్ర భేదాభిప్రా యాలు వచ్చాయి. చైనా విప్లవం, సోవియట్ రష్యా పునర్నిర్మాణ విష యాల్లో స్టాలిన్ సూచించిన విప్లవకర ఎత్తుగడలు అధిక సంఖ్యాక ప్రతినిధులచే ఆమోదింప బడినందున, ప్రతికూల పక్ష నాయకుడైన ట్రాట్స్కీ, జినోవీవ్, కామెనీవ్‌ల సహాయంతో స్టాలిన్‌ను తీవ్రంగా విమర్శించ సాగాడు. అంతవరకూ కొమింటాంగుతో కమ్యూనిస్టులు సహకారం చేయాలని వాదించిన జినోవీవ్ యిప్పుడు కమ్యూనిస్టులు విడి పోయి, చైనా బూర్జువావర్గాన్ని ఢీకొనాలని ప్రతిపాదించాడు. 1926 లోనే చైనాలో సోవియట్లను స్థాపించవలెనని ట్రాట్స్కీ చేసిన వాదాన్ని యెదుర్కొని స్టాలిన్ చేసిన యీ క్రింది ఉపన్యాసంవలన చైనాపరిస్థితులు సంపూర్ణంగా బోధపడతాయి.

"సామ్రాజ్యదేశాల్లోని విప్లవాలకూ, పరాధీన వలసదేశాల్లోని విప్లవాలకూ తీవ్రభేదాలున్నాయి. పీడక, పీడిత దేశాల విప్లవాల స్వరూప స్వభావాల్లో ప్రముఖమైన తేడాలుంటాయి.

"సామ్రాజ్య దేశంలోని ధనికవర్గం పాలితజాతులను పీడించి, దోచుకుంటుంది; అచ్చటి ధనికవర్గం విప్లవంయొక్క అన్ని దశల్లోను విప్లవ వ్యతిరేకిగానే వుంటుంది; అచ్చట స్వాతంత్ర్య సంఘర్షణలో జాతీయతత్వం ప్రబలమైన విప్లవ ప్రోత్సాహక కారణంగా వుండదు.

"పీడిత, పరాధీన వలస దేశాల్లోని పరిస్థితులు దీనికి సంపూర్ణంగా విరుద్ధంగా వుంటాయి సామ్రాజ్యవాద దేశాల దాస్య శృంఖలాలు, పార

తంత్ర్యము విప్లవకారకంగా వుంటాయి. ఈ బానిసత్వం జాతీయ ధనిక వర్గపు క్షేమ, లాభాలకు భంగం కలిగిస్తుంది. అచ్చటి ధనికవర్గం సామ్రాజ్య వ్యతిరేక విప్లవోద్యమాన్ని కొన్ని దశలవరకు, కొంతకాలం వరకు బలపరుస్తుంది. అచ్చట స్వాతంత్ర్య సంఘర్షణకు జాతీయత ప్రబలకారణ మవుతుంది.

"ముఖ్యమైన యీ విభేదాలను గుర్తించకపోవడం మార్క్సిస్టు లెనినిస్టు పంథాలను వదలి రెండవ అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ యొక్క పెడమార్గాన్నిబట్టి పోవశమన్నమాటే. పీడక, పీడిత దేశాల్లోని విప్లవ స్వభావాన్ని సరిగా అర్థంచేసుకుని, తదనుగుణ్యంగా విప్లవకర యెత్తుగడలను అమలు జరుపకపోవడమే ప్రతికూలవర్గంవారు చేస్తోన్న గొప్ప తప్పిదం అనేక జాతులను, దేశాలను పీడిస్తోందే సామ్రాజ్య వాద దేశమైన జారిస్టు రష్యాలో 1905లో జరిగిన విప్లవమూ, సామ్రాజ్య వాద వ్యతిరేక విప్లవాన్ని కొనసాగిస్తోన్న పీడిత, అర్థవలస దేశమైన చైనా విప్లవమూ ఒక్కటేనని ప్రతికూలపక్షం (ట్రాట్స్కీ, రాడెక్ మొదలైనవారు) వాదించడం కంటె హాస్యాస్పదమైన విషయం వేరొక టుండదు. ఇక్కడ రష్యాలో 1905 విప్లవం బూర్జువా ప్రజాతంత్ర విప్లవ మైనప్పటికీ జాతీయ బూర్జువా వర్గానికీ, ఉదారబూర్జువాలకు వ్యతిరేకంగా కొనసాగించబడింది. ఎందుచేత? సామ్రాజ్యవాద దేశంలోని ఉదార ధనికవర్గంకూడా విప్లవవ్యతిరేకులుగా వుండక మానరు. ఈ కారణం వలననే ఉదార బూర్జువావర్గంతో యే విధమైన తాత్కాలిక యేర్పాట్లూ చేసుకునేందుకు బోల్షివిక్కులు ఆ రోజుల్లో అంగీకరించ లేదు ఈ కార ణాలనే చూపి చైనాలోకూడా విప్లవంయొక్క యే దశలోనూకూడా జాతీయ బూర్జువావర్గంతో యెవ్విధమైన తాత్కాలిక సంబంధమూ యేర్ప రుచుకోకూడదని ప్రతికూల పక్షంవారు వాదిస్తున్నారు. వలస దేశాల్లోని బూర్జువా దాస్య విమోచనోద్యమంలో పాల్గొనేందుకు జాతీయ బూర్జువా

వర్గంతో తాత్కాలికంగా సంయుక్త పక్షాల నేర్పాటుచేయ వలసిన అగ త్యాన్నిగూర్చి లెనిన్ యీ విధంగా వ్రాశాడు :

"వలస దేశాల్లోనూ, వాగా వెనుకబడిన దేశాల్లోనూ జాతీయ బూర్జువా ప్రజాతంత్ర వాదులతో, అతి శైశవావస్థలో నున్నప్పటికీ శ్రామిక వర్గం కొన్ని తాత్కాలికపు యేర్పాట్లుగాని, అవసరాన్నిబట్టి తమ పక్ష నిర్మాణ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకుంటూ సంయుక్త పక్షాన్నిగాని, మైత్రినిగాని తృతీయ కమ్యూనిస్టు అంతర్జాతీయ సంస్థ నెలకొల్పుతుంది. ........కమ్యూనిస్టులమైన మేము వలసదేశాల్లోని బూర్జువా వర్గంతో వలస దేశాల్లోని కార్మిక, కర్షక నిర్మాణానికి, వర్గచైతన్యాభివృద్ధికీ అడ్డు రానంతవరకూ, విప్లవ స్వభావాన్ని కోల్పోనంతవరకూ వారి జాతీయో ద్యమంలో పాల్గొంటాము"

"1905 లో రష్యాలో బూర్జువావర్గంతో యెట్టి సంబంధము, సమాధానము పనికిరాదని ఉరిమిన లెనిన్ వలస దేశాల్లోని శ్రామికవర్గం బూర్జువావర్గంతో ప్రజాతంత్రి విప్లవోద్యమం విప్లవ స్వభావాన్ని కోల్పో నంతవరకూ సహకరించమని చెప్పాడు. ప్రతికూలపక్షంవారు లెనిన్ ఉపదేశాన్ని పూర్తిగా నిరాకరించి ట్రాట్స్కీ వాదాన్ని లేవదీశారు

"చైనా విప్లవదశలనుగూర్చి తెలుసుకుందాము. చైనావిప్లవంలో దశలే లేవని వాదించేటంతటి విప్లవపరిజ్ఞాన శూన్యులయ్యారు ప్రతికూల వర్గంవారు. ఐతే కొన్ని అభివృద్ధికరమైన దశల్లేని యే విప్లవమైనా వుంటుందా? మన రష్యన విప్లవాన్నే ఉదాహరణకు తీసుకోండి. లెనిన్ రచించిన "ఏప్రిలు కరపత్రాన్ని" చూస్తే నిర్దిష్టమైన రెండుదశలు గోచరిస్తాయి. కర్షక విప్లవంమీద ఆధారపడిన బూర్జువా ప్రజాతంత్ర విప్లవం ప్రథమ దశ. రాజ్యాంగ యంత్రాన్ని స్వాధీన పరచుకోవడమే పరిమాణ ధ్యేయంగా పెట్టుకున్న శ్రామికవర్గంయొక్క నవంబరు విప్లవం రెండవ దశ. చైనా విప్లవదశ లేమిటి? మూడుదశలుంటాయని నా ఉద్దేశం.

"మొదటి దశ : జాతీయ సంఘటనయొక్క విప్లవం. దీనిని కాంటన్‌కాలం అని పిలవవచ్చును. ఈ కాలంలో సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవాన్ని జాతీయ బూర్జువావర్గం పూర్తిగా బలపర్చింది.

"రెండవ దశ : జాతీయసైన్యాలు, సైనికప్రభువులలో ఒకరి తర్వాత నొకరి నోడించుతూ యాంగ్‌జీనదిని దాటిన యనంతరం జాతీయ బూర్జువావర్గం, జాతీయ బూర్జువా విప్లవంనుండి తిరుగుముఖంపట్టి వ్యతిరేకించ నారంభిస్తారు ఈ కాలంలోనే చైనా ప్రజాసామాన్యమైన కోట్లకొలది పీడిత రైతులు వర్గచైతన్యంతో యీ విప్లవంలో పాల్గొన నారంభించారు. (ప్రస్తుతం చైనా విప్లవం యీ దశలోనే వుంది) ప్రజలలో కల్గిన యీ రాజకీయ పరిజ్ఞానం, వర్గచైతన్యము, జాతీయ ధనిక వర్గాన్ని భయకంపితులను చేస్తాయి.

"మూడవ దశ : సోవియట్ విప్లవం యింతవరకూ జరుగలేదు కాని త్వరలోనే యీవిప్లవం చేయబడుతుంది

"చైనా విప్లవంయొక్క యీ మూడు దశలను గుర్తించలేనివారు మార్క్సిజాన్ని, లెనినిజాన్ని అర్థంచేసుకోలేదనడం, వారికి చైనా విప్లవ స్వభావం గోచరించలేదనడం సత్యదూరం కాదు.

"చైనా విప్లవంయొక్క స్వాభావిక లక్షణాలలో మొదటిది జాతీయ సంయుక్త సంఘటనయొక్క విప్లవం. రెండవది ముఖ్యంగా సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవం (హాంకాంగ్ సమ్మె ఎగైరాలు) అందువల్లనే ప్రథమ దశలో కాంటన్ విచిత్రంగా విప్లవపీఠం అని చెప్ప వచ్చును. అందులోతప్ప దీనినెవ్వరూ కాదనలేరు.

"అయితే వలసదేశ విప్లవంలో యీ ప్రథమ దశ యీ స్వభావమే కల్గియుంటుందంటారా ? తప్పనిసరిగా యీ లక్షణాలనే కల్గియుంటుంది. కోమింటర్ను రెండవ కాంగ్రెస్సు సమావేశంలో ఇండియా, చైనా విప్లవాలనుగూర్చి "విదేశ దురాక్రమణవలన యీ దేశాలలోని సామాజిక

జీవితాభివృద్ధికి అడుగడుగునా ఆటంకాలు యేర్పడుతున్నాయి. అందు వలన విదేశపెట్టుబడిదారుల పరిపాలనను అంతమొందించడమే యీ దేశ విప్లవాల ప్రధాన లక్ష్యం" అని నిర్దిష్టమైన వాక్యాలలో చెప్పబడింది.

"నేడు చైనావిప్లవం యీదశను గడచి రెండవ దశయైన కర్షక విప్లవానికి దారితీసింది.

"విప్లవ ప్రథమ దశయైన కాంటన్ కాలంలో కొమింటాంగు ప్రభుత్వంలో కార్మికులు, కర్షకులు, మేధావులు, జాతీయ పెట్టుబడి దారులు కలసియున్నారు. వారంచడూ సామ్రాజ్యవాద దేశాలమీద విప్లవం లేవనెత్తి వాలవరకు విదేశ సామ్రాజ్యవాదుల ప్రతిభను క్షీణింపచేసి నందున కాంటన్ ప్రభుత్వాన్ని మనం విప్లవ కేంద్ర మనవచ్చును. సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాటం సాగించినంతవరకూ టర్కీ-లోని కెమాల్‌పాషాకును, చైనాలోని కొమింటాంగుకును సహాయం చెయ్యడంలో మనం విప్లవాన్ని ముందుకు తీసుకొని వెళ్ళాము. ఈ విధంగా సామ్రాజ్యవాదులను బలహీనపరుస్తూ ప్రపంచ విప్లవాన్ని బల పరిచాము.

"అయితే, వలసదేశ విప్లవ ప్రథమ దశలోని జాతీయ పెట్టుబడి దారీ వర్గంతో యేర్పరచే సంయుక్త సంఘటనను యేవిధంగా యేర్పర చాలి? కార్మిక కర్షకులు జాతీయ పెట్టుబడిదారులతోను, భూస్వాముల తోను కలహించక, తమ క్షేమ లాభాలను లెక్కించక వారికి లోబడి యుండవలెనా? కాదు. ఎన్నటికీ అట్లుండరాదు. కార్మిక, కర్షకులను నిర్మాణరీత్యా బలపరిచి, స్వతంత్రంగా రాజకీయ, నిర్మాణ కార్యాచర ణకు సన్నద్ధులనుచేసి, శ్రామిక విప్లవానికి అనుకూల పరిస్థితులను కల్పించజాలకపోయినచో కమ్యూనిస్టులు జాతీయసంయుక్త సంఘటనలో పాల్గొనడంలో అర్థం లేదు. కోమింటర్న్ చైనా కమ్యూనిస్టుపార్టీకి యిట్టి సలహాలనే యిచ్చిందని ఋజువుపరచే పత్రాలనే కామ్రేడ్ బుఖారిన్ తన నివేదికలో ఉదహరించాడు.

"1926 వ సంవత్సరం అక్టోబరు 26 వ తేదీని కేంద్రకమిటీ "షాంఘై పట్టుబడేవరకూ కర్షక విప్లవోద్యమాన్ని రెచ్చగొట్టక, నిలుపు చేయవలసింద"ని పంపిన తంతివార్త చాలా పొరపాటైనది. అందువలననే ఒక నెల లోపుగానే ఆ ఆజ్ఞను ఉపసంహరించివేశారు "

1926 నవంబరుమాసంలో జరిగిన కొమింటర్ను యొక్క సప్తమవిస్తృత సమావేశంలో చేయబడిన తీర్మానంనుండి యీ క్రింది భాగం ఉదహరింపబడింది.

"ప్రస్తుత అసాధారణ పరిస్థితుల్లో బూర్జువావర్గంలో కొంత భాగంతో మైత్రిచేసుకోవడంగాని, కర్షకులతో మైత్రిని యింకా హెచ్చుగా, స్థిరపరుచుకోవడంగాని కార్మికవర్గం చేయవలసియుంది. విప్లవయుతమైన కార్యక్రమాన్ని యిచ్చి కర్షకులను విప్లవోద్యమంలోనికి తీసికొని రానిచో శ్రామికవర్గం యీ విప్లవంలో నాయకత్వం వహించలేదు.

"జాతీయ స్వాతంత్ర్యసమరం, కర్షకవిప్లవంతో ఏకీభావం పొందనిచో కాంటన్ జాతీయప్రభుత్వం అధికారాన్ని నిలుపుకోలేదు. విదేశ సామ్రాజ్యవాదాన్నీ, దేశీయ విప్లవవ్యతిరేకతను రూపుమాపి విప్లవం సంపూర్ణ విజయాన్ని సాధించలేము."

ఈ తీర్మానం కోమింటర్ను యొక్క నాయకత్వ పంథాను సుస్పష్టంగా వెల్లడిస్తోంది.

1926 నవంబరులో ఆ సమావేశంలోనే స్టాలిన్, కోమింటర్ను విస్తృతసమావేశంలో చేసిన యుపన్యాసంనుండి కొన్ని భాగాలను ఉదహరిస్తున్నాము.

"కొమింటాంగు మేధావులును, చైనాయు కమ్యూనిస్టులలో కొందరును, గ్రామాల్లో విప్లవోద్యమం లేవదీసి, కర్షకులను విప్లవంలోనికి తీసికొనివస్తే, సామ్రాజ్యవాదవ్యతిరేక సంయుక్తసంఘటన విచ్ఛిన్నమవుతుందని భయపడుతున్నారని నాకు తెలుసును. ఇది చాల పొర

మైన పోరాటు చైనారైతులెంత త్వరగాను, యెంత సంపూర్ణంగాను విప్లవంలో పాల్గొంటారో, అంత వేగంగా సామ్రాజ్యవాద వ్యతిరేక సంయుక్త సంఘటన బలపడుతుంది

"చైనాకార్మికులు తమ కష్టాలను నివారించుకునేందుకు, తమ జీవితప్రమాణాన్ని అభివృద్ధిచేసుకునేందుకు సమ్మెలుచేయరాదని కొందరు చైనీయ కమ్యూనిస్టులే నిరుత్సాహపరుస్తున్నారని కూడ నాకు తెలుసును.

"ఇది చాలపొరపాటు. చైనాగ్రామికవర్గంయొక్క శక్తిని గూర్చి మీరు చాల తప్పుడు అంచనా వేస్తున్నారు. కాని వాస్తవిక పరిస్థితులు మాత్రం మీనికి విరుద్ధంగా వున్నాయి ఈ పరిస్థితుల్లోనే కార్మికులయొక్క జీవితప్రమాణాన్ని అభివృద్ధిపరచేందుకు మీరు హెచ్చుగా కృషిచెయ్యాలి. కార్మికులు చేసే ప్రయత్నాలకు మీరు తోడుపడాలి. వారి జీవితప్రమాణాన్ని వృద్ధిచేసుకునేందుకు వారు సమ్మెచేసినను సరియే మీరు సహాయం చేయాలి. లేకపోతే చైనావిప్లవం వలన 'ఒనగే లాభమేమిటి ?"

చైనాలోని అన్ని పట్టణాల కార్మికుల సమ్మెలు సంక్షోభానికీ, విప్లవోద్యోగానికీ దారితీస్తున్నాయని ప్రకటనలు వెలువడినప్పుడు 1926 డిసెంబరు నెలలో కోమింటర్ను యీ పత్రం ప్రకటించింది :

"కార్మికుల జీవిత సౌకర్యాల కొరకు చేసే పోరాటాలనుండి సంపూర్ణంగా విరమించుకోవాలనడం తప్పుడు విధానం. గ్రామాల్లో రైతు ఉద్యమం తీవ్రతరం చేయబడాలి. పట్టణాల్లో అనుకూల పరిస్థితుల్లో కార్మికుల భౌతికస్థితిలో అభివృద్ధికొరకు నిర్మాణ యుక్తమైన అన్ని మార్గాల లోను కృషి చేయవలసి యుంటుంది కాని తొందరపడి యెన్నడూ హద్దుమీరి శక్తులను వృధాపరచకూడదు. పట్టణాలలోని కార్మికులు సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగానే చర్యలు జరుపుతూ చైనాదేశీయ పెటీబూర్జువా వర్గంవారినీ, మధ్యతరగతి వారినీ సాధ్యమైనంతవరకూ జాతీయ సంయుక్త సంఘటనలోనే యుండునట్లుగా జాగ్రత్త తీసుకో

వాలి. సమాధాన సంఘాలు మధ్యవర్తుల యేర్పాట్లను కార్మికుల క్షేమ లాభాలకు అనుకూలించే పరిస్థితుల్లో తప్పక చేసుకుంటూ వుండాలి వీటి ద్వారా నిర్దిష్టమైన కార్మిక విధానాన్ని అమలు జరుపునట్లు చూడాలి. సమ్మెలను, సమావేశాలనూ నిషేధిస్తూ యెన్నడూ ఆజ్ఞలనుగాని, శాసనాలను గాని, చేయుట సహించరాని విషయం. ఈ సమస్యయొక్క ప్రాముఖ్యతను మనస్సునం దుంచుకొని యిందుకు సంబంధించిన సమాచారాన్నంతటిని వెంట వెంటనే మాకు తెలియపర్చాలి "

జంగ్‌కై షేక్ తిరుగుబాటుకు ఆరువారాల పూర్వం నాలుగవ పత్రాన్ని ప్రకటించారు పైనిక పటాలా లన్నిటిలోను కొమింటాంగు. కమ్యూనిస్టు కార్యక్రమాలను జోరుగా సాగించాలి. లోగడ కొమింటాంగు, కమ్యూనిస్టు సంఘాలు లేనిచోట్ల వెంటనే సంఘాలు నెలకొల్పాలి. కమ్యూనిస్టుసంఘాలను నెలకొల్పేటందుకు వీలులేని తావులలో రహస్యంగానే కమ్యూనిస్టు ప్రచారాన్ని సాగించాలి.

రైతు కూలీలను సాయుధులుగా చేసేందుకు సకల ప్రయత్నాలు చేయాలి. ప్రాంతీయ కార్మిక, కర్షక సంఘాలకు ఆత్మరక్షణకు, అధికారాన్ని హస్తగతం చేసుకునేందుకు తగిన శిక్షణనీయడం అత్యవసరం.

కమ్యూనిస్టుపార్టీ ప్రతిచోటా అవిధంగానే పనిచేయడం అత్యవసరం. అర్ధక్రమసంఘం (Semi legal) గా ఐచ్ఛికంగానే పనిచేయడం సహింపరాని విషయం. ప్రజోద్యమాన్ని అడుగడుగునకూ విరోధించే సాధనంగా కమ్యూనిస్టుపార్టీ పనిచేయరాదు. అభివృద్ధి విరోధకమూ, విద్రోహకరమూ అయిన కొమింటాంగు మితవాద పక్షానికి చెందిన ధనిక వర్గీయుల విధానాన్ని ప్రోత్సహించరాదు; దాచరాదు వారి విధానాన్ని వెల్లడించేందుకుగాను కోమింటాంగు. కమ్యూనిస్టు పార్టీలలోకి ప్రజా సామాన్యాన్ని అమితంగా తీసికొనిరావాలి.

"ఎవరు విప్లవానికి వాస్తవమైన అనుచరులో ప్రజలకు తెలియ చేయవలసిన అగత్య మేర్పడింది. సామ్రాజ్యవాదు లందరూ తమ తమ

బలాలను కేంద్రీకరిస్తూ తమ వర్గశక్తులను కూడగట్టుకుంటూన్న ప్రస్తుత విషమ పరిస్థితుల్లో చైనావిప్లవం సంక్షోభంలో చిక్కుకుంది. ప్రజోద్యమాన్ని బాగుగా బలపరుస్తేనే యికముందు విజయాలను సాధించ గలుగుతాము. లేనిచో విప్లవానికి వినాశం తప్పదు. అందువల్ల ననే యీ కార్యవిధానాన్ని తక్షణమే అమలుజరపడం అత్యంతావసరం."

జంగ్ కై షేక్ నాయకత్వంలో కొమింటాంగు బూర్జువావర్గం చేసిన తిరుగుబాటుకు ఒకసంవత్సరం పూర్వమే కోమింటర్న్ చైనీయ కమ్యూనిస్టుపార్టీకి "కొమింటాంగునుండి విప్లవ వ్యతిరేకులైన మితవాద పక్షంవారిని వెళ్ళగొట్టవలసిన"దని సలహా యిచ్చారు.

వలసదేశ విప్లవ ప్రథమ దశలో సామ్రాజ్య వ్యతిరేక సంయుక్త సంఘటనను యీ విధంగా కోమింటర్న్ అర్థం చేసుకుంది ఈ విధమైన కార్యక్రమాన్నే అమలు జరుప ప్రయత్నించింది

కోమింటర్నులో ప్రతికూలపక్షంవారైన ట్రాట్స్కీ, జినోవీవ్, కామెనీవ్‌లు కోమింటర్న్‌యొక్క యీ విధానాన్ని తెలిసియుండి కూడా పోరాటంకొరకే గొడవచేస్తున్నారు వారికి యథార్థం కాదు కావలసింది; తగవులాటమాత్రమే.

1926 ఫిబ్రవరి, మార్చి మాసాలలో జరిగిన అంతర్జాతీయ కమ్యూనిస్టుసంస్థ విస్తృత సమావేశానికి కామ్రేడ్ జినోవీవ్ అధ్యక్షుడుగా వుండి అచ్చట ఆమోదించబడిన యీ తీర్మానాలను అంగీకరించాడు గావి, తర్వాత లెనినిజాన్ని వదలివేసి ట్రాస్కీపక్షంలోజేరి నేడు వానినేకాదని వాదిస్తున్నాడు. ప్రతికూల పక్షనాయకులలోని ట్రాట్స్కీ, కామెనీవ్ మున్నగు ముఖ్యులందరూ ఆ సమావేశంలో ఆ తీర్మానాన్ని ఆమోదించిన వారే. ఆ తీర్మానాన్ని క్రింద ఉదహరిస్తున్నాను.

"విదేశ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా చైనాప్రజానీకం సల్పే స్వాతంత్ర్యపోరాటంలో 1925 జూన్, సెప్టెంబరు మాసాలలో షాంఘై,

హాంగ్‌కాంగులలో కార్మికులు జరిపిన రాజకీయసమ్మెలు అత్యద్భుత మయిన మార్పును తీసుకుని వచ్చాయి.........శ్రామికుల యీ రాజకీయ ప్రజాచరణ, దేశంలోని విప్లవప్రజాతంత్ర నిర్మాణాలు అభివృద్ధి పొందేందుకు, సహాయభూతంగా యుండటమే కాకుండా జాతీయ ప్రజాతంత్ర పక్షమైన కొమింటాంగు, కాంటన్ ప్రభుత్వాలు బలపడేందుకు కూడా బాగా తోడ్పడ్డాయి. చైనాకమ్యూనిస్టు పక్షంతో కలసి పనిచేసిన కొమింటాంగు, కార్మికులు, కర్షకుల, మేధావుల పట్టణ బూర్జువావర్గంయొక్క సముదాయంగా (బ్లాక్) పనిచేసింది.

"కాంటన్ కొమింటాంగు నాలుగువర్గాల కూటంగా పనిచేసింది. కొమింటాంగుచే నెలకొల్పబడిన కాంటణ విప్లవప్రభుత్వం సామ్రాజ్యవాదులచే ప్రోత్సాహ, సహాయాలను పొందుతోన్న దేశీయ అభివృద్ధి విరోధకులను నాశనంచేసి, లక్షలాది కార్మిక, కిర్షకులను తనవైపుకు ఆకర్షించింది. ఇప్పుడు క్వాంగ్‌టంగు రాష్ట్రంలోని ప్రజాజీవితంలో అత్యద్భుతమయిన అభివృద్ధికరమైన మార్పులను తీసికొని వచ్చింది. చైనాస్వాతంత్ర్య పోరాటంలో అగ్రగామిగా నిలబడి విజయాలను సాధిస్తోన్న కాంటణ ప్రభుత్వం భవిష్యత్తులో చైనాకంతటికీ విప్లవాదర్శంగా వుంటుంది.

"ఈ విపత్సమయంలో కమ్యూనిస్టుపార్టీ, కొమింటాంగులు రాజకీయ కార్యాచరణను బహు విస్తృతంచెయ్యాలి. ప్రజాసైన్యాల పోరాటాలకు సహాయకారిగా నుండునట్లు ప్రజాకార్యాచరణను పెంపొందించాలి సామ్రాజ్యవాద ముఠాలోనున్న ఆంతరంగిక స్పర్ధలను సావకాశంగా తీసుకొని కార్మికులు, కర్షకులు, బూర్జువావర్గంతోకూడిన విశాల సంయుక్త సంఘటనను నిర్మించి, విదేశపీడనను నిర్మూలించాలి."

అంతవరకూ కొమింటాంగులోవుండిన చైనా పెట్టుబడిదారీవర్గంలో కొందరు కొమింటాంగులో కమ్యూనిస్టులుండరాదనీ, ప్రజాసంఘాలునెలకొల్ప

బడకూడదనీ బహిరంగంగావాదిస్తో కొమింటాంగునుండి గతసంవత్సరం విడిపోయారు. కాంటన్ ప్రభుత్వపు విప్లవవిధానాన్ని వారు ప్రతిఘటించ సాగారు. 1926 జనవరిలో జరుగబోయే కొమింటాంగు రెండవ సమావేశంలో ఆ మితవాదపక్షంవారిని పూర్తిగాఖండించడము, కొమింటాంగు, కమ్యూనిస్టుసఖ్యాన్ని మరింత బలపర్చడం అత్యవసరమని కోమింటర్న్ చేసినతీర్మానాన్ని ప్రతికూలపక్షంవారు మరచిపోవడం చాలహాస్యాస్పదం.

చైనావిప్లవ ప్రధమ దశలోనే కమ్యూనిస్టులు కొమింటాంగు నుండి విడిపోవడం ఘోరమైన తప్పిదమైయుండేది

చాల హానికరమైన రెండు తప్పిదాలను చేయకుండా వుంటే చైనా కమ్యూనిస్టుపార్టీయొక్క రాజకీయ స్వయం నిర్ణయశక్తి బలపడుతుంది. చైనా శ్రామికవర్గంయొక్క ప్రత్యేక నిర్మాణాత్మక కార్యాచరణను విరమించి సామాన్య జాతీయ ప్రజాతంత్ర ఉద్యమంలో నామరూప రహితంగా కలసిపోవడ మనేది మితివాదుల ఆత్మవినాశకర పంథా. తద్విరుద్ధంగా విప్లవప్రజాతంత్ర దశను లెక్కలోకి తీసికొనకుండా శ్రామిక నియంతృత్వానికి చైనాస్వాతంత్ర్యోద్యమానికి ఆధారభూతమైన రైతులతో నిమిత్తం లేకుండా సోవియట్ పరిపాలనను నెలకొల్పవలెననేది అతివాదుల ఆత్మవినాశకర పంథా. ప్రస్తుతంలో ప్రతికూలపక్షం కర్షకశక్తిని తక్కువగా అంచనావేసి సోవియట్ ప్రభుత్వం వైపుకు ఒక్క దూకు దూకాలని చూస్తున్నారు."

విప్లవ ప్రధమదశలో సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా అన్ని వర్గాలకలయిక అతి ప్రాధాన్యం వహిస్తే, రెండవదశలో జమీందారీ విధాన వినాశం తక్షణ కర్తవ్యమవుతుంది ప్రథమదశలో పూర్తికాని సామ్రాజ్యవాద బానిసత్వ వినాశం రెండవ దశలో శ్రామికవర్గం చేయవలసి యుంటుంది. రెండవదశలో సంపూర్తికాని జమీందారీయుగ సామ్రాజ్యవాద దాస్యచిహ్న వినాశాన్ని, మూడవదశయైన సోవియట్ ప్రభుత్వ నిర్మాణ దశలో పూర్తిచేయవలసి యుంటుంది.

రష్యను విప్లవంలో ప్రథమదశలో పూర్తికాని జమీందారీయుగ ఆర్థికవిధాన విచ్ఛేదం, రెండవదశయైన సోవియట్ దశలో సంపూర్ణమైంది. కాబట్టి చైనాలో సోవియట్ నిర్మాణదశ వచ్చినపుడే ప్రజాదాస్య బంధాలు నాశనమవుతాయి.

విప్లవోద్యమకేంద్రం కాంటనునుండి వూహాన్‌కు మారిన యీ రెండవ విప్లవదశలో చైనాకమ్యూనిస్టులు నెరవేర్చవలసిన అతిముఖ్య కార్యాలేమిటి ? ఊహాన్ విప్లవప్రభుత్వానికి ప్రతిగా జంగ్‌కైషేక్ నాయకత్వాన విప్లవప్రతికూల ప్రభుత్వం నాన్కింగులో నెలకొల్పబడిన యీ సమయంలో బహిరంగంగా కమ్యూనిస్టు, కార్మిక, కర్షక విప్లవాన్ని కోరే తీవ్రవాదులవైపుకు నడపాలి విప్లవవ్యతిరేక ప్రభుత్వంతో పోరాడె శక్తులకూటమిగా వూహాన్ ప్రభుత్వాన్ని మార్చాలి

కోమింటర్ను ఆదేశాలను చైనాకమ్యూనిస్టుపార్టీ సరిగా అమలు జరుపునట్లు చూచుటకు బొరోడిన్‌కు సహాయకారిగా, కోమింటర్ను ప్రతినిధియైన యం. యన్ రాయి చైనా పంపబడ్డాడు.

చైనాకమ్యూనిస్టులు రైతు, కూలీ జన సామాన్యంలో నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించుటవలన కమ్యూనిస్టుపార్టీ 1926 నాటికి చాల పెరిగింది. చెన్‌టుస్యూ కమ్యూనిస్టుపార్టీ నాయకుడుగా వ్యవహరించేవాడు. చెన్‌టుస్యూ కోమింటర్ను సలహాలను సరిగా పాటించక, కేంద్రకమిటీ సభ్యులనుకూడ సంప్రదించకుండా చాల నిరంకుశంగా ప్రవర్తించేవాడు. కేంద్రకమిటీలో సభ్యుడైన మోసీయంగు షాంఘై కొమింటాంగు కార్యనిర్వాహక సభ్యుడుగావుండి చాలముఖ్యమైన కార్యాలను నెరవేర్చేవాడు. వాంగ్‌చింగ్‌వీ, హూహాన్‌మిన్‌లతో కలసి కేంద్ర కార్యనిర్వాహక వర్గంలో పనిచేయుటవలనను, అసమమేధావిధి యగుటవలనను, మోసీయాంగు, కొమింటాంగు ప్రచారశాఖాధికారిగా నియమింపబడ్డాడు. 21 రాష్ట్రాలనుండి వచ్చే రైతుసేవకులకు రైతాంగ విద్యాలయం నెలకొల్పి స్వయంగా శిక్షణనిచ్చేవాడు. చాల రాష్ట్రాలలో తిరిగి,

రైతుసంఘాలను నిర్మించి, రైతు ఉద్యమాన్ని బలిష్ఠంచేశాడు. కర్షక సమస్యలను సరిగా అర్థంచేసుకున్న మోసీయాంగు, చైనా సమాజంలోని వివిధవర్గాలు," "మనం చేయవలసిన పనులు" అను రెండు ప్రముఖ కరపత్రాలను ప్రకటించాడు. మొదటి కరపత్రంలో తీవ్రమైన భూవిభజన విధానాన్ని అమలుపరచాలనీ, కమ్యూనిస్టు నాయకత్వంక్రింద రైతు సంఘాలను నెలకొల్పాలనీ మోసీయాంగు వెలిబుచ్చిన భావాలను చెన్ టుస్యూ ఆమోదించలేదు చెన్ టుస్యూ మితవాద పంథాలోపడి, అంత కంతకు కమ్యూనిస్టు ప్రధాన ఆశయాలనే మరచిపోజొచ్చాడు.

1926 మార్చిలో జంకైషేక్ కమ్యూనిస్టులపై ప్రథమపర్యాయం తిరుగుబాటుచేసి, మరల సమాధానపడి, ఉత్తరరాష్ట్ర దండయాత్ర సాగించుచున్న సమయంలో చాంగ్షా, లీలింగు, సియాంగ్‌టాన్, హంగ్‌షాన్, సియాంగ్‌సియాంగు జిల్లాలలో రైతుఉద్యమాన్ని పరిశీలించి వచ్చిన మోసీయాంగు భూపునర్విభజనను వెంటనే జేయవలసిందని తీర్మానం ప్రవేశపెట్టినప్పటికీ, చెన్ టుస్యూ దానిని త్రోసివేశాడు.

కమ్యూనిస్టు కేంద్రకమిటీ ఐదవ సమావేశం జరిగింది. అప్పటికే జంగ్‌కైషేక్ విప్లవప్రతీఘాత కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నాడు. షాంఘై, నాన్కింగులలోని కమ్యూనిస్టుపార్టీలను క్రూరంగా హింసిస్తో న్నప్పుడు కూడా చెన్ టుస్యూ మితవాదపంథాలోనడిచి, ఊహాన్ కొమిం టాంగుకు లోబడిపోజొచ్చాడు. ఆయన మితవాద పెట్టీ బూర్జువా అవ కాశవాద (సమయానుకూల) విధానాన్ని అనుసరింప నారంభించాడు. మోసీయాంగు రైతులను సాయుధులను చేయడం అత్యవసరమని యెంత వాదించి నప్పటికీ, చైనావిప్లవంలో రైతుల పాత్రను సరిగా అర్థం చేసు కోని చెన్‌టుస్యూ పెడచెవిని పెట్టాడు. పైగా, 135 యకరాలకంటె హెచ్చుభూమి కలిగినవాడు మాత్రమే భూస్వామందు అని నిర్వచించాడు. ఈ నిర్వచనము ఆమోదించినచో చైనాలో వర్గసంఘర్షణకే తావులేదు.

చెన్‌టుస్యూ చైనావిప్లవానికి, కమ్యూనిస్టు ఉద్యమానికీ తీరని ద్రోహం చేశాడు.

1927 వేసంగిలో అఖిలచైనా రైతుసంఘమేర్పడింది మోసీ యాంగు ప్రథమ అధ్యక్షుడయ్యాడు ఈయన అధ్యక్షపదవిలో హూపే, కియాంగ్సీ, ఫూకీన్, హూనాన్‌లలో రైతుఉద్యమం మంచి తీవ్రరూపం దాల్చింది. కొమింటాంగులోని భూస్వాములు, జమీందార్లు చాలాఖంగారు పడి, రైతుసంఘాన్ని అణచివేయవలసిందని కోరనారంభించారు.

# 11 వ అధ్యాయం.

## కొమింటాంగు కమ్యూనిస్టు ఐక్యతా విచ్ఛేదం.

1927 మే 21 వ తేదీని హూనాన్‌లోని చాంగ్షాలో దున్నేవారిదే భూమి అను సూత్రంపైన కమ్యూనిస్టుల నాయకత్వాన జరుగుతోన్న రైతు ఉద్యమాన్ని సైనికులను పంపి ఊహాన్ ప్రభుత్వం క్రూరంగా అణచివేయ నారంభించింది. ఈ సంఘటనలను చూచియు, ప్రభుత్వ సైన్యాలకు విజయాలు లభించుట వలనను, కొమింటాంగు నాయకులు కమ్యూనిస్టులను పార్టీనుండి వెళ్ళగొట్టేందుకు సమయం వచ్చిందని భావించారు. సన్‌జోఫీ ప్రకటనను, కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శియైన చెన్‌టుస్యూ విజ్ఞప్తులను నిరాకరించిననూ భయంలేదను ధైర్యం కలిగింది. కొమింటాంగు పార్టీవారొక్కరేగాక, కమ్యూనిస్టులుకూడ ఉన్నత పదవులాక్రమించుకుంటున్నారని కమ్యూనిస్టులపై నిందలు మోపారు. కమ్యూనిజాన్ని స్థాపించేందుకు చూస్తున్నారని నేరారోపణ చేశారు. రాజకీయ సలహాదారైన బొరోడిన్‌తో సంప్రతించడం మాని, కేవలం అతిధిగా చూడటం ప్రారంభించారు.

జూన్ 1 వ తేదీనాడు కమ్యూనిస్టు అంతర్జాతీయ సంస్థ (కొమింటర్న్) ప్రతినిధిగా చైనాలో పనిచేయుటకు వచ్చిన యమ్. యన్. రాయ్ ఊహాన్ రాష్ట్రంలో భూమి జప్తుల విధానాన్ని కొనసాగించ వలసిందని, యెన్ని ఆటంకాలు వచ్చినా ఆచరణలో పెట్టుటకు జంకరాదనీ, యిరువది వేలమంది కమ్యూనిస్టుపార్టీ సభ్యులతో కూడిన సుశిక్షితమైన సైన్యాన్ని తయారు చేయవలసిందనీ, యేబదివేల మందితోకూడిన కార్మిక, కర్షక, సైనిక దళాలను యేర్పరచ వలసిందని స్టాలిన్ తనకొక టెలిగ్రాం పంపించాడనీ, చెప్పాడు. ప్రజా న్యాయస్థానాలు నెలకొల్పి విప్లవ వ్యతిరేకులను విప్లవ విద్రోహులను శిక్షించవలసిందనికూడా చైనా కమ్యూ

విస్టు పార్టీకి సలహా యివ్వబడిందని చెప్పి తమతో కలిసి పనిచేయమని వాంగ్‌ను కోరాడు. వాంగ్‌చింగ్‌వీ వెంటనే యూజీజ్-చేన్‌ను కలసికొని కమ్యూనిస్టులు సైనికంగా బలపడకూడదని వారిని అణచివేయాలని ప్రయత్నాలు చేశారు. జూన్ 4 వ తేదీన టాన్‌యెన్‌కే, సన్‌ఫో, సూచీన్ లతో కలసి చెంగ్‌చౌకు వెళ్ళి, టాంగ్‌షెంగ్‌చీ, చాంగ్‌ఫాక్వీ మున్నగు కొమింటాంగ్ సైనిక నాయకులతో తమ సైన్యాలలోని కమ్యూనిస్టులను నిరాయుధులుగా చేయవలసిందని ఆజ్ఞయిచ్చారు హూనాన్, హూపే రాష్ట్రాలలో కమ్యూనిస్టుల కార్యకలాపాలను అరికట్టవలసిందని ఫెంగ్ యూషియాంగ్‌కు ఆజ్ఞలు యిచ్చారు వాంగ్ చెంగ్‌చౌలో వున్నప్పుడే జంగ్‌కైషేక్ ఊహాన్‌ను ముట్టడించేందుకు సన్నాహం చేస్తున్నాడని వార్త తెలిసి జూన్ 13 వ తేదీకి హాంకౌకు తిరిగి వెళ్ళాడు.

కొమింటాంగు కేంద్ర కార్యనిర్వాహక సభ్యులలో, కొమింటాంగు నుండి కమ్యూనిస్టులను వెళ్ళగొట్టే సమస్యమీద భేదాభిప్రాయాలు కలిగాయి. సన్‌యట్‌సేన్ సతి, యూజీన్‌చేన్‌లు వాంగ్‌ను తీవ్రంగా ప్రతిఘటించారు. కాని కమ్యూనిస్టుసైనికులు, కమ్యూనిస్టులు ప్రజా సామాన్యంలో బలపడితే ముందు ముందు వారిని అణచడం సాధ్యం కాదని వాదించి కమ్యూనిస్టులన్ను తొలగించుటకే నిర్ణయించారు కాని యీ నిర్ణయం రహస్యంగానే ఉంచబడింది.

టాంగ్‌షెంగ్‌చీ హూనాన్ రాష్ట్రంలోని కమ్యూనిస్టు సైనికుల్ని ప్రభుత్వ విప్లవ సైన్యాంనుండి తొలగించివేశాడు. కమ్యూనిస్టు అభిమానుల్ని కొమింటాంగునుండి తీసివేశారు కాని చాంగ్‌ఫాక్వీ సైన్యం లోని సుప్రసిద్ధ కమ్యూనిస్టు సైనికుల్ని తొలగించడం చాలా కష్టమైన పని అయింది. ఉక్కు తునకలని ప్రఖ్యాతి బడసిన టింగ్‌యన్‌టా సైన్యాలు అధికంగా కమ్యూనిస్టులతో కూడుకొని వున్నాయి

1927 జూలై 15 వ తేదీని బహిరంగంగా కొమింటాంగు నుండి కమ్యూనిస్టులను వెళ్ళగొడుతూ తీర్మానించారు. చాంగ్‌చంగ్‌చాంగ్

బొరోడిన్ భార్యను నిర్బంధించి, జూలై 12 వ తేదీని వదలివేయుట తోనే బొరోడిన్ జూలై 27 వ తేదీని రష్యాకు వెడలిపోయాడు. బొరో డిన్ చేసిన చిరస్మరణీయమైన సేవను కొనియాడుతూ కొమింటాంగు సభ్యులు గౌరవించి, బొరోడిన్‌ను సాగనంపారు.

సైన్యంనుండి, ప్రభుత్వోద్యోగాలనుండి కమ్యూనిస్టులను మహా వేగంగా తొలగించివేయ నారంభించారు. కమ్యూనిస్టులమీద దుష్ప్ర చారం జోరుగా సాగింది. కొమింటాంగు సభ్యులు కమ్యూనిస్టులను హింసించసాగారు. ఈ ప్రతికూల పరిస్థితుల్లో 11 వ సైన్యంలోని యేటింగ్ అధికారంలో వున్న సైనికదళం, కియాంగ్సి రాష్ట్రంలోని నాంచాంగ్‌కు వెళ్లి జూలై 30 ని స్వాతంత్ర్యాన్ని ప్రకటించారు. ఆ రాష్ట్రంలో ఆస్థి జప్తుల విధానం అమలుపరచ సాగేరు. బ్యాంకులు వశపరచుకున్నారు. ఎక్స్చేంజి ఆఫీసులన్నిటినీ పట్టుకున్నారు ఆగస్టు 5 నాటికి సైన్యాలతో చూపీ చేపచ్చి, వారిని ఓడించాడు. చాంగ్‌ఫాక్వీ తన సైన్యాలన్నిటినీ హోలుంగ్, యేటింగుల కమ్యూనిస్టు సైన్యాలపైకి పంపి, వారిని క్వాంగ్‌టంగు రాష్ట్రంపరకు వెంటాడించాడు.

ఆ సమయంలో కియుకియాంగ్‌లో వున్న వాంగ్‌చింగుపీ హాంకౌకు తిరిగివచ్చి రాజకీయసంఘ సమావేశం జరిపి కమ్యూనిస్టుల నందరినీ నిర్దాక్షిణ్యంగా అణచివేసేందుకు కమ్యూనిస్టుపార్టీని అశాస్త్రీయ సంఘంగా ప్రకటించమని కోరాడు కమ్యూనిస్టు సభ్యులను పార్టీనుండి తొలగించే విధానాన్ని ప్రతిఘటించిన సన్‌యట్‌సేన్ సతి, యూజెన్‌చేన్, టెంగ్‌యెన్‌టాలు చైనాను వదలి విదేశాలకు వెళ్లియున్నందునను, జంగ్‌కైషేక్ ఆను యాయులు నాన్కింగులో వుండుటవలనను, వాంగ్ చింగుపీ హాంకౌ ప్రభుత్వంలో సర్వాధికారాలు కలిగియున్నాడు. కమ్యూ నిస్టులతో శాంతియుతంగా విడిపోయే విధానాన్ని మార్చి, రక్తపుటేరు లలో ముంచెత్తే దౌర్జన్యవిధానాన్ని అమలుపరచమని ప్రోత్సహించాడు.

ఇదే సమయంలో తృతీయ అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థలోని అతి వాదమురాలో ప్రముఖుడైన బుఖారిన్ కొమింటాంగును తీవ్రంగా విమర్శించసాగేడు. అందువలన కొమింటాంగుచైనాకు, సోవియట్ రష్యాకు రాజకీయంగా మైత్రి చెడింది. అతిక్రూరంగా చైనాకమ్యూనిస్టులను కొమింటాంగు మితవాదనాయకులు హింసించి, నాశనం చెయ్యసాగేరు.

## హాంకౌ, నాన్కింగు ప్రభుత్వాల కలయిక.

చెంగ్చౌ సమావేశానంతరం ఫెంగ్యూసియాంగు నాన్కింగు వెళ్లి జంగ్కైషేక్‌తో రాజీప్రయత్నాలు చేశాడు కమ్యూనిస్టుల వినాశములోను,బొరోడిన్‌ను చైనానుండి వెళ్లగొట్టుటలోను వాంగ్‌కూడా తనకు తోడ్పడుతోన్నందున హాంకౌ ప్రభుత్వంతో కలిసేందుకు యేమీ అభ్యంతరంలేదని జంగ్ చెప్పాడు. ఏప్రిల్‌నెలలో జంగ్ స్థాపించిన కొత్త ప్రభుత్వాన్ని. పార్టీని రద్దుచేసి, హాంకౌప్రభుత్వానికి లోబడవలసిందని ఫెంగుకోరాడు. కాని జంగ్ అంగీకరించక, హాంకౌమీద దండెత్తేందుకు ఊహాలో వుంచిన సైన్యాలను సిద్ధపరిచాడు. ఈ లోవుగా ఉత్తరరాష్ట్ర సైనికప్రభువులైన చాంగ్‌చంగ్‌చాంగ్, చ్వాన్‌ఫాంగులు జంగ్‌సైన్యాలను ఓడించి సూచౌను తిరిగి పట్టుకున్నారు. లీసంగుజేజా అధికారంలోవున్న ఏడవసైన్యం జంగ్‌మీద తిరుగబడేందుకు సిద్ధంగావున్న సూచనలు కనపడ్డాయి. అందువలన గత్యంతరం లేక జంగుకైషేక్, కమ్యూనిస్టులను హత్యచేస్తోన్న వాంగుచింగువీ, చాంగుఫాక్వీలకు తంతిమూలకంగా హాంకౌ ప్రభుత్వంతో యేకమయ్యేందుకు తన సంసిద్ధతను తెలియపరిచాడు.

అగస్టు 10 వ తేదీని కేంద్ర కార్యనిర్వాహకవర్గ సభ్యులు జాతీయ ప్రభుత్వాన్ని పునర్నిర్మించేందుకు నాలుగవ విస్తృత సమావేశాన్ని యేర్పరచేందుకు తమ సంసిద్ధతను తెలియపరచారు. హాంకౌ, నాన్కింగు ప్రభుత్వ ముఠాలు కమ్యూనిస్టులనణచి, దేశంలో బూర్జువావర్గ ప్రాబల్యం

నిలబెట్టేందుకు చేతులు కలిపేందుకు ప్రయత్నాలు సాగించారు. కాని ఆ మురాలలో వ్యక్తిగత అధికారాన్నికై ప్రాకులాడే నాయకులు అనేక అభ్యంతరాలు కలిపించకపోలేదు. హాంకౌ ప్రభుత్వ ముఠావారు ఆ సమావేశం హాంకౌలోనే జరగాలనీ శాస్త్రీయమైన ప్రభుత్వం తమదేననీ నొక్కి చెప్పారు.

ఈ లోగా జంగు అనుచర బృందంలోని లీసంగ్‌జేణ, హూహాన్ మిన్, హోయింగ్‌చింగ్ మున్నగువారు జంగుకైషేక్‌ను వ్యతిరేకించి, హాంకౌ ప్రభుత్వంతో రాజీపడేందుకు ప్రాకులాడుచున్నందున, జంగు 400 మంది అనుచరులతో నాన్కింగును ఎదలి షాంఘై వెళ్ళిపోయాడు.

హాంకౌ ప్రభుత్వ సైన్యాధ్యక్షుడైన చాంగుఫాక్వీ కమ్యూనిస్టులను ఓడించి కియాంగ్సీ రాష్ట్రాన్ని ఆక్రమించి, క్వాంగ్‌టంగులోకికూడా తరుముకు వెడుతున్నాడు. ఆన్‌హ్వీరాష్ట్రాన్ని టాంగ్ షెంగ్ చీ లోబరచుకున్నాడు. వాంగ్‌చింగ్‌వీ, సణఫో, యుయుజెన్, చెన్‌కంగ్‌పో చూపీచే మున్నగువారు కియుకియాంగ్ వెళ్ళారు. అక్కడ లీసంగ్‌జేన్, వాంగ్‌ను కలుసుకుని నాన్కింగ్, హాంకౌ ప్రభుత్వాల తరఫున ఉభయులు సంభాషణలు కొనసాగించారు. జంగ్‌కైషేక్ నాన్కింగు ప్రభుత్వాన్నుండి రాజీనామా యిచ్చి వెళ్ళిపోయాడనీ, సన్‌చ్వాన్‌ఫాంగ్ సైన్యాలను తన సైన్యాలు ఓడించగల్గుతాయనీ లీ చెప్పాడు. నాన్కింగు ప్రభుత్వాన్ని రద్దు చేశారు గనుక నాన్కింగులోనే నాలుగవ విస్తృత సమావేశం జరిపేందుకు వాంగ్ నిర్ణయించాడు.

నాన్కింగు సైన్యాలు అనేకచోట్ల సణచ్వాణఫాంగ్ సైన్యాలచే ఓడింపబడినందువలన, ఆగష్టు 30 నాడు హాంకౌ ప్రభుత్వ సైన్యాలు టాంగుషెంగ్‌చీ, చెంగ్‌చీన్‌ల నాయకత్వాన పంపబడ్డాయి. సణచ్వాన్ ఫాంగు సైన్యాలు ఓడింపబడి తరిమివేయబడ్డాయి. సెప్టెంబరు 5 వ తేదీకి

హాంకౌ ప్రభుత్వం నాన్కింగుకు మార్చివేయబడింది. కాని టాన్‌యెన్‌పే లీసంగ్‌జేన్‌లు మాత్రం కుట్రలు పన్నుట మానలేదు

పాత కామ్రేడ్సు అని పిలువబడే మితవాద నాయకులలో ముఖ్యులనుకూడా నాన్కింగు ప్రభుత్వానికి తీసికొనివచ్చేందుకు వాంగుచింగ్‌వీ, సన్‌ఫో, చూపీతే, టాన్‌యెన్‌కేలు షాంఘేకు సెప్టెంబరు 9 సాయంకాలం చేరుకున్నారు. పడమటి కొండల మురావారితో సంప్రతింపులు సాగించారు కాని వారు హాంకౌ ప్రభుత్వానికి ద్రోహం తలపెట్టినందున, రాజీ ప్రయత్నాలు విఫలమయ్యాయి. సెప్టెంబరు 15 నాడు సి. సి. వూ. సన్‌ఫోలు పాత కామ్రేడ్సుతో కలసి, నాన్కింగులో ఒక ప్రత్యేక కమిటీని యేర్పరచారు. ఈ ప్రత్యేక కమిటీని దేశమందలి కొమింటాంగువాదు లందరూ నిరసించారు. వాంగు యీ ప్రయత్నాన్ని ఖండించాడు.

ప్రత్యేక కమిటీవారు హాంకౌ ప్రభుత్వ సైన్యాధ్యక్షుడైన టాంగ్‌షెంగ్‌చీమీద దండెత్తేందుకు సన్నాహాలు చేయగా వాంగుచింగువీ టోకియోలో వున్న జంగ్‌కై షేక్‌ను కూడగట్టుకునేందుకు గాను తంతిమూలంగా ప్రయత్నించాడు. లీచీసేణా, చాంగ్‌ఫాక్వీలు తమ వైరాలను కట్టిపెట్టి వాంగ్ యెడల భక్తితో మెలగుతామన్నారు.

నవంబరు మొదటివారంలో జంగ్‌కై షేక్ షాంఘేకు తిరిగి వచ్చాడు. కాని నవంబరు 15 నాటికి టాంగ్‌షెంగుచీ సైన్యాలు లీసంగుజేన్, పేచెంగ్‌సీ, చెంగ్‌చీణాల సైన్యాల వలన ఓడింపబడినందున జంగ్ తన సైన్యాలతో టాంగ్‌కు సహాయపడేందుకు అవకాశం దొరక లేదు. జంగ్ షాంఘేనుండి పాత కామ్రేడ్సుచే స్థాపించబడిన ప్రత్యేక కమిటీని ఖండించి, వాంగును బహిరంగంగా బలపరిచాడు.

నవంబరు 18 వ తేదీకి వాంగు షాంఘేకు వెళ్ళి జంగ్‌ను కలుసుకున్నాడు. కాని జంగ్ సైన్యాధ్యక్షపదవికి రాజీనామా దాఖలుచేసియుండినందున, ఆయన ఆజ్ఞలకు లోబడిన సైన్యాలు లేవు. జంగ్, వాంగుల

కలయిక వలన ప్రజలలో ప్రత్యేక కమిటీమీద విరోధంహెచ్చి విస్తృత సమావేశం మీద అభిమానం హెచ్చింది. జంగు తన వ్యక్తిగత పలుకుబడికోసం అటు పాత కామ్రేడ్సుతోను, యిటు వాంగ్‌తోను కూడా స్నేహం నటిస్తో తన ప్రాబల్యాన్ని స్థిరపరుచుకునేందుకు ప్రయత్నించాడు.

## కాంటస్ తిరుగుబాటు.

లీచీసేన్, నలుగురు పాత కామ్రేడ్సు యీలోగా చాంగ్‌ఫాక్వీ సేనాని కమ్యూనిస్టుపార్టీలో జేరి కొమింటాంగును ధ్వంసం చేసేందుకు సిద్ధంగా వున్నాడనే పుకార్లు పుట్టించారు. కాంటన్‌లో వుండే కమ్యూనిస్టులు చాంగ్‌ఫాక్వీ లేని సమయంలో కాంటన్‌ను వశపరచుకుని క్రమంగా ఆ రాష్ట్రమంతటా యెర్రజండా నెగురవెయ్యాలని తీవ్ర కృషి చెయ్యసాగేరు. నవంబరు 7 వ తేదీని రష్యను రాయబారిని కాంటన్‌లో విర్పంధించి, కొద్దిసేపట్లో కొమింటాంగుసైనికులు వదలివేశారు. ఆ రాష్ట్రంలోనూ, ముఖ్యంగా కాంటన్‌లోనూ కమ్యూనిస్టులు తుపానుప్రచారం చేశారు. కార్మిక, కర్షకులలో నూతనచైతన్యం కలిగి, గెరిల్లాయుద్ధం చెయ్యసాగారు.

కమ్యూనిస్టులు ప్రజాసామాన్యంలో బలపడటం చూచి వాంగు చాలా ఆందోళన పడ్డాడు. తన భార్యయైన చెన్‌పిచూఞాను, కాంటణా వెళ్ళి కమ్యూనిస్టుల వణచవలసిందని చాంగ్‌ఫాక్వీ, చెన్‌కంగ్‌పోలతో చెప్పవలసిందిగా కబురుచేశాడు. కమ్యూనిస్టులు సైన్యంలో ప్రచారంచేసి, .వారిని తమవైపు త్రిప్పుకొనేందుకు ప్రయత్నించారు.

క్వాంగ్సీ ముఠాయున్ను, మితవాదులున్ను సాగించే దుష్ప్రచారం గమనించి, డిసెంబరు పదవతేదీని కొమింటాంగు కార్యనిర్వాహక సభ్యులను సమావేశపరచి, సర్వసైన్యాధ్యక్షుడుగా జంగ్‌కై షేక్ వుండవలసి వదిగాను, నాలుగవ విస్తృతసమావేశానికి స్థల, సమయ నిర్ణయం చేయ

వలసిందిగాను వాంగ్ తీర్మానం ప్రవేశపెట్టాడు. ఈ తీర్మానం ఏక గ్రీవంగా ఆమోదింపబడింది. నాలుగవ సమావేశం 1928 జనవరి 1 వ తేదీని జరుపబడుటకు నిర్ణయింపబడింది. సభ్యులలో దురభిప్రాయం తొలగేందుకు, కొత్తచిక్కులు తటస్థించకుండాను వాంగ్ రాజీనామా యిచ్చాడు. జంగ్‌కై షేక్ రష్యాతో మైత్రిని రద్దుచేయాలని ఒక తీర్మానం ప్రవేశపెట్టాడు. ఇతర సామ్రాజ్యవాదుల స్నేహాన్ని సంపాదించేందుకు గాను కమ్యూనిస్టులను క్రూరంగా హింసించేందుకును, రష్యాతో స్నేహ సంబంధాలను తెంపుకునేందుకును జంగ్‌కై షేక్ ప్రారంభించాడు. ఈ తీర్మానం కూడా నెగ్గింది.

డిసెంబరు 11 వ తేదీని చరిత్రాత్మకము, భావిమార్గదర్శకము ఐన కొంటన్ తిరుగుబాటు జరిగింది. కమ్యూనిస్టులనందరనూ విచక్షణ లేకుండా నిర్బంధించవలసిందని పంపిన వాంగ్, జంగ్‌ల ఆజ్ఞలు వెల్లడి అయ్యాయి. అందువలన గత్యంతరంలేక కమ్యూనిస్టులు డిసెంబరు 11 వ తేదీనే తిరుగబడ్డారు. 1100 మంది సైనికులతో కూడిన ఒకచిన్న సైనికదళం మాత్రమే కమ్యూనిస్టులకు తోడ్పడింది. హ్వాంగ్‌చీసియాంగ్ సైన్యంలో యీ దళం ప్రత్యేకమైన శిక్షణను పొందింది. కమ్యూనిస్టులు కొంటన్‌లోని రిక్షాబండ్లు లాగేవారికి కూడ ఆయుధాలిచ్చారు. చెరసాల లలో నిర్బంధింపబడిన ఖైదీలను విడిపించి సాయుధులను చేశారు. పల్లె ప్రాంతాలనుండి రైతులు వందలాదిగా కమ్యూనిస్టులకు తోడుపడేందుకు కొంటన్ వచ్చారు.

హ్వాంగ్‌షోసియంగ్‌ను ఓడించి కొంటన్ పట్టణాన్ని కమ్యూ నిస్టులు వశపరచుకున్నారు. చాంగ్‌ఫాక్వీ, చెన్‌కంగ్‌పోలు కమూనిస్టుల ధాటికి తట్టుకోలేక హోనాందీవికి పారిపోయారు. అక్కడవున్న లీఫూలిన్ తన సైన్యాలతో వారికి తోడ్పడ్డాడు ఈ లోగా దక్షిణ, పడ మటి దిక్కులనుండి చాంగ్‌ఫాక్వీ సైన్యాలు కొంటన్‌ను ముట్టడించాయి.

చాలా ఘోరయుద్ధాలు 12, 13 తేదీలలో జరిగాయి. 14 వ తేదీని కమ్యూనిస్టు లోడింపబడ్డారు. దొరికిన కమ్యూనిస్టులను చిత్రవధచేశారు. చాంగ్ ఫాక్వీ సైనికులు అనేకమంది నిరపరాధులను క్రూరంగా హింసించారు.

కాంటన్‌లో కమ్యూనిస్టులు, కొమింటాంగు సైన్యాలు యుద్ధం చేస్తోండగా యువేకాసియాచో అనే సుప్రసిద్ధ బందిపోటు నాయకుడు 800 మంది బందిపోటు సైనికులతో కాంటన్ ప్రవేశించి అనేక ఘోరాలు చేశాడు. కాంటన్‌లోని బ్యాంకులు, మారకపు కార్యాలయాలను దోచాడు. ఈ ఘోరాలన్నీ కమ్యూనిస్టులే చేశారని బూర్జువావర్గ ప్రతినిధులైన మితవాదులు గొప్ప దుష్ప్రచారం సాగించారు.

కాంటన్ తిరుగుబాటు సంగతి తెలియగానే షాంఘైలోని మితవాదులు అతివాదులను నిర్బంధించారు షాంఘై అంతర్జాతీయ వలస అధికారులకు వారి వారి వలసలలో దాగుకొనివున్న అతివాదులను తమకు పప్పగించమని వ్రాశారు. చైనా పోలీసులు వలసనంతను గాలించారు. కాంటన్ తిరుగుబాటును అణచివేసిన వార్త తెలియగానే క్వాంగ్సీ సైనిక నాయకుల మురా, నలుగురు పెద్దలు అంతవరకూ అతివాదులందరూ కమ్యూనిస్టులే అని చేస్తోన్న ప్రచారం కేవలం నిరాధారమైనదని వెల్లడైంది.

డిసెంబరు 17 న షాంఘైనుండి వాంగ్‌చింగ్‌వీ ఫ్రాన్సు వెళ్ళిపోతూ, "పార్టీని రక్షించడం, పార్టీనుండి పార్టీ వ్యతిరేకులను తరిమి వెయ్యడమంత ముఖ్యమైన పనే! నాలుగవ విస్తృత సమావేశం జరపాలి. కేంద్ర కార్యనిర్వాహక వర్గం, కేంద్ర పరిశీలక సంఘాలు పునరుద్ధరింపబడాలి. ప్రత్యేక కమిటీ రద్దుచెయ్యబడాలి. విప్లవ విరోధకుల, లంచగొండుల కుతంత్రాలను భగ్నం చెయ్యాలి," అంటూ ఒక ప్రకటన చేశాడు.

వాంగ్ యూరప్ వెళ్ళిన తర్వాత జంగుకైషేక్ క్వాంగ్సీ సైనిక నాయకులను కేంద్ర కార్యనిర్వాహక సభ్యులను సంధాన పరచి 1928

ఫిబ్రవరిలో నాలుగవ విస్తృత సమావేశం జరిపాడు నామ మాత్రంగా కొమింటాంగును నిలిపి జంగ్‌కైషేక్ ప్రపంచంలోకెల్ల ఘోరము, క్రూరము అయిన అంతర్యుద్ధాన్ని పది సంవత్సరాలపాటు సాగించి, కమ్యూనిస్టుల నాయకత్వంక్రింద వున్న కార్మిక, కర్షకులను నాశనం చేయడానికి పూనుకున్నాడు

1927 లో కొమింటాంగు, కమ్యూనిస్టులపై దాడి సాగించినప్పుడు కమ్యూనిస్టు పార్టీలో 60,000 మంది సభ్యులున్నారు. 35,000 మంది యువజన కమ్యూనిస్టు సమితులలో వుండేవారు. కమ్యూనిస్టుల పలుకుబడిలో 28,00,000 కార్మిక సభ్యులున్నూ, 97,20,000 మంది రైతు సంఘ సభ్యులున్నూ వున్నారు ఇంత గొప్ప బలసంపన్నమైన నిర్మాణ మున్నప్పటికి చెన్‌టుస్యూ మితవాద, సమయానుకూల వైఖరియున్నూ, యం. యన్. రాయ్ తెలివితక్కువ పనులును, బొరోడిన్ వేసిన కొన్ని తప్పుడు విప్లవకర యెత్తుగడలును, కమ్యూనిస్టు పార్టీ తాత్కాలికంగా అణచివేయ బడేందుకు కారణాలయ్యాయి. 1926 లో భూ పునర్విభజన విధానాన్ని ఆమోదించిన బొరోడిన్ 1927 లో శ్రామికులకు ఆయుధా లీయవద్దని వాదించాడు. చెన్ మితవాద పంథా, బొరోడిన్ పొరపాట్లు, రాయి బుద్ధిహీనతలే చైనాలో కమ్యూనిస్టుల హత్యలకు, రక్తపాతానికి ప్రధాన కారణాలుగా భావింపవచ్చును అన్నిటికంటె ముఖ్యంగా చైనా బూర్జువా వర్గం విప్లవాన్ని అణచివేయనిచో, చైనాలో కార్మిక, కర్షక, సోవియట్ విప్లవ వెల్లువలో తామూ, తమ ప్రత్యేక ఆస్తులూ, తుడిచి పెట్టుకుపోతాయనే భీతావహంతో జంగుకైషేక్ నాయకత్వాన చరిత్రలో కని, విని యెరుగని ఘోరానికి తలపడ్డారు.

---

# చైనా విప్లవ చరిత్ర.

## రెండవ భాగము.

## సోవియట్ విప్లవదశ

## 1927-1937.

## చైనా అంతర్యుద్ధం.

# 12 వ అధ్యాయం.

## క్రొత్త పాత సైన్యాల సంఘర్షణ.

శాస్త్రీయమైన విప్లవసిద్ధాంతాలు, మంచి శిక్షణవున్న పార్టీనే విజయవంతంగా పనిచేయకలుగుతుంది. శిక్షణవుండి సిద్ధాంతాలు లేకపోయినా, మంచి సిద్ధాంతాలుండి పార్టీలో శిక్షణ లేకపోయినా ఆ పార్టీ విధ్వంసమౌతుంది. పార్టీసైన్యంవంటిది. సామ్రాజ్యవాద సైన్యాలలో మంచి శిక్షణ వుంటుందికాని మంచి సిద్ధాంతాలు లేవు. అందువలన మంచి శిక్షణలో ఆ సైన్యాలు ప్రపంచాన్నంతనీ జయించి, లోబరచుకోగలిగినా మంచి సిద్ధాంతాలు లేకపోవుటవలన ప్రథమప్రపంచ యుద్ధంలోని సర్వ యూరప్ సైన్యాలవలె ఓడిపోతాయి. 1924 లో బొరోడిన్ సలహాప్రకారంగా పునర్నిర్మింపబడిన కొమింటాంగుపార్టీ బ్రహ్మాండమైన పార్టీ సిద్ధాంత ప్రచారం చేయుటవలన ప్రజలలో గొప్ప పలుకుబడిని సంపాదించింది పార్టీ నిర్మాణరీత్యా బలపడి, శిక్షణకు లోబడి యుండుటవలన సైన్యాలో పార్టీసైనికంగానూ, రాజకీయంగానూ ఉన్నతస్థాన మాక్రమించ గలిగింది.

1912 నుండి పార్టీలోవున్న వృద్ధరాజకీయవాదులు తమకు అధికారాలను సమకూర్చే సంఘంగా మాత్రమే పార్టీని యెంచారు. పార్టీ పునర్నిర్మాణం వలన వారి స్థానానికి నష్టంరావడం, శిక్షణకు లోబడవలసి వుండటం, కమ్యూనిస్టుల పలుకుబడి హెచ్చుటంవలన వీరు 1924 లో పార్టీపునర్నిర్మాణాన్ని ప్రతిఘటించారు. "కమ్యూనిస్టుల వత్తిడివలననే కొమింటాంగుపార్టీ యేర్పరచబడింది. కమ్యూనిస్టులవలని భయంవలననే కొమింటాంగు యేర్పరచబడింది," అంటూ యీ ముఠానాయకుడైన ఊచీహ్వా చెప్పేవాడు. నిర్మాణము, శిక్షణ, పార్టీఅధికారం, ప్రజలతో సహకారం అనేవి కమ్యూనిస్టు వ్యవస్థలుగాయెంచి ద్వేషించేవారు. వీరు కమ్యూనిస్టులను హింసించేందుకు ముఖ్యకారకులు.

## పాత కాంగ్రేడ్స్.

ఫెంగ్‌చీయు, చాంగ్‌చీ, సౌలూ, లిజాషేన్, సూచంగ్‌చీలు పాత కామ్రేడ్సులో ముఖ్యులు. వీరు పార్టీలో ముఖ్య పదవులలో వుంటూనే ఊచీహ్వా, చాంగ్‌చింగ్‌జంగ్, వీషీపెంగ్, సేయువాన్‌పే లను వృద్ధ రాజకీయవాదులతో సంబంధం కలిగి, సన్‌యట్‌సేన్ మరణానంతరం పడమటి కొండల ముఠాగా యేర్పడ్డారు. వీరిలో కొందరు కొమింటాంగు లోనుండి దానిని విచ్ఛిన్నం చేసేందుకు అనేక కుట్రలు పన్నారు. వీరే తర్వాత పార్టీలో మితవాద కక్షిగా యేర్పడ్డారు. ప్రజా ఉద్యమాలన్నిటికీ వీరు వ్యతిరేకులు. వీరిలో ధనికవర్గతత్వం బాగావుంది. చైనాలోని జమీందార్లు, పెద్ద భూస్వాములు, బ్యాంకర్లు, పారిశ్రామిక యజమానుల ప్రయోజనాలను కాపాడడమే వీరి ముఖ్యోద్దేశం. పార్టీలో అధికార కేంద్రీకరణను వీరు కోరక, తమ వ్యక్తిగత ప్రాబల్యాన్ని స్థాపించేం దుకు ప్రయత్నించారు. వీరు రాష్ట్రీయ స్వాతంత్ర్యాన్ని కోరుతో, సైనిక ప్రభువుల ప్రాపకం కొరకు ప్రాకులాడేవారు. సన్‌యట్‌సేన్ మూడు ప్రజాసూత్రాలకు పైకిమాత్రం భక్తి చూపిస్తో, ఆచరణలో వ్యతిరేకించే వారు. "పార్టీ సిద్ధాంతాలు ఉత్తమోత్తమమైనవి. కాని పార్టీసభ్యులు మాత్రం ధ్వంసం చెయ్యబడాలి" అనునది వీరి వినాదం. విప్లవసైన్యాలు ఉద్భవించినప్పుడు విప్లవపార్టీ అనవసరం అని ప్రచారం చేశారు. 1927 డిసెంబరులో ఊచీహ్వా పార్టీని రద్దుచేయవలసిందని బహిరంగంగా చెప్ప సాహసించాడు. చాంగ్‌చింగ్‌జంగ్ గొప్ప కూటనీతిజ్ఞుడు. తంపులు పెట్టుటలోను ప్రవీణుడు. జంగ్‌కైషేక్‌కు చాంగ్ అంటే గొప్ప గురి. అందువలన వెనుకనుండి చాంగ్ జంగ్‌చే కమ్యూనిస్టు వ్యతిరేక ఉద్య మాన్ని నడిపించగలిగాడు. కార్మిక, కర్షక ఉద్యమాలను అణచుటకు యీ ముఠావారే కారకులు.

## అతివాదులు.

కొమింటాంగులోని 'అతివాదుల'ను కమ్యూనిస్టులుగా భావించ రాదు. కొమింటాంగులో విభిన్న దృక్పధాలు, ప్రయోజనాలు, లక్ష్యాలు కలిగినవారు సభ్యులుగా జేరారు. పదవు లాశించినవారు, సైనికప్రభువులు, ఉద్యోగులు కొమింటాంగులోకి వచ్చారు. 1924 లో కొమింటాంగు పునర్నిర్మితం కావాలని కోరినవారు అతివాదులుగా పరిగణింపబడ్డారు. సన్ యట్ సేన్ జీవితకాలంలో యీ అతివాదు లందరూ మూడు ప్రజా సిద్ధాంతాలకు పైకి భక్తి చూపేవారు. జాతీయ విముక్తికి విప్లవమార్గము, ఆర్థిక, సాంఘిక అభివృద్ధికి సంస్కరణ పద్ధతులు వీరు కావాలంటారు. ప్రజలతో సైనికులు సోదరభావంతో మెలగాలని వీరంటారు. రైతు, కూలీ సంఘాలు ఉండాలంటారు. కాని పాతచైనా సమాజ బంధాలను త్రెంచ కూడదని వాదిస్తారు. అతివిషమ పరిస్థితుల్లో వున్న రైతుసమస్య 100 కి 25 వంతున పన్ను తగ్గింపబడుతుందంటారు. నియంతృత్వాన్ని వ్యతిరేకిస్తో, ప్రాదేశిక ప్రభుత్వ విధానాన్ని ప్రతిఘటించి పార్టీ నియంతృత్వం కావాలి అని ప్రచారంచేస్తారు. 1926 వ సంవత్సరంలో కొమింటాంగు సభ్యత్వం 2,50,000. వీరిలో 1,50,000 మంది అతివాద సభ్యులు 70,000 సైనిక సభ్యులు. 30.000 మంది మితవాద, మధ్యరకపు సభ్యులు. 1926 లో జరిగిన రెండవ జాతీయ కాంగ్రెస్సుకు 168 గురు అతివాదులు, 65 కేంద్ర, 45 మితవాద సభ్యులు ప్రతినిధులుగా వచ్చారు. అతివాద సభ్యులలో 20 మంది కమ్యూనిస్టులు. వీరు దేశములోవున్న 60,000 మంది కమ్యూనిస్టులకు ప్రతినిధులు.

అతివాదులు, కమ్యూనిస్టులు 1927 జూలై వరకూ సహకారం చేసుకునేవారు. అతివాదులని నాడు పిలువబడేవారిలో చేచీటో, హూహాన్ మిన్, చంగ్ కై షేక్, టాంయెన్ కే, టి. వి. సూంగ్. తదితరులనేకులు

తరువాత ముఠావాదులుగా మారారు. వీరందరూ విదేశీ సామ్రాజ్యవాదుల పలుకుబడిని కూలద్రోసేందుకు మాత్రమే కలిసివుండేవారు. కాని తర్వాత ధనికవర్గప్రయోజనాలను రక్షించేందుకు ఏడు పౌరసత్వహక్కులను నాశనంచేసి, పచ్చి నియంతృత్వాన్ని స్థాపించారు.

## చంగ్‌కైషేక్ జీవిత చరిత్ర.

చైనా కమ్యూనిస్టులపై కత్తిగట్టి, విదేశ సామ్రాజ్యవాదుల ప్రాపకాన్ని సంపాదించేందుకు 20 సంవత్సరాలపాటు అంతర్యుద్ధపు రక్తపుటేరులలో దేశాన్ని ముంచెత్తి, 1928 లో నాన్కింగుప్రభుత్వ సర్వసైన్యాధ్యక్షుడైన చంగ్‌కైషేక్ జీవితచరిత్రను తెలుసుకొనుట అత్యవసరం.

చెకియాంగు రాష్ట్రంలో ఫెంగువా అనే గ్రామంలో చంగ్‌కైషేక్ 1888 వ సంవత్సరంలో జన్మించాడు. ముందు పోటింగు సైనిక శిక్షణాలయంలోను, తర్వాత చైనాప్రభుత్వ విద్యార్థిగా టోక్యోసైనిక శిక్షణాలయంలోను సైనిక శిక్షణను బడశాడు. పట్టం పొందేందుకు సిద్ధంగా వున్న సమయంలో 1911 విప్లవం జరుగుటవలన చైనాకు వచ్చి, షాంఘై విప్లవగవర్నరైన చెన్‌చీమి విప్లవదళంలో 83 వ పటాలంలో వున్న 3000 మంది అశిక్షితులకు అధికారి అయ్యాడు. ప్రథమంలో సైనికులకు గొప్ప శిక్షణ యిచ్చాడుకాని, తరువాత భోగలాలసుడయ్యాడు. ప్రధానసైనిక కార్యాలయంనుండి నెలలతరబడి వెళ్ళిపోయి, వారకాంతల యిండ్లలో గడిపేవాడు. ముక్కోపి. తరుచుగా ఉద్రిక్తుడై, కస్సుబుస్సు మంటూండేవాడు. స్నేహితులకు యీతనితో ప్రవర్తించటం బహుకష్టంగా వుండేది. ఈ రోజుల్లోనే ఆయనకు, భావిలో చైనావిప్లవోద్యమంలో బహు నికృష్టుడని పేరుపొందిన చాంగ్‌చింగ్‌జంగ్‌తో పరిచయం కలిగింది. షాంఘైలోని రహస్య సంఘాలతోకూడ సంబంధం కలిగింది. ఈ పరిచయమే జంగ్‌కు తరువాత షాంఘై పెట్టుబడిదార్లతో

వ్యవహరించడంలో చాల ఉపకరించింది. యువాన్‌షికేకు వ్యతిరేకంగా నడిపిన ఉద్యమం విఫలమగుటతో, జంగ్‌కు విచక్షణజ్ఞానం కలిగింది. వెంటనే విలాసజీవితాన్ని వదలి, చెన్‌చీమేతో కలసి, టోక్యోవెళ్లి సన్‌యట్‌సేన్‌తో పరిచయంసంపాదించాడు. యువాన్‌షికే చెన్‌చీమేని హత్య చేయించిన తర్వాత 1917 లో క్వాంగుటంగులో సర్వసైన్యాధ్యక్షుని కార్యాలయంలో ఒక ఉద్యోగిగా సన్‌యట్‌సేన్‌వద్ద పనిచేశాడు. జంగ్ సామర్థ్యాన్ని సన్‌యట్‌సేన్ గుర్తించాడు కాని, జంగ్ కోపస్వభావం, అమర్యాద ప్రవర్తన అనుయాయులలో చాల చెడ్డపేరు తెచ్చింది. అందువలన జంగ్ కెట్టి బాధ్యతాయుతమైన పదవినిగాని యిచ్చేందుకు సన్ జంకేవాడు. అనేక సంవత్సరాలవరకూ జంగ్ ఊరూ, పేరూ లేకుండా సన్‌వద్దనే వుండిపోయాడు. 1920 లో చాంగ్‌చింగ్‌జంగ్‌తో కలిసి స్టాకు మారకంలో స్పెక్యులేషను వర్తకంచేసి, లక్షడాలర్లు లాభం తీసి, సన్- యుద్ధనిధికిచ్చివేశాడు.

చెన్‌జంగ్‌మింగు సైన్యంలో కూడా జంగ్ పనిచేసియున్నందున, ఊపీపూమీద దండయాత్రకు ముందు చెన్‌ను అణచవలసిందని సన్‌కు జంగ్ సలహా యిచ్చాడు. కాని సన్ పెడచెవిని బెట్టాడు. చెన్ సైన్యాలను సంపూర్ణంగా నాశనం చెయ్యమని యిచ్చిన సలహాను తిరస్కరించినందున, ఆగ్రహావేశ పరవశుడై జంగ్ షాంఘై వెళ్లిపోయాడు. జంగ్ చెప్పినరీతిగానే 1922 జూన్ 16 నాడు చెన్ తిరుగబడి సన్‌యట్‌సేన్‌ను కాంటన్ నుండి తరిమివేశాడు. వెంటనే సన్, జంగ్‌ను పిలిపించాడు. 1923 జూలైలో సన్, జంగ్‌కై షేక్‌ను రష్యాకు పంపాడు. డిసెంబరులో రష్యానుండి తిరిగివచ్చి రష్యాతో సహకారం చెయ్యాలని ప్రచారం చేశాడు. 1924 మేలో వాంపోవా మిలిటరీ అకాడమీకి డైరెక్టరుగా నియమింపబడ్డాడు, బొరోడిన్ సలహాతో ఇప్పటినుంచి ఆయన సాధించిన విజయాలు ఆశ్చర్యమును కొల్పుతాయి. ఒక పదవితర్వాత, మరొక ఉన్నతపదవిని అధిరోహించాడు. 1925 ఫిబ్రవరిలో చెన్‌చిఘుంగ్

మింగ్‌ను, జూన్‌లో యాంగ్‌లియూలను ఓడించి అద్భుత విజయాలను పొందాడు ఒక్క సైనిక రంగంలోనేకాక, పార్టీవిషయాల్లోకూడ జోక్యం కలుగజేసుకుని, రెండవ కాంగ్రెస్సులో కేంద్రకార్యనిర్వాహక సభ్యుడుగా యెన్నుకోబడ్డాడు. దురదృష్టవశాత్తూ సైనిక సాంప్రదాయంలో శిక్షణపొందిన జంగ్‌కు స్వతంత్ర రాజకీయ ఆలోచనాశక్తి లేదు. తన చుట్టూవున్న వాతావరణానికి లొంగిపోతాడు. సన్‌యట్‌సేన్ జీవిత కాలంలో ప్రశ్నించకుండా ఆయన ఆజ్ఞలను శిరసావహించాడు బొరోడిన్‌తో స్నేహంగా వుండే రోజుల్లో, బొరోడిన్ సలహాలను తనవాటి వలెనే స్వీకరించమని సన్ చెప్పేవాడని అంటూండేవాడు సన్ అనంతరం, వాంగ్‌చింగ్‌జుంగ్ వలలో పడ్డాడు. జంగ్ మనస్తత్వం బాగా తెలుసుకున్న వాంగ్, జంగ్ రాజకీయ దృక్పధాన్ని తన యిష్టానుసారంగా మార్చగలుగుతాడు. రాజకీయంగా మారుమూల జంగ్ పడివుండి, గర్హనీయమైన విలాస జీవితాన్ని గడుపుతోన్న రోజుల్లో ఆయనకు తోడ్పడి, తరువాత అన్ని రాజకీయ సంఘాల్లోనూ వాంగు, జంగ్ ప్రతినిధిగా పనిచేశాడు.

1926 మేలో ఆయన మనస్తత్వాన్ని గూర్చి ఒక రహస్య సోవియట్ నివేదికలో యీ క్రింది విధంగా వ్రాయబడింది. "జంగ్‌కైషేక్ స్వాభావికంగా గర్విష్టి, ఆత్మవంచనాపరుడు, ఆశాపరుడు, మితభాషి. ఆయనకు యూరపియను నాగరికతయందు కొద్దిగా గౌరవంకలదుకాని, చైనాజాతీయ మూఢవిశ్వాసాలు మాత్రం పూర్తిగా పోలేదు. జంగ్ యొక్క స్వభావాన్ని తెలుసుకొనివుండి, తెలివితేటలతో ఆయనను పొగడి, భక్తిప్రపత్తులు నటించిన యెడల కావలసినవి ఆయనవద్దనుండి లభిస్తాయి. ఆయనకింటె అధికునిగాగాని, అల్పునిగాగాని ఆయనతో ప్రవర్తించరాదు. సమానుడుగా సంభాషిస్తో, ఆయన అధికారాన్ని తృణీకరించకుండా వుండాలి. ఆయన చాలా కష్టించి పనిచేస్తాడు. ఇతరచైనా సైనికప్రభువులవలె మధ్యరకపు సామర్థ్యం కలదు. త్వరలో ఉత్సాహ

వంతుడౌతాడు ; మరుక్షణంలో నిరుత్సాహుడౌతాడు. అంతేగాని మధ్య మార్గంలో వుండటం తెలియదు. దృఢ చిత్తంతో, శాంతంగా ఆలోచించలేడు."

కమ్యూనిస్టులను తరిమివేసి, వాంగ్ ఫ్రాన్సు వెళ్ళిపోయినతర్వాత 1928 ఫిబ్రవరినుండి 1929ఏప్రిల్‌వరకు జంగ్‌కీ క్వాంగ్సీముఠా (లీసంగ్‌జేణ, హ్వాంగుషోసియంగ్, లీచీసేన్, పేచంగ్‌సీ) వారికీ మధ్య అధికారానికై పెనుగులాట కాలంగా వుంది క్వాంగ్సీముఠా చేతిలో చైనాలోని మిక్కిలి ఫలవంతమైన క్వాంగ్‌టంగు, క్వాంగ్సీ, హూనాన, హూపే రాష్ట్రాలున్నవి. కొమింటాంగుకు పూర్వముండే జమీందారీయుగపు పరిస్థితులనే నిలపాలని, సైనిక ప్రభువుల చేతుల్లో రాష్ట్రాలన్నీ వుంచాలనీ వీరు ప్రయత్నించారు. 1927 ఏప్రిల్ నెలలో జంగ్‌కైషేక్ ప్రారంభించిన పవిత్రోద్యమం" పేరిట వేలకొలది రైతులను, కూలీలను బహుక్రూరంగా నాశనం చేశారు. కమ్యూనిస్టుల డిసెంబరు విప్లవోద్యమం తర్వాకూడా వీరు జరిపిన హత్యాకాండ జలదరింపు పుట్టిస్తుంది. అందువలన యీ ముఠాను తుదముట్టించి, పార్టీలో కేంద్రీకృత ప్రజాతంత్రాన్ని స్థాపించి అతివాదపంథా నవలంబిస్తానని జంగ్ అతివాదులను బుజ్జగించాడు

చైనా ప్రజాస్వామికానికీ, కొమింటాంగుకీ నాయకత్వం వహించి సర్వాధికారాలు వశం చేసుకోవాలనే దురాశతో వున్న జంగ్, నాన్కింగు ప్రభుత్వమందు ప్రజాతంత్ర పద్ధతులను ప్రవేశపెట్టలేదు సన్‌యట్‌సేన్ భార్యకు సోదరియైన సూంగ్‌మీలింగ్‌ను 1927 డిసెంబరులో వివాహం చేసుకున్నాడు. షాంఘైలో వున్న మెజస్టిక్‌అనే వైభవోపేతమైన హోటల్లో విదేశస్తులనేకులకు విందుచేశాడు. ఈ విందుకు లక్ష డాలర్లు ఖర్చు చేశాడు. ఉత్తరరాష్ట్ర దండయాత్రలో జంగు చాలాధనాన్ని గడించి, కొమింటాంగు పార్టీ కార్యవర్గ సభ్యులను, నాన్కింగు ప్రభు

త్వాధికారులను లంచాలతో తన దాసులను చేసుకున్నాడు. 1929 ఏప్రిల్ 18 వ తేదీనాడు తపాలా బిళ్ళలమీద తన బొమ్మకూడా వేయించాడు. ఇది అపూర్వమైన విషయం.

జంగ్ తన ప్రతికక్షులలో చాలమందికి ఓట్లు లేకుండా చేసి, తన అనుచరులనే ప్రతినిధులుగా పెట్టి, కాంగ్రెస్సులో 360 ప్రతినిధులకు 205 మంది అనుకూల సభ్యులను సంపాదించాడు. వీరిలో చాలమంది పార్టీలో సంబంధం లేనివారే. అయినప్పటికీ వీరందరూ జాతీయ ప్రభుత్వానికి జంగ్‌ను అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. ఈ జాతీయ ప్రభుత్వమే చైనా ప్రజాస్వామికమని ప్రజలను భ్రమింపచేసేందుకు ప్రయత్నించాడు. కాని అతివాదులు, యువకులూ జంగు నియంతృత్వాన్నీ, నాన్కింగు ప్రభుత్వాన్నీ తీవ్రంగా విమర్శించారు. పార్టీముఖ్యులు జంగును విమర్శిస్తో యీ దిగువ ప్రకటనను చేశారు.

"..........ఉత్తర రాష్ట్ర సైనికప్రభువులనుండి విప్లవవాదుల రక్తం వెచ్చించి సంపాదించిన రాజకీయాధికారం వారికంటె ఉత్తమ పురుషుల చేతుల్లో పడలేదు. ఒక నిరంకుశుల ముఠాను తొలగించి, మరొక నిరంకుశ ముఠావారీ స్థానాన్ని ఆక్రమించారు. ఇంతకంటే విప్లవం మరేఘనకార్యాన్నీ సాధించలేదు. ప్రజల కోరికలు, క్షేమం, ప్రయోజనాలు లెక్కచెయ్యబడటం లేదు. వారి మాన, ప్రాణ, ధనాలు నిరంతరం ఒడుదుడుకుల్లో వున్నాయి. వేలకొలది విప్లవవాదుల అసువులు, లక్షలాది ప్రజల చెమట, కోట్లకొలది డాలర్లు విప్లవంలో వృధాగా వెచ్చింపబడి, కొద్దిమంది కుయుక్తిపరుల చేతిలో సర్వాధికారాలు చిక్కాయి.

"..........మూడవ జాతీయ కాంగ్రెస్సు నాయకులు బహిరంగ ఎన్నికలు పెడితే, కమ్యూనిస్టులు ప్రజాప్రతినిధులుగా కాంగ్రెస్సుకు

ఏస్తారని రహస్యంగా యెన్నికలు పెట్టమంటున్నారు. ఈ వాదన చాలా హాస్యాస్పదంగా వుంది. కమ్యూనిస్టు గండమునుండి రక్షించేందుకు, ప్రజాఉద్యమాలనే అణచివేస్తున్నామని చెప్పే యీ వాదన చాల గర్హణీయమైనది........."

కొమింటాంగు కేంద్రకార్యవర్గ సభ్యులను లంచాలుపెట్టి దాసులుగా చేసుకొని, జంగ్‌కైషేక్ జపానుతో రహస్యసంధి చేసుకున్నాడు. అంతర్జాతీయ న్యాయశాస్త్రాన్ని ధిక్కరించి జపాన్ 1928 ఏప్రిల్ లో షాంటంగు రాష్ట్రాన్ని ఆక్రమించి 1929 ఏప్రిల్ 17 వ తేదీనుండి ఆ రాష్ట్రాన్ని ఖాళీచేసి వెళ్లిపోతామని వాగ్దానంచెయ్యగా, "విదేశస్తుల ఆస్తుల్ని, ప్రాణాల్ని, రక్షించలేముకనుక అప్పుడే వెళ్లిపోవద్ద"ని నాన్కింగు ప్రభుత్వం తరపున జంగ్‌కైషేక్ ఏప్రిల్ 12 వ తేదీని జపానువారికి సందేశం పంపాడు. ఒక ప్రభుత్వం మరొక విదేశప్రభుత్వంతో తమ అసమర్థతకారణంగా తమదేశంలో కొంతభాగాన్ని ఆక్రమించుకోవలసిందని కబురుపంపడానికి ప్రపంచ చరిత్రలో యిదే ప్రథమ పర్యాయం. జంగ్‌కైషేక్ ప్రభుత్వపు దివాళాకోరుతనాన్ని నిరూపించేందుకు యింతకంటె వేరేనిదర్శనం అవుసరంలేదు. యువాన్‌షీకే, ట్వాన్‌చీజూయి, చాంగ్‌సోలిన్‌ల వంటి నిరంకుశ సైనిక ప్రభువులుకూడా యింత దేశద్రోహం చేసేందుకు సాహసించలేదు.

1928 అక్టోబరుమాసంలో ప్రపంచంలోని గొప్ప సామ్రాజవాద దేశ ప్రభుత్వాలన్నీ జంగ్‌కైషేక్ ప్రభుత్వాన్ని గుర్తించాయి. క్వాంగ్సీ ముఠాను అణచివేశాడు. జాతీయజీవన రంగాలన్నిటిలోను ఆడంబరపూరితమైన మార్పులను తెచ్చేందుకు కమిటీలను పెట్టాడు. విద్య, ఆర్థిక పునర్నిర్మాణం, ప్రభుత్వాదాయం, సైనిక పునర్నిర్మాణములకు బ్రిటిష్ రాజనీతిజ్ఞులను, జర్మన్ సైనిక నిపుణులను, అమెరికన్ శిల్పశాస్త్రజ్ఞులను గొప్ప జీతాలమీద నియమించాడు.

ఎగుమతి దిగుమతి సుంకాల ఒడంబడికను టి వి సూంగ్ సి. టి. వాంగ్‌లు చేసుకున్నారు కాని విదేశ సామ్రాజ్యాలకు అనేక వర్తక సౌకర్యాలను కలిగించారు. బెల్జియంకు చైనాదేశంలో భూభాగాన్ని కొనుక్కునే హక్కుకూడా యిచ్చారు. వెనుక చేసిన ఋణాలన్నింటినీ నాన్కింగు ప్రభుత్వం తీర్చుకోవలసి వచ్చింది. విదేశ ప్రభుత్వాలకూ, ముఖ్యంగా జపానుకూ దాసోహంచేస్తూ ప్రజాసామాన్యాన్ని అణగద్రొక్కి, ప్రజాఉద్యమాలను విధ్వంసంచేసి, పౌరసత్వహక్కులను హరించి, జంగ్‌కై షేక్ నిరంకుశపాలనను సాగించాడు. కమ్యూనిస్టులను నాశనం చేసి, విదేశసామ్రాజ్యవాదుల అభిమానాన్ని చూరగొనేందుకు కమ్యూనిస్టులతో అంతర్యుద్ధం ఒక దశాబ్దంవరకు సాగించాడు

# 13 వ అధ్యాయం.

## సోవియట్ విప్లవ జననక్రమం.

*——————*

### మోసియయంగ్, చూటేల ప్రాముఖ్యత.

జంగ్ కై షేక్ సాగించిన క్రూర కమ్యూనిస్టు నిర్మూలన దాడుల నతిసాహసంతో ఎదుర్కొని, ఛిన్నాభిన్నమైన కమ్యూనిస్టు ఉద్యమాన్ని సోవియట్ ఉద్యమంగా మార్చిన విప్లవప్రతిభాశాలురు, మోసియయంగ్. చూటే, హోలుంగ్, యేటింగ్, చౌఎన్‌లే ప్రభృతులు. వీరిలో మోసియయంగ్, చూటేలు పరాజయాన్ని విజయంగా మార్చగలిగిన అమోఘ శక్తిమూర్తులు. సంక్షుభితమైన చైనారాజకీయ సంద్రంలో కమ్యూనిస్టు ఉద్యమనౌకకు కర్ణధారి మోసియయంగ్; నావికుడు చూటే. అకుంఠిత విశ్వాసంతో వీరు సాగించిన విప్లవకార్యక్రమ ఫలితంగా కమ్యూనిస్టు ఉద్యమం విపత్కర, వినాశన పరిస్థితులనుండి తిరుగుబాట్ల ద్వారా సోవియట్ ఉద్యమదశలోనికి పరిణామంచెంది విప్లవవాదులందరకు ఆశాజ్యోతియై విలసిల్లింది. పోరాటపుటెత్తుగడలను, సోవియట్ ప్రాంతీయ స్వరూప స్వభావములను అనుక్షణము రచించి, అమలుజరుపు యీ విప్లవమూర్తుల జీవితాలు చైనాసోవియట్ ఉద్యమంతో పెనవైచుకుని అవినాభావ సంబంధంతో విరాజిల్లుతున్నాయి. సమకాలీన, సాంఘిక, రాజకీయ పరిస్థితులను ప్రతిఫలించే దర్పణములు వీరి జీవితములు కనుక, సమగ్రంగా తెలిసికొనదగినవి.

### మోసియయంగ్ జీవితం,

హూనాన్‌రాష్ట్రంలోని సియాంగ్‌టాన్ జిల్లాలో షోషాన్ అనే కుగ్రామంలో పేదరైతు కుటుంబంలో మోసియయంగ్ జన్మించాడు.



మో సి యం గ్

ఆయన తండ్రిపేరు మోజెన్‌షెంగ్; తల్లిపేరు వెన్‌చీమే; చిన్న వయస్సులోనే ఋణభారంతో క్రుంగిపోతున్న మోజెన్‌షెంగ్ గ్రామాన్ని వదలివేసి సైన్యంలో చేరాడు. కొంతకాలం గడచినతర్వాత స్వగ్రామం తిరిగివచ్చి, విశేషంగా కృషిచేసి, చిన్నవర్తక వ్యాపారాలు చేసి, రెండు న్నర ఎకరాల కొండ్రను సంపాదించాడు ఆయన కుటుంబంలోని ఐదు గురూ కలసి అహర్నిశలూ కష్టించి ఆ పొలంలో 50 బస్తాలు పండించి, అందులో కుటుంబ ఖర్చులు పోను 20 బస్తాల ధాన్యం మిగిల్చేవారు.

మోసియంగుకు పది సంవత్సరాల వయస్సు వచ్చేనప్పటికి వారి కుటుంబంలో తండ్రి, తల్లి, తాను, తమ్ములు యిద్దరూ వుండేవారు. సుమారు 4 యకరాల భూమివుండేది. కుటుంబపోషణకు పోను 41 బస్తాల ధాన్యం విలవేసేవారు. వారు మధ్యతరగతి రైతాంగంలో చేరగానే, మోజెన్‌షెంగ్ ధాన్యం కొని, అమ్మి, నిల్వచేసి కమీషన్ వ్యాపారం సాగించి కొంత సొమ్ముచేయ నారంభించాడు ఆయన హోదా పెరిగి, ధనిక రైతులశ్రేణిలో పరిగణింపబడ్డాక, వ్యాపారమందే నిమగ్నుడై ఒక కమతగానిని పెట్టుకున్నాడు. మోసీయంగ్ ఆరు సంవత్సరాల చిరుత ప్రాయంనుంచి తల్లితోకూడా పొలంపనులు చేసేవాడు. మోజెన్‌షెంగ్ రైతులదగ్గర తక్కువధరకు ధాన్యంకొని, పట్టణానికి తోలించి యెక్కువ ధరకు అమ్మితో లాభాలు సంపాదించేవాడు.

ఎనిమిది సంవత్సరాల వయస్సు వచ్చిన తరువాత మోసియంగ్ ప్రాథమిక పాఠశాలలో చేరి 13 వ యేడువరకు అందులోనే విద్యాభ్యాసం చేశాడు. సూర్యోదయానికి పూర్వం, సూర్యాస్తమయం తర్వాత పొలం పనిచేస్తో, పగలు కన్ఫ్యూషియస్ సిద్ధాంతాలు, నీతిగ్రంథాలు వల్లె వేసే వాడు. ఆయన గురువు 'దండం దశగుణం భవేత్' రకానికి చెందినవాడు. పేము బెత్తాలు విరిగిపోయేట్లా పిల్లలను అదరగొట్టే పిల్లల పిడుగు. ఈ చండశాసని కఠోర శిక్షణకు తట్టుకోలేక పదవయేట మోసియంగ్ బడిని వదలి పారిపోయాడు. మూడు రోజులు కొండలోయల్లో తిరిగిన

చోటనే తిరుగుతూండగా తండ్రి పట్టుకుని వెనక్కి తీసుకుని వెళ్ళాడు. అప్పటినుండి బడిపంతులు పిల్లలను కొట్టడం చాల తగ్గించాడు. ఇది మోసియంగు జరిపిన మొట్టమొదటి విజయవంతమైన సమ్మె.

మోసియంగుకు కొద్దిగా చదువను, వ్రాయనూ రాగానే తండ్రి పద్దులు వ్రాయించేవాడు ఒక్క నిముషంకూడా సోమరితనంగా కూర్చో నిచ్చేవాడు కాదు చిల్లరతిండికి డబ్బులు యిచ్చేవాడు కాదు. మాంసం, గ్రుడ్లులేని మితభోజనం పెట్టేవాడు. తల్లి కరుణార్ద్ర హృదయ. ఉదార స్వభావురాలు. తండ్రిలేని సమయాల్లో ఆకొన్నవారికి, అవసర పడినవారికి ఉన్నంతలో బియ్యం పగైరా యిచ్చి సహాయం చేసేది. దాన ధర్మాలు కిట్టని తండ్రి తరచుగా తగవులాడేవాడు. విరుద్ధ స్వభావులైన మాతాపితల వలన కుటుంబంలో రెండుపక్షలు యేర్పడ్డాయి. మొదటిపక్షము కుటుంబ పాలకుడైన తండ్రిపి. మోసియుంగ్, తల్లి, తమ్ముడు, అప్పుడప్పుడు కమలగాడు ప్రతికూలపక్షంగా ఏర్పడ్డారు ఈ 'ఐక్యసంఘటనలో' భేదాభిప్రాయాలున్నాయి పాలకశక్తిపై ఉద్రేకోద్వేగాలతో బహిరంగపు తిరుగుబాటు చేసే మోసియంగ్‌ను మందలిస్తూ 'పరోక్షపు దాడి' విధానాన్ని అమలు జరపమని తల్లి కోరేది.

మోజెజా-షెంగ్ డబ్బు పోగుచెయ్యడమనే వ్యసనంలో పడ్డాడు. నిల్వఘసంతో పొలాలు కొనడం మాని, అప్పులకిచ్చి, తనఖాలు పట్టి ధనాన్ని పెంచసాగాడు కాని ఆయన కఠోరం శాసనానికి, నిర్దయత్వానికి సహించలేని మోసియుంగు పదమూడవయేట ఒక విందు సమయంలో అతిథుల సమక్షమున తండ్రి నిందించి పరుషభాష లాడగా యెదుర్కొని యిల్లువదలి వెళ్ళిపోతూండగా తండ్రి వెనుక పరిగెత్తాడు. ఒక చెరువులో దూకి ప్రాణాలు విడుస్తానని బెదరించి, ఇకమీదట అసభ్యంగా ప్రవర్తించ నని తండ్రిచేత వాగ్దానం పొంది తిరిగి వచ్చాడు. ఈ ఉదంతంనుండి, లొంగి దుర్బలంగా ఉన్నప్పుడు తిట్లు, హక్కుల సంరక్షణార్థం ఆత్మ

విశ్వాసంతో తిరుగుబాటు చేస్తే, గౌరవప్రదమైన జీవితం లభిస్తాయని మోసియంగ్ నేర్చుకున్నాడు.

కొద్ది చదువను, వ్రాయను వచ్చిన తండ్రి నిరక్షరాస్యురాలైన తల్లి ఉన్న కుటుంబంలో మో గొప్పవిద్వాంసుడుగా పరిగణింపబడ్డాడు. చిన్నతనంనుండికూడా మోకు మతగ్రంథాలంటే అయిష్టత. వీరరస పూరితమైన కధలు, కావ్యాలు, నాటకాలు అంటే గొప్ప అసక్తి కలిగాయి. ఈ పుస్తకాలు చదువకూడదని బడిపంతులు ఎంత నిషేధించినా తోడి బాలకులతో కలిసి రహస్యంగా చదివి చర్చించేవాడు.

పదమూడవ యేట బడివదలి పగలంతా పాలేరుతో సమంగా కష్టించి, రాత్రిళ్ళు గ్రంధపఠనం సాగించాడు. ఒక వ్యాజ్యంలో కన్ఫ్యూషియస్ ప్రోక్త నీతిసూత్రాలను సరిగా ఉదహరించలేకపోవడంమూలాన్ని ఓడిపోయిన తండ్రి నీతి గ్రంధాలనే చదవమని మోను నిర్బంధించేవాడు. కాని మో మాత్రం సంస్కరణ వాదులైన విద్వాంసులు వ్రాసిన 'హెచ్చరిక' అను గ్రంధాన్ని అర్ధరాత్రి సమయాల్లో మిక్కిలి ఆసక్తితో చదివేవాడు. అందులో రైల్వేలు, టెలిగ్రాఫు, పొగఓడలు మున్నగు పాశ్చాత్య సాధన సామగ్రులు లేకపోవడం మూలాన్ని చైనా దుర్బలంగా వుందనీ, అందువలన చైనాలో వాటిని ప్రవేశపెట్టాలని వారుచేసిన సూచన మోకు బాగా నచ్చింది. ఐనా మో వీరోచితమైన కధలను చదవడం హెచ్చించాడు. ఒక రోజున యీ కధ లన్నిటిలోను ప్రజాపాలకులు, సేనా నాయకులు, పండితులు, కవులు, ఉద్యోగుల జీవితాలకు సంబంధించిన సాహసోదంతాలే వున్నాయి. కాని రైతులను గూర్చి, శ్రమజీవులను గూర్చి వ్రాయబడకపోవడం గుర్తించాడు. విద్యాభ్యాసం కొనసాగించాలనే పట్టుదలతో మో యింటినుండి పారిపోయి నిరుద్యోగి అయిన ఒక వకీలు ధగ్గర ఆరుమాసాలు, ఒక వృద్ధపండితునివద్ద ఒక సంవత్సరం వుండి న్యాయశాస్త్ర గ్రంథాలు, సమకాలీన వ్యాసాలు, రచనలు చదివాడు.

ఈ కాలంలోనే ఆయన జీవితంలో మహత్తరమైన మార్పు తీసి కొనివచ్చిన సంఘటన జరిగింది వారి బడిప్రక్కనుండి ఒకరోజున చాంగ్షాపట్టణ చిన్నపర్తకులు పారిపోతోంటే మో వారిని కారణ మడిగాడు. "ఈ సంవత్సరం చాంగ్షాప్రాంతంలో గొప్ప కరువు వచ్చి వేల కొలది ప్రజలు తిండికి అల్లాడుతున్నారు. గవర్నరు వద్దకు పరిస్థితులను నివేదించి నివారణ అర్థించేందుకు షధార్తులు ఒక రాయబారాన్ని పంపారు 'మీకు కరువెందుకు వచ్చింది ? తిండి యెందుకు లేదు ? నాకుయేలోటూ కనబడటం లేదే ?' అని గవర్నరు సమాధానం. దానితో కరువు పీడితులందరిలో ఆగ్రహావేశాలు పెరిగి. ఒక పెద్ద ఆకలియాత్ర జరిపి సఫలా చేసి గవర్నరును ఆయన భవనంనుండి తరిమివేశారు. మంచూ చక్రవర్తి మరొక గవర్నరును, సైనికులను పంపి ఆ తిరుగుబాటు నాయకుల శిరచ్ఛేదంచేయించి బహిరంగప్రదేశాంలో ప్రజాధీకరంగా వ్రేలాడగట్టేడు.

ఈ సమాచారం విద్యార్థులు చాలారోజులు చర్చించారు. చాలమంది మాటల్లో సానుభూతి వెల్లడించారు. కాని మో భావాల్లో యీ సంఘటన మహత్వ పూర్ణమైనదీ చేతలకు పురికొల్పేదీ.

కొద్దికాలంలోనే షోషాన్‌లో 'కేలోహ్వీ' రహస్య సంఘ సభ్యులకీ అక్కడ జమీందారుకీ న్యాయస్థానంలో వ్యాజ్యం జరిగింది. కాని ధనికుడైన జమీందారు న్యాయమూర్తినీ, న్యాయాన్నీ, తీర్పునీ కొనివేసి విజయు డయ్యాడు. ఐతే యీ 'కుట్రదారులు' సహించలేక తిరుగబడి పోరి నిలువలేక లియూషాణ్ పర్వతానికి పారిపోయి అక్కడ ఒక దుర్గాన్ని నిర్మించారు. ఈ తిరుగుబాటుదార్లు వారి జెండా నెగురవేసినప్పుడు ఒక బాలకుని బలి యిచ్చారనీ, హంతకులు, దోపిడిగాండ్రూ, అనే అసత్య ప్రచారం చేసి, ప్రభుత్వ సైనికులు ప్రజల్లో పలుకుబడి లేకుండా చేసి, ఆ దళ నాయకుడైన మిల్లురాళ్ళను చేసే పాంగ్‌మ ఉరితీశారు. మోకు, తోటి విద్యార్థులకు వారు గొప్ప వీరులు.

మరుసటి సంవత్సరం వారి జిల్లాలో క్షామం వచ్చింది. ధరలు విపరీతంగా పెరిగాయి. పేద రైతులు 'ధర యివ్వకుండా ధాన్యం తీసుకోండి' అనే ఉద్యమంలేవదీశారు ధాన్యవ్యాపారి అయిన మో తండ్రి ధాన్యం పట్టణం పంపుతోంటగా పట్టుకున్నారు. మో తండ్రికి మితిలేని ఆగ్రహం. మోకు ఆ దీనులమీద జాలి కలిగినా ఆ విధానాన్ని ఆమోదించలేకపోయాడు.

ఈ కాలంలోనే బౌద్ధమతాన్ని తీవ్రంగా విమర్శించి, నిరీశ్వర వాదాన్ని ప్రచారం చేసే ఒక యువక బడిపంతులంటే మోకు మిక్కిలి భక్తి విశ్వాసాలు కలిగాయి చైనా తునాతునకలుగా విభజింపబడి సామ్రాజ్యవాదుల దోపిడీకి గురియై దీనావస్థలో వుందని వ్రాసిన ఒక కరపత్రంకూడా మో లేత మనస్సును కదిలించివేసింది

తండ్రి ధాన్యం వ్యాపారంలో ప్రవేశపెట్టాలని యెంత ప్రయత్నించినా వినక సియాంగ్ సియాంగ్‌లో ఆధునిక విజ్ఞాన శాస్త్రాలను బోధించే పాఠశాలలో మో జేరాడు. విద్యార్థులలో సియాంగ్ సియాంగ్ జిల్లా దురభిమానం హెచ్చుగా వుండేది ప్రాంతీయ భేదాలను పురస్కరించుకొని వారిలోవారు కలహించేవారు. మో పురాణ గ్రంథాలను బాగా చదువుటవలన గ్రాంథిక భాషలో చక్కటి వ్యాసాలు వ్రాసేవాడు. ఆ రోజుల్లోనే లియాంగ్‌చీచో మున్నగు సంస్కరణవాదుల వ్యాసాలను మిక్కిలి ఉత్సాహంతో చదువుతూండేవాడు. ప్రాచీన మహారాజుల యొక్క, పాశ్చాత్య దేశాల చరిత్రలు, అమెరికను విప్లవం, ప్రపంచ మహావీరుల జీవితాలనే గ్రంథం, కాథరైన్, నెపోలియను, పీటర్, వెల్లింగ్టను, గ్లాడ్‌స్టన్, రూసో, మాంటెస్క్యూ, లింకన్‌ల జీవితాలు చదివాడు.

రాజధానీ నగరమైన చాంగ్షా ప్రసిద్ధి నవయువకుడైన మోను ఆకర్షించగా, అక్కడకు నడచివెళ్ళి ఒక పాఠశాలలో చేరేడు. ఆ పట్టణంలో వున్నప్పుడు మొదటిసారి 'ప్రజాశక్తి' (మిన్‌లీ) అనే వార్తాపత్రికలో మంచూ రాజవంశంపై జరుపబడిన కాంటన్ తిరుగుబాటు, వాంగ్‌పింగ్

అమ ప్రజాతంత్రవాది ఆయన 72 అనుచరుల వీరోచిత మరణాన్ని గూర్చి చదివి ఉద్రిక్తుడయ్యాడు. ఆ పత్రిక యియుజెఙా అను సుప్రసిద్ధ కొమింటాంగు వాదిచే నడుపబడేది. సన్ యట్ సేన్ ఆయన విప్లవ పక్షమైన టంగ్ మెంగ్ హ్వీని గూర్చిగూడ చాంగ్షాలోనే మో విన్నాడు. చైనా దేశం విప్లవ ప్రాంగణంవద్ద నిలబడివున్న ఉద్రిక్త సమయమది. విప్లవోత్సాహంతో ఊగిపోతున్న మోసియంగ్ ఒక విప్లవ కరపత్రం వ్రాసి వారి కళాశాల భవనంపై అంటించాడు. ఈ ప్రయత్నమే ఆయన రాజకీయభావ ప్రకటనా ప్రయత్నానికి అంకురార్పణ.

లీయువాన్ హంగ్ నాయకత్వాన జరిగిన వూహాన్ తిరుగుబాటు అనంతరం హూనాన్‌లో సైనిక శాసనం అమలు జరిగింది. మో చదువుతోన్న కళాశాలలో ఒక విప్లవ నాయకుడు అతి ఉద్రేకంతో ఉపన్యసించిన నాలుగైదు దినాలలో కొందరు విద్యార్థులతో కలసి విప్లవ వాదులతో చేరేందుకు ప్రయత్నించాడు. చాంగ్షాలో కార్మికులు, కోటవెలుపల విప్లవ వాదులు ప్రభుత్వ సేనలతో పోరి జయించి చోఫెంగ్, చెన్‌సోసింగ్‌ల ఆధిపత్యాన ప్రభుత్వాన్ని యేర్పరిచాడు. కాని వారు పేదలగుటచేత ధనిక భూస్వామియైన టాన్ యన్ కే వారిని చంపి, తాను అధిపతి అయ్యాడు. విద్యార్థులు టాంగ్ షెంగ్ చీ నాయకత్వాన ఒక సైన్యాన్ని నిర్మించారు. కాని అందులో క్రమశిక్షణ లేసందువలన మోసియంగ్ రాష్ట్ర సైన్యంలో చేరాడు

నెలకు వచ్చే ఏడు డాలర్ల జీతంలోనూ, యెక్కువభాగం వార్తా పత్రికలకింద ఖర్చుపెట్టేవాడు సియాంగ్ ఎర్ పో అనే దినపత్రికలో సోషలిజంమీద ప్రచురింపబడిన వ్యాసాలు మో దృష్టిని బాగాఆకర్షించాయి.

ఇంతలో మంచూవంశం పతనమైంది. యువాన్‌షీకే ఆధిపత్యాన ఐక్య చైనా ప్రజాప్రభుత్వం ఏర్పడింది. విప్లవం పూర్తి అయిందనే ఉద్దేశంతో మో రాజీనామా యిచ్చి వార్తాపత్రికా ప్రకటనలు చూచి సబ్బు పరిశ్రమ నేర్పే విద్యాలయంలోను, న్యాయశాస్త్ర కళాశాలలోను వాణిజ్య

వ్యాపార కళాశాలలోను, చేరేందుకు ప్రయత్నించి తర్వాత విరమించి, హూనాన్‌రాష్ట్ర గ్రంథాలయంలో ఆరుమాసాలు అవిరామంగా ప్రపంచ భూగోళం, చరిత్ర, అర్థశాస్త్రం, డార్విన్ పరిణామవాదం, రూసో రచనలు, స్పెన్సరు తర్కశాస్త్రం, మాంటెస్క్యూ న్యాయశాస్త్రం, నవలలు మొదలైనవి చదివాడు. గ్రంథాలయం తెరిచినప్పుడు వెళ్ళి, మూసినప్పుడు యివతలకు వచ్చేవాడు తదేకదీక్షతో కృషిచేసి ఆ గ్రంథాలను క్షుణ్ణంగా అర్థం చేసుకున్నాడు. హూనాన్ కళాశాలలో చేరి అయిదు సంవత్సరాల తర్వాత పట్టభద్రుడయ్యాడు. ఈ కాలంలో ఆయన రాజకీయభావాలు ఒక పరిణతికి వచ్చాయి. ప్రకృతి శాస్త్రాలకంటె, సమాజ శాస్త్రం అంటే అభిరుచి కల్గి, అత్యధికంగా కృషి చేశారు.

ఇంగ్లండులో విద్యాభ్యాసం చేసిన యాంగ్‌చెన్‌చీ అను అధ్యాపకునివలన మోకు ఆదర్శవాదమందు, నీతిశాస్త్రమందు గాఢమైన గౌరవ విశ్వాసాలు కలిగాయి. విప్లవ పత్రిక అయిన ప్రజాపత్రిక (మిన్‌పో) ప్రతులను భక్తి ఉత్సాహాలతో చదువుతో వుండేవాడు.

పట్టభద్రుడైన తర్వాత వసంతకాలంలో ప్రొద్దు గూకినచోట రైతుల యిండ్ల ఆతిధ్యం స్వీకరిస్తూ, ఉదయాన్నే లేచి కాలినడక ప్రయాణం సాగిస్తూ హూనాన్‌రాష్ట్రంలో అధికభాగం పర్యటనం చేశాడు.

దేశభక్తి ప్రపూరితమైన కార్యాచరణ కొనసాగించేందుకు ఒక సంఘాన్ని ఏర్పాటు చేశాడు. మున్ముందు యిద్దరుమాత్రమే చేరారు. లిలిసాన్‌ఎచ్చి మోయొక్క ఆదర్శాలు విని, తన అభిప్రాయం చెప్పకుండా, తిరిగి రాకుండా వెళ్ళిపోయాడు క్రమంగా ఆయనచుట్టూ దేశ సేవాకాంక్షులైన విద్యార్థులు, యువకులూ చేరారు. వీరి సమావేశాల్లో చైనాజాతీయౌన్నత్యం, అంతర్జాతీయ రాజకీయాలు, విశ్వ రూపం వున్నగు మహత్తర విషయాలను గూర్చేగాని, స్త్రీ, ప్రేమ, కామ సంబంధమైన విషయాలను చర్చించేవారు కారు. గొప్ప నియమబద్ధమైన

జీవితం గడిపేవారు. 'శరీర శిక్షణ' పేరుతో రాటుపోటులకు నిలబడు నట్లు కష్టించేవారు.

1917 వ సంవత్సరంలో మోసియుంగ్ 'సిన్‌మిన్‌స్యూహ్వీ' అను నూతన ప్రజాబోధన సంఘాన్ని నెలకొల్పాడు. అందులో మాన్, సియాసీ, హోసీన్‌చో, సియోచూచాంగ్. సేహోషెంగ్. కోలియాంగ్, సియోచెన్,అను యువకులు చేరి చాల శ్రద్ధాసక్తులతో పనిచేశారు వీరిలో చాలామంది 1927 లో జంగ్‌కైషేక్‌చే సాగించబడిన విప్లవ ప్రతీఘాత చర్యలలో చనిపోయారు మిగిలినవారు సోవియట్ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహిస్తున్నారు

ఈసమయంలోనే 'సంఘశ్రేయోదాయక మండలి' స్థాపింపబడింది. దాని స్థాపకుడు వెన్‌టేయింగ్ 1927 లో కమ్యూనిస్టు వ్యతిరేక చర్య లలో చంపివేయబడ్డాడు. లిన్‌పియో కమ్యూనిస్టు పార్టీలో ప్రధానపాత్ర వహిస్తున్నాడు. ఈ సంఘసభ్యు లనేకులు కమ్యూనిజం వ్యాప్తికి చాల తోడ్పడుతున్నారు.

ఇట్టి సమాజాలలో చాలవరకు చెంగ్‌టుస్యూచే 'నవ్యసాహిత్య ప్రచారసభ' తరఫున ప్రకటింపబడే 'నవయువ' అను పత్రిక ప్రచారం చేసే ఆదర్శసిద్ధాంతాలకు పాటుపడేవి షాంఘై, హాంగ్‌చౌ, టీన్‌ట్సిన్ పట్టణాలలో యిట్టి సంఘాలు కమ్యూనిస్టు సిద్ధాంత ప్రచారం చేశాయి. టీన్‌ట్సిన్‌లో చౌఎన్‌లైచే 'ప్రబోధక సంఘం' నడిపింపబడింది.

1918 లో పట్టభద్రుడైన తరువాత మోసీయాంగ్ చాలమంది విద్యార్థులను ప్రోత్సహించి, "పనిచేస్తూ చదువుకుందాం" అనే ఒక విధా నంతో ఫ్రాంసు వెళ్లేందుకు ఫ్రెంచి చదవడం ఆరంభించారు. ఈ ఉద్యమ ఫలితంగా విద్యార్థుల జట్టులనేకం ఫ్రాంసు వెళ్ళారు. కాని చైనాదేశం లోనే తిరిగి అర్థంచేసుకోవలసిందీ, చేయవలసిందీ చాలా పని వుండగా యూరపుదేశం వెళ్ళేకంటే, చైనాలోనే ప్రయోజనకరంగా దేశసేవ చేయవచ్చునని మోసియంగ్ పీపింగు విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో

సహాయక గ్రంథాలయోద్యోగిగా పనిచేశాడు ఈ రోజుల్లో పూస్సీన్, లోచియాలుంగ్ మున్నగు అతివాదులు అక్కడికి వచ్చేవారు. వారితో మాట్లాడాలని ఎంత ప్రయత్నించినా చిన్న ఉద్యోగియైన మోసియుంగ్‌తో వారికి సంభాషించేందుకు తీరుబడి వుండేదికాదు. ఐనప్పటికీ నిరుత్సాహపడక 'తత్వశాస్త్ర సమాజం' పత్రికారచయితల సంఘాల్లో సభ్యుగా చేరి ఉత్సాహవంతులు, మహాత్యాగులూ అయిన యువకులతో పరిచయం సంపాదించాడు. ఇంతవరకు ఉదారభావాలు, ఆదర్శవాదం, ఊహాజనిత సోషలిస్టుభావాలను కలిగివున్న మోసియుంగ్ క్రమంగా అతివాదదృక్పథంవైపు ప్రయాణం సాగించాడు

నిర్ధనుడైన మోసియుంగ్ ఫ్రాంసుకు వెళ్ళే విద్యార్థులను సాగనంపేందుకు షాంఘేకు బయల్దేరి, చేలనొక్క గవ్వలేకపోయినా, స్నేహితుల అయాచిత, సహాయంతో కన్ఫ్యూషియస్ సమాధిమున్నగు వ్రశ్యాలు చూస్తో, షాంఘేచేరి ప్రజలవద్దనుంచి విరాళాలు ప్రోగుచేసి, వారిని సాగనంపి తిరిగి చాంగ్షా చేరుకున్నాడు.

చాంగ్షాలో రాజకీయాల్తో ప్రత్యక్ష సంబంధం పెట్టుకొని సియాంగ్‌చియాంగ్ పత్రికకు సంపాదకుడుగా పనిచేశాడు ఈ పత్రిక విద్యార్థులపై గొప్ప ప్రభావం కలిగివుండేది. 'సంస్కృతి గ్రంథమండలి' ద్వారాను, పత్రికద్వారాను హూనాన్ రాష్ట్రగవర్నరుకు వ్యతిరేకంగా ఉద్యమం లేవదీసి, విద్యార్థులచే గొప్ప సమ్మె చేయించాడు దీనికి ఫలితంగా ఆయన పత్రికపై ఆంక్ష విధింపబడింది.

"నూతనప్రజా ప్రబోధక సంఘం" తరఫున సైనిక పరిపాలక వ్యతిరేకోద్యమం నడిపిస్తో మోసియుంగ్ పెకింగ్‌లో బ్రహ్మాండమైన ప్రచారంచేసి చాలమంది అనుయాలను సంపాదించాడు. వీరి ప్రచారఫలితంగా హూనాన్‌రాష్ట్ర సైనిక గవర్నరును తరిమివేసి టాన్‌యెన్‌కే గవర్నరు అయ్యాడు. క్రమంగా ప్రజాప్రబోధక సంఘంలో అతివాద మితవాదకక్షు లేర్పడ్డాయి.

అతివాదపక్షం తరపున మోసియంగ్ హూనాన్ రాష్ట్ర పునర్ని ర్మాణ సంఘాన్ని నెలకొల్పి, షాంఘైలోవున్న చెన్‌టూస్యూతో ఆ సంఘ నిబంధనావళి, కార్యక్రమాలను గూర్చి సంప్రదించాడు. అటుతర్వాత ఆ రాష్ట్ర స్వపరిపాలనాధికార సంపాదనాకృషిని తీవ్రంగా చేశాడు. పెకింగ్ ప్రభుత్వంయొక్క ప్రజావ్యతిరేక చర్యలవలన రోతపుట్టి హూనాన్ రాష్ట్రాన్ని సర్వతంత్రస్వతంత్రంచేసి, ఆధునికం చెయ్యాలని, సత్వర పురోభివృద్ధికి తేవచ్చుననీ ప్రచారం చేశాడు. స్త్రీపురుషులకు సమాన హక్కులు, సావకాశాలు కలగాలనీ, ప్రజాప్రతినిధి ప్రభుత్వం ఏర్పడాలనీ ప్రచారం సాగింది. వీరి ప్రచారఫలితంగా ప్రజలలో కలిగిన హూనాన్ ప్రభుత్వంపై ద్వేషాన్నిఉపయోగించుకొని చోహెంగ్‌టీ అను సైనికవాది, జమీదార్లను, గొప్ప భూస్వాములను, షాహుకార్లను కూడగట్టుకొని, టాన్‌యెన్‌కేను తరిమివేసి తానే గవర్నరయ్యాడు. ఈ కొత్తగవర్నరు ప్రజాహక్కులను నాశనం చేశాడు 1920 లో రష్యా నవంబరు విప్లవ దినోత్సవాన్ని మోసియంగ్ ఆధిపత్యాన జరుపుతోవున్నప్పుడు, ఆ ఉత్సవం నిషేధింపబడింది. ఎర్రజెండా నెగురవేయ ప్రయత్నించేవారిని తరిమి వేశారు. అప్పటినుంచీ ప్రజాహిత కార్యక్రమంద్వారా ప్రజాశక్తి నభివృద్ధి పరుస్తేనేగాని ప్రజాప్రభుత్వం ఏర్పడదనే నమ్మకం మోసియంగ్‌కు కలిగింది.

మార్క్సు సిద్ధాంతాలను రష్యను విప్లవజ్యోతి వెలుగులో అర్థం చేసుకొంటూన్న మోసీయంగ్ 1920 శీతాకాలంలో హూనాన్‌లో ప్రథమ కార్మిక సంఘాన్ని యేర్పరిచాడు. 1919 లో చెన్‌టుస్యూ అంతర్జాతీయ కమ్యూనిస్టు సంఘంతో సంబంధ మేర్పరచుకొన్నాడు. 1920 లో కోమిం టర్ను ప్రతినిధియైన మార్లిన్ వచ్చి ఉత్సాహపరులగు యువకులతో కమ్యూనిస్టు సమస్యలను గూర్చి చర్చించాడు. 1921 మే లో చరిత్రాత్మక మైన ప్రథమ కమ్యూనిస్టుపార్టీ నిర్మాణసభ షాంఘైలో జరిగింది. అందులో చెన్‌టూస్యూ, లిటాచో, మోసియంగ్ మున్నగువారు పాల్గొ

న్నారు. అక్టోబరు మాసంలో హూనాన్‌రాష్ట్ర పార్టీ మోసియంగుచే నిర్మింపబడింది. త్వరలోనే యితర రాష్ట్రశాఖలుకూడ యేర్పడ్డాయి. ఇదే సమయంలో చౌఎన్‌లే, లిలిసాన్ మున్నగువారిచే ఫ్రాంసులోనూ, కొద్దికాలం తర్వాత కోయిూహాన్, చూతేలతో జర్మనీలోనూ, చైనీయుల కమ్యూనిస్టుపార్టీలు నిర్మింపబడ్డాయి.

1922 మే నాటికే కార్యదర్శియైన మోసియంగ్ కృషి ఫలిత హూనాన్ రాష్ట్రంలో రైల్వే, మునిసిపల్, అచ్చు, టంకశాల ఎనిమిదల సంఘాలు 20 కంటె హెచ్చుగానే వెలిశాయి. ఆ రోజుల్లో కమ్యూనిస్టులు విద్యార్థి, కార్మిక రంగాల్లోనే హెచ్చుగా కేంద్రీకరించి పని చేసేవారు. గని పనివారు, విద్యార్థులు, చాలవరకు యీ నిర్మాణాలలోకి వచ్చారు. హూనాన్ గవర్నరు యిద్దరు కార్మికులకు వేసిన ఉరిశిక్షకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన నిరసన ఉద్యమాన్ని నడిపారు మే దినోత్సవం నాడు సర్వసాధారణ సమ్మె జయప్రదంగా జరిపి కార్మికులలో కలిగిన నూతన రాజకీయ ప్రబోధానికి, ఐకమత్యానికి ఒక నిర్దిష్టమైన రూపం దిద్దారు.

1923 లో కొమింటాంగులో జేరి ఐక్య సంఘటన నేర్పరచాలని తీర్మానించిన తృతీయ కమ్యూనిస్టు సమ్మేళనంలో పాల్గొని, కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీలో సభ్యుడుగా పని చేశాడు. 1924 లో కాంటన్‌లో జరిగిన ప్రథమ కొమింటాంగు జాతీయ కాంగ్రెస్సు సమావేశంలో పాల్గొని షాంఘై కొమింటాంగు కార్యనిర్వాహకవర్గ సభ్యుడుగా కూడా యెన్నుకోబడ్డాడు. ఈ కార్యనిర్వాహక సభలోనే వాంగ్‌చింగ్‌వీ, హూహాన్‌మిన్‌లుకూడా సభ్యులు. ఆ సంవత్సరం వసంతఋతువులో వాంపోవా సైనిక శిక్షణాలయం ప్రారంభింపబడింది. గాలెన్ సలహాదారుగా నియమింపబడ్డాడు. కమ్యూనిస్టు కొమింటాంగుల ఐక్యకృషి చైనాదేశంలో నూతన విప్లవవెల్లువను కొనివచ్చింది

1925 మే 30 వ సంఘటన తర్వాత హూనాన్ రైతులలో గొప్ప సంచలనం కలిగింది. వెంటనే మోసియంగ్ హూనాన్‌రాష్ట్ర గ్రామసీమల్లో

సంచారంచేసి 20కి మించి రైతుసంఘాలనేర్పరచాడు. పెద్దభూస్వాములు భయకంపితులై మోసియంగ్ అరెస్టునుకోరగా, ఆరాష్ట్రగవర్నరు పట్టుకు నేందుకు సైనికులను పంపాడు. మోసియంగ్ కాంటన్ పారిపోయాడు. అటుతర్వాత కొమింటాంగు ప్రభుత్వం ప్రకటించే రాజకీయ పత్రికకు సంపాదకుడుగా నియమింపబడ్డాడు. ఈ పత్రికద్వారా అతివాదులను బల పడుస్తో, మితవాదుల నిజస్వరూపం బయటపెట్టేవాడు. త్వరలోనే 21 రాష్ట్రాలనుంచి వచ్చిన ప్రతినిధి విద్యార్థులకు రైతుసమస్యలను బోధించేం దుకు రైతాంగవిద్యాలయ నిర్మాణ కర్తగా పని చేశాడు. కొమింటాంగ్ ప్రభుత్వ ప్రచారసంస్థలో ప్రధానాధికారిగాను, కేంద్రసంఘంలో సభ్యుడు గాను మోసియంగ్ బహు ప్రముఖపాత్ర వహించాడు. లిన్ పేహా కర్షక శాఖకు, టాణాపింగ్‌షాన్ కార్మిక శాఖకు ప్రధానాధికారులుగ పని చేస్తోండేవారు.

హూనాన్ రైతులలో పనిచేసినప్పుడు, గడించిన అమూల్యాను భవాన్ని ఆధారం చేసుకొని ఆయన "చైనా సమాజంలోని వివిధ వర్గాలు" "చో హెంగ్‌టీ వర్గ పునాదులు మనం నిర్వర్తించవలసిన విధులు" అను రెండు కరపత్రాలను వ్రాశాడు. చెన్‌టూస్యూ ప్రథమ కరపత్రంలోని భావిధానానికి వ్యతిరేకించాడు, కమ్యూనిస్టుపార్టీ ఆధిపత్యాన రైతుసంఘా లను నిర్మించాలనే సూచనను ఖండించాడు. అందువలన కేంద్రపార్టీ పత్రికలో ప్రచురించలేదు. కాని కాంటన్‌నుండి వెలువడే రైతు మాస పత్రికలో ప్రకటించబడింది. రెండవది కరపత్రంగా ప్రకటించబడి, హూనాన్‌లో గొప్ప ప్రచారంలోకి వచ్చింది. చెన్‌టూస్యూ మితవాద పంథాతోను సమయానుకూల ధోరణితోను మోసియంగ్ ఖేదిస్తూవచ్చాడు.

కాంటన్ కొమింటాంగు ప్రభుత్వంలో 1926 మార్చిలో జంగ్‌కై షేకు ప్రథమ పర్యాయం తిరుగుబాటు చేసేవరకు మోపనిచేసి, షాంఘేకు వెళ్ళి కమ్యూనిస్టు రైతుఉద్యమాన్ని నడుపుతో హూనాన్ రాష్ట్రరైతు

ఉద్యమాన్ని తణీఖీచేశాడు. ఈ లోగా చరిత్రాత్మకమైన ఉత్తరరాష్ట్ర దండయాత్ర కమ్యూనిస్టు కొమింటాంగు ఐక్యసంఘటన ఆధిపత్యాన జరిగింది.

వివిధరాష్ట్రాలకు చెందిన రైతుసేవకుల సమావేశంలో మోసి యంగ్ భూ విభజన భారీప్రమాణంలో జరుపాలని ఒక తీర్మానం పెట్టాడు. ఆ సమావేశంలో ఆ తీర్మానం ఆమోదింపబడినప్పటికీ 1927 మేలో జరిగిన ఐదవ కమ్యూనిస్టు సమావేశంలో చెన్‌టూస్యూ దానిని త్రోసివేశాడు. అప్పటికే జంగ్ విప్లప్రతీపఘాతకుడై కాంటన్, షాంఘై హత్యలు సాగించినప్పటికీ చెన్‌టూస్యూ మాత్రం మితవాద పంధానే అనుసరిస్తో ఊహాన్ ప్రభుత్వానికి సంపూర్ణంగా లొంగిపోయాడు. చెన్ దృష్టిలో రైతులు విప్లవపాత్ర వహించలేరు రైతుల బలంలోనూ, వర్గ దృక్పధంలోనూ ఆయనకు విశ్వాసంలేదు. రైతుపోరాటాలను రైతు సంఘ నిర్మాణాన్ని తీవ్రతరం చెయ్యాలన్న మోసియంగ్ తీర్మానాన్ని చర్చకే తీసుకురాకుండా త్రోసివేశాడు.

1927 వసంతఋతువులో హోపే, కియాంగ్సీ, ఫూకీన్, హూనాన్‌లలోని రైతులు విప్లవభావాలతో ఉడుకెత్తిపోతున్నారు. ప్రద ర్శనలు, సభలు, సమావేశాలు హెచ్చుగా జరిపారు. వారిలో కలిగిన ఈ అపూర్వ చైతన్యానికి భయపడి పెద్ద ఉద్యోగులు, సేనానాయకులు రైతుసంఘాలను అణచివేయవలసిందిగా కోరారు. ఈ ఉపద్రవాని కంతకూ మోసీయంగ్‌ను కారణభూతునిగా యెంచి చెన్‌టూస్యూ మోను వెనుకకు రప్పించాడు.

1927 ఏప్రిల్‌లో నాంకింగు, షాంఘైలలో కార్మికులను జంగ్ కౄ్రరంగా నాశనంచేయ మొదలెట్టాడు. మే 21 నాడు హోనాన్‌లో మూకోసియాంగ్ విప్లవం రుధిరప్రవంతులలో ముంచివేయబడింది. అవతి కాలంలో వూహాన్‌లోని అతివాద కోమింటాంగు ప్రభుత్వం కమ్యూనిస్టు

లతో చేసుకున్న ఒడంబడికను రద్దుచేసి కమ్యూనిస్టులను బహిష్కరించారు.

చెన్‌టూస్యూ కమ్యూనిస్టు నాయకులను ఇతర దేశాలలో సురక్షిత ప్రదేశాలకు వెళ్ళమని ఆదేశించాడు. మోసీయంగ్ కోరి హూనాన్ రాష్ట్ర పార్టీకార్యదర్శిగా వెళ్ళిన పదిరోజుల్లోపుగానే అక్కడ తిరుగుబాటు తీసుకుని వస్తున్నాడని ఆందోళనతో మోను చెన్ వెనుకకు పిలిపించాడు. అటుతర్వాత కమ్యూనిస్టు పార్టీవ్యవహారాలన్నీ అరాచకమయ్యాయి. చెన్ నాయకత్వంలో కమ్యూనిస్టులకు విశ్వాసం సమసిపోయింది. కమ్యూనిస్టుపార్టీకి నియంతవలె వ్యవహరించిన చెన్‌టూస్యూ కమ్యూనిస్టు బహిష్కరణతోపాటు పతనం చెందాడు.

## చూ టే జీ వి త క థ.

చైనా ఎర్రసైన్యనిర్మాత, సర్వసేనాధ్యక్షుడూ అయిన చూటే జెక్వాన్ రాష్ట్రంలోని యీలుంగ్ జిల్లాలోని మాంచాంగ్ గ్రామంలో ఒక నిరుపేద రైతుకుటుంబంలో 1886 లో జన్మించాడు. ఆయన కుటుంబంలో 20 మంది సభ్యులుండేవారు. వారు కొద్దిభూమిని కౌలుకు పుచ్చుకుని, కష్టించి పనిచేస్తో బహు పేదజీవితాన్ని గడిపేవారు. ఆరు సంవత్సరాల వయస్సులో చూటే వీధిబడిలో ప్రవేశించి మూడు సంవత్సరాలపాటు చదువుకున్నాడు. పొట్టగడవడం కష్టమైనందున చూటేను పినతండ్రికి పెంపుకిచ్చేరు. ఆయన బహు దయగా పెంచుతో చూటేను బడికి పంపించాడు. ఆరుసంవత్సరాలు కన్ఫ్యూషియస్ సిద్ధాంతాలు చదువుకుంటూనే ఇంట్లో చాకిరీకూడా చేస్తుండేవాడు. 1906 సం॥రంలో మాధ్యమిక పాఠశాలలో చదువు పూర్తిగావించి 1907 లో చెంగ్‌టూలో వ్యాయామశిక్షణ పొంది పట్టా సంపాదించాడు. 1909 లో యూనాన్ రాష్ట్రప్రధాన నగరమైన యూనాన్‌ఫూలో సైనికశిక్షణాలయంలో విద్యా

ర్దిగాజేరి 1911 విప్లవంవరకూ శిక్షణపొందాడు. ఆరోజుల్లో ఈ శిక్ష ణాలయం జాతీయ భావాలకు తావిచ్చేది.

చూతే చిన్నతనంలో తైపింగ్ విప్లవ వీరగాథలు వృద్ధనేతగాంధ్ర ఎలన విని తానుకూడా గొప్ప సుశిక్షితుడైన సైనికుడై విప్లవవాది కావా లని కోరుకునేవాడు. 1909 లో సైనిక శిక్షణాలయంలో జేరిన కొద్ది



చూతే ఉపన్యాసం.

వారాలలోనే సన్‌యట్‌సేన్‌చే స్థాపించబడిన టంగ్ మింగహ్వ విప్లవ పక్షంలో సభ్యుడుగా చేరాడు.

ఒక సైనిక పటాలానికి అధికారిగా ఉన్న చూటే 1911 లో మంచూ ప్రభుత్వాన్ని తుదముట్టించేందుకు యూనాన్ గవర్నరైన సీమో నాయకత్వం క్రింద విప్లవంలో పాల్గొన్నాడు. త్వరలోనే జెక్వాన్ గవర్నరుతో పోరాడేందుకు చూటేను పంపారు మూడు నాల్గు మాసాల పోరాటంలో ఆ గవర్నరును పూర్తిగా ఓడించి ఏప్రిల్‌లో యూనాన్ తిరిగివచ్చాడు. 1912 సంవత్సరంలో యూనాన్ సైనిక శిక్షణాలయంలో యుద్ధతంత్రాన్ని, ఎత్తుగడలను, రైఫిలు శిక్షణను యిచ్చే శిక్షకుడుగా చూటే పనిచేశాడు.

1913, 1914 సంవత్సరాలలో ఫ్రెంచి యిండోచైనా సరిహద్దులో బెటాలియన్ కమాండరుగా పనిచేశాడు 1915 లో జెక్వాన్ తిరిగివచ్చి యువాన్‌షీకే విద్రోహి సైన్యాలతో ఆరుమాసాలపాటు యుద్ధంచేసి ఓడించినతర్వాత బ్రిగేడ్ కమాండరుగా చూటే నియమింపబడ్డాడు ఈయన అధికారం క్రింద పనిచేసిన సైన్యాలు ఆరోజుల్లో గొప్ప పేరుప్రఖ్యాతులు గడించాయి.

ఐదు సంవత్సరాల నిరంతర పోరాటానంతరం 1921 లో రెండు మాసాలపాటు యూనాన్‌రాష్ట్ర పోలీసు కమీషనరుగా పని చేశాడు. కాని యీలోగా టాంగ్‌చియో సైనికప్రభువు యూనాన్ రాష్ట్రాన్ని తిరిగి ఆక్రమించుకుని చూటేను 20 రోజులపాటు వెంటాడించాడు. అతి కష్టంమీద చూటే ఒక పటాలంతో టాంగుబారినుండి తప్పించుకుని పారిపోయాడు. అటుతర్వాత జెక్వాన్, చియాటింగులు గడిచి చుంకింగ్ వెళ్ళాడు. 1922 జూన్ మాసంలో గవర్నరు జనరలైన లియూసియాంగు చూటేను ఆదరించాడు. అప్పటికే మంచూచక్రవర్తి సైన్యాలపై చేసిన యుద్ధాలలో చూటే సేనాని అమలుపరచిన నూతన 'చలన యుద్ధతంత్రం' గెరిల్లా పోరాటపు ఎత్తుగడలు చూటేకు గొప్ప గౌరవాన్ని సంపాదించాయి. ఫ్రెంచి యిండోచైనా సరిహద్దులో మంజూ తెగవారితోనూ, దోపిడీ ముఠాలతోనూ నల్పిన పోరాటాలలో గడించిన విశేషానుభవాన్ని సాంప్రదాయ యుద్ధశాస్త్ర విజ్ఞానానికి జోడించి చూటే యీ నూతన యుద్ధ

తంత్రాన్ని అభివృద్ధిపరచి వ్యూహరచనా పాటవాన్ని అలవరచుకున్నాడు. ఆయన గొప్ప బలశాలి. దృఢకాయుడు. కాయకష్టాని కోర్వగలడు. అందువలన సామాన్య సైనికునితో సమానంగా కష్టిస్తో వారితో సమానుడుగా ప్రవర్తించి వారి విశ్వాసాన్ని చూరగొంటాడు. పెద్ద చిన్న విచక్షణ లేకుండా అన్ని పోరాటాలకు ముందుగానే ఆయన భౌగోళిక పరిస్థితుల్ని దృష్టిలో నుంచుకుని యుద్ధనిర్వాహణకు కావలసిన సన్నాహాలన్నిటినీ బహు శ్రద్ధగా చేస్తాడు. ఆయన స్వయంగా యేర్పాట్లు చేస్తో స్వయంగా యుద్ధంలో పాల్గొంటాడు శత్రువుయొక్క స్థితిగతుల్ని అన్ని వైపులనుంచీ బహు సూక్ష్మంగా పరిశీలించి తదనుగుణ్యంగా తన యుద్ధ తంత్రాన్ని నిర్ణయిస్తాడు ప్రజలకు గౌరవాదరాభిమానాలు చూపి వారి భక్తివిశ్వాసాలను చూరగొంటాడు.

లియూసియాంగు సైనికవాది యిస్తానన్న పదవిని తిరస్కరించి విప్లవపదగామియై కమ్యూనిస్టుపార్టీ వైపు పయనించాడు. ఆ కాలంలో సైనికతత్వంతో కూడిన భూస్వామికవాదం చైనాలో ప్రబలివుంది. రష్యను విప్లవం గురించిన గ్రంథాలనన్నిటినీ చదివిన చూటే షాంఘైలో కమ్యూనిస్టుపార్టీని వెదికాడు. కాని అజా పజా దొరక లేదు. పెకింగు వెళ్ళి అక్కడకూడా పార్టీ లేకపోవడం వలన తిరిగి షాంఘైకు వచ్చి సన్‌యట్‌సేన్, వాంగ్‌చింగ్వీలను కలుసుకున్నాడు. అటుతర్వాత 1922 సెప్టెంబరులో యుద్ధతంత్రాన్ని నేర్చుకునేందుకు జర్మనీ వెళ్ళాడు.

జర్మనీలో చౌఎన్‌లేను తదితర కామ్రేడ్సును కలుసుకొని వెంటనే జర్మనీలో స్థాపించబడిన చైనా కమ్యూనిస్టుపార్టీలో అక్టోబరు మాసంలో సభ్యుడుగా చేరాడు. అప్పటికి ఆయనకు 36 సంవత్సరాల వయస్సు.

బెర్లినులో ఒక సంవత్సరంకాలం జర్మనుభాష నేర్చుకుని తర్వాత గెట్టింగ్‌జన్‌లో ఒక కళాశాలలో సమాజశాస్త్రం అభ్యసింప నారంభించాడు. జర్మనీలో ఉన్నంతకాలం కమ్యూనిస్టుపార్టీ పని చేస్తూండేవాడు. ఈ కాలంలో ఆయన ఒక వారపత్రికను నడుపుతో కమ్యూనిస్టు భావ

ప్రచారం సాగించాడు. 1924 లో బెర్లిన్‌లో కొమింటాంగు శాఖ నొకటి స్థాపించారు. ప్రపంచ విద్యార్థి కాంగ్రెసులోకూడా ఆయన పాల్గొన్నాడు. 1925 లో చెన్‌కాఫ్ అను ఒక బల్గేరియన్ విప్లవ వ్యతిరేకి హత్యా ప్రయత్న నేరంమీద చూ టేను 28 గంటలకాలం నిర్బంధంలో వుంచారు. చూ టే జీవితంలో యిది మొదటినిర్బంధం. కమ్యూనిస్టుపార్టీచే 1925 మే 30 వ తేదీని జరుపబడిన ప్రదర్శన సందర్భంలో రెండవ పర్యాయం అరెస్టు చేయబడ్డాడు. ఈసారి 30 గంటల కాలంమాత్రమే ఆయన జైలు వాసం మొత్తం ఆయనకు 58 గంటలు మాత్రమే నిర్బంధవాసం. ఈ కాలంలో ఆయన చాలామంది భారతీయులతో స్నేహం చేశాడు. వివిధ దేశస్థులు పరిచయమయ్యారు. ఈయన విప్లవ చర్యలు జర్మను ప్రభుత్వానికి కంటకప్రాయ మైనందున ఆయన జర్మనీ వదలి యూరపియన్ దేశాలు, సోవియట్‌రష్యా పర్యటనం చేసి 1926 లో చైనాకు తిరిగి వచ్చాడు.

షాంఘై, హాంకో, వాన్‌సీన్‌లలో తిరిగి కమ్యూనిస్టు ప్రచారం చేశాడు. ఊపీపూ ఆధిపత్యంలో యాంగ్ సేనానికి తోడుపడి చూ టే 20 వ సైన్యాన్ని పునర్నిర్మించాడు. 'జాతీయ విప్లవ సైన్య'మని యీ సైన్యానికి పేరు. ఈ సైన్యానికి చెందిన రాజకీయ సంఘానికి చూ టే అధ్యక్షుడు. కొమింటాంగుకు ప్రతినిధిగా కూడా యెన్నుకోబడ్డాడు. కాని యాంగ్‌పెకా ఉత్తర రాష్ట్రంలో వున్న సైనిక ప్రభువులతో సంబంధం వుంచుకున్నందున కొమింటాంగు ప్రభుత్వ సైన్యాలు టాంగ్‌షెంగ్‌చీ నాయకత్వాన యుద్ధం ప్రకటించగా యాంగ్‌పెకా సైన్యం వదలి, చూ టే కియాంగ్సీకి వెళ్ళాడు. 1927 జనవరి మాసంలో చూపీటే సైన్యంలో చేరి నాన్చాంగు సైనిక కళాశాలలో ప్రధానాధికారి అయ్యాడు. ఆయనే నాన్చాంగు పోలీసు ప్రధానాధికారిగాకూడా పని చేస్తున్నాడు. 1927 ఆగస్టు ఒకటవ తేదీని నాన్చాంగు తిరుగుబాటు జరిగేందుకు తోడ్పడి ప్రధాన నాయకుల్లో ఒకడయ్యాడు.

# 14 వ అధ్యాయం.

## నాన్చాంగు తిరుగుబాటు — సోవియట్ ఉద్యమం.

నాన్చాంగు తిరుగుబాటు సోవియట్ ఉద్యమానికి నాందీ ప్రస్తావన. కమ్యూనిస్టు కొమింటాంగు వాదుల నాయకత్వాన బయల్వెడలిన ఉత్తరరాష్ట్ర దండయాత్ర విప్లవ ప్రయోజనాలు సాధింపబడకుండా జంగ్ కై షేక్ సర్వసేనాని ఐక్య సంఘటనను విచ్ఛేదం చేశాడు ఊహాన్‌లోని అతివాద ప్రభుత్వంకూడా విప్లవ చైతన్యంతో విలసిల్లుతోన్న రైతుకూలీలను, కమ్యూనిస్టులను అణచివేసేందుకు తీవ్రంగా ప్రయత్నించారు. ఈవిధంగా అణచివేయబడుతున్న విప్లవాన్ని ఉద్ధరించాలనే పట్టుదలతో నాన్చాంగులో చాంగ్‌ఫాక్వీ సేనానిక్రింద నున్న కొమింటాంగు 4 వ సైనికదళంలోని కమ్యూనిస్టు సైనికులు తిరుగుబాటు లేవదీశారు. చాంగ్ ఫాక్వీ సైన్యాలు "ఉక్కు తునకలనే" ప్రసిద్ధి బడశాయి. ఈ సైన్యంలో 50,000 మంది సైనికులున్నారు. వీరిలో హోలుంగు సేనాని క్రిందనున్న 20 వ సైన్యంలోని రెండు సైనిక దళాలూ యేటింగు సేనాని క్రిందనున్న 24 వ దళం పూర్తిగానూ, 11 వ సైన్యంలోని రెండు రెజిమెంట్లు ఈ తిరుగుబాటులో పాల్గొని విప్లవ ధ్వజాన్ని ఎగురవేశాయి. మొత్తం యేటింగు నాయకత్వాన పదివేలమంది అనుచరు లున్నారు. ఈ తిరుగుబాటులో "ఉక్కుతునకలు" 25 వేలమంది పాల్గొన్నారు.

సైనిక శిక్షణ కళాశాలనుండి 700 మంది సైనికవిద్యార్థులను, పోర్సులైను, రైల్వే కార్మికులతో కలిపి 89వ సైన్యాన్ని చూటే నిర్మించి ఈ తిరుగుబాటులో పాల్గొన్నాడు. మొత్తం ఆయన సైన్యంలో 3000 మంది ఉన్నారు. పోలీసు కమీషనరుగా వున్న చూటే తిరుగుబాటుదార్లతో కలిసి ఒక ప్రధాన నాయకుడయ్యాడు.

ఈ తిరుగుబాటుకు, చౌఎన్‌లే, చూతే, హోలుంగ్, లియూపి చెంగ్, లిన్‌పెచూ లిన్‌పియో, సూతేలీ, యేటింగ్ ప్రభృతులు నాయకత్వం వహించారు.

నాన్చాంగు తిరుగుబాటుదార్లు "విప్లవనిలయ" మైన క్వాంగ్‌టంగ్ రాష్ట్రానికి వెళ్ళారు. ఆ రాష్ట్రంలో వారు నిలబడి విప్లవాన్ని జయప్రదం చేయగలమని ఆశించారు. కాని కొమింటాంగ్ సైన్యాలతో జరిగిన పోరాటాల్లో ఓడిపోయారు. క్వాంగ్‌టంగ్‌లోని స్వాటోవద్ద జరిగిన యుద్ధంలో హోలుంగ్, యేటింగ్‌ సేనానుల సైన్యం చాలవరకు నాశనమైంది 2000 మంది అనుచరులు మాత్రం మిగిలారు. వీరిలో 300 వచ్చి చూతే సైన్యాల్లో జేరారు.

చూతే తన సైన్యాలతో క్వాంగ్‌టంగ్ రాష్ట్రంలోని టుంగ్‌కియాంగ్ జిల్లాకు వెళ్ళి హైలోఫెంగ్‌ను ఆక్రమించుకుని నవంబరు మాసంలో ప్రధమ సోవియట్ ప్రజాప్రభుత్వాన్ని నెలకొల్పాడు. ఈ లోగా జరిగిన శాన్‌హోపా పోరాటంలో చూతే వేయిమంది సైనికులను కోల్పోయాడు. పోగా మిగిలిన 1500 మంది సైనికులతోనూ 1000 మంది రైతుదళాలతోనూ కాంటన్ విప్లవంలో డిశెంబరు 11 వ తేదీని పాల్గొని 3 రోజుల్లో నాన్కింగు ప్రభుత్వసైన్యాలచే ఓడింపబడి తరిమివేయబడ్డారు.

## ఎర్రసైన్య నిర్మాణం.

కాంటన్ కమ్యూన్ 3 రోజులలోనే తుడిచివేయబడినప్పటికీ ఆ స్వల్పకాలంలోనే ఆ ప్రభుత్వం కార్మికులకు రోజుకు 8 గంటల పని కాలం; వేతనాభివృద్ధి; పెద్ద పరిశ్రమలను, బ్యాంకులను జాతీయం చెయ్యడం; సామాజిక జీవిత భీమా; జమీందార్లయొక్క, గొప్ప భూస్వాములయొక్క భూమిని జప్తుచేసి పేదరైతులకు పునర్విభజిం

చడం; వాక్స్వాతంత్ర్యం; పత్రికా స్వాతంత్ర్యం: అను విప్లవవిధానాన్ని ప్రకటిం చింది. ప్రజానీకం తమను తామే పరిపాలించుకోవచ్చుననే యీ విప్లవ శంఖారావం రైతులలో బ్రహ్మాండమైన ఉత్సాహాన్ని రేకెత్తించింది.

చూటే 1200 మంది సైనికులతో దక్షిణ హోనాన్ రాష్ట్రానికి తిరోగమనంచేసి దక్షిణ హోనాన్ తిరుగుబాటును 1928 జనవరి మాసంలో జరిపి అచ్చటిసైన్యాన్ని 10000 వరకూ పెంచాడు. విప్లవో త్సాహంతో ఉద్రూతలూగుతున్న రైతులు, సైనికులు ఆయన సైన్యంలో చేరారు క్రొత్తగా నిర్మించబడిన హైలోఫెంగ్ సోవియట్‌ను రక్షించేం దుకు కాంటన్ తిరుగుబాటులో పాల్గొన్న విద్యార్థులు వెళ్ళి 4 వ సైన్యం క్రింద పునర్నిర్మిత మయ్యారు. హైలోఫాంగ్‌వద్ద 2 వ సైన్యంలో 800 సైనికులున్నారు. ఈ 2000 సైనికులు హైలోఫాంగ్ సోవియట్ రక్షణలో అసువులు కోల్పోయారు. ఈ విధంగా 25000 మంది నాన్చాంగు తిరుగు బాటుదార్లలో 1927 అంత్యానికి 1200 మంది మాత్రమే మిగిలారు. అందువలన కమ్యూనిస్టులు రైతులలో ప్రబోధంచేసి వారిలో మరల సైన్యాలను నిర్మించుకొన నారంభించారు. నాన్చాంగ్, కాంటన్ తిరుగు బాటుదార్లతో నిర్మింపబడిన ఈ సైన్యం సాహసానికి, శౌర్యానికి పేరె న్నికగన్నది. ఓటమినెరుగదు. హోన్యేపెంగ్, అన్యాంగ్‌గవి పవివారలతో నిర్మింప బడిన సైన్యంకూడా సోవియట్ రక్షణకు బలిఅయింది. హైలో ఫాంగ్ సోవియట్ 5 మాసాల్లోను, జెన్‌హ్వా సోవియట్ 40 రోజుల తర్వాతను అణచివేయబడ్డాయి. కియాంగ్సి, క్వాంగుటంగులలో బయల్దే రిన ఈ విప్లవజ్వాల సరిహద్దులలోనున్న పూకిన్, హూపే, క్వాంగ్సీ రాష్ట్రాలకు ప్రాకింది.

ఈలోగా కాంటన్ తిరుగుబాటు అణచివేయబడిన వారం రోజు లలో ఆగస్టు 7 వ తేదీన కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీయొక్క అత్య వసర సమావేశం జరిగి చెన్‌టూస్యూ నాయకత్వానికి ఉద్వాసన చెప్పింది.

చెన్‌టూస్యూ కార్యదర్శి పదవినుండి తొలగించివేయబడ్డాడు. మోసీ యంగ్, సేహోషెంగ్, పెంగ్‌కంగ్‌టా మున్నగు 10 మంది సభ్యులతో కూడిన ఆ కేంద్రసంఘం కమ్యూనిస్టుపార్టీ పంథాను మార్చివేసింది. సామ్రాజ్యవాదులకు బానిస అయిన కొమింటాంగుతో సహకరించాలనే ఆశ వదలుకుంది. ప్రజాప్రభుత్వ స్థాపనకు బహిరంగ పోరాట కార్యక్రమం సాగించాలనే నిర్ణయానికి వచ్చింది.

పార్టీచే చాంగ్షాకు పంపబడిన మోసీయంగ్ 1927 ఆగస్టు 17వ తేదీనాడు శీతాకాలపు పంట తిరుగుబాటును లేవదీశాడు. ఆయన పోరాట కార్యక్రమంలో అయిదు అంశాలున్నాయి :

1. కొమింటాంగునుంచి రాష్ట్ర కమ్యూనిస్టుపార్టీ సంపూర్ణంగా విడిపోవడం.

2. రైతుకూలీలతోకూడిన విప్లవసైన్య నిర్మాణం.

3 ధనిక భూస్వాముల భూమిని జప్తు చేయడం.

4. హోనాన్‌రాష్ట్రంలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని నెలకొల్పడం.

5. సోవియట్ల నిర్మాణం.

ఈ 5 వ అంశాన్ని కోమింటర్న్ ఆ రోజుల్లో అంగీకరించలేదు.

రైతు ఉద్యమం బాగా ప్రబలివున్న హోనాన్‌లో 1927 సెప్టెంబరు మాసంనాటికి సోవియట్ విప్లవం నలుమూలలా ప్రాకి రైతుకూలీ సైనిక దళాలు నిర్మింపబడ్డాయి. కొమింటాంగు సైన్యాలనుండి తిరుగుబాటుచేసిన సైనికులు, హాన్యాంగు గనిపనివారు, రైతులతో కలిసి 'రైతుకూలీల ప్రథమసైన్యం' నిర్మింపబడింది. ఊహాన్‌కోట రక్షణసైనికులు వాంగ్‌చింగ్‌వీమీద తిరుగబడి అక్కడనుంచి వచ్చి యీ సైన్యంలో చేరారు. హోనాన్‌రాష్ట్ర పార్టీకమిటీ యీ సైన్య నిర్మాణాని కంగీకరించింది. కాని పార్టీ కేంద్రకమిటీ మాత్రం వ్యతిరేకించింది. వారు "వేచివుండి చూద్దాం" అనే విధానాన్ని అనుసరించారు.

మోసీయంగ్ రైతులలో తిరుగుతూ సైనికులను సమకూరుస్తుండగా జమీందారు గూండా సైనికభటుల చేతులలో చిక్కాడు. కొమింటాంగు ప్రభుత్వం దొరికిన కమ్యూనిస్టుల నందరనూ కాల్చి పారవేస్తుండే గడ్డురోజులవి. మోసీయంగును జమీందారీ గూండాల గుడారం వద్దకు కాల్చివేయుటకు తీసుకొనివెడుతుండగా రెండు మూడు వందల గజాల దూరంలో మోసీయంగు అతి సాహసంతో వారినుండి తప్పించుకుని పారిపోయాడు. భటులు వెంబడించారు. కాని అయన అధిక ప్రయాసకులోనై కొండలమీద తుప్పల చాటుగుండా నడచి రైతుభటులను జేరుకున్నాడు.

మోసీయంగు తన సైన్యాన్ని హోనాన్ రాష్ట్రంలో దక్షిణాభిముఖంగా నడిపిస్తూ వేలకొలది కొమింటాంగు సైన్యాలతో అనేక పర్యాయాలు పోరాడి, ఓడిపోయి, తిరోగమనం చేస్తూ మరల మరల రైతుభటులను జేర్చుకుని సైనిక శిక్షణనిచ్చి వింగ్‌కొ జేరుకున్నాడు. ఆ సైన్యాలకు సేనాధిపతులైన యూషాటూ, చెంగ్‌హోలు ఒకరి తర్వాత మరొకరు సైన్యాలను వదలి పారిపోయారు. ఆ సైన్యాలకు శిక్షణ తక్కువ. సైన్యంలో జేరినవారిలో కొంతమంది ఊగిసలాడుతోనూ, కొందరు మధ్య మధ్య సైన్యాన్ని వదలి పారిపోతూను వుండేవారు.

## చింగ్‌కన్‌షాన్ — ఎర్రసైన్య విస్తరణ.

హోనాన్, వియాంగ్సీ సరిహద్దులోనున్న చింగ్‌కన్‌షాన్ పర్వతానికి మోసీయంగ్ తన సైన్యాలతో జేరుకున్నాడు ఈలోగా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ మోసీయంగ్‌ను రాజకీయ శాఖ (పోలిట్ బ్యూరో) నుంచి తొలగించివేసింది. హోనాన్ రాష్ట్రకమిటీవారుకూడా మోసీయంగ్ 'రైఫిలు ఉద్యమాన్ని' నడుపుతున్నాడని తీవ్రంగా విమర్శించసాగారు. అయినప్పటికీ మోసీయంగ్ అచంచలమైన విశ్వాసంతో చింగ్‌కన్‌షాన్ దుర్గంలో తన సైన్యాలను ప్రోగుచేయసాగాడు.

1927 నవంబరులో హోనాన్‌రాష్ట్రంలో చేలింగ్ సోవియట్ నిర్మింపబడింది టౌసింగ్‌పింగ్ ఆ ప్రభుత్వానికి అధ్యక్షుడుగా ఎన్నుకో బడ్డాడు. ఆ ప్రాంతంలో బహు జాగ్రత్తగా అభివృద్ధికరమైన మార్పులు తీసుకొనిరాగా అతి తీవ్రవాదులు మోసీయంగ్ సంస్కరణ వాదియని ప్రచారం చేశారు. 1927 శీతాకాలంలో వాంగ్‌సో, యువాన్ వెణాసే అను బందిపోటుదొంగల నాయకులు తమ జీవితాలను, భావాలను సంస్కరించు కొని మోసీయంగ్ సైన్యాల్లో జేరాడు. వారు వెనుక జాతీయ విప్లవంలో పాల్గొని ఆటుతర్వాత సోవియట్ విప్లవంలో చేరారు. చింగ్‌కణాషాన్‌లో మోసీయంగ్ సైన్యా లున్నంతవరకూ వారు విశ్వాసపాత్రులుగా వుండే వారు. కాని వారు వెళ్ళిపోయినతర్వాత వాంగ్. యువాన్‌లు తమ పాత పద్ధతులలో మెలగ నారంభిస్తే వారిని రైతులు చంపివేశారు.

1928 మే మాసానికి చూటే తన సైన్యాలతో చింగ్‌కన్‌షాన్ చేరుకున్నాడు చూటే, మోసీయంగ్‌ల సైన్యాలను కలిపి 'నాల్గవ రైతు కూలీ సైన్యమును' నిర్మించారు. ఆ సైన్యానికి చూటే సేనానాయకుడు, మోసీయంగ్ రాజకీయ సంఘాధ్యక్షుడు. వీరిద్దరూ కలసి హోనాన్, కియాంగ్సీ, క్వాంగ్‌టంగ్, సరిహద్దుల్లో ఆరు జిల్లాలలో సోవియట్లను నెల కొల్పేందుకు ఒక పథకం వేశారు దాని నాధారంగా చేసుకుని ఆ రాష్ట్రాల్లో సోవియట్ రాజ్యాన్ని విస్తరింపచేయాలని వీరు చేసే ప్రయత్నాన్ని బహుత్వరగా సోవియట్ సరిహద్దుల్ని విస్తరింపచేయాలనే రాష్ట్రపార్టీ వారున్నూ, క్వాంగ్‌టంగ్‌రాష్ట్రానికి తిరోగమనంచేయాలనేభయస్థులున్నూ వ్యతిరేకింప బొచ్చారు. 'భూ పునర్విభజన', 'సోవియట్ల నిర్మాణం' అను రెండు విధానాలను చూ, మోలు ప్రచారం చేశారు. పట్టుబడిన కొమిం టాంగు సైనికులను దయతో చూచి, తమ సైన్యాల్లో చేరనివారిని ఇండ్లకు పంపివేసేవారు.

సోవియట్ జిల్లాలనుండి ప్రతినిధులను 1928 ఆకురాలు కాలంలో చింగ్‌కన్‌షాన్ దుర్గంలో సమావేశపరచి వారి కార్యక్రమాన్ని గూర్చి

చర్చించారు. ఈ కాంగ్రెసులో సోవియట్ రాజ్యవ్యాప్తికి కృషి చేయాలని తీర్మానించబడింది. మాస్కోలో జరిగిన 6 వ కమ్యూనిస్టుపార్టీ సమావేశంలో చేయబడిన తీర్మానం శీతాకాలంలో కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సంఘానికి అందిన తర్వాత పార్టీకూడా యీ సోవియట్ ఉద్యమాన్ని అంగీకరించింది.

## సోవియట్ల నిర్మాణం.

ఈలోగా 1927 లో హోపే రాష్ట్రంలో సూహేయంగ్, హోలుంగ్‌లు కార్మిక కర్షక సైనికదళ నిర్మాణం చేయ నారంభించారు సూహేయంగు, ఓయువాన్ సోవియట్‌కు అంకురార్పణ చేశాడు. ఫూకీన్ చేరువనున్న కియాంగ్సి రాష్ట్ర ప్రాంతంలో సూసియాంగ్‌చేన్, షీపింగులు సోవియట్ ఉద్యమం లేవదీసి కూలీ రైతు దళాలను నిర్మించ సాగారు. తిరుగుబాటు విఫలమైన తర్వాత పెంగ్‌పే కొంతమంది సైనికులతో హైలోఫెంగ్ వెళ్ళి అక్కడ సోవియట్‌ను నిర్మించాడు కాని ఐదు మాసాల తర్వాత కొమింటాంగు సైన్యాలచే నాశనం చేయబడింది.

1928 వసంత ఋతువులో కియాంగ్సీ రాష్ట్రంలోని సింగుకూ, టుంగుకూలలో రీలెన్‌లుంగు, లీసోచూలు గెరిల్లా దళాలను నిర్మించి కియాన్ ప్రాంతంలో సోవియట్‌కు పీఠం ఏర్పరచారు. ఆటుతర్వాత సోవియట్ కేంద్ర ప్రభుత్వం ఇచ్చటనే నెలకొల్పబడి బలపడింది. పశ్చిమ ఫూకీన్‌లో చాంగ్‌టిన్‌జెన్ సోవియట్‌ను నెలకొల్పాడు.

## చింగ్‌కన్‌షాణానుండి తిరోగమనం.

చింగ్‌కన్‌షాన్, పెంగుటేహ్వా కొన్ని సైన్యాలను తీసుకుని వచ్చాడు. 1928 శీతకాలంలో హోచీన్ సైన్యంలో తిరుగుబాటు చేసిన వారు కొందరు వచ్చి చేరారు. చూ, మోల ఆధిపత్యాన యీ సైన్యాలు

చాలా పెరిగాయి. వీటిలో రెండు సైనిక భాగాలకు మాత్రమే ఆయుధా లున్నాయి. కియాంగ్సీ సైన్యాలు, చూపీచే సైన్యాలు, హోనాన్ రాష్ట్ర సైన్యాలు కమ్యూనిస్టులపై దండెత్తి వేర్వేరుగా ముట్టడించాయి. కాని ఓడిపోయారు. వారి సైన్యాల్లోనుంచి చాలమంది కమ్యూనిస్టు సైన్యాల్లో జేరారు.

ఈ మూడవ యుద్ధం ముగిసిన తర్వాత విజయోత్సాహులైన ఎర్రసైనికులు ఫాన్‌షిచెంగు యొక్క కొమింటాంగు సైన్యాల నోడించి చెంగుచౌను పట్టుకున్నారు. దానిని వదలి లింగ్‌పీన్, చేలిన్‌లపై దండెత్తారు, కాని ఎర్రసైన్యాలను కొమింటాంగు సైన్యాలు వెంట తరుముతూనే వున్నాయి. ఈ సమయంలోనే కొమింటాంగ్ సైన్యాలు సిమెంటు గృహాలు కట్టి ఫిరంగులతోనూ, ఆర్థిక దిగ్బంధం చేసే యుద్ధ విధానం అవలంబించారు అందువలన చింగ్‌కన్‌షాన్ పర్వత దుర్గాన్ని వదలి సోవియట్ల నిర్మాణానికై ఎర్రసైన్యం దండయాత్ర సాగించింది.

ఎర్రసైన్యం కియాంగ్సీ, పశ్చిమ పూకీన్‌లలోని హాచాంగ్, క్వాంగ్‌చాంగ్, షీచెకా, నింగ్‌టూ, టింగ్‌చౌలకు కొమింటాంగు సైన్యాలతో పోరాడుతూ వెళ్ళారు. నాన్కింగు ప్రభుత్వానికి సైనిక ప్రభువులకు యుద్ధం జరుగుతున్నందున టింగ్‌చౌలో 1929 లో ఏప్రిల్‌నుండి మే వరకు విశ్రాంతి తీసుకున్నారు. జూయికిచావద్ద పరాజయం పొందిన పెంగ్‌ఉహ్వా సైనికులు యీ యెర్రసైన్యంతో కలిశారు ఎర్రసైన్యపు పలుకుబడి యీ కోణాల్లో హెచ్చినందున చాలమంది రైతు, వ్యవసాయ కూలీలు వచ్చి జేరారు వీరితో 24 వ సైన్యం నిర్మింపబడింది. యుంగ్‌టింగ్, షాంగ్‌హాంగ్, టుంగ్‌కూ, లూంగ్‌యేలలో సోవియట్లు నిర్మింపబడ్డాయి.

1929 డిశెంబరులో పశ్చిమ పూకీన్‌లో 9 వ పార్టీపమావేశం జరిగింది. తత్ఫలితంగా ఎర్రసైన్య నిర్మాణంలోని అనేకలోట్లు సవరింప

బడ్డాయి. శిక్షణనిర్మాణపటిష్ఠత హెచ్చింపబడింది. సోవియట్లలో సంస్కరణలను ప్రవేశపెట్టి, పరిపాలనా పోషణం కలిగించడానికి యిష్టపడక, నూతనప్రదేశాలకు వెళ్ళి, సాహసోపేతమైన పోరాటాలు జరపాలనే "తిరుగుడు కాంక్ష"ను ఖండించారు. ఉత్తమరకమైన నిర్మాణం, రాజకీయ సిద్ధాంత ప్రబోధం ప్రవేశపెట్టారు. కియాంగ్సీ పశ్చిమ ఫూకీన్, టుంగ్‌కియాంగ్ ప్రాంతాలలో సోవియట్లను నెలకొల్పాలని నిశ్చయించారు.

సోవియట్ల ప్రాబల్యము నణచుటకు టూపిచే, చాంగ్‌చూన్‌లు చాల సైన్యాలతో యెర్రసైన్యాన్ని యెదిర్చారు. అందులో బలహీనంగా ఉన్న చాంగ్‌చూణ సైన్యాలపై బడి వాటిని సంపూర్ణంగా నాశనం చేశారు. ఎర్రసైన్యం చాంగ్‌చౌ, ఫూకీన్ లను ఆక్రమించింది. బలహీనంగావున్న శత్రుసైన్యంపైబడి ఓడించడం యెర్రసైన్యపు పోరాటపు ఎత్తుగడ. టూపిచే సైన్యాలు చాలబలవత్తరమైనవి గనుక అనేక పోరాటాలు జరిగినా ఇదమిద్ధమని తేలలేదు. ఈ కాలంలో దక్షిణ కియాంగ్సీరాష్ట్రం అంతా ఎర్రసైన్యానికి లోబడింది.

1930 ఫిబ్రవరి 7 వ తేదీనాడు దక్షిణకియాంగ్సీలో సోవియట్ కార్యక్రమం చర్చించుటకు అతిప్రాముఖ్యమైన సమావేశం జరిగింది. పార్టీ, ప్రభుత్వ, సైనిక ప్రతినిధులు పాల్గొన్నారు. భూపునర్విభజన జరుపరాదనే సమాయానుకూల వాదాన్ని ఓడించి భూమిని పంచుటకు నిర్ణయించారు. అంతవరకు జరుగుతున్నట్లు జిల్లాలలోగాక కియాంగ్సీ రాష్ట్ర సోవియట్ ప్రభుత్వం నిర్మించాలని కూడా నిశ్చయించారు. ఈ నిర్ణయానికి రాష్ట్రరైతులలో చాలమంది హర్షం వెలిబుచ్చారు. తండాలు తండాలుగా సైన్యంలో చేరజొచ్చారు.

ఈ విధంగా విప్లవరక్షణకు, ఆత్మరక్షణకు చేసిన తిరుగుబాట్లు, గెరిల్లా పోరాటాలదశ 1927 నుంచి 1930 వరకూ సాగి, ముగిసింది.

# 15 వ అధ్యాయం.

## ఎర్ర సైన్యాభివృద్ధి.

చైనాలోని సోవియట్ విప్లవంయొక్క రెండవదశ 1930 నుండి 1931 అంత్యంవరకూ సాగింది. ఈ దశలో గెరిల్లాలను, రైతువలంటీర్లను సుశిక్షితమైన ఎర్రసైన్యంగాను, గెరిల్లాప్రాంతాలను సోవియట్లగానూ మార్చడం జరిగింది.

## ప్రవర్తనా విధులు.

క్రమక్రమంగా ఎర్రసైన్యంలో క్రమశిక్షణ, ఎర్రసైన్య నిర్మాణ విధానంలో నూతన సాంకేతికమూ, ఎర్రసైన్యం ప్రజలలో ప్రవర్తించే విధానంలో నూతన పద్ధతీ, ప్రవేశపెట్టబడ్డాయి అన్ని ప్రాంతాలలోని రైతులు అత్యుత్సాహంతో విప్లవంలో పాల్గొనేందుకు ఐచ్ఛికంగా రానారంభించేరు. చింగ్‌కన్‌షాన్‌లో వున్నప్పుడే "తక్షణ ఆజ్ఞానిర్వహణ" "పేద ప్రజానీక ఆస్థి రక్షణ" "జప్తు ఆస్థులు ప్రభుత్వపరం చేయుట" అను మూడు నియమాలను ఉల్లంఘించరాదని నిర్ణయించారు. ఆటు తర్వాత జరిగిన పార్టీ సమావేశంలో ఈ దిగువ నుదహరించిన అష్ట నిబంధనలను చేశారు:

1. మకాం వేసిన యింటిని జాగ్రత్తగా సొంతదార్లకు వప్ప గించండి.

2. పడుకున్న గడ్డిపరుపులను చుట్టి యిచ్చివేయండి,

3. ప్రజలతో గౌరవ మర్యాదలతో ప్రవర్తిస్తూ వారికి సహాయ పడండి.

4. ఎరువు తీసికొన్న సామాన్లను తిరిగి యిచ్చివేయండి.

5. పాడైపోయిన సామాన్లకు బదులు క్రొత్తవి యివ్వండి.

6. రైతులతో విశ్వాసపాత్రంగా మెలగండి.

7. కొన్న సామాన్లన్నింటికి న్యాయమైన ధర లివ్వండి.

8. శుచిగాను, శుభ్రంగాను ఉండండి. పాయిఖానా దొడ్లను నివాస గృహాలకు దూరంగా నిర్మించండి.

ఈ అష్ట విధులలో చివరి విధులను రెంటినీ లిన్‌పియో జేర్చాడు. ఈ ప్రవర్తనా సూత్రాలను ఎర్రసైనికు లందరూ వల్లించి అడిగినప్పుడు వప్పగించాలి. ఈ సూత్రాలతో చేయబడిన ఒక పాటను సైనికులందరూ పాడాలి. "శత్రుసైన్యంతో అసువులను గోల్పోయేవరకూ పోరాడాలి," "ప్రజలను సాయుధులను చేయాలి," "ప్రజాపోరాట నిర్వహణకు కావలసిన ధనాన్ని సమకూర్చాలి" అను మూడు ప్రధాన లక్ష్యాలనుకూడా ఎర్రసైనికులకు బోధించేవారు.

## పోరాటపు టెత్తుగడలు.

చింగ్‌కన్‌షాన్ దుర్గంలో వుండగా ఎర్రసైన్యం యీ దిగువ నుదహరించిన నాలుగు పోరాటపు టెత్తుగడల నాచరణలో నుంచేది.

1. శత్రుసైన్యం దండెత్తి మీదకు వచ్చేటప్పుడు మనం తిరోగమనం చేద్దాం.
2. శత్రుసైన్యం ఆగి మకాంచేసినపుడు వారిపైబడి బాధిద్దాం.
3. శత్రువులు యుద్ధంచేయకుండా తప్పించుకోవాలన్నపుడు మనం వారిపై దండెత్తుదాం.
4. శత్రువు తిరోగమనం చేశేటప్పుడు మనం వెన్నంటితరుముదాం.

వృద్ధసేనానులు మున్ముందీ ఎత్తుగడల నధిక్షేపించారు. కాని కాలక్రమేణా, ఈ సూత్రాలు ఆచరణలో చాలా లాభదాయకంగా వుండటం గమనించి ఆమోదించారు. ఈ ఎత్తుగడల నమలుజరిపినపుడల్లా ఎర్రసైన్యం విజయం పొందింది. అందుకు భిన్నంగా నడిచినపుడు దెబ్బతింది. పీకలవరకూ ఆయుధాలను ధరించి సంఖ్యాబలంలోనూ, ఆయుధ

బలంలోనూ పోల్చేందుకు వీలులేని స్తోమతుకల్గిన కొమింటాంగు ప్రభుత్వ సేనలతో పోరాడేందుకు ఎర్రసైన్యం గెరిల్లాపద్ధతులతోనూ అతిచురుకుగా అతిసాహసోపేతంగా ఏర్పరచుకున్న చోటున ముందే నిర్ణయించుకున్నంతమంది సైనికులు సమకూడి శత్రుసైనికులపై బడి, వారు దిగ్భ్రమచెంది యుండగా దెబ్బపై దెబ్బకొట్టి, విజయవంతంగా పోరాటం సాగించడమను నూతన "చలనపోరాటపు" సాంకేతికాన్ని ఎర్రసైన్యం చూ టే. మోసీయుంగుల నాయకత్వంలో సృష్టించి అమలు జరిపారు. సాంప్రదాయసిద్ధమైన అనువైన ప్రాంతాల్లో నిలబడి యుద్ధం చేయడమనే "ప్రాదేశికయుద్ధ" విధానాన్ని వారు విడనాడారు.

సోవియట్ప్రాంత విస్తరణకు "తరంగవిస్తరణ" విధానాన్ని చూ, మోలిద్దయూ ప్రచారంచేశారు. "గంతులు", "దూకుల" తో కూడిన అసమవిస్తరణను వ్యతిరేకించారు. ఆక్రమించిన ప్రాంతాలన్నిటిలో సోవియట్ విధానాన్ని అమలుపరచి, బలపరచాలని బోధించారు. కాని ఈ విధానాలను లిలీసాజా ఖండిస్తూ తీవ్రఅతివాద పంథానుసరింప ప్రయత్నించి విఫలుడయ్యాడు.

## లిలీసాన్ పంథా:

1930 వ సంవత్సర ప్రారంభంనాటికి ఎర్రసైన్యాలు చాలా పెరిగాయి. చాలా సోవియట్లు కూడా వెలిశాయి చూపీ టే సైన్యంనుండి వచ్చిన తిరుగుబాటుదార్లతోనూ చింగ్కన్షాన్ ఎర్రసైనికులు కొందరితోనూ కలిపి హ్వాంగ్కంగ్లియూ నాయకత్వాన 8 వ సైన్యం నిర్మింపబడింది. 3, 4 ఎర్రసైన్యాలు కియూన్ను పట్టుకుని టింగ్చౌకు దండయాత్ర చేయుచుండగా కమ్యూనిస్టుపార్టీ నాయకుడైన లిలీసాన్ తననూ, తనపంథాను బోధపరిచేందుకు ఒక పార్టీ ప్రతినిధిని పంపాడు.

"కొమింటాంగు ప్రభుత్వమును కూలద్రోసేందుకు తగిన తరుణమేతెంచినందున అన్ని నగరాల్లోనూ సాయుధ తిరుగుబాట్లను తీసుకొని

వచ్చి ఎర్రసైన్యం విజయయాత్ర సాగించేందుకు మార్గం సరళం చేయవలసింది" అని లిలీసాన్ ఆదేశం "విప్లవంతో ఆటలాడవద్ద"ని అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ ఆరవ పార్టీకాంగ్రెస్సులో నిర్ణయించినప్పటికీ ఊహాంగ్‌లోనున్న లిలీసాన్ షాంఘైలోనున్న కేంద్రసంఘంయొక్క ఆమోదాన్ని పొందకుండానే సొంతపూచీమీద 'కేంద్ర కార్యాచరణ సంఘాన్ని' నెలకొల్పాడు

నాన్చాంగు తిరుగుబాటు వార్షికోత్సవ దినమైన 1930 ఆగస్టు 1వ తేదీనాడు ఎర్రసైన్యాలు నాంచాంగ్‌ను ముట్టడించి అక్కడనున్న కొమింటాంగు సేనానులైన ఛాంగ్‌హ్వీచాంగ్, టాంగ్‌టో, యువాఙ్‌లను ఓడించారు వెన్వెంటనే కియాంగ్సీలోని అంజెన్, పిన్‌ఫెంగు, యిఫెంగ్ మున్నగు ప్రాంతాల్లో సోవియట్లు వెలిశాయి. ఎర్రసైన్యంలో రైతులు విరివిగా చేరారు చాలా ధనం వసూలైంది.

జూలై 27వ తేదీనాడు పెంగ్‌టేహ్వే హోనాఙ్ ప్రధాన పట్టణమైన చాంగ్షా పట్టణంమీద దండెత్తి పట్టుకున్నాడు. ఎర్రసైన్యాలకు రేడియో లేనందున వారి సమాచారం చూటే సైన్యాలకు తెలియలేదు. పెంగ్ ఒక వారంరోజులు మాత్రమే ఆ పట్టణాన్ని స్వాధీనంలో వుంచుకుని తరువాత వదలిపేసి చూటే సైన్యాలతో లియువాంగ్‌వద్ద కలుసుకున్నాడు. చూటే పెంగ్ సైన్యాలు హూనాన్‌రాష్ట్ర కొమింటాంగ్ సైన్యాలతో పోరాడి నాలుగు గొప్ప దళాలను ఓడించాయి. ఈ యుద్ధంలో వారికి చిరకాల వాంఛితమైన రేడియోలు దొరికాయి కాని రేడియోలనుపయోగించేవారు లేకపోయారు. అనేక వేల రైఫిళ్ళు కూడా పట్టుబడ్డాయి.

ఈ యుద్ధానంతరం ఎర్రసైన్యం 30 వేల వరకూ పెరిగింది. మళ్ళీ చాంగ్షాను ముట్టడించారు. కాని కొమింటాంగు సైన్యాలు పూర్తిగా సంసిద్ధులై వుండుటవలన విజయం ఎవరికీ లభించలేదు. పదిరోజుల

తర్వాత ఎర్రసైన్యాలు వెనుకకు మరలాయి ఆ సమయంలో ఎర్రసైన్యాల నన్నిటినీ కలిపి "ప్రథమ యుద్ధరంగ ఎర్రసైన్యం"గా నిర్మించారు. దానికి చూ-టే సర్వసేనాధిపతి. మోసీయంగ్ రాజకీయ ప్రతినిధి.

1930 సెప్టెంబరు మాసంలో ఎర్రసైన్యం యాచూఞను ఆక్రమించింది. ఈ కాలంలో లిలీసాన్ పంథా సైన్యంలో గొప్ప కలవరాన్ని కలుగజేసింది. పెద్ద నగరాలైన చోచాంగ్, యాచౌ, హాంకాంగ్‌లను ముట్టడించాలని లిలీసాన్ వాదన కాని, చూ, మోలు వ్యతిరేకించారు. విశ్రాంతి తీసుకొని ఎర్రసైన్యాలను పునర్నిర్మించాలని వారు సూచించారు. చివరకు చూ, మోల సలహాయే అంగీకరింపబడింది. ఎర్రసైన్యం కియాన్‌లో వుండగా 50,000 వరకూ పెరిగింది. 30 లక్షల డాలర్ల ధనం ప్రోగుచేసి బొక్కసాన్ని నింపుకుంది హూనాఞ, కియాంగ్సీ రాష్ట్రాల్లో వారి పలుకుబడి విస్తరించింది. మోసీయంగ్, చూ-టేలను పట్టుకొని వప్పగించినవారికి గొప్ప బహుమతుల నిస్తామని కొమింటాంగు ప్రభుత్వం ప్రకటించింది. మోసీయంగ్ భార్యను, కుమారుణ్ణి యిద్దరు సోదరులను హోచీన్ సేనాని జెయిల్లో పెట్టాడు. మో భార్యను, చెల్లెలిని ఉరితీశారు.

చాంగ్షాపై రెండవదాడిలో యెర్రసైన్యాలు చెప్పుకోతగ్గ విజయాలు సాధించకపోవడంతో లిలీసాన్‌పంథా చాలా దెబ్బతింది. ఊహాన్ మున్నగు బలిష్ఠమైన కొమింటాంగు దుర్గాలపై దండెత్తుతే, ఎర్రసైన్యాలు పూర్తిగా నాశనమవచ్చునని పార్టీవారు గుర్తించారు. అందువలన లిలీసాన్ అతివాద పంథాను త్రోసివేశారు.

లిలీసాఞ హూనాఞ రాష్ట్రనివాసి. ఫ్రాంసులో విద్యాభ్యాసం పూర్తిచేసి, చైనా తిరిగివచ్చి, హూనాన్‌షాంఘేలలో కమ్యూనిస్టుపార్టీ రహస్యప్రధాన కేంద్రాలయాలలో తిరుగుతో పార్టీలో పనిచేశాడు. ఆయన చైనాకమ్యూనిస్టులలోకెల్ల తెలివైనవాడు. 1929 నుండి 1931

వరకు పార్టీలో ప్రధాన పదవుల్లో వుండేవాడు. కాని ఆయన పంథా ఆత్మ హత్యాసదృశ మని తేలగానే 1931 లో ఆయనను పార్టీపొలిట్ బ్యూరో నుంచి తొలగించివేసి, మాస్కోకు "మార్క్సిజాన్ని అభ్యసించేందుకు" గాను పంపారు.

పల్లెటూళ్ళలోని పెద్ద రైతులను నాశనంచేసి, పట్టణాలపై దండె త్తాలనే లిలీసాన్‌పంథాను అనుసరించి, 20 వ సైన్యనాయకుడైన లియూ టీసో తిరుగబడి, కియాంగ్సీ సోవియట్ అధ్యక్షుణ్ణి చాలమంది ఉద్యో గస్థులను నిర్బంధించి, చూ, మోల రాజకీయ పంథాపై తిరుగుబాటు లేవదీశాడు. సోవియట్‌జిల్లాల మధ్యలోనున్న ఫూటీన్ అనుచోట యీ ఉదంతం జరిగినందున గొప్ప సంక్షోభం కలిగింది. ఆ తిరుగుబాటు వెంటనే అణచివేయబడింది. లియూటీసో నిర్బంధింపబడ్డాడు ఈ సంఘ టన అనంతరం లిలీసాన్‌పంథా నామమాత్రమైంది. చూ, మోల నాయ కత్వంలో ఎర్రసైన్యం, సోవియట్ ఉద్యమం చాలా బలపడ్డాయి.

## బోల్షివిక్ వ్యతిరేక సంఘం.

లిలీసాన్‌పంథాయేకాక, యీ సమయంలో బోల్షివిక్ వ్యతిరేక సంఘంవారు కూడా పార్టీవినాశనానికి కృషిచేశారు. హైలోఫెంగ్ సోవి యట్ నిర్మాతలలో ఒకడైన ఫెంగ్‌పే యీ కుట్రను బైటపెట్టాడు. లోపలనుండి గోతులు త్రవ్వాలని యీ పార్టీవారు చేసేప్రయత్నాలు వెల్లడి అవగానే, వారి ప్రధాన కేంద్రాలయంపై దండెత్తి, ధ్వంసం చేశారు. ఈ సంఘంలో పెద్దరైతులు, జమీందార్లబిడ్డలు, వారి అనుచ రులు, భూపునర్విభజన నంగీకరించనివారు పనిచేసేవారు. కాని వీరి విధ్వంసన కార్యక్రమం ఫెంగ్‌పేయొక్క అప్రమత్తతవల్ల విఫలమైంది. ఎర్రసైన్యాలు వెనుదిరిగి ఒక్కుమ్మడిని వారిపై నలుమూలలనుండి చుట్టు ముట్టి, తేలిగ్గా వారిని తుడిచిపెట్టేశారు. సోవియట్ జిల్లాల్లో దుర్గమ పర్వతాల్లో భౌగోళిక పరిస్థితులు తెలియని కొమింటాంగు సైన్యాలు అంధ

ప్రాయంగా చొరుచుకుని వెళ్ళి ఎర్రసైన్యాలు ఒగ్గిన మాటుల్లో పడివిహతు లయ్యారు. చాంగ్ 10 వేల సైన్యాలమీద ఎర్రసైనికులు పడి తేలిగ్గా ఓడించారు. ఈ మొదటి కమ్యూనిస్టు నిర్మూలన సైన్యాలకు నాయకుడైన చాంగ్‌హీ్వచాంగ్ యుద్ధంలో చంపివేయబడ్డాడు. 9 వేల రైఫిళ్లు, 2 వైర్‌లెస్ యంత్రాలు ఆయన సైనికులందరూ పట్టుబడ్డారు. యుద్ధఖైదీలలో గొప్పరాజకీయ ప్రచారంచేసి వారిని వదలివేశారు. చాంగ్ సైన్యముల ఓటమిసంగతి తెలియని టాంగ్‌సైన్యంపై బడి వారిని పూర్తిగా ఓడించారు. వీరివలన 4000 రైఫిళ్ళు దళ్కాయి. ఈ విధంగా లభించిన బ్రహ్మాండమైన విజయాలతో ప్రథమకమ్యూనిస్టు నిర్మూలన యుద్ధం సోవియట్ల విస్తరణకూ ఎర్రసైనికశక్తి ద్విగుణీకృత మయేందుకు తోడ్పడింది.

## రెండవ యుద్ధం.

ఈ ఓటమి జంగ్‌కై షేక్‌కు ఆందోళన కలిగించింది. ఆయన యుద్ధతంత్రాన్ని మార్చివేసి హోయింగ్‌చింగ్ యుద్ధవ్యూహరచనా పద్ధతుల నంగీకరించాడు. హో అధిపత్యాన కొమింటాంగు సైన్యాలు మెల్లగా సోవియట్ స్థావరాలపైకి దండువెడలాయి. 1931 జనవరినుంచి మే వరకు యుద్ధసన్నాహాలను చేశారు. ఈ దాడి నెదుర్కొనేందుకు ఎర్రసైన్యాలు కూడా సన్నద్ధమయ్యాయి. క్రొత్త రైతుదళాలకు తర్ఫీయటునిచ్చి నూతన సైనిక దళాలను నిర్మించ సాగేరు.

# 16 వ అధ్యాయం.

## కమ్యూనిస్టు నిర్మూలన యుద్ధాలు.

ఫెంగ్‌యూసియాంగ్, యెన్‌సీషాన్‌లతో 1930 అక్టోబరులో యుద్ధం ముగించిన తర్వాత కొమింటాంగు కేంద్ర ప్రభుత్వం యెర్ర సైన్యాలను రూపు మాపేందుకు తీవ్ర ప్రయత్నాలు చేయజొచ్చారు. 1930 డిసెంబరుమాసం చివరినాల్లో నాన్కింగు ప్రభుత్వం యొక్క మొదటి కమ్యూనిస్టు నిర్మూలనయుద్ధం ప్రారంభమైంది.

## మొదటి యుద్ధం.

ఈ ప్రథమ యుద్ధానికి జంగ్‌కైషేక్ చాలా సైన్యాలను అయిత్త పరచాడు. టాంగ్‌టో, వాంగ్‌చింగ్‌యూల సైన్యాలు, 19 వ సైన్యాలు సోవియట్ల వినాశనానికై అట్టహాసంగా పంపబడ్డాయి. అప్పుడు ఎర్ర సైన్యాలకు రేడియో లేకపోయినప్పటికి గూఢచారిదళం చక్కగా పని చేసేది. అదీగాకుండా జంగ్‌కైషేక్ ఆడంబర పూరితంగా తన సైన్యాల కదలికను గూర్చిన వివరాలన్నీ పత్రికల్లో ప్రకటించేవాడు. ఆ యుద్ధ సమయంలో ఎర్రసైన్యాలు టుంగ్‌కూలో వుండేవి

ఈ యుద్ధంలో కొమింటాంగు సేనలకు యెర చూపి కొన్నికొన్ని గ్రామాలను పట్టుకోనిచ్చి అకస్మాత్తుగా గ్రామాల్లో వున్న సేనలపైబడి వారిని తుదముట్టించే యుద్ధ వ్యూహాన్ని ఎర్రసైన్యాలు అమలు పరిచాయి. ఈ రకమైన గెరిల్లా పోరాట పద్ధతులు తెలియనందున కొమింటాంగు సైన్యాలు తెలివితక్కువగా ఎర్రసైన్యాలు ఖాళీచేసిన గ్రామాలను అక్రమించుకొని కొన్ని సైన్యాల నక్కడ ఉంచేవారు. అదీగాక ప్రతి కొమింటాంగు సేనాని జంగ్‌యొక్క మెప్పు పొందాలనే దురాశతో ఎర్రసైన్యాలను వారి బలిష్ఠమైన స్థావరాలలోకి తరిమేవారు. ఆ విధంగా

చాంగ్‌హీ్వచాంగ్. టోయువాన్ సేనానులు ఎర్రసైన్యాలను టుంగ్‌కూ వరకూ తరిమారు.

1931 మే 19 వ తేదీనాడు రెండవయుద్ధం ప్రారంభమైంది. కొమింటాంగు సైన్యాలు కియాంగునుండి ఫూకీన రాష్ట్రంలోని చీన్‌లింగ్ పట్టణం వరకూ 150 మైళ్ళప్రాంతం విస్తరించి వున్నాయి. మొత్తం రెండు లక్షల కొమింటాంగు సైన్యాలు యీ దండయాత్రలో పాల్గొన్నాయి.

మొదటి యుద్ధంలో గడించిన అనుభవం ఎర్రసైన్యాలకు ఉపకరించింది. పైగా రేడియో యంత్రాలుగూడా వున్నవి గనుక సైనిక సమీకరణకు సమాచారాలు తెలుసుకునేందుకు అవకాశం కలిగింది. కొమింటాంగు సైన్యాల వెనుక భాగానికి ఎర్రసైనిక దళాలు 15 రోజుల్లో వెళ్ళి వాంగ్‌చింగ్‌యూ, చూపియాంగులపై అకస్మాత్తుగా పడి నాశనం చేశాయి. ఈ విధంగా రెండవ యుద్ధంకూడా ఎర్రసైనిక విజయంతో సమాప్తమైంది ఈ యుద్ధంలో యెర్రసైనికులు అతి ఆధునిక యుద్ధ తంత్రాన్ని అమలుపరచారు. ఈ విజయంవలన ఎర్రసైన్యానికి ఆత్మవిశ్వాసం వృద్ధిపొందింది. ప్రజలుకూడా ఎర్రసైన్యానికి అనేకరీతుల తోడ్పడ్డారు.

## మూడవ యుద్ధం.

రెండవ దండయాత్ర విఫలమవడంతో జంగ్‌కైషేక్ ఆగ్రహానికి అంతు లేదు. ఆయనే స్వయంగా మూడవ దండయాత్రకు సన్నాహాలు చేయనారంభించాడు. నాన్చాంగునుండి స్వయంగా సేనలను నడుపవిశ్చయించి వెంటనే జూలై మాసంలోనే దండయాత్ర ప్రారంభించాడు. జంగ్ సేనలను నాలుగు సమానాంతర రేఖలుగా వ్యూహంపన్ని నడిపించాడు. ఆరేఖల మధ్యప్రాంతంలోనికి ఎర్రసైన్యాలు ప్రవేశించి సైన్యా

లను వేధింపజొచ్చారు. జంగ్‌యొక్క రెండవ సేనాపంక్తికి హోమింగ్ లిా అధిపతి. ఆయన సైన్యమే అన్నిటికంటె బలహీనమైనది. అందు వలన ఆ సైన్యాలపైబడి ఓడించి అనేక రైఫిళ్ళను, ఆహార సామగ్రు లను ఎర్రసైన్యాలు పట్టుకున్నాయి. అటుపైన మోపింగ్‌వెన్, సూకేసి యాంగ్‌ల సైన్యాలను గూడా ఓడించారు. జంగ్ మరింత ఉగ్రుడై సైన్యాల నన్నిటిని ఒకచోట చేర్చాడు. ఎర్రసైన్యంకూడా తన యుద్ధ తంత్రాన్ని మార్చింది. గ్రామాలను ఖాళీచేసి ఆహార సామగ్రులను కొమింటాంగు సైన్యాల కిందకుండా చేసింది. ఎర్రసైన్యాలన్నీ టుంగ్‌కూ ప్రాంతంలో వున్నాయి. కాని గెరిల్లాలు మాత్రం అన్ని ప్రాంతాలలోనూ జంగ్ సైన్యాలను వేధింప జొచ్చారు. అందువలన ఎర్రసైన్యా లెక్కడ వున్నాయో జంగ్‌కు తెలియలేదు. ఈ విధంగా దిక్కు, తెన్ను తోచ కుండా వున్న కొమింటాంగు దళాలపైబడి గెరిల్లాలు చాల నష్టం కలిగించారు.

24 సైనిక దళాలున్న 19 వ కొమింటాంగు సైన్యంపై విజయో న్మత్తులైన ఎర్రసైన్యాలు తలపడ్డాయి. కాని విజయం యెవ్వరికీ లభించలేదు.

టుంగుకూ సమీపంలో 52 వ, 9 వ కొమింటాంగు దళాలను ఎర్రసైన్యాలు పూర్తిగా ధ్వంసం చేశాయి. ఈ సమయాన్నే సెప్టెంబరు 18 వ తేదీనాడు ముక్డెన్ ఉదంతం జరిగినందున జంగ్‌కైషేక్ ఎర్ర సైన్య నిర్మూలన దాడిని విరమించుకుని నాన్కింగుకు జేరుకోవలసిన అత్యవసర పరిస్థితు లేర్పడ్డాయి. ఈ విధంగా రెండుపక్షాలకు విశ్రాంతి లభించింది.

1931 డిసెంబరు 14 వ తేదీనాడు 26 వ పదాతి సైన్యం నింగ్ టూలో సన్‌లీన్‌చాంగ్ ఆధిపత్యాన కొమింటాంగు ప్రభుత్వంపై తిరుగ బడి 10 వేల సైనికులతో ఎర్రసైన్యంలో చేరారు. వీరితో 5 వ సైనిక దళం ఏర్పాటు చేయబడింది.

# 17 వ అధ్యాయం.

## ప్రధమ సోవియట్ కాంగ్రెస్.

రష్యన్ విప్లవదినోత్సవమైన 1931 నవంబరు 7 నాడు అఖిల చైనా సోవియట్ కాంగ్రెసు సమావేశం కియాంగ్సీ రాష్ట్రంలో జూయిచిన్ వద్ద జరిగింది. కియాంగ్సీ, ఫూకీన్ రాష్ట్రములనుండి హోనాన్, హూపే, కియాంగ్సీ పరిహద్దుజిల్లాల సోవియట్లనుండి, ఎర్రసైన్యములనుండి, అఖిల చైనా శ్రామిక ఫెడరేషన్ నుండి, నావికాసంఘంనుండి, చైనా కమ్యూనిస్టుపార్టీ నుండి ఎన్నుకొనబడిన ప్రతినిధులు మొత్తము 610 మంది ఈ సమావేశానికి హాజరయ్యారు 1930 మే నెల 31 వ తేదీనాడు షాంఘేలో రహస్యంగా జరిగిన కమ్యూనిస్టుపార్టీ సమావేశంలో నిర్ణయింపబడిన రీతిగా యీ కాంగ్రెసు సమావేశమైంది. దేశమంతటా కొమింటాంగు ప్రభుత్వం కమ్యూనిస్టులపై తీవ్రనిర్బంధం అమలుజరుపుతున్న విప్లవ ప్రతీఘాత సమయంలో, ఆర్థిక సంక్షోభం ప్రపంచాన్నంతా అలముకొని కల్లోలపరుస్తున్న విపత్కరపరిస్థితుల్లో, 1931 సెప్టెంబరు నుండి జపాను సైనికవాదులు మంచూరియాపై దురాక్రమణ సాగిస్తున్న సంకట పరిస్థితుల్లో ఈ సమావేశం విప్లవోత్సాహంతో నూతనసమాజ నిర్మాణోత్సాహులై వారి నెదుర్కొంటున్న విషమసమస్యల కూలంకషంగా చర్చించి రైతుకూలీ సమస్యలపై తీర్మానములను, సోవియట్ చైనా రాజ్యాంగరచనను సాగించారు.

విదేశపెట్టుబడిదార్లు చైనాలో పరిశ్రమలనమితంగా స్థాపించారు. వెండినాణ్యముల విలువ విపరీతంగా పడిపోయింది. ఇనుము, ఉక్కు కర్మాగారాల్లో చైనీయుల పెట్టుబడి 1930 నాటికి నూటికి 5 పాళ్ళు మాత్రమే వుంది. 1926 లో బట్టలయంత్రాల్లో నూటికి 52 నుండి 1930 నాటికి 44 కు చైనీయుల పెట్టుబడి పడిపోయింది. అనేక చైనాపరిశ్ర

మలు ఆర్థికసంక్షోభం వలన ఆగిపోయాయి. చైనాజాతీయ ఋణం విపరీతంగా పెరిగింది. అనేకులు దివాళాతీస్తున్నారు. చిన్నరైతులు పొలాల నమ్ముకుని వ్యవసాయకూలీవర్గంలో చేరుతున్నారు. అంతర్యుద్ధాలు దేశం యొక్క ఆర్థికశక్తిని క్షీణింపజేశాయి. పన్నులు విపరీతంగా పెరిగాయి. నిరుద్యోగం ప్రబలింది. 1931 పంటలు వరదలవల్ల నాశనమయాయి.

ఈ పరిస్థితుల్లో చైనాలో ఒక నూతనశక్తి విజృంభించింది. సామాన్యపౌరుడు, పేదమానవుడు—మానవులకందరకూ సమానావకాశాలు లభించే ఒక నూతన సమాజాన్ని నిర్మింపబూనుకున్నాడు. ఆమహదాశయసిద్ధికి సోవియట్ ప్రభుత్వ నిర్మాణం సాగించాడు. విదేశ సామ్రాజ్యవాదుల పెట్టుబడి, ఆయుధబలములపై నాధారపడిన కొమింటాంగు ప్రభుత్వం వింతపడి భయంతో చూస్తున్నది

## ప్రధమ కాంగ్రెసు సాధించిన మహద్విషయాలు.

ప్రధమకాంగ్రెసు అఖిలచైనా సోవియట్ ప్రజారాజ్యానికి రాజ్యాంగాన్ని రచించి దానికి మోసీయంగ్‌ను అధ్యక్షునిగా ఎన్నుకుంది

సోవియట్ చైనారాజ్యాంగంలో మొదటి నిబంధనలో సోవియట్ ప్రభుత్వం యొక్క ప్రధానకర్తవ్యాలు ఈ విధంగా పేర్కొనబడ్డాయి.

"సోవియట్ జిల్లాలలో కార్మిక కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వమును స్థాపించి దానిని యావత్తు చైనాలోను వ్యాపింపచేయుట యీ సోవియట్ చైనా రాజ్యాంగప్రణాళిక ఆశయమైయున్నది జమీందారీ భూస్వామ్య యుగముల చిహ్నములను తుడిచివేయుట చైనాలోని యుద్ధప్రభువుల, విదేశసామ్రాజ్యవాదుల అధికార వినాశనము. ఐక్యచైనా నిర్మాణము, క్రమేణా పెట్టుబడిదారీ విధానమును క్షీణింపజేయుట, ఆర్థిక విధానమును ప్రభుత్వమే వశంచేసికొని నిర్మించుట, శ్రామికులలో వర్గచైతన్యము నభివృద్ధిపరచి వర్గసంఘప

లలో సమీకరించుట, గ్రామసీమలలో పేదప్రజాసామాన్యమును ఎర్ర జెండాపీడను సమీకరించి శ్రామికవర్గ నియంతృత్వమునకు పరివర్త నపుబాటను సుగమంజేయుటయు యీ నియంతృత్వపు ఆశయముళై యున్నవి "

అనగా జమీందారీ విధాన, సామ్రాజ్యవాద, వ్యతిరేక పోరాట ములు తక్షణ కర్తవ్యములుగాను, సామాజిక విప్లవం రెండవ దశగాను పరిగణింప బడ్డాయి.

రెండవ నిబంధన అధికారాన్నంతటినీ శ్రామికవర్గపు చేతులలో కేంద్రీకరించింది. మూడవ నిబంధన అంతిమ అధికారాలను సోవియట్ ప్రజాస్వామిక ప్రభుత్వపరం చేసింది. తరువాత నాల్గు నిబంధనలు కార్మిక కర్షకుల ప్రతిపత్తిని ఆర్థిక ప్రమాణమును అభివృద్ధి పరచాయి. ఏడవ నిబంధన శ్రామికుల ప్రయోజనాలకు రక్షణనిస్తూ పెట్టుబడిదారీ విధానపు అభివృద్ధిని క్రమబద్ధం చేసి చివరకు పెట్టుబడిదారీ దాస్యంనుంచి శ్రమను విముక్తం చేయడమే పరమాశయంగా ప్రకటించింది. ఆ వెనుకటి ప్రభుత్వాలన్నీ విధించిన అన్యాయపు పన్నులను రాజ్యాంగం రద్దు చేసింది.

## వ్యావసాయిక సంస్కారణలు.

వ్యావసాయిక ఆందోళన సోవియట్ల నిర్మాణానికి దారితీసింది. ఎర్రసైన్యం సహాయంతోను, లేకుండానూకూడా రైతులు తిరుగుబాట్లు చేసి సోవియట్లను నెలకొల్ప మొదలుపెట్టారు. భూస్వాముల పేర్ల జాబితాలు, తనఖాపత్రాలు, దస్తావేజులు మొదలైనవాటిని తగులబెట్టి సర్వే రాళ్ళను తీసివేసి రైతులు భూమిని పంచుకున్న ప్రకారంగా తిరిగి సరిహద్దు రాళ్ళను రైతులు పాతఁబొచ్చారు.

చైనీయ కార్మిక, కర్షక, ఎర్రసైనిక ప్రతినిధుల ప్రథమ సోవియట్ కాంగ్రెసు భూమిజప్తు, విభజన విషయములలో ఒకే విధమైన సూత్ర

ముల సమలునందుంచుటకును, విప్లవవ్యాప్తిని కొనసాగించుటకును, కర్షక సమస్య నతి సమగ్రముగా పరిష్కరించునట్టి ఏడు నిబంధనలతో గూడిన కర్షకశాసనం చేసింది.

మొదటి నిబంధన ప్రకారం, జమీందార్లు, భూఖామందుల, సైనిక వాదుల భూములను వారు స్వయంగా చేస్తున్నా కౌలుకిచ్చి చేస్తున్నా సరే జప్తుచేసి, స్త్రీ పురుషభేదం లేకుండా వ్యవసాయకూలీలు, శ్రమజీవులైన రైతులు భూవిభజనలో భాగస్వాములవుతారు. అసమర్థులు, నిరాధారులు, వికలాంగులూ అయిన వృద్ధులు వితంతువులు మొదలైనవారి పోషణ భారం ప్రభుత్వం వహించి వారి భూమిసాగు యేర్పాట్లు చేస్తుంది.

2 వ నిబంధనలో సోవియట్ ప్రభుత్వ రక్షణసేయు ప్రథమశ్రేణి వీరులైన ఎర్రసైనికుల వంతుకు వచ్చు భూఖండములను సాగుచేయించు భారం ప్రభుత్వం వహిస్తుంది.

3 వ నిబంధన వలన ట్యూఖోలను వడ్డీవ్యాపారం చేస్తూ భూములను కలిగివుండేవారి భూములను కూడా జప్తు చేస్తారు. ఆ ట్యూఖోల శ్రమశక్తి ననుసరించి భూమిలో భాగం యివ్వబడుతుంది.

5 వ నిబంధన వ్యవసాయ బానిసత్వమును రూపుమాపి పాటుపడి పండించు రైతులమధ్య సమత్వ సూత్రము ననుసరించి భూమిని విభజించు నధికారం కలిగిస్తుంది. ఈ సూత్రం స్థానిక పరిస్థితుల ననుసరించి అమలు జరుపబడాలి. కాని దౌర్జన్య ప్రయోగంమీద ఆధారపడరాదు.

6 వ నిబంధన ప్రకారం రైతుల మత విశ్వాసములను గాయ పరచకుండా వారి యిష్టముపైన ఆధారపడి మత సంస్థలకు చెందిన భూములను ప్రభుత్వం రైతుల వశం చేసేందుకు అధికారం కల్గి వుంటుంది.

7 వ నిబంధన ప్రకారం సోవియట్లు ఆ యా గ్రామముల ప్రత్యేక పరిస్థితుల ననుసరించి బీద, మధ్యతరగతి రైతుల ప్రయోజనముల కను

పైన శ్రమ ప్రమాణము ననుసరించిగాని వినియోగము ననుసరించిగాని భూవిభజన జరుపాలి.

## కార్మిక శాసనం.

14—16 సంవత్సరముల వయస్సు కలవారికి రోజునకు 4 గంటల పని, 16—18 వర్షముల వయస్సుగల వారికి రోజునకు 6 గంటలపని, ఆ వయస్సు పైబడిననారికి 8 గంటల పనిమాత్రమే విధింపబడింది. అపాయకరమైనపనిగల గనులలో 6 గంటలకాలం మాత్రమే పనిచేయాలి. ప్రతిశ్రామికునకూ వారమునకు 42 గంటల కనీసపు విశ్రాంతి ఉండాలి. 6 మాసాలు ఒకేచోట పనిచేసిన ప్రతికార్మికునకూ జీతమిస్తూ 15 రోజులు శెలవు ఇవ్వాలి. పనివారు, యజమానులు కలిసి జీతాలను నిర్ణయించాలి. స్త్రీకూలీలకు పురుషులతో సమానకూలీ, జీతాలివ్వాలి.

ఆరోగ్యభంగకరమైన పనులలో స్త్రీలు నియమింపబడరాదు. పెద్ద బరువులను మోయరాదు. 18 సంవత్సరాలలోపు వయస్సుగల స్త్రీలు, గర్భిణీస్త్రీలు. రాత్రికాలంలో యంత్రాలయాల్లో పనిచేయుట నిషేధింప బడింది. ప్రసవించే ముందు. తర్వాత ఒక్కొక్కమాసం జీతం ఇస్తూ స్త్రీలకు శెలవుఇవ్వాలి. సాంఘిక భీమాపద్ధతి, పరిశ్రమాగారాల్లో ఆరోగ్య విధానం మొదలైనవాటిని గూర్చి కూడా ఈ శాసనంలో నిబంధనలు చేయబడ్డాయి.

## ఇతర తీర్మానాలు.

సోవియట్ల నిర్మాణము, ఎన్నిక విధానములను గూర్చి తీర్మానాలు చేయబడ్డాయి. ఎర్రసైన్యాలపై అధికారంవహించి నడిపించుటకు ఉన్నత సైనికసంఘం నెలకొల్పబడింది. ఆయుధాగారముల నిర్మాణం, వాటిపై అధికారములను గూర్చి కూడా తీర్మానించబడింది.

అల్ప సంఖ్యాకజాతులైన మంగోలులు, టిబెటనులు, అన్నామై టులు, మియోజాతులకు సమాన పౌరసత్వాధికారాలనిస్తూ తీర్మానించ బడింది. జాతుల స్వయంనిర్ణయాధికారాన్ని, విడిపోయే హక్కును గూడా ఈ సూత్రం గుర్తించింది. ప్రపంచకార్మిక కర్షకులందరకూ చైనా సోవి యట్ ప్రజాప్రభుత్వస్థాపనను గూర్చి విన్నవిస్తూ ఒక కరపత్రాన్ని ఈ కాంగ్రెసు ప్రకటించింది. అసమసంధులను, విదేశ సామ్రాజ్యవాదులు అన్యాయంగా చైనాప్రభుత్వంపై రుద్దిన ఋణాలను, విదేశసైనికస్థావరా లను చైనాగడ్డనుంచి తొలగించివేయాలని కోరారు చైనాలోనున్న విదేశ బ్యాంకులను, పరిశ్రమలను, గనులను, రైళ్ళను ప్రభుత్వం వశంచేసు కుంటుందని వెల్లడించారు.

జపాను ప్రభుత్వం చైనాలోని మంచూరియాలో సాగిస్తున్న దురా క్రమణకు అగ్రహం వెల్లడించి, జపానుపై యుద్ధం ప్రకటిస్తూ ప్రథమ సోవియట్ కాంగ్రెసు ముగిసింది.

## నాలుగవ కొమింటాంగు కాంగ్రెసు సమావేశం.

ఈ సమయంలోనే నవంబరు 12 వ తేదీనాడు కొమింటాంగు కాంగ్రెసు నాల్గవ సమావేశం నాన్కింగులో ఆడంబరంగా జరిగింది. ఆ సమావేశంలో "కమ్యూనిస్టు పీడ తొలగించి, సోవియట్లను రూపు మాపడమే" వారి కర్తవ్యమని ప్రకటించారు. యుద్ధశాఖామంత్రియైన హూయింగ్‌చింగ్ సేనాధిపతి కమ్యూనిస్టు నిర్మూలన యుద్ధాలను గూర్చి సవిస్తరంగా సమావేశంలో చెప్పాడు. "ఎర్రసైన్యాలు పర్వతాలలో దాగు కొని వుంటారుగనుక కమ్యూనిస్టు ప్రమాదం పూర్తిగా నమసిపోలేదని, ఈ కమ్యూనిస్టు బంధిపోటుగాండ్రకు ఆ ప్రాంతాలలోని ప్రజాసామాన్యం సహాయపడుతూ కొమింటాంగు ప్రభుత్వ సైనికులకు ఆహారపదార్థాల రవాణాకు చాల విఘాతాలు కల్గిస్తున్నారని" కూడా చెప్పాడు. ఒక్క

సంవత్సరం లోపుగానే కమ్యూనిస్టులను తుడిచివేస్తానని అభయ మిచ్చారు.

## సోవియట్ రాజ్యవ్యాప్తి.

ప్రథమసోవియట్ కాంగ్రెసు అనంతరం సోవియట్ ప్రభుత్వం విస్తరించేందుకు, క్రొత్తగా లోబరచుకున్న ప్రాంతాల్లో సోవియట్ కార్య క్రమాన్ని అమలుజరిపేందుకు ప్రయత్నించారు. వివిధప్రాంతాలలోను విడిగానున్న సోవియట్లను కేంద్రప్రభుత్వాధికారావరణలోకి తెచ్చారు. సైన్యాలను పునర్నిర్మించి క్రమశిక్షణ ప్రవేశపెట్టారు. పల్లెలలోను, పట్ట ణాలలోను ప్రాథమిక వయోజన విద్యాలయాలను నెలకొల్పారు.

ఈకాలంలో హోలుంగు అధికారంలోనున్న రెండవ యుద్ధరంగ సైన్యం కేంద్ర సోవియట్ ప్రభుత్వంతో రేడియో ట్రాన్సుమిటర్లు లేనం దున సన్నిహిత సంబంధాలను కల్గించుకోలేక పోయింది. ప్రతిరాష్ట్రం లోను ప్రత్యేక పరిస్థితులను కమ్యూనిస్టు లెదుర్కోవలసి వచ్చింది. హూనాన్, హూపే, అన్‌హ్వే సరిహద్దు జిల్లాల్లో 1925 - 27 విప్లవం వలన సోవియట్ల నిర్మాణానికి పరిస్థితులు పక్వస్థితికి వచ్చాయి. రైతు కూలీలు ఎర్రసైనిక దళాల నేర్పరచుకొన్నారు. కియాంగ్సీలో ఎర్రసైన్యం మార్గాన్ని నిష్కంటకం చేసుకోవలసి వచ్చింది. కియాంగ్సి, హూనాన్, హూపే రాష్ట్రాలలోని సోవియట్ ప్రాంతాలు రవాణా, రేడియో యేర్పా ట్లను చేసుకోగలిగితే గొప్ప సహకారం, సన్నిహితత్వములు కలిగి, సుదృఢమైన సోవియట్ ఉద్యమ మేర్పడి యుండేది.

ఈ కాలంతో ఆరు సోవియట్ ప్రాంతాలు ఏర్పడి కేంద్రసోవియట్ క్రింద పని చేస్తున్నాయి.

1. కియాంగ్సి రాష్ట్రం.
2. ఫూకీన్ - కియాంగ్సి - క్వాంటంగురాష్ట్ర సరిహద్దు జిల్లాలు.
3. హూపే - హూనాన్ - అన్‌హ్వే రాష్ట్ర సరిహద్దు జిల్లాలు.

4. హూనాన్ - హూపే - కియాంగ్సీ రాష్ట్ర సరిహద్దు జిల్లాలు.

5. హూనాన్ - హూపే సరిహద్దు జిల్లాలు.

6.

(1) 1933 నాటికి దక్షిణ కియాంగ్సీ, పశ్చిమ ఫూకీన్, ఉత్తర క్వాంటంగు, కియాంగ్సీ - హూనాన్ - హూపే సరిహద్దుజిల్లాలలో నెల కొన్న కేంద్ర సోవియట్ ప్రభుత్వంక్రింద ఒక కోటి యాభై లక్షల ప్రజలున్నారు.

(2) పశ్చిమ హూనాన్ - హూపే. అహ్వీ - హూనాన్ - హూపే సరిహద్దుల్లోని సోవియట్ ప్రాంతం; (3) ఇవి కాక మరి యెనిమిది చిన్న సోవియట్లు సోవియట్ పాలనలో నున్నాయి.

## నాలుగవ కమ్యూనిస్టు నిర్మూలన యుద్ధం.

మూడవ కమ్యూనిస్టు నిర్మూలన యుద్ధంలో కొమింటాంగు సైన్యాలు ఓడిపోయిన తర్వాత విదేశ సామ్రాజ్యవాదులు ఆందోళన చెంది దేశీయ పెట్టుబడిదార్లతో చేరి కమ్యూనిస్టు ప్రమాదాన్ని అణచమని ప్రభుత్వంపై వత్తిడి తెచ్చారు. హాంకాంగు టెలిగ్రాఫ్, ఉత్తరచైనా, డెయిలీన్యూస్ జానాంజిబో అను గొప్పపలుకుబడిగల పత్రికలు కమ్యూనిస్టుల ప్రాబల్యం హెచ్చుతున్నదనీ, యువకులలో కమ్యూనిజం వ్యాపిస్తున్నదనీ, వెంటనే సోవియట్లను నాశనం చేసేందుకు విదేశ సామ్రాజ్య వాదుల సహాయం తీసుకోవాలనీ ప్రతిదినమూ వ్రాయసాగాయి.

జపాను సైనికవాదులు మంచూరియాలో సాగించుచున్న దురాక్రమణను ఎదుర్కోవడం మాని జంగ్‌కైషేక్ ప్రభుత్వ సైన్యాలను కమ్యూనిస్టుల వంతమొందించేందుకు 1932 ఫిబ్రవరినుంచి సన్నద్ధ పర చాడు. నాన్కింగును జపానువారు బాంబు చెయ్యగా నాన్కింగు ప్రభుత్వాన్ని లోయాంగుకు జంగ్ మార్చాడు. గాని వారిని ప్రతిఘటించ లేదు.

షాంఘేలో అత్యద్భుతంగా చైనా సైన్యాలు జపానువారిని ప్రతిఘటిస్తుంటే వారికి తోడ్పడకుండా సామ్రాజ్యవాదుల ఒత్తిడికి లొంగి జంగ్ 5 లక్షల సైన్యాన్ని అంతర్యుద్ధంకొరకు ప్రోగుచేశాడు.

మార్చి మాసంలో ప్రజా సహకారంతో కమ్యూనిస్టు ఎర్రసైన్యాలు కొమింటాంగు సైన్యాలపై యెదురు దాడి చేశారు. హోలుంగు సైన్యాలు కొమింటాంగు ప్రభుత్వ సైన్యాల నోడించాయి. ప్రభుత్వ సైన్యాన్ని వదలివేసి 34, 48 దళాలు ఎర్రసైన్యంలో చేరాయి. ఒక మాసం తర్వాత కొమింటాంగు ప్రభుత్వ సైన్యాలను భేదించి కొన్ని సైనిక భాగాల నోడించి 6 వేల రైఫిళ్ళు మరఫిరంగులు, 2 విమానాలను, ఆయుధ ఆహార సామగ్రులను ఎర్రసైన్యాలు పట్టుకున్నాయి. 4 వ ఎర్రసైన్యం మార్చిమంచి మే వరకు ప్రభుత్వ సైన్యాలతో పోరి 15000 రైఫిళ్ళ, 300 మరఫిరంగులు, ఒక విమానం వశపరచుకున్నాయి

1933 ఏప్రిల్ మాసంలో జంగ్ బ్రహ్మాండమైన సైన్యాలను చెన్ చెంగ్ నాయకత్వాన కమ్యూనిస్టులను దుంపనాశనం చేయమని పంపాడు. 11 వ, 52 వ, 59 వ దళాలు జంగ్ సైన్యాలలోకెల్ల బలవత్తమమైనవి. ఈ సైన్యాలకు ఎర్రసైన్యాలకు భీషణమైన సంగ్రామం జరిగింది. 59 వ, 52 వ కొమింటాంగు సైన్యాలు ఓడిపోయాయి. 13000 మంది యుద్ధ ఖైదీలుగా ఎర్రసైన్యానికి చిక్కారు. 30 లక్షల తూటాలు, తదితర మందుగుండు సామగ్రి, రైఫిళ్ళు దొరికాయి. ఈ విధంగా ఈ 4 వ యుద్ధంలో ప్రభుత్వ సైన్యాలు సంపూర్ణ అపజయాలు పొందాయి.

యుద్ధరంగాల్లో కలిగిన ఈ పరాజయాల అనంతరం జంగ్‌కే షేకు, అతివాది అని పిలువబడే వాంగ్‌చింగ్వే లిద్దరూ బాగుగా నాలోచించి దేశంలో నలుమూలలా వ్యాపించిన అసంతృప్తిని ఆర్థిక దురన్యాయాలను తొలగిస్తేనేకాని కమ్యూనిస్టులకు పీఠం లేకుండా చేయడం అసంభవమనే నిర్ణయానికి వచ్చారు. తోడనే పదాడంబరంతో కూడిన

ఆర్థిక పునర్నిర్మాణ పథకాలను పన్నించి ప్రకటించారు. ఇందుకొరకై ఒక ప్రత్యేక "గ్రామ పునరుద్ధరణ సంఘాన్ని" నియమించాడు. దుర దృష్టవశాత్తు ప్రభుత్వాదాయంలో అధికభాగం విదేశ సామ్రాజ్యవాదుల కీయవలసిన ఋణముల నిమిత్తం, సైనిక ఖర్చులక్రింద, యుద్ధముల కొరకు ఖర్చు అయిపోయి వుండుటచేత ఆర్థిక పథకాలన్నీ కాగితాల మీదే వుండిపోయాయి. జంగ్‌కై షేక్, వాంగ్‌చింగ్వీలు కమ్యూనిస్టులపై యీ మారు అంతిమ పోరాటాన్ని సాగిస్తామనీ, ఈ పోరాటాన్ని పదింట యేడుపాళ్ళు రాజకీయంగాను మిగిలిన మూడుపాళ్లుమాత్రమే సైనికబలం పైనా ఆధారపడి సాగిస్తామని ప్రకటించారు

# 18 వ అధ్యాయం.

## నాన్కింగుప్రభుత్వ పరిపాలన.

జంగ్ కేషేక్ నాన్కింగు ప్రభుత్వం నెలకొల్పిన వెంటనే విదేశ సామ్రాజ్యవాదులందరూ చైనా పరిస్థితుల నడుపులోవుంచి తమ దోపిడీ విధానానికి పెట్టుబడికి భంగం వాటిల్లకుండా కాపాదేందుకుగాను 1927లో షాంఘై విదేశస్థావరాలలో బలీయమైన సైన్యాలనుంచారు. జంగ్ కేషేక్ సామ్రాజ్యవాదుల వ్యాపారవాణిజ్యాలకు నష్టం రాకుండా వారి ఋణాలను సక్రమంగా చెల్లిస్తానని వాగ్దానంచేశి వారిదయను సంపాదించిన తర్వాత గాని ప్రపంచసామ్రాజ్యవాద ప్రభుత్వాలు నాన్కింగు ప్రభుత్వాన్ని 1928 అక్టోబరు మాసంవరకు గుర్తించలేదు. అమెరికా బ్రిటనులు నామ మాత్రంగా చైనాదేశ కేంద్రప్రభుత్వంక్రింద ఐక్యమయ్యేందు కిష్ట పడ్డారుగాని చైనానంతా కబళించాలన్న పేరాశతో వొంచివున్న జపాను సామ్రాజ్యవాదులు చైనాపై దురాక్రమణకు సాకులను వెదుకసాగారు.

మంచూరియాతో ప్రారంభించి చైనానంతనూ కబళించిన తర్వాత ప్రపంచాధిపత్యం కొరకు జపానుచక్రవర్తికి ఒక నివేదికను సమర్పించిన టనకాప్రభువు 1927 మే నుంచి జూలై వరకు షాంటంగు రాష్ట్రంలో జపాను సైన్యాలనుంచాడు. మంచూరియా పరిపాలకుడైన చాంగ్‌సోలిన్ ప్రభువు పెకింగ్‌నుకూడా ఆక్రమించుకొనియున్నందున 1928 లో జంగ్ కేషేక్ కొమింటాంగు సైన్యాలను పెకింగ్‌వైపు నడుపుకు వెడుతుండగా కూడా చాంగ్‌సోలిన్‌కూ, జంగ్‌కూ సఖ్యత కుదరకుండా చేశేందుకు షాంటంగ్‌రాష్ట్రంలో జపానుసైన్యాలను సిద్ధంగా వుంచాడు. కొమింటాంగు సైన్యాలు సినాణాను ఆక్రమించుకుని పెకింగ్‌కుపోయే మార్గాన్ని నిరోధిస్తే మంచూరియాలో అల్లకల్లోలం జరుగకుండా శాంతిభద్రతలను కాపాడేందుకు అవుసరమైన చర్యలను తీసుకోవలసివస్తుందని జపాను ప్రధాని టనాకా ప్రకటించాడు.

జూన్ 3 వ తేదీనాడు మంచూరియా యుద్ధప్రభువైన చాంగ్ సోలిన్ ప్రయాణం చేస్తున్న రైలును జపానువారు విధ్వంసం చేయించగా ఆయన చనిపోయిన తర్వాత ఆయన కుమారుడు చాంగ్సులియాంగ్ మంచూరియాకు పాలకు డయ్యాడు. ఆయన జాతీయభావ ప్రేరితుడై చియాంగ్కైషేక్తో ఒడంబడిక చేసుకొని పెకింగును నాన్కింగు ప్రభుత్వానికి లోబరచాడు. 1928 డిసెంబరులో మంచూరియాలో ప్రభుత్వ పతాకాలు యెగిరాయి.

ఈ విధంగా చైనానంతా ఏకైక కేంద్రప్రభుత్వ ఛాయకు తీసుకొనిరావాలనే కొమింటాంగు ఆశయం బాహ్యంగా సఫలమైంది. ఐనా యీ లక్ష్య సాధనలో వైరుధ్యాలు, లక్ష్యసిద్ధిలో వైవిధ్యాలు వున్నాయి. చైనాలోని సైనిక ప్రభువులయొక్క బలంగాని, స్వాతంత్ర్యం గావి క్షీణించలేదు. దిగువ యాంగ్సీలోను, హాంకౌ చుట్టుప్రక్కల మాత్రమే సైనిక ప్రభువుల పాలన సంపూర్ణంగా తుదముట్టింది. కాని మిగిలిన చైనాలో షెన్సీ, హోపేలలో, ఫెంగ్యూసియాంగ్, షన్సీలో యెన్సీషాన్, ఈశాన్య దిక్కున వున్న (North eastern) మూడు రాష్ట్రాలలోనూ చాంగ్, స్యూలియాంగ్ల యొక్క సైన్యాలు, పాలన సుప్రతిష్ఠితమయే వున్నాయి. కొమింటాంగు సైన్యాలలోనుండి లీసంగ్జెన్, పేచుంగ్సీలయొక్క కొత్త ముఠాలు బయల్దేరాయి. వీరేకాక జెక్వాన్లోనూ యూనాన్లోనూ చిన్న సైనిక ప్రభువులున్నారు. నాన్కింగు ప్రభుత్వం వీరి సైన్యాలను నిరాయుధం చేసేందుకు ప్రయత్నించినపుడల్లా వారు తిరుగుబాట్లు చేశారు. 1929 లో లీ, పెంగ్లూ, 1930లో ఫెంగు, యెన్లు తిరుగబడి నాన్కింగు ప్రభుత్వాన్ని ప్రతిఘటించారు. ఈ తిరుగుబాటుదార్లకు విదేశ సామ్రాజ్యవాదుల ప్రోత్సాహ సహాయాలు పూర్తిగా లభించాయి. అంతర్యుద్ధాలతో చైనా ముంచెత్తబడి పరిశ్రమల నభివృద్ధి చేసుకోలేక, ఆర్థికంగానూ, రాజకీయంగాను బలహీనంగా వుంటే వారి

దోపిడి నిరాఘాటంగా సాగుతుంది. సుప్రసిద్ధ బ్రిటిషుఏజంటైన లెన్నాక్సు సింప్సన్ యెన్‌సీషాన్ సైనిక ప్రభువుక్రింద కస్టమ్సుశాఖ అధికారిగా పనిచేశాడు. ఈ నిరంకుశ సైనికప్రభువుల పీచం చాలవరకు చాంగ్‌సూ్యలియాంగ్ వలన అణగింది.

కొమింటాంగు వాదులలో గూడ జంగ్ నియంతృత్వ, నిరంకుశ పాలనపై అసంతృప్తి ప్రబలింది సన్‌ఫో, హూహాన్‌మిన్ మొదలగు వారు 1931 లో చెన్‌చిటాంగ్ సేనాని తోడ్పాటుతో నాన్కింగు మిలిటరీ గవర్నరును తరిమివేసి కాంటన్‌లో ఒక ప్రభుత్వాన్ని నెలకొల్పారు. కాని ఈ ప్రభుత్వం త్వరలోనే కూలిపోయింది. వెన్వెంటనే చెన్ సేనాని క్వాంగ్సీ సేనానులతో కలిసి South west రాజకీయసంఘాన్ని నెలగొల్పి ఐదు సంవత్సరాల వరకూ నాన్కింగుకు లోబడకుండా సర్వస్వతంత్ర ప్రభుత్వంగానే వ్యవహరించారు. చిన్నచిన్న ప్రవిక ప్రభువులలో చాలమందికి శాంతిస్థాపక కమీషనర్లను పెద్ద బిరుదులిచ్చి నాన్కింగు ప్రభుత్వ నియమితులైన గవర్నర్లతో సమానంగా తమకు లోబడిన ప్రాంతాల్లో స్వతంత్రంగా అధికారాన్ని చెలాయించుకునే హోదాను గుర్తించాడు. వారిసైన్యాలకు "శాంతిస్థాపకదళాలు" అని జంగ్ వ్యవహరించేందుకు ఆజ్ఞలు ఇచ్చాడు. ఈ విధంగా జంగ్‌కైషేక్ ప్రజాపీడకులైన సైనిక ప్రభువులతో సంధి చేసుకుని నామమాత్రమైన కేంద్రప్రభుత్వాధికారాన్ని మాత్రమే నెలకొల్పాడు.

## పారిశ్రామిక స్థితి.

అందువలన పెట్టుబడిదారీ వర్గప్రయోజనములైనా ఈ ప్రభుత్వం వలన సాధింపబడలేదు. ప్రభుత్వాదాయంలో రమారమి నూటికి ఎనభై పాళ్లు విదేశ ప్రభుత్వాల ఋణాల తీర్మానం నిమిత్తం మిలిటరీ ఖర్చుల క్రింద జంగ్ ప్రభుత్వం ఖర్చుచేశేది. అందువలన ఆర్థికపునర్నిర్మాణ పథకాల నన్నిటిని బుట్టదాకలు చేయక తప్పిందికాదు. చైనీయుల పెట్టు

బడి యాజమాన్యములక్రింద నడుపబడే స్వదేశ పరిశ్రమల అభివృద్ధి గణనలోకి రాదు.

దేశీయ ప్రత్తినూలు యంత్రాలు 1925 లో 77 ఉంటే 1930 లో 81 వరకు మాత్రమే పెరిగాయి. ఇదే సమయంలో విదేశమిల్లులు 37 నుండి 46 వరకూ పెరిగాయి. చైనాలో పెట్టబడిన మొత్తం 45 కోట్ల పౌండుల పారిశ్రామిక పెట్టుబడిలో నాల్గవవంతు మాత్రమే చైనావారిది. దీనికితోడుగా చైనారైల్వేలలో విదేశ సామ్రాజ్యవాదులు 15 కోట్ల పౌండుల పెట్టుబడిని కలిగి వున్నారు. అందువలననే విదేశప్రభుత్వాలు చైనాను దోచుకునేందుకు అనువుగా నుండే అర్ధవలసదేశంగానూ దాని ప్రభుత్వం తమ ప్రయోజనాలను, దోపిడీవిధానాన్ని నిరటంకంగా సాగించేందుకు ఉపకరణంగానూ వుంచేందుకు సర్వవిధాలా ప్రయత్నిస్తూ కుట్రలు పన్నే వారు. జంగ్ కేషేక్ వారి కనుసన్నలనుండి ఈ దోపిడీభారంతోను, నిరంతర అంతర్యుద్ధంలోను ప్రజలు దారుణహింసల పాలగునట్లు చేశాడు.

## నాన్కింగుప్రభుత్వ విదేశాంగనీతి.

అసమసంధుల నన్నిటినీ రద్దుచేస్తానని ప్రజలకు పదేపదే వాగ్దానాలు చేసిన జంగ్ కేషేక్ ప్రభుత్వంయొక్క బలహీనత తెలిశిన విదేశ సామ్రాజ్యవాదులు అసమసంధుల రద్దువిషయంలో కూడా యీ విధంగానే ప్రవర్తించారు. విదేశస్తులు చిక్కుకున్న కేసులలో కొన్ని తరగతుల నేరాలకు వారిని చైనా న్యాయస్థానాలలో విచారించు హక్కును నాన్కింగు జాతీయ ప్రభుత్వం సంపాదించింది. చైనా తపాలాశాఖానిర్వహణంలో కొద్ది అధికారాన్ని పొందింది. ఉప్పుశాఖపై పెత్తనం బ్రిటిష్ అధికార్ల నుండి తొలగించి అమెరికన్ అధికార్ల వశంచేశారు. అమెరికా ప్రభుత్వం వలెనే బ్రిటనుకూడా బాక్సరు యుద్ధనష్ట పరిహార ఋణాన్ని తన దేశ ప్రభుత్వాన్ని చైనాలో అభివృద్ధిపరచేందుకు చైనాలో విద్యావ్యాప్తికి

వెచ్చింప నిశ్చయించింది. ఎగుమతి దిగుమతి సుంకాలను చైనాప్రభుత్వం విధించే అధికారాన్ని 1929 చివరభాగంలో చాల ప్రతిఘటనానంతరం అమెరికాబ్రిటనులు అంగీకరించాయి. జపాను 1930 లో గాని ఆ అధికారాన్ని గుర్తించలేదు. 1931 లో ప్రథమ పర్యాయం చైనాజాతీయ ప్రభుత్వం సుంకాలను విధించింది. బ్రిటిషు సరుకులమీద సుంకపు పన్నులు చాల తక్కువగా వేయబడ్డాయి. విదేశప్రభుత్వాలు చైనా దేశంలో సాగిస్తున్న విశేష ప్రాదేశికన్యాయస్థాన విచారణాధికార రద్దు సమస్యమాత్రం కంటకప్రాయమైంది. చైనాప్రభుత్వ ప్రతిష్ట ఈ హక్కు రద్దుపైననూ, జపాను మొదలగు విదేశస్థులకు లాభదాయకమగు నల్లమందు వ్యాపారము ఈ హక్కు రక్షణపైననూ ఆధారపడి వున్నాయి. అందువలన జాతీయ ప్రభుత్వ మెన్ని వినతులు చేసినప్పటికీ ప్రతిఫల శూన్యములయాయి. 1931 మే లో చైనా జాతీయ ప్రభుత్వం ఇతరు లంగీకరించనప్పటికీ తామే విదేశస్థులకుగల ఈ అధికారాలను రద్దుచేస్తామని ప్రకటించారు కాని జపాను మంచూరియాపై సెప్టెంబరు 18 వ తేదీన దురాక్రమణకు దిగగానే యీ విషయంపై చర్చలకు వాయిదా వేసింది. జర్మనీ, సోవియిట్ రష్యా, ఆస్ట్రియా, ఇటలీ, బెల్జియం, డెన్మార్కు, స్పెయిన్, పోర్చుగల్, ఫిన్లాండు, పర్షియా, బొలీవియా, చిలీ, మెక్సికో ప్రభుత్వములు చైనాలోగల సమస్త ప్రత్యేకహక్కులను, న్యాయవిచారణాధికారములను వదలుకొనినారు. ఆంగ్లేయులు మాత్రం వదలుకొనవలసినట్లు సిద్ధాంతరీత్యామాత్రామే అంగీకరించిరిగాని రద్దు పరచలేదు. షాంఘేలో ఆంగ్లేయుల "హిజ్ మెజిస్టీస్"వారి సుప్రీమ్‌కోర్టు, అమెరికనుల "సంయుక్తరాష్ట్రముల" వారి కోర్టులు చైనా జాతిప్రతిష్ఠకు భంగకరంగా పనిచేయుచునే యున్నవి.

1930 అక్టోబరు 1 వ తేదీనాడు హాంకో మొదలగు కొన్ని పుర పాలకసంఘములను, వైహాయివైకౌలు ప్రాంతమును బ్రిటిషువారు చైనా

జాతీయ ప్రభుత్వమునకు వశపరచారు. 1931 జనవరి 15 వ తేదీని టీన్ట్సినులోని తమ ప్రదేశమును బెల్జియం ప్రభుత్వంవారు జాతీయ ప్రభుత్వమున కిచ్చివేశారు.

## జాతీయ రాజ్యాంగ విధానము.

కొమింటాంగు పార్టీవారిచే చైనా ప్రజాస్వామిక ప్రభుత్వం స్థాపింపబడింది. పాలనాధికార మంతయు అఖిల చైనా కొమింటాంగు కాంగ్రెసు మహాసభయం దున్నది కొమింటాంగు కాంగ్రెసు తీర్మానము లకు లోబడి నడుపుటకొక స్థాయిసంఘము నెన్నుకోవాలి. 1928 అక్టో బరు 4 వ తేదీన కొమింటాంగు కాంగ్రెసు రాజ్యాంగ విధానమును నిర్ణ యిస్తూ చైనాప్రజాస్వామికపు జాతీయ ప్రభుత్వ విధానంయొక్క శాసనం చేయబడింది. 1931 డిసెంబరు నెలలో మరల కాంగ్రెసు సమావేశంలో కొద్దిగ మార్పుచేసి యున్నారు. ఈ విధానమే తరువాత అమల్లో వున్నది. ఇది తాత్కాలిక విధానమనీ చైనాలో స్థిరమైన శాంతి నెలకొనిన పిదప శాశ్వత రాజ్యాంగ చట్టాన్ని ప్రజాప్రతినిధులు నిర్మించగలిగే యేర్పాట్లు చేస్తామనీ చియాంగ్ పలుకుబడికి లోబడిన కొమింటాంగు జాతీయ ప్రభుత్వం ప్రకటించారు. అంతవరకూ కొమింటాంగు పార్టీయొక్క నియంతృత్వంలోనే వుండి చైనా స్వాతంత్ర్యం రక్షింపబడాలనే సిద్ధాం తాన్ని ప్రచారం చేసి అమలు పరచారు. ఈ రాజ్యాంగవిధానం ప్రకారం కాంగ్రెసు స్థాయిసంఘం అయిదు ప్రభుత్వ అంగాలను యెన్నుకుంటుంది. ఈ శాఖలన్నీ స్థాయిసంఘానికి బాధ్యతవహించి పనిచేస్తాయి :

(1) శాసన సభ : ఇందులో 99 మంది సభ్యులను కార్యనిర్వాహక సంఘం రెండు సంవత్సరముల కొకమారు యెన్నుకుంటుంది. ఆదాయ వ్యయ పట్టికలు, చట్టములను చేయుట, పన్నులు వేయుట, విదేశ వ్యవహారములు, యుద్ధము, సంధి మొదలగు పని యీ సభ నిర్వహించు విధులు.

(2) మంత్రివర్గము: మంత్రివర్గమును కాంగ్రెసు కేంద్రస్థాయి సంఘమే యెన్నుకొనును. అన్ని ప్రభుత్వశాఖల కార్యనిర్వహణము, చట్టములను ప్రవేశపెట్టుట, శాసన సభలో తీర్మానింపబడిన చట్టములను అమలుజరుపుట వీరిపని.

(3) న్యాయ నిర్వహణ శాఖ: పౌరసత్వములు, ఉద్యోగస్తులు చేయు నేరములను విచారించి శిక్షించుట, నేరస్తులకు క్షమాపణ నిచ్చుట, న్యాయస్థానముల నెలకొల్పుట, వాటిపై తణిఖీ అను విధులీశాఖ నిర్వర్తించును.

(4) ఉద్యోగస్తులను నియమించు శాఖ: పౌర పరిపాలనకు సంబంధించినఉద్యోగములలో ఉద్యోగస్తులకు పరీక్షలనుబెట్టి ఆరితేరిన వారి కుద్యోగము లిచ్చుట యీ శాఖ పని.

(5) తణిఖీచేయు శాఖ: 19 నుండి 29 వరకు సభ్యులుంటారు. వివిధ ప్రభుత్వ శాఖలను, వాటి లెక్కలను తణిఖీ చేయుచు, నేరములను చేయు ఉద్యోగులపై న్యాయాధిపతుల సంఘమువద్ద ఫిర్యాదులను దాఖలు చేయవలెను.

ఈ అయిదు శాఖలపైన జాతీయ ప్రభుత్వాధ్యక్షుని కాంగ్రెసు స్థాయిసంఘమువా రెన్నుకుంటారు. 24 మంది సభ్యులుగల ప్రభుత్వ సభ్యులను ఆయనకు సహాయం చేయుటకు స్థాయిసంఘమువా రేర్పాటు చేస్తారు. దేశంలోని 276 కోర్టులపైన అధికారం వహించు అత్యున్నత న్యాయస్థానం కలదు. రాష్ట్రములమీద జాతీయ ప్రభుత్వము అధ్యక్షులను నియమించును. జిల్లాలమీద రాష్ట్రప్రభుత్వము తన ప్రతినిధులను నియమించును.

## కొమింటాంగు ముఠా కలతలు.

చియాంగ్ కై షేక్ బృందము చైనాలోని ధనికులతోను, భూస్వాములతోను, పారిశ్రామికులతోనూ స్నేహముగ నుండి వారి ప్రతినిధులనే

సలహాదార్లుగ గల్గియుండెను. వాంగ్‌చింగ్‌వీ ఫ్రాన్సుకు పోయిన పిమ్మట 1928 నుండి ఆయన తన మితవాద బృందంతో జాతీయ ప్రభుత్వాధ్యక్షుడు గాను, యెదురులేని నాయకుడుగాను వ్యవహరించుచుండెను. సోవియట్ రష్యాతో సంబంధములను త్రెంపుకొని, దేశీయ కమ్యూనిస్టులను నాశనం చేస్తూ రైతుకూలీ ఉద్యమాలను పూర్తిగా అణచివేసెను. కూలీలేమాత్రం నమ్మి కట్టినను సమ్మెలను క్రూరముగా యజమానులణచి వేయుటకు ప్రభుత్వం సహకరింపసాగింది. సన్‌యట్‌సేన్ అవలంబించిన రాజనీతిని పూర్తిగా వదలివేశాడు. సన్‌యట్‌సేన్ తత్వమును హృదయపూర్తిగా నమ్మి ఆచరించువారికి, త్యాగములు చేసినవారికి ఉద్యోగముల నిచ్చుట మాని, కొమింటాంగు నుండి వెనుక వెడలగొట్టబడినవారినే మరల ఉద్యోగములలో ప్రవేశపెట్టిరి దీనికి తోడుగా విదేశ సామ్రాజ్యవాదుల కనుసన్నలలో మెలగుచు ప్రజానురాగానికి లెక్కచేయకుండా నిరంకుశంగా ప్రవర్తించసాగారు. అందువలన చియాంగ్‌కైషేక్ మీద దేశంలోని కొమింటాంగు సభ్యులలో తీవ్రమైన అసంతృప్తి యేర్పడింది.

1929 మార్చినెల 12 వ తేదీన మూడవ కొమింటాంగు కాంగ్రెసు మహాసభను నాన్కింగు నగరమున చియాంగ్ సమావేశ పరచాడు. స్వదేశమునకు తిరిగి వచ్చిన వాంగ్‌చింగ్‌వీకూడ యీ సమావేశంలో పాల్గొన్నాడు. ఈ కాంగ్రెసుకు పార్టీ సభ్యులనుండి సక్రమమైన యెన్నికలద్వారా ప్రతినిధులు పంపబడలేదు. అనేక కుతంత్రములను జేసి, ప్రజాతంత్ర విధానాన్ని రూపుమాపి తన అనుచరులను తెచ్చుటకు చియాంగ్ అధికార దుర్వినియోగం చేశాడని, సరియైన యెన్నికలు జరిపి వేరే కాంగ్రెసును సమావేశ పరచాలని వాంగ్ మొదలగు పదకొండు మంది పార్టీప్రముఖులు ప్రకటించారు. 1929 మే నెల 20 వ తేదీన చైనాలోని 18 రాష్ట్రాలలోని 15 రాష్ట్ర కొమింటాంగువారు యీ కాంగ్రెసు

నాక్షేపించుచు వేరే యెన్నికలు జరుపాలని తీర్మానించారు. తన అధికార ధిక్కారమును సహించలేని నిరంకుశుడైన చియాంగ్ తనకు వ్యతిరేకముగానున్న కొన్ని కొమింటాంగు సంఘములను అణచివేసి కొన్ని పత్రికల నాపివేయించి వ్యతిరేక సభ్యులను ఖైదులో వేశాడు. పార్టీవారిపై దౌర్జన్యప్రయోగము జోరుగా సాగింది. చాలమంది నిర్బంధంలో వుంచబడ్డారు. విదేశస్థులక్రిందనున్న స్థావరాలలో దాగుకొన్న యిద్దరు కొమింటాంగు ప్రముఖులను 1930 ఫిబ్రవరి నెలలో చియాంగ్ హత్యలు చేయించాడు.

ఈ విధంగా దౌర్జన్య ప్రయోగంతో చియాంగ్ ముఠావారు ప్రభుత్వం చేయసాగారు. కాని 1931 సెప్టెంబరు 18 నాడు జపాను సేనలు మంచూరియాలో ప్రవేశించి స్వాధీనపరుచుకొన్నపుడు ప్రతిఘటించక అమెరికా బ్రిటిషు సామ్రాజ్యవాదుల నానారాజ్య సమితికి మొర పెట్టుకుని అవమానకరంగా ప్రవర్తిస్తున్న చియాంగ్‌పై దేశప్రజ లందరికు విపరీతమైన ఏహ్యభావ మేర్పడింది. శాంతి రాజీపద్ధతుల మీద విదేశ సామ్రాజ్యవాదులు తమ సమస్యలను న్యాయంగా పరిష్కరిస్తారనే ఆశలు అడియాసలని ప్రజలు గ్రహించారు. విదేశ సామ్రాజ్యవాదుల దోపిడీ విధానాన్ని స్వయం సహాయంతో తీవ్రముగా స్వతంత్రించి వ్యవహరించినగాని తుదముట్టించలేమనీ జపాను దురాక్రమణను ప్రతిఘటించాలనే కొమింటాంగు తీవ్రవాదులకు దేశంలో ప్రాబల్యం వచ్చింది. 1931 సంవత్సరాంతమున దేశమంతటా విద్యార్థి యువజనసంఘాలవారు చియాంగ్ ప్రభుత్వమునకు వ్యతిరేకంగా అఖండమైన ఆందోళన జరిపారు. అఖిలచైనా విద్యార్థిసంఘమువారు దేశంలో నలుమూలలా డిశెంబరు 15 వ తేదీనాడు సభలుజరిపి చియాంగ్ దేశాన్ని జపానుకు అమ్మివేస్తున్నాడనీ వెంటనే చైనాజాతి మేల్కొని ప్రతిఘటించాలనీ ప్రచారం చేశారు. వారితో కార్మిక కర్షకులు చేరారు. లాఠీలు, పోలీసులు, ఖైదులు,

నిర్బంధ విధానమూ యీ ఉద్యమతీవ్రత నరికట్టలేనందున చియాంగ్ అధ్యక్షపదవికీ, అతని మంత్రులు తమ పదవులకూ రాజీనామా లిచ్చారు. 1932 ఫిబ్రవరిలో జాతీయ ప్రభుత్వానికి ఎన్నికలు జరిగి లిఆ‌షెన్ అను అతివాది ప్రభుత్వాధ్యక్షుడుగానూ వాంగ్ చింగ్వీ మంత్రివర్గాని కధ్యక్షుడు గానూ, టి వి సూంగ్ ఆర్థిక మంత్రిగాను, డాక్టరులోవెంకన్ విదేశ వ్యవహారమంత్రిగాను ఫెంగ్ సేనాని అంతర్వ్యవహార మంత్రిగాను ఎన్నుకొనబడిరి. సైనికసంఘమునకు అధ్యక్షుడుగ నెన్నుకొనబడిన చియాంగ్ కే షేక్ సర్వసేనాధిపతి అయ్యాడు. జపాను వ్యతిరేకత మాత్రమే వీరిలో ఐక్యత కలుగజేసింది. ఈ విధంగా అధికారంలోనికి వచ్చిన అతివాదులే ప్రాబల్యంకలిగి తర్వాత 1935 లో జరిగిన ఎన్నికలలోగూడ పదవులను నిల్పుకున్నారు. 1928 లో చేయబడిన ప్రభుత్వ శాసనంద్వారా ఏర్పడిన ఈ ప్రభుత్వంలో ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రజాప్రతినిధులు లేరు పాలనాధికారంద్వారా ప్రజాసేవను, బహిరంగంగా పనిచేయగలిగే శాస్త్రీయ హక్కును గుత్తగాచేసుకున్న ఏకైకరాజకీయపక్షమైన కొమింటాంగు వశంలో ప్రభుత్వంవుంది. పార్టీలోని పెత్తందార్లే స్థానికపార్టీ నాయకులను నియోగించే పద్ధతిని ప్రవేశపెట్టి ఎన్నికలద్వారా ప్రతినిధులు వచ్చే ప్రజాతంత్రాన్ని పూర్తిగా రూపుమాపారు. పార్టీవాదు లెంత నిరంకుశులూ, పదవీవ్యామోహపరులూ అయినప్పటికీ చైనాదేశంలో గుత్తవ్యాపారపు పారిశ్రామిక పెట్టుబడి అభివృద్ధి చెందనందున పూర్తిగా ఫాసిస్టు విధానం అమలుజరుపబడలేదు. పార్టీ అంతరంగిక వ్యవహారాల్లో ఆ అయిదు ప్రభుత్వాంగాలఅధ్యక్షులు వారివారి ముఠాల ప్రాబల్యాన్ని చిరకాలం నిల్పుకునేందుకు, ఎట్టిదుర్మార్గాన్ని చేసేందుకు జంకక ప్రజాభిప్రాయాన్ని తృణప్రాయంగా త్రోసివేశారు. చెన్‌కోఫూ, చెన్‌లీఫూ అను చెన్ సోదరుల ముఠాలచేతిలో పార్టీయంత్రమంతా వుంది. నిర్మాణ, ప్రచారశాఖలు, గూఢచారులు కేంద్రరాజకీయ సంస్థలు వారి అధికారానికి

లోబడివున్నాయి. వాంగ్ మురావారు మంత్రివర్గంలో ప్రాబల్యంకలిగి విదేశ వ్యవహారాలపై పెత్తనం వహించారు. రాజకీయశాస్త్రపక్షంవారు మాత్రం చాలవరకు దేశభక్తి ప్రపూరితమైన మార్గాన్నవలంబించారు.

## చైనా సమస్యలు.

చైనా సమస్యలలోకెల్ల ప్రధానమైనది పేదరికం. చైనా భూభాగంలో నూటికి 64 పాళ్ళు పర్వతములు, పీఠభూములు, కొండలు ; 26 పాళ్ళు మైదానాలు, లోయలు ; 10 పాళ్ళు స్టెప్పీలు, జలాశయ ప్రాంతాలు. ప్రపంచ ప్రజల్లో సగంమంది ఆసియా ఖండస్థులు. వారిలో సగంమంది చైనావారు చైనా జనసంఖ్య 45,80.00000 లలో 43 కోట్లమంది హాన్ తెగవారు. (1) ఉత్తర స్టెప్పీలలో వుండే మంగోలియన్లు. (2) సింకియాంగు మున్నగు వాయువ్యరాష్ట్రవాసులైన చైనా మహమ్మదీయులు. (3) దక్షిణ పశ్చిమయూనాన్ హైనాణాద్వీప మధ్య ప్రాంతవాసులైన 'యీ'లు. (4) టిబెట్టు, సికాంగ్, పశ్చిమ జెక్వాన్‌లలోని టిబెట్ తెగ, (5) జెక్‌వాన్, క్వీచౌ, యూనాణ రాష్ట్రాలలో యావ్‌లు, (6) క్వాంగ్సీ హూనాన్, క్వాంటంగ్ రాష్ట్రాలలోని'మియా'లు, (7) సికాంగ్, వాయువ్య జెక్‌వాన్‌లలో 'ఫాణ'లు`అను జాతీయ అల్పసంఖ్యాక తెగలవారు చైనాలో నివసిస్తున్నారు.

చైనా ప్రజాస్వామికమునందు మంచూరియాతో సహా అయిదు భాగము లున్నాయి. (1) చైనా, (2) సింకియాంగు, (3) టిబెట్టు, (4) తూర్పు మంగోలియా, (5) మంచూరియా. మొత్తము వైశాల్యము సుమారు నలుబదిమూడు లక్షల చతురపు మైళ్ళు. చైనా ప్రజాస్వామికపు జనసంఖ్య నలుబది యెనిమిది కోట్లని అంచనా వేయబడింది. వీటిలో తూర్పు మంగోలియా విస్తీర్ణము పదమూడు లక్షల అరుపది యెనిమిది వేల చతురపు మైళ్ళు. చాల భాగము గోబి యెడారితో కప్పబడి వుంది.

అందులో 1934 వ సంవత్సరమునకు 8 లక్షల మంగోలులు, 10 లక్షల చైనావారు కాపుర మున్నారు. తూర్పు మంగోలియా నొక రాష్ట్రంగా చేశారు. ఆ రాష్ట్రంలోని కేచేటా చైనావారు చైనా పరిస్థితులను భరించ లేక తండాలుగా వలసపోయి పచ్చికబయళ్ళ నాక్రమించసాగారు. దీనిని సహించక మంగోలులు 1934 వ సంవత్సర ప్రారంభమున ఒక తిరుగు బాటు చేశారు. చైనా జాతీయ ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా అణచివేసింది. కాని అల్ప సంఖ్యాక జాతుల స్వయంనిర్ణయ సూత్రమును గుర్తించవల సిందని కమ్యూనిస్టులు, అతివాదులు చేసే ఆందోళనకు లొంగి మంత్రివర్గ అధ్యక్షుడైన వాంగ్‌చింగ్‌వీ ఆ రాష్ట్రమును దర్శించి 1934 ఏప్రిల్ 23 వ తేదీన తూర్పు మంగోలియాకు సంపూర్ణమగు రాష్ట్రీయ స్వపరిపాలనము నిచ్చెను. చైనావారివలన నరికట్టు హక్కుగూడ వారి కొసగబడెను. పైలింగ్‌మియో పట్టణము ముఖ్యపట్టణముగ జేయబడెను.

(2) సింకియాంగ్ లేక చైనా తురుష్క స్థానము. విస్తీర్ణము 5 లక్షల 50 వేల చదరపు మైళ్లు. జనసంఖ్య 27 లక్షలు. వీరిలో హెచ్చు మంది తురుష్కులు. అది చాలవరకు యెడారి ప్రాంతము. ఇదికూడ ఒక ప్రత్యేక రాష్ట్రముగ చేయబడింది. సింకియాంగు రాష్ట్రంలోకూడ 1933, 1934 లలో తిరుగుబాట్లు జరిగాయి. చైనా జాతీయ సైన్యాలు ఆ తిరుగుబాట్లను అణచివేశాయి. వాంగ్‌చింగ్‌వీ అక్కడ ప్రభుత్వ గవర్నరైన చిన్‌జూలిన్‌యొక్క అక్రమ ప్రవర్తన మూలమున నా తిరుగు బాటు జరిగినదనీ, ఆ తప్పులన్నీ సరిదిద్దబడి, శాంతి స్థాపితమైనదనీ ప్రకటించి ప్రజలకు రాష్ట్రీయ స్వపరిపాలన మిచ్చెను.

(3) టిబెట్టు : జనసంఖ్య 20 లక్షలు విస్తీర్ణము నాల్గు లక్షల అరు వదిమూడువేల చతురపుమైళ్ళు. ఈ దేశమంతయు కొండ ప్రదేశముల తోను ఇసుకపర్రలతోను నిండివుంది. టిబెట్టుదేశము చైనా ప్రజాస్వామికముక్రింద సంరక్షిత రాజ్యముగ నున్నది. డెలైలామా అనుమత

గురువు చైనాప్రభుత్వ సలహాదార్లతో స్వదేశ విదేశ సైనిక వ్యవహార ములను నడుపుతూవుంటాడు

(4) చైనాప్రజాస్వామికంలో చైనా మిగుల ముఖ్యమైనది. జన సంఖ్య నలుబది నాల్గుకోట్ల ఇరువదిఏడులక్షలు. విస్తీర్ణము పదునేను లక్షల ముప్పదినాల్గువేల చతురపుమైళ్ళు. ఈ చైనాను వ్యావసాయిక దృష్ట్యా ఉత్తరదక్షిణ ప్రాంతాలుగా విభజింపవచ్చును. యాంగ్సినదీ లోయ. దానికి దక్షిణంగా వున్న భూభాగం దక్షిణచైనా; దానికుత్త రంగా చైనా గోడవరకూవున్న భూభాగం ఉత్తరంచైనా. దక్షిణంలో సారవంతమై వ్యవసాయ యోగ్యమైన భూములు హెచ్చు. అక్కడ 30—60 అంగుళముల వర్షం కురుస్తుంది. ఒకటిరెండు పంటలుకూడ పండించవచ్చును. అక్కడ వరి, ఉర్లగడ్డలు; ఉత్తరచైనాలో గోధుమ, యవలు, చిక్కుళ్ళు పండుతాయి ప్రత్తి, పొగాకులు రెండుప్రాంతా ల్లోను పండిస్తారు. దక్షిణంలో భూమి పంటలతో, యేపుగా పెరిగిన పచ్చికతో, వెదురుపొదలతో పచ్చగా కలకలలాడుతూ వుంటుంది. ఉత్తరంలో శీతాకాలంలో చెట్లు, గరికలేక భూమి బూడిదవర్ణంగా వుంటుంది.

చైనా సమస్యలలోకెల్ల ముఖ్యమైనది పేదతనం. చైనా గ్రామ ప్రజలు వ్యవసాయంమీద హెచ్చుగా ఆధారపడి, భూములు కౌలుకు పుచ్చుకుని వచ్చు ఫలసాయంలో అధికభాగం భూస్వాములకిచ్చి అంతు లేని దారిద్ర్యబాధతోను, ఋణాలతోను కృంగిపోతున్నారు.

## మొత్తంచైనాలో భూకేంద్రీకరణ.

| | మొ॥ కుటుంబాలలో నూటికి పాళ్లు | మొ॥ సాగుభూమిలో సొంతభూమి నూటికి పాళ్లు. |
|---|---|---|
| భూస్వాములు (సొంతవ్యవసాయం చేయనివారు) | 3 | 26 |
| ధనికరైతులు (పెద్ద కమతదార్లు) | 7 | 27 |
| మధతరగతి రైతులు (భుక్తికి చాలీచాలని ఆదాయకం కలవారు) | 22 | 25 |
| బీదరైతులు (ఎల్లపుడు ఋణస్తులు) | 68 | 22 |
| | 100 | 100 |

## దక్షిణ చైనాలో భూకేంద్రీకరణ.

| | మొ॥ కుటుంబాలలో నూటికి పాళ్ళు. | మొ॥సాగుభూమిలో సొంతభూము నూటికి |
|---|---|---|
| భూస్వాములు | 3 | 47 |
| ధనిక రైతులు | 6 | 17 |
| మధ్యతరగతి రైతులు | 20 | 20 |
| బీదరైతులు | 71 | 16 |
| | 100 | 100 |

## ఉత్తర చైనాలో భూకేంద్రీకరణ.

| | | |
|---|---|---|
| భూస్వాములు | 5 | 12 |
| ధనిక రైతులు | 8 | 28 |
| మధ్యతరగతి రైతులు | 25 | 33 |
| బీదరైతులు | 62 | 27 |
| | 100 | 100 |

## సాగుబడి భూముల సగటు ప్రమాణం - ఎకరాలలో.

| | ధనిక రైతులు | మధ్యతరగతి రైతులు | బీదరైతులు |
|---|---|---|---|
| ఉత్తర ఈశాన్య సరిహద్దు ప్రాంతాలు | 37.5 | 18 | 6 |
| ఉత్తర చైనా | 7.5 | 3 | 1.2 |
| దక్షిణ చైనా | 4.5 | 2.25 | .75 |

పైనుదహరించిన లెక్కలను బట్టి నూటికి ఎనుబదిమంది వ్యవసాయ వృత్తులపై నివసించే చైనాదేశంలో సాగుభూమిలో హెచ్చుభాగం భూస్వాముల సొంతమైంది. రెక్కలు ముక్కలు చేసుకుని కష్టించే వ్యవసాయదారు భూస్వామికి నూటికి ఎనుబది పాళ్ళవరకు కట్టుబడి చెల్లించి ఋణాలతోను, పస్తులతోను అలమటిస్తాడు. చైనా భూస్వాములు చతుష్పాత్తులు. వారు కౌలుదార్లనుండి కట్టుబడి, వడ్డీ వ్యాపారంనుంచి వడ్డీధనం, పన్నుల వసూలుదార్లుగా మామూళ్లు, దుకాణదార్లుగా లాభాలు కూడా సంపాదిస్తూ చైనా ప్రజాసామాన్యాన్ని దోస్తారు. చైనా ప్రజల్లో నూటికి 48 పాళ్ళు కౌలుదార్లు, బీద వ్యవసాయదార్లు. వారికి మొత్తం సాగుబడి భూమిలో నూటికి 22 పాళ్ళుమాత్రమే కలదు. అందువలననే వ్యవసాయ సంస్కరణల కొరకు రైతులు ఆందోళన గావించారు. తిరుగుబాట్లు చేశారు. చివరకు వర్గపోరాటపు సిద్ధాంతంమీద ఆధారపడిన శ్రామికవర్గ నాయకసంస్థయైన కమ్యూనిస్టు పార్టీలో చేరి భూస్వాముల ప్రభుత్వమైన నాన్కింగు జాతీయ ప్రభుత్వంపై పోరునల్పుతూ సోవియట్ల నిర్మాణానికి పూనుకున్నారు.

# 19 వ అధ్యాయం.

## జపాను దురాక్రమణ : మంచూకో రాజ్యస్థాపన.

మిగుల ఫలవంతమైన మంచూరియా మూడు లక్షల అరువది మూడువేల చతురపుమైళ్ళ విస్తీర్ణము, మూడుకోట్ల యెనిమిదిలక్షల జన సంఖ్య కలిగియున్నది. దానిలో లియోనింగ్, కిరిన్, హైలంగుచియాంగ్ అను మూడు రాష్ట్రాలున్నాయి. ప్రజల్లో నూటికి 96 మంది వలసవచ్చిన వారు, నూటికి ఒకటికంటె తక్కువగా జపానువారు, నూటికి రెండు న్నర చొప్పున కొరియావారు కాపురమున్నారు.

1904 లో జరిగిన రష్యా జపాను యుద్ధానంతరం జపాను పోర్టు ఆర్థరు ప్రాంతాలను, దక్షిణ మంచూరియాలోని రైల్వేలను, అచటి గను లను సంపాదించింది. 1890 లో కొరియాను కబళించిన తర్వాత ప్రక్క నున్న మంచూరియాలోని లోహసంపద, బొగ్గు, ముడి పదార్థములు, జపాను దురాశను రేకెత్తించాయి. 1907, 1909 లలో చైనా సామ్రాజ్య మును రష్యా జపాను చక్రవర్తులు తమ మధ్య పంచుకోవలయునని రహస్యపు టొడంబడికలు చేసుకున్నారు. కాని మన్రో సిద్ధాంతంవలన జపాను దురాక్రమణ వాంఛాపరుల కోర్కెలు అడియాస లయ్యాయి. కాని జపానుమాత్రం పట్టు విడువలేదు. 1915 లో యువాన్‌షికేను బెద రించి దక్షిణమంచూరియాలో ముఖ్యమైన హక్కులు గుంజుకున్నారు. 1918 లో పెకింగు ప్రజాస్వామ్యమును పాలించుచుండిన ట్యుయన్ బృదంవారు జపానువారివద్ద లంచం తీసుకుని చైనాను జపానుకు సంర క్షక రాజ్యముగ జేయుటకు సమకట్టిరి. కాని కొనసాగలేదు. అనాటి నుండి జపాను సామ్రాజ్యవాదులు దౌర్జన్యముగ అనేక ఆక్రమణలు చేయసాగారు. చైనాప్రభుత్వం నల్లమందు అమ్మకమును నిషేధించినా సరకుగొనక జపానువారు తమ రైళ్ళలోదుగునా అమ్మించి లాభాలు గడించసాగారు.

చాంగ్‌సోలిన్ సేనాని చైనాజాతీయ ప్రభుత్వంతో రాజీపడకుండా 1928 లో ఆయన ప్రయాణం చేసే రైలుపెట్టెను ప్రేల్చివేసి ఆయనను హత్యచేశారు. ఆయన కుమారుడగు చాంగ్‌సూలియాంగు చైనాజాతీయ ప్రభుత్వంలో మంచూరియాను జేర్చాడు. అది జపానుకు చాల కంట కంగావుంది. రాజ్యతృష్ణగల సైనికబృందము జపానుప్రభుత్వంలో ప్రాముఖ్యతకు వచ్చి మంచూరియాను కబళించుటకు పూనుకున్నారు. 1931 జూలై నెలాఖరున నకమూరాఅను జపానుసేనాని ముగ్గురు అను చరులతో పశ్చిమ మంచూరియా తూర్పు మంగోలియాలలో చైనావారి సైనిక రహస్యములను సేకరించుచు ప్రయాణం చేయుచుండగా అదృశ్యు లయ్యారు. వారి హత్యకు ప్రతీకారంగా మంచూరియాను ఆక్రమించ వలసిందని జపానుపత్రికలు, సైనికవాదులు సెప్టెంబరుమాసంలో ఆందో ళన ప్రారంభించారు. చైనా ప్రభుత్వంవారు విచారణచేసేవరకు వేచియుండ లేమని తాముకోరిన షరతులకెల్ల చైనా అంగీకరింపనిచో తగుచర్యను తీసికొందుమని జపాను ప్రభుత్వం మంచూరియా గవర్నరు జనరలగు చాంగు సూలియాంగుకు తెలియచేసినది.

## నానారాజ్య సమితి — జపాను దురాక్రమణ.

నానారాజ్య సమితిలో చైనా జపాను ప్రభుత్వాలు సభ్యులుగాన యీ వివాద మచ్చట పరిష్కరింప బడాలని చైనావారి వాదన. జపాను సామ్రాజ్యవాదులకు తమ సైనిక శక్తిలో నమ్మకం. జాతీయ చైనాకు అమెరికనులలోను బ్రిటిషు అమెరికన్ ప్రభుత్వాల కీలుబొమ్మయైన నానా రాజ్య సమితిలోను విశ్వాసం ; చైనాను కబళింప నిశ్చయించుకున్న జపాను హంజోసేనాని క్రింద నాలుగు దళాలను కొంత నావికా దళ మును మంచూరియాకు పంపినది. జపానువారెట్టి దౌర్జన్యం చేసినా తొందరపడవద్దని చైనా జాతీయ ప్రభుత్వం హుకుం జారీచేసింది,

కలహా కారణమునకు నిరీక్షించుచున్నారు జపానువారు. 1931 సెప్టెంబరు 18 వ తేదీరాత్రి పదిన్నర గంటలకు మంచూరియా రాజధానీ నగరమైన ముక్డెన్ నగరమున జపాన్‌వారి రైలుమీద నొక బాంబు పడి రైలుబండి యంచునకు కొంచెము దెబ్బ తగిలినది. దానిని సాకుగా తీసు కుని హాంజో సేనాని ఆ రాత్రే ముక్డెన్‌ను ఆక్రమించాడు. ఆ బాంబును జపానువారే వేశారని చైనావారు ప్రకటించారు. విదేశ పత్రికా ప్రతినిధులు కూడా ఆ విధంగానే భావించారు. చైనా జాతీయ ప్రభుత్వ గవర్నరు జన రలు చాంగ్‌సూలియాంగ్ ప్రతిఘటించక దక్షిణమున నున్న చించో పట్ట ణమునకు తిరోగమించాడు.

చైనాప్రభుత్వ ప్రతినిధి సెప్టెంబరు 21 వ తేదీన జినీవా నగర మున నానారాజ్యసమితి కౌన్సిలులో జపాను అక్రమంగా మంచూరియా నాక్రమిస్తూ ప్రపంచ శాంతికి భంగం కలిగిస్తోందని ఫిర్యాదు చేశాడు. జపాను ప్రతిధి యీ వివాదం చైనా జపానుల మధ్య రాయబారాల వలన పరిష్కారం కావాలిగాని కౌన్సిలుకు సంబంధం లేదని ప్రతివాదన చేశాడు. నానారాజ్య సమితి 11, 15, 16 నిబంధనల ప్రకారం, తొమ్మిది రాజ్యాల సంధి ప్రకారం పారిస్‌లో జరిగిన కెల్లాగు ఒడంబడిక ప్రకారం చైనా జపానుల తగాదాలు నానారాజ్య సమితివారి పంచాయతీ ప్రకారం తగా దాలు పరిష్కరించుకోవాలని నిర్ణయించి సెప్టెంబరు 30 వ తేదీని కౌన్సిలు వారు సభ ముగించారు.

కౌన్సిలువారి నిర్ణయం ప్రకారం తమ సైన్యాలను మంచూరియా నుండి తొలగిస్తామని వాగ్దానం చేసినప్పటికీ సెప్టెంబరు 24 వ తేదీనాడు చించోమీద బాంబులు వేసి అక్టోబరు 8 నాటికి 150 మైళ్ళ దూరం వరకు ఆక్రమించి, చించో నగరంలో కొంతభాగం తగులబెట్టారు జపానువారు.

అక్టోబరు నెలలో సమావేశమైన నానారాజ్య సమితివారు అక్టోబరు 24 నాడు జపాను చర్యను ఖండించి నవంబరు 16 వ తేదీ లోపున

మంచూరియాను వదిలిపోవాలని తీర్మానించారు. కాని జపాను సామ్రాజ్య వాదులు లక్ష్యపెట్టక అయిదు వారాలలో చైనాప్రభుత్వ సేనలను పారద్రోలి ఉత్తర దక్షిణ చైనాలను ఆక్రమించారు. బ్రిటన్ అమెరికాలకు చైనా మొఱ పెట్టుకొనుచుండగా జపాను మంచూరియా ఆక్రమణను పూర్తి చేసుకుంది. 1931 డిసెంబరు 10 వ తేదీన జపాను చైనాల తగవును గూర్చి విచారించి ఒక నివేదికను సమర్పించుటకు లిట్టన్ కమీషనును నానారాజ్యసమితి నియమించింది.

జపానుయొక్క దురాక్రమణ చైనాజాతిలో అఖండమైన సంచలనము గలుగచేసింది. చైనా అంతటను జపాను సరుకుల బహిష్కారం జరిగింది. జపాను ఓడలను ఎక్కకుండాను, జపానువారిక్రింద పనిచేయకుండాను కట్టుకట్టారు చైనా వర్తకులు జపాను సరుకులను కొనుటకు చేసుకొనిన ఖరారులను రద్దు చేసుకున్నారు. చైనా బ్యాంకులు జపాను వారితో సంబంధాలు వదులుకున్నాయి 1931 డిసెంబరు నెలకు చైనాకు జపాను సరుకుల దిగుమతులు నూటికి యెనభై పాళ్ళు పడిపోయాయి.

జపాను సరుకుల బహిష్కారమును జపానుయందు ద్వేషమును అణచవలసిందని చైనాప్రభుత్వమున కొక తాఖీదు పంపుతూ 1932 జనవరి 18 వ తేదీని ట్సింగుటో రేవుపట్టణంలో 600 మంది జపాను నావికులు దిగి మ్యూమింటిపో అను చైనా పత్రికా కార్యాలయమును కొమింటాంగు ప్రభుత్వ భవనమును తగులబెట్టారు.

జనవరి 28 తేదీన అర్థరాత్రివేళ షాంఘేలో చైనావారు నివసించు చాపే పట్టణమును జపాను నౌకాదళాధిపతియగు షియోజావా సేనాని ముట్టడించాడు. కాని అచ్చటనున్న 19 వ పటాలము జపానుసైన్యాలను అడుగడుగునకు ప్రతిఘటించి వర్ణనాతీతమైన శౌర్యమును ప్రదర్శించెను. 29 వ తేదీయంతయు జపానువారు విమానములనుండి బాంబులను వేసి ఆపట్టణమును భస్మీభూతం చేశారు. ఆ బాంబుల మంటలకు ఎరమైన

వారి సంఖ్య అపరిమితం. 30 వ తేదీ మధ్యాహ్నంవరకు అగ్నివర్షం కురిపించుచునే యుండిరి కాని చైనాసైన్యములు చాపేను ఆక్రమించుకొనవివ్వలేదు. అప్పటికి తాత్కాలికపు సంధి జరిగినందున జపానుసైన్యాలు చాపేను వదలిపోయాయి. నానారాజ్య సమితివారి ఆధ్వర్యమున ఫిబ్రవరి 2 వ తేదీన చైనా జపానులకు సంధిప్రయత్నాలు జరిగాయి కాని జపాను కుదరనివ్వలేదు. ఫిబ్రవరి 3 వ తేదీన క్రొత్తసేనలతో జపానువారు చాపే, ఊసంగుకోటలను ముట్టడించారు కాని 19 వ పటాలము మరల జపాను సైన్యాలను అడ్డగించి అత్యద్భుతంగా పోరసాగేయి చైనా యువకులంతా ఉద్రిక్తులై నాన్కింగు ప్రభుత్వపు లొంగుబాటు విధానాన్ని తీవ్రంగా నిరసిస్తూ వెంటనే జపాను సైన్యాలతో పోరాడమని ప్రదర్శనలు చేశారు.

నాన్కింగు ప్రభుత్వంవారు శౌర్యమునకు ప్రసిద్ధిబడసిన 87, 88 నంబరు పటాలాలను కొన్ని ఆకాశవిమానములను చాపేకు సహాయార్థం పంపేరు. జపానుసైన్యాలు 34 దినాలు ఈ ముట్టడిని సాగించాయి. ఈ ముట్టడి మానవజాతి చరిత్రలో ప్రసిద్ధిగాంచిన పోరాటములలో నొకటి చైనాజాతి స్వతంత్రంగా నిలిచియుండుటా లేదా యను సమస్య ఈ యుద్ధంలో తేలవలసియున్నది. చైనాసైన్యాలు అనన్యసాధారణమగు శౌర్యంతో పోరాడాయి. చనిపోయిన చైనాసైనికులస్థానే యువకులు వచ్చి చేరుతూ పోరాటం సాగించారు. జపానువారు కూడా క్రొత్తసైన్యాలను తీసుకుని ముట్టడిసాగించారు కాని 34 దినాల అనంతరం చైనా గోడవలె అచంచలము బలిష్టమూ అయిన చైనావారి దేశభక్తి, త్యాగప్రేరితమైన పోరాటంలో విజయంపొందే ఆశలు సన్నగించగా ముట్టడిని మాని జపానుసైన్యాలు చైనానుండి వెళ్ళిపోయాయి. ఈ విధంగా చైనా స్వాతంత్ర్యం కాపాడబడింది.

1932 ఫిబ్రవరి నెల 18 వ తేదీనాడు మంచూరియాకు జపాను వారు మంచూకో అను పేరు పెట్టి స్వతంత్ర దేశంగా ప్రకటించారు.

ఆ ప్రభుత్వానికి 1911 లో రాజ్యభ్రష్టుడైన హెన్రీపూయిని యావజ్జీవపు అధ్యక్షునిగా నియమించారు. ప్రభుత్వ సలహాదార్లుగాను ఉద్యోగస్థులు గాను జపానువారు నియమింపబడ్డారు. హెన్రీ పూయి వారి చేతిలో కీలు బొమ్మ.

ఫిబ్రవరి 29 నాడు లిట్టన్ కమీషనువారు జపానులో దిగి దీర్ఘ కాలం విచారణలు సల్పి 1932 అక్టోబరు 5 వ తేదీన జినీవా నగరంలో తమ నివేదికను ప్రకటించారు. అందులో మంచూరియాపై చైనా ప్రజా స్వామికమునకే పాలనాధికారం కలదనీ జపానువారు కొత్తగా స్థాపించిన మంచూకో ప్రభుత్వం అశాస్త్రీయమైనదనీ స్పష్టీకరించారు. ఈలోగా జపాను ప్రభుత్వా న్నెదిర్చిన చైనావారిని బందిపోటుగాండ్రని పేరుపెట్టి హత్య గావించుచూ, తిరుగుబాట్లను క్రూరంగా అణచివేస్తూ నిరంకు శంగా మంచూకోను దోచుకున్నారు.

1934 ఫిబ్రవరి నెలలో నానారాజ్యసమితి సమావేశమై లిట్టన్ కమీషను నివేదికను ఏకగ్రీవంగా ఆమోదించింది. మంచూకో ప్రభు త్వము నెవ్వరునూ గుర్తించరాదని తీర్మానించగా జపాను దురాగ్ర హంతో నానారాజ్యసమితి సభ్యత్వమునకు రాజీనామా ఇచ్చింది.

నానారాజ్య సమితినుండి నిష్క్రమించిన జపాను వెంటనే ఫిబ్ర వరి 23 వ తేదీనుండి చైనాదేశంలోని జెహోల్‌రాష్ట్రంపై దండెత్తి బహుకష్టంమీద ప్రతిఘటించిన సైన్యాలను ఓడించాయి. అడుగడుగు నకూ ప్రతిఘటిస్తూ అద్భుత శౌర్య పరాక్రమాలను ప్రదర్శిస్తున్న చైనా సైన్యాలను జపాను సైన్యాలు ముందుకు నెట్టుకు వచ్చుచుండెను. ఏప్రిల్ 22 నాడు ప్రపంచవాసులు దిగ్భ్రమ చెందునట్లుగా చైనాసైన్యాలు జపాను సైన్యాలను వెనుకకు నెట్టాయి. కాని మరల 30 వ తేదీన కొత్త సైన్యా లతో జపానువారు పెకింగు, టీణ్టిసిన్ నగరముల మీదకు దండు వెడ లగా చైనా సైన్యములు మరల వారితో తలపడ్డాయి. చైనా ప్రజలందరూ

చైనా కమ్యూనిస్టులు జపాను వ్యతిరేక యుద్ధాన్ని సాగించమని ప్రభుత్వాన్ని వత్తిడి చేసినప్పటికి ప్రజల్లో విశ్వాసం లేని చియాంగ్‌కైషేక్, వాంగ్‌చింగ్వీలు జపాను ప్రభుత్వంతో 'టాంగుకూ' సంధి చేసుకొని మంచూరియాను జెహోల్‌రాష్ట్రాన్ని కోల్పోయారు.

ఫ్రాన్సు, ఇంగ్లాండు, సామ్రాజ్యవాదుల చేతిలోని కీలుబొమ్మయైన నానారాజ్య సమితి జపాను దురాక్రమణ నెవ్విధంగాను అరికట్టక తీర్మానాలను చేసి ఊరుకుంది.

ఫ్రాన్సు ఇంగ్లాండు జపానులొక జట్టుగచేరి పసిఫిక్ సముద్ర ప్రాంతంలో తమ తమ ప్రత్యేక లాభములకు పలుకుబడి ప్రాంతములలో పరస్పర సహాయం గావించుకుంటూ దుర్బల జాతులను దోపిడి చేయుటలో భాగస్వాము లయ్యారు.

చైనాగోడకును పెకింగునగరమునకును మధ్యనున్న ప్రదేశము నుండి చైనాసైన్యాలు తీసివేయబడినవి. మంచూకో, జెహోల్ రాష్ట్రాలలో జపానుపాలన స్థిరపడింది. 1934 మార్చి 1 వ తేదీన జపాను ప్రభుత్వం హెన్రీపూయిని కాంగ్‌టే చక్రవర్తి అను బిరుదుతో పట్టాభిషేకం చేశారు. ఆయనకు సాలుకు 57 లక్షల రూపాయల భత్యము నిచ్చుచున్నారు. పరిపాలన, సంరక్షణలను జపానుసైన్యాలు, పోలీసులే చేయుచున్నారు. ఆ ప్రాంతంలోని కలప లోహములు బొగ్గు జపానువారి వశమయ్యాయి. ప్రత్తి పండింపబడుతోంది. అచ్చటి వర్తకమంతా జపాను పారిశ్రామికుల హస్తగతమైంది. ప్రజలపై ఆయుధశాసనం అమలు జరుపబడింది. ఈ విధంగా మూడుకోట్ల చైనాప్రజలు నివశించే మిగుల ఫలవంతమైన మంచూకో జపాను పారిశ్రామికులకు దోపిడీభూమియైనది.

# 20 వ అధ్యాయం.

## ఐదవ కమ్యూనిస్టు నిర్మూలన యుద్ధం.

1931 సెప్టెంబరు 18 వ తేదీనాడు జపాను సామ్రాజ్యవాదులు మంచూరియాపై దురాక్రమణకు పూనుకొని మంచూరియాను అనతి కాలంలో కబళించి షాంఘై మున్నగు పట్టణాలపైకూడా దండెత్తడం, నాన్కింగు జాతీయ ప్రభుత్వం తీవ్రంగా ప్రతిఘటించకపోవడం చూసి, చైనా సోవియట్ కేంద్రప్రభుత్వంవారు 1932 ఏప్రిల్ 26 వ తేదీనాడు జపానుపై ఒక దీర్ఘమైన యుద్ధప్రకటన చేశారు. షాంఘైలో జపాను దురాక్రమణ పరులతో వీరోచితంగా యుద్ధం చేస్తున్న 19 వ సైన్యాన్ని ప్రజాస్వచ్ఛంద సేవకులను దేశవ్యాపితమైన జపాను వ్యతిరేక ప్రదర్శనలను సామ్రాజ్య వ్యతిరేక ఆందోళనను పూర్తిగా అణచి చియాంగ్‌కై షేక్ దేశద్రోహం చేస్తున్నాడని స్పష్టీకరించారు. అమెరికా, బ్రిటిషు, ఫ్రెంచి, జపాను సామ్రాజ్యవాదులకు అమ్ముడుపోయిన చియాంగుకై షేక్ ప్రభుత్వాన్ని కూలద్రోసిననాడే చైనాజాతి స్వాతంత్ర్యం పొందగల్గుతుం దనీ యీ చారిత్రాత్మక కర్తవ్యాన్ని నెరవేర్చేందుకు చైనాప్రజలందరూ చైనా కమ్యూనిస్టులకు సహాయపడవలసిందని వ్రాశారు. అటుతర్వాత 1933 మే దినోత్సవం నాడు (మే 1 వ తేదీనాడు) చైనా సోవియట్ ప్రభుత్వంవారు మరల యీ దిగువ షరతులపై తాము చియాంగు ప్రభుత్వంతోగాని మరెవ్వరితోనైనాగాని జపాను వ్యతిరేకయుద్ధంలో కలసి పాల్గొనుటకు సిద్ధంగా నున్నామని ప్రకటించారు. "మేము చైనా శ్రామిక వర్గపు హక్కుల రక్షణ కొరకు, చైనా స్వాతంత్ర్యానికీ, అవిచ్ఛిన్నతకూ సమగ్రతకూ పోరాడుతున్నాం. చైనా ప్రజల నేటి తక్షణ కర్తవ్యం జపానుతోనూ, తదితర సామ్రాజ్యవాదులతోనూ పోరాడడం. ఈ కార్య క్రమాన్ని ప్రతిఘటించి ఆటంకములు కల్గించేవారిని తుడిచి పారవేస్తాం.

ఎర్రసైన్యం జపాను వ్యతిరేక యుద్ధాన్ని కొనసాగించేందుకు ఏ సైన్యాలతో సైనాసరే ఈ దిగువ షరతులపై ఒడంబడికలు చేసుకుంటాము.

1. సోవియట్ జిల్లాలపై యుద్ధాన్ని విరమించాలి.

2. వాక్, సభా, పత్రికా, ప్రదర్శన, నిర్మాణ స్వాతంత్ర్యములు మున్నగు ప్రజాతంత్ర హక్కుల నివ్వాలి

3. ప్రజలను సాయుధులను చెయ్యాలి. చైనా ఐకమత్యాన్ని, సమగ్రతను రక్షించేందుకుగాను ప్రజాఘటుల దళాలను వెంటనే నిర్మించాలి."

కాని చియాంగ్ ప్రభుత్వం యీ ప్రకటనలను పెడచెవిని పెట్టింది. తమ వ్యక్తిగత ప్రాబల్యానికి జపాను దురాక్రమణకంటెకూడ కమ్యూనిస్టులే హెచ్చు ప్రమాదకరమని భావించిన చియాంగ్ కమ్యూనిస్టులపై సాగించిన నాల్గు యుద్ధాలలో కలిగిన ఓటమికి మరీ భయపడి ఐదవ యుద్ధానికి జర్మన్ యుద్ధతంత్రజ్ఞుడైన వాన్‌సీక్ట్ పర్యవేక్షణలో అట్టహాసంగా భారీప్రమాణంలో సన్నాహాలు చేశాడు. కమ్యూనిస్టు వ్యతిరేక చట్టాలను అతి నిర్దాక్షిణ్యంగా అమలు జరుపుతూ, కమ్యూనిస్టుల పలుకుబడిలోనున్న గ్రామాలకు గ్రామాలనే తగులబెట్టించాడు. 1932 జూలై 17 వ తేదీనాడు ఎర్రసైనికుల కీ క్రింది ప్రకటన చేశాడు :

1. "ఎర్రసైన్యాలను వదలివేసి కొమింటాంగు సైన్యంలో జేరిన ప్రతివారికీ బహుమతు లివ్వబడతాయి. రైఫిలుతో వచ్చినవారికి 20 డాలర్లు, మరతుపాకితో వచ్చినవారికి 300 డాలర్లు, ఆయుధాలు లేకుండా వచ్చినవారికి 5 డాలర్లు.

2. "ఎర్రసేనా నాయకుని చంపి వచ్చినవారికి 500 డాలర్లు, ఒక డివిజన్ కమాండరునుగాని, బ్రిగేడియర్‌నుగాని చంపి వచ్చిన ఎర్ర సైనికునకు 5000 డాలర్లు, ఒక పటాలపు సేనానాయకుని చంపిన

వానికి 300 డాలర్లు, ఒక సైనిక శాసన సభ్యుని చంపినవానికి 3000 డాలర్ల బహూమానం.

3. "ఎర్రసైనిక సర్వసేనాధ్యక్షుణ్ణి బంధించి తీసుకువస్తే 30000 డాలర్లు. సేనానాయకులను గాని రాజకీయ ప్రతినిధులను గాని బంధితులనిగా తీసుకునివస్తే 10000 డాలర్లు."

4. "కమ్యూనిస్టుల గుట్టుమట్టులు చెప్పేవారిని, కమ్యూనిస్టు సైన్యాలను వదలివేసి ఆయుధాలను తెచ్చేవారిని పశ్చాత్తప్తులను మా సైన్యాలలోనికి ఆహ్వానిస్తున్నాము. మా కమ్యూనిస్టు వ్యతిరేక యుద్ధంలో తోడ్పడినవారు బహూకరింపబడతారు."

కమ్యూనిస్టు నిర్మూలన యుద్ధం దిగ్విజయమగుటకుగాను రాజకీయ ఆర్థికరంగాల్లో కూడ పునరుద్ధరణ కార్యక్రమం ప్రకటింపనిచో ప్రజలు కమ్యూనిస్టుల ననుసరిస్తారని వాంగ్‌చింగ్వే, చియాంగ్‌లు ఈ దిగువ ప్రకటనచేశారు.

"కమ్యూనిస్టుల పాలననుండి విముక్తంచేయబడిన జిల్లాలు మిలిటరీ పరిపాలనలో వుంటాయి. కొమింటాంగు ప్రభుత్వ మేజస్ట్రేటు శరణార్థులను వారి స్వస్థలములకు జేర్చేందుకు సదుపాయాలను గలిగిస్తాడు. శరణాగతులయొక్క సత్ప్రవర్తనకు పెద్దమనుష్యులు పూచీ పడాలి. కమ్యూనిస్టు లెక్కడైనా రహస్యంగా దాక్కుంటే ఆ సమాచారాన్ని రహస్యంగా కొమింటాంగు ఉద్యోగస్థులకు తెల్పాలి."

జిల్లా, తాలూకా, గ్రామ పునర్నిర్మాణసంఘాలు కమ్యూనిస్టులచే భూపునర్విభజన కార్యక్రమం అమలుజరుపబడిన ప్రాంతాల్లో నెలకొల్పబడ్డాయి, భూస్వామ్య హక్కులను తిరిగి భూస్వాములకు కల్గించి జప్తు చేయబడిన భూములను వారి వశంచేయుటే ఈ సంఘాల ప్రధానకర్తవ్యం.

## సంఘ నిర్మాణం.

జిల్లాసంఘంలో తాలూకా, గ్రామ సంఘాలనుండి యెన్నుకొనబడిన సభ్యులుంటారు. మేజస్ట్రేటు దానికి అధ్యక్షుడు. "పో" (అనగా

వెయ్యికుటుంబాల కూటమి) నాయకుడు గ్రామ సంఘాధ్యక్షుడు. ఆ సంఘంలో పదిమంది "చియా" (అనగా నూరుకుటుంబాల కూటమి) పెద్దలు సభ్యులుగా నియమింపబడతారు.

## విధులు.

ఈ సంఘాలు పంటభూమిని పంపకం చేస్తాయి. కౌలుదారు భూస్వామి కీయవలసిన కట్టుబడిని కూడా వీరే నిర్ణయిస్తారు. భూస్వామి ఎవరో తేలని భూములపై ఆదాయాన్ని ఈ సంఘాలే వసూలు చేసుకుని తమకు తోచినరీతిగా వినియోగిస్తాయి.

కమ్యూనిస్టులచే భూపంపకం జరిగిన ప్రాంతాల్లో ఈ క్రిందివిధానం అమలుజరుపబడుతుంది.

1. కమ్యూనిస్టు దోపిడిగాండ్రచే చేయబడిన భూవిభజనకు పూర్వమున్న అసలు భూస్వామికి సాగుబడిభూమి తిరిగి యివ్వబడుతుంది.

అసలు భూస్వామియొక్క భూస్వామిక హక్కు స్థిరపడితే ఆ భూమి అతనికే యివ్వబడుతుంది.

2. పట్టాదారు రైతుగాని (Proprietor-former) కౌలుదారుగాని తిరిగి రానిచోట్ల కమ్యూనిస్టుల పంపక విధానంలో భూమిని పొందిన రైతుకే ఆ భూమి లభ్యమవుతుంది.

3. పట్టాదారు రైతుగాని, కౌలుదారుగాని, క్రొత్తగా భూమిని పొందిన రైతుగాని ఎవరో నిర్ధారణగా తేలని పరిస్థితుల్లో ఆభూమిని సంఘమే పంచి యిస్తుంది.

4. రైతుల కుటుంబాలలోని సభ్యుల సంఖ్యనుబట్టి వారికి రావలసిన భూమికంటె హెచ్చుగావచ్చిన భూమిని పట్టాదారు-రైతులనుండి తీసుకొని భూముల్లేనివారికి పంచాలి.

5. భూముల నీయడంలో రైతు నివసించే స్థలానికి భూమికి వున్న చోటునకు ఉన్నదూరం లెక్కలోనికి తీసుకోవాలి."

రాజకీయంగా కమ్యూనిస్టు భావ ప్రచారాన్ని అరికట్టేందుకు చియాంగ్, వాంగ్, సన్‌ఫోలు యీ క్రింది కార్యక్రమా న్ననుసరించారు:

1. 'పోచియా' అను ఒక నూతనమైన పోలీసు గూఢచారి విధానాన్ని అమలు పరిచారు. గ్రామాల్లోని ఏ ఒక్కరైనా కమ్యూనిస్టుగా మారితే ఆ గ్రామంలోని ప్రజలందరూ సమిష్టిగా బాధ్యత వహిస్తూ శిక్ష ననుభవించాలి. అందువలన గ్రామస్థులందరూ ఒకరిపై నొకరు సతతమూ అనుమాన దృష్టి కలిగి ఆరాకీ తీస్తూ ప్రభుత్వ గూఢ చారులుగా పని చేయాలి.

కమ్యూనిస్టుల నణచుటకు ఇట్టి చట్టాలను చేసి కొమింటాంగు పాలనలోనున్న చైనాలో నిర్దాక్షిణ్యంగా అమలు జరపడమేగాక 1933 మే 31 వ తేదీనాడు చియాంగ్ జపాను సామ్రాజ్యవాదులకు దాసోహం చేసి 'టాంగ్‌కూ' సంధి చేసుకుని వెంటనే కమ్యూనిస్టు ప్రభుత్వంపై పంచమ పోరాట సన్నాహాలు చేయజొచ్చాడు. అమెరికన్ ప్రభుత్వమిచ్చిన 50 కోట్ల అమెరికను డాలర్ల 'గోధుమ, ప్రత్తి ఋణాన్ని' దేశాభ్యుదయ దాయకమైన ఆర్థిక పథకాలకొరకుపయోగించక దండయాత్రకగు ఖర్చులకుగాను వినియోగించాడు. చియాంగ్‌యొక్క బావమరదియైన టి. వి. సూంగ్ యీ ఋణాన్ని యీ విధంగా ఉపయోగించ కూడదని నిరసనతెల్పి తన ఆర్థికమంత్రిపదవికి రాజీనామా నివ్వగా చియాంగ్ యొక్క మరియొక బావమరదియైన డాక్టర్ హెచ్. హెచ్. కంగ్ ఆ పదవిని స్వీకరించాడు. ఆర్థిక రాజకీయ సంస్కరణల నన్నిటినీ వాయిదా వేసినప్పటికీ యీ గొప్ప ఋణమొత్తం కూడా ఆయన పైనిక ఖర్చులకు సరిపోలేదు. చియాంగ్ సర్వసేనాధ్యక్షుడు స్వయంగా యీదండయాత్రను నడుపుతాడనీ కమ్యూనిస్టులను సర్వనాశనం చేయకుండా ప్రాణాలతో తిరిగి రాడనీ ప్రభుత్వ పత్రికలన్నీ అట్టహాసంగా ప్రకటించాయి. తొమ్మిది లక్షల సైన్యాన్ని చియాంగ్ సన్నద్ధపరచాడు. అందులో నాల్గు లక్షల

సైనికులు కియాంగ్సీ-ఫూకీన్ సోవియట్లపైనా అన్వే-హోనాజా-హూపే ప్రాంతాల్లోని సోవియట్లపైనా ప్రయోగింపబడ్డారు.

కియాంగ్సీ రాష్ట్రంలో అత్యధిక భాగమును, ఫూకీజా, హూనాన్ రాష్ట్రాలలో చాల ప్రాంతాలును సోవియట్ల అధికారమునకు లోబడి వున్నాయి. ఇవే కాకుండా హూనాన్, హూపే, హోనాన్, అన్‌హ్వే, జెక్‌వాన్, షెన్సీరాష్ట్రాల్లో కూడా చిన్న చిన్న సోవియట్లు వెలిశాయి. వీటిలో ముఖ్యంగా కియాంగ్సీ, ఫూకీజాలలో కేంద్రసోవియట్ ప్రాంతాల చుట్టూ వాన్‌సీక్టు సలహా ప్రకారంగా వందలకొలదిమైళ్ళ సైనిక రోడ్లను మరఫిరంగులకు వేలకొలది సిమెంటు స్థావరాలను నిర్మించి, చియాంగ్ సైన్యాలతో దిగ్బంధం చేసివేశాడు. చియాంగుకు సామ్రాజ్యవాద దేశాల మద్దతు, సహాయం సంపూర్ణంగా లభించింది. ఆయుధ మందుగుండు సామగ్రులను సాయుధ శకటాలను, 400 యుద్ధవిమానములను చియాంగ్ యీ యుద్ధంలో వినియోగించాడు. ఆయన "దాడి-రక్షణ" అను యుద్ధ తంత్రాన్ని అమలు జరుపుతూ ఆర్థిక దిగ్బంధాన్ని అతి కట్టుదిట్టంగా ఉపయోగించాడు. సోవియట్లచుట్టూ ఉరిత్రాళ్ళను చుట్టి గట్టిగా బిగింప నారంభించాడు. వెనుకటి యుద్ధాలలోవలె సాహసోపేతమైన దాడులను జరుపుట మానివేసి జాగ్రత్తగా చియాంగ్‌సైన్యాలు చుట్టుముట్టుతున్నాయి.

1,80,000 మంది మాత్రమే ఎర్రసైనికులున్నారు. వీరికి తోడుగా 2 లక్షలమంది రైతు,కూలీ గెరిల్లా లున్నారు. వారికి ఒక లక్ష లోపుగా మాత్రమే రైఫిళ్ళున్నాయి. మరఫిరంగులు లేనేలేవు. కొద్దిగా చేతి బాంబులు, మందుగుండు సామగ్రి, ఎర్రరాజధానియైన జూయికిన్‌లోని మందుగుండు ఫాక్టరీలో తయారౌతున్నాయి. కొమింటాంగు సేనలచే చేయబడిన ఆర్థిక దిగ్బంధన వలన సోవియట్ ప్రజలకు ఉప్పుమున్నగు పదార్థాల కరువు యేర్పడింది.

ఈ ఐదవయుద్ధాన్ని చియాంగ్ బహు జాగ్రత్తగా నడిపాడు. వల వలె కట్టబడిన సైనికస్థావరాలనుండి దూరంగా సైనికపటాలాలు మర

ఫిరంగులు లేకుండా సోవియట్ జిల్లాలలోనికి చొరచుకు పోరాదని కట్టు దిట్టం చేశాడు. టాంకులు, సాయుధశకటాలు, మరఫిరంగులతో కుత్తు కలవరకూ ఆయుధాలను ధరించిన సైన్యాలు మాత్రమే ఎర్రజిల్లాలలోనికి దండువెడలేవి. ఈ విధంగా 1933 అక్టోబరులో ప్రారంభమైన ఐదవ యుద్ధం చాల నెమ్మదిగా జరిగింది.

## ఫూకీన్ తిరుగుబాటు.

ఐదవ యుద్ధం ప్రారంభమైన ఒక నెలలోపుగానే షాంఘైలో జపాను సైన్యాలను ప్రతిఘటించిన వీర 19 వ సైన్యం చియాంగ్ ప్రభుత్వం జపాను ప్రతిఘటనకు తోడ్పడక దేశద్రోహం చేస్తున్నందున ఫూకీన్‌లో 1933 వ సంవత్సరం నవంబరు మాసంలో చియాంగు సైన్యాలపై తిరుగుబాటు చేశారు. జనరల్ చేటింగ్‌కే ఆధిపత్యాన 1932 మే మాసంనుంచి ఎర్రసైన్యాలతో పోరాడుచున్న 19 వ సైన్యం యుద్ధం విరమించి "తటస్థసంధి" చేసుకున్నారనే వదంతులు వ్యాపించాయి. జనరల్ చేటింగ్‌కే ఫూకిన్ రాష్ట్రంలో స్వతంత్రం ప్రకటించి తాత్కాలిక ప్రభుత్వాన్ని స్థాపించాడు. ఈ పరిస్థితులు ఎర్రసైన్యాలకు చాలా అనుకూలించాయి. ఫూకీన్‌రాష్ట్ర సముద్రతీరంనుంచి సోవియట్ ప్రభుత్వం వారికి కావలసిన ఉప్పు మున్నగు ముఖ్యవస్తువులను తెప్పించుకున్నారు.

చియాంగ్‌కేషేక్ కొన్ని సైన్యాలను ఫూకీన్ తిరుగుబాటుదార్ల పైకి పంపాడు. రెండుమాసాల్లో 1934 జనవరినాటికి ఈ ఫూకీన్ ప్రభుత్వం కూలద్రోయబడింది. రాజధానీనగరమైన ఫూచౌను జనవరి 13 వ తేదీనాటికి నాన్కింగు ప్రభుత్వ నావికాసైన్యం పట్టుకుంది. 19 వ సైన్యం దక్షిణాభిముఖంగా తిరోగమనం చేసింది. ఈ తిరుగుబాటు నాయకులతో రాజీబేరాలు సాగించి చియాంగ్ సైన్యాలను పునర్నిర్మించాడు. ఈ తిరుగుబాటును అణచినతర్వాత జనరల్ వాన్‌సీక్షు యుద్ధ

వ్యూహం ప్రకారం అమెరికను విమానాలతోను, ఇంగ్లీషు టాంకులు, సాయుధ శకటాలతోను యుద్ధం కొనసాగించాడు.

## ద్వితీయసోవియట్ కాంగ్రెసు సమావేశం.

ఫూకీన్ తిరుగుబాటు నణచిన చియాంగ్ తన అపారమైన సైనిక శక్తి నంతటినీ సోవియట్లను నాశనమొనర్చుటకు కేంద్రీకరించిన విప త్కరవినాశన పరిస్థితుల మధ్య సోవియట్ కేంద్రప్రభుత్వం వారి సహా యమున ద్వితీయసోవియట్ కాంగ్రెసుసమావేశం ఎర్రరాజధానియైన జూయికిన్ నగరంలో 1934 జనవరి 22 తేదీనాడు జరిగింది. ఆ సమా వేశంలో చైనాసోవియట్ ప్రజాస్వామికం తరపున ఒకదీర్ఘమైన నివేది కను మోసీతుంగ్ చదివాడు. గత రెండుసంవత్సరాల్లో చైనాలోను ఇతరదేశాల్లోను విప్లవశక్తులయొక్క పురోవృద్ధి; సోవియట్ ప్రజా స్వామిక స్థాపనానంతరం సోవియట్ ఉద్యమంలో కల్గినమార్పులు, అనుభ వాలు; ఎర్రసైనికనిర్మాణం, పెరుగుదల; సోవియట్ రాజ్యవిస్తరణ; వ్యవసాయిక విప్లవాన్ని తీవ్రతరం చేయడం; శ్రామికుల జీవన పరిస్థి తుల నభివృద్ధిపరచడం; స్త్రీల విముక్తి, సమాన ప్రతిపత్తిహక్కులు; ప్రజల సాంస్కృతిక ప్రమాణాన్ని హెచ్చించడం మున్నగు విషయాలను గూర్చి సవిస్తరంగా సమీక్షచేసి నూతన సంవత్సరానికి కార్యక్రమాన్ని వేసుకున్నారు.

## సూహేయంగ్ అన్‌హ్వే - హూపే - హోనాన్ సోవియట్.

చియాంగ్‌కేషేక్ ఐదవ కమ్యూనిస్టు నిర్మూలన యుద్ధతంత్రాన్ని అన్‌హ్వే - హూపే - హోనాన్ సరిహద్దుప్రాంత సోవియట్‌పై కూడా సాగించాడు. చూ, మోల ఆధిపత్యంలో వున్న కేంద్రసోవియట్ ప్రాంతం తర్వాత విస్తీర్ణంలోనూ, ప్రాముఖ్యతలోనూ యీ సోవియట్ ప్రభుత్వమే

ఉన్నత స్థాన మలంకరిస్తుంది. ఈ సోవియట్ నిర్మాత సూహేయంగ్. హోలుంగ్, సూహేయంగు లిద్దరు మాత్రమే 1933 నాటికి సోవియట్ ముఖ్యసేనానుల్లో కార్మికవర్గంలో పుట్టినవారు. ఆయన చైనా ఎర్రసేనాను లందరికంటె తీవ్రవర్గ దృక్పధం కలవాడు. చైనా శ్రామికు లందరూ సుగుణ పుంజాలనీ, చైనా ధనికవర్గమంతా సర్వ దుర్గుణ నిలయమనీ ఆయన గాఢవిశ్వాసం.

## సూహేయంగ్ జీవిత విశేషాలు.

సూహేయంగ్ హాంకోవద్ద హ్వాంగ్‌పిలో 1900 లో జన్మించాడు. ఆయన తల్లిదండ్రులు కుమ్మరివృత్తి చేశేవారు. వారు నిరక్షరాస్యులూ, నిర్ధనులూ అయినా, వారి కదనారి కొడుకూ, చురుకైనవాడూ అయిన సూను అతి కష్టంమీద చదివింప జొచ్చారు. ఆయన తోడి విద్యార్థు లందరూ ధనిక శ్రేణికి జెందినవారే. పంచిబట్టలు లేని, చెప్పులు తొడు క్కోని యీ పేద బాలకుని శ్రీమంతులైన మిగిలిన విద్యార్థులు పరిహసించేవారు. వారు తగవు లాడుకుంటే తప్పెవరిదైనా ఉపాధ్యా యులు సూనే శిక్షించేవారు.

పదకొండవయేట ఒకరోజున సూహేయంగు మిగిలిన ధనిక బాలకులతో తీవ్రంగా దెబ్బలాడి ఒక కుర్రవాని బుర్రపై రక్తం చిందేట్లు కొట్టాడు. ఆ కుర్రవాని తలిదండ్రులు వచ్చి తాహతునీ, జన్మనీ మరచిన సూను మెత్తగా కొట్టారు. ఉపాధ్యాయుడు కూడ గట్టిగా మర్దించాడు. ఆనాటితో సూ విద్యాభ్యాసానికి స్వస్తి చెప్పాడు.

సూ పదకొండేండ్ల లేతవయస్సులో ఒక పింగాణీ యంత్రాగా రంలో జీతభత్యాలు లేకుండా పనినేర్చుకునేందుకు చేరాడు. అతని 16 వ ఏట ఆ కర్మాగారంలోని 300 మంది కార్మికులలోను అతనికే హెచ్చు జీతం.

21 ఏండ్ల ప్రాయంలో ఆయన ఇంటిని వదలి హాంకోకు నడిచి వెళ్ళి ఒక సంవత్సరం కుమ్మరిపని చేసుకుంటూ కాలం గడిపినతర్వాత నెలకు 10 డాలర్ల జీతంపై సైన్యంలో జేరాడు. ఈలోగా దక్షిణచైనాలో విప్లవం ప్రారంభమైంది కమ్యూనిస్టులు ఆయన పనిచేసే సైనికప్రభువుల సైన్యంలో రహస్య ప్రచారం సాగించేవారు వారిలో చాలమంది ఉరితీయబడేవారు. ఆ సైన్యంతో సరిపడక ఆయన కాంటన్ పారిపోయి చాంగ్‌ఫాక్వీ సైన్యాల్లో చేరాడు. 1927 నాటికి ఒకపటాలానికి కమాండరు అయ్యాడు.

1927 వేసంగిలో అతివాద మితవాద పక్షాల భావసంఘర్షణ చాంగ్‌ఫాక్వీ సైన్యాల్లో తీవ్రతరమైంది. ఈకాలంలో కమ్యూనిస్టు విద్యార్థి ప్రచారకుల ప్రభావం వలన హూహేయంగ్ కమ్యూనిస్టుగామారి సైన్యం వదలివేసి, హ్వాంగ్‌పీకి పారిపోయి, కమ్యూనిస్టుపార్టీ ప్రాంతీయశాఖను నిర్మింపసాగాడు.

1927 ఏప్రిల్‌లో చియాంగ్‌కేషేక్ కమ్యూనిస్టులను అణచుట ప్రారంభించగానే కమ్యూనిస్టులు రహస్యజీవితాన్ని గడపజొచ్చారు కాని, హూహేయంగ్ సోవియట్లను నిర్మించేందుకు తరుణమాసన్నమైనదని స్వతంత్రించి నిశ్చయానికి వచ్చాడు. తోడనే పింగాణీ ఫాక్టరీ కార్మికులను, రైతులను జేర్చి హూపేరాష్ట్రంలో "ప్రధమ కూలీ రైతుదళాలను" నిర్మించాడు. ముందు 17 గురితోను, ఒకరివాల్వరు, 8 తోటాలతోను ప్రారంభమైన ఆ దళం 1933 నాటికి 60,000 సైనికులుగల అజేయమైన నాలుగవసైన్యంగా మారింది. ఆ నాటికి ఐర్లండు వైశాల్య మంత భూభాగం ఈ సోవియట్ ప్రభుత్వానికి లోబడివుంది. ఆ సోవియట్ రాజ్యంలో ప్రత్యేక తపాలా, టంకశాల, సహకార పరపతిశాఖలు పని చేస్తున్నాయి, బట్టలమిల్లులు మున్నగు పరిశ్రమలుకూడా వృద్ధిపొందాయి. ఆర్థికనిర్మాణం శోష్టవంగావుంది. ఎన్నికలవిధానం శాసనవిర్మాణ, కార్య

నిర్వాహకశాఖలు చాలా సంతృప్తికరంగా పనిచేస్తున్నాయి. పాలితుల్లో సంతృప్తికలిగి, సోవియట్ భక్తి హెచ్చింది. ఈ సోవియట్ ప్రభుత్వానికి చాంగ్‌క్వోటో అధ్యక్షుడుగాను, ఎర్రసైన్యానికి వాంపో సైనికకళాశాల పట్టభద్రుడైన సూసియాంగ్ ప్రధానసేనానాయకుడుగాను వ్యవహరించేవారు.

## సూసీయాంగ్‌చీన్ జీవిత విశేషాలు.

షన్సీ సమీపంలోనున్న వుసైషాన్‌లో 1902 లో సూసీయాంగ్ చేకా పండిత కుటుంబంలో జన్మించాడు. గౌరవ మర్యాదలకు భుక్తికి లోటులేని భూస్వాముల కుటుంబం వారిది. విద్యాభ్యాసం పూర్తియైన తర్వాత ఒక పుస్తకాల కొట్టులో గుమాస్తాగా పని చేశాడు. కళాశాల విద్య ముగించుకుని పట్టభద్రుడై కొంతకాలం ఉపాధ్యాయ వృత్తి నవలంబించి ఆటు తర్వాత వాంపో మిలిటరీ అకాడమీలో చేరాడు. అప్పటి చియాంగ్ ప్రభుత్వ సేనానుల్లో ప్రధానులైన హూచుంగ్‌నాన్ మొదలైన వారు ఆయన సహాధ్యాయులు. వాంపో కళాశాలలో ఆయన సోవియట్ రష్యన్ అధ్యాపకులైన బొరోడిన్, కార్లోఫ్‌ల ఉపన్యాసాలవలన ఆకర్షింపబడ్డాడు.

వాంపో కళాశాలను వదలిన తర్వాత ఉత్తర చైనాలోని సైనిక ప్రభువులగు చాంగ్‌సోలిన్- యెన్‌సీషాన్‌లతో పోరాడి 1926 లో వూహాన్ ప్రభుత్వ సైనిక కళాశాలలో అధ్యాపకుడుగా పని చేశాడు. ఈ కాలంలోనే ఆయన కమ్యూనిస్టుపార్టీలో సభ్యుడుగాచేరాడు. 1927లో కమ్యూనిస్టు కొమింటాంగు ఐక్యతా విచ్ఛేదం తర్వాత చాంగ్‌ఫాక్వీ యొక్క 'ఉక్కుటోపీల' సైన్యంలో రహస్య ప్రచారం చేస్తూ కాంటన్ కమ్యూన్‌లో ఒక కార్మిక దళంలో పాల్గొన్నాడు. అక్కడ ఓడిపోయిన తర్వాత హైలోఫెంగ్ సోవియట్ రక్షణ పోరాటంలో పాల్గొన్నాడు.

కాని ఆ ప్రథమ సోవియట్ కూడా కొద్దివారాల ఘోర పోరాటానంతరం నామమాత్రమైంది. ఆయన తప్పించుకుని కొత్తగా రూపొందుతున్న ఓయువాన్ సోవియట్‌కు 1929 జూన్‌లో వెళ్ళాడు. ఈసోవియట్ రాజ్యం చైనాలోకెల్ల భీకరమైన వర్గ పోరాటానికి రంగస్థలమైంది.

సూచియాంగ్‌చీన్ ఓయువాన్ ప్రాంతంలో కాలిడినప్పుడు 200 రైతుగెరిల్లాలతో కూడిన ఒక సైనికదళము 32 వ సైన్యం అని పిలువ బడుతూ వుండేది. హూపేరాష్ట్రంలో హ్వాంగాన్, మాసెణ అను రెండు తాలూకాలుమాత్రం వారికి లోబడివుండేవి 1929 లో హోనాణ రాష్ట్రంలో కూడా సోవియట్ తిరుగుబాట్లుజరిగి హూపే, హోనాన్ సరిహద్దుజిల్లా సోవియట్ ప్రభుత్వము 1930 నాటికి హూపే - హోనాన్ - అన్‌హ్వీ సరిహద్దు సోవియట్‌గా విస్తరించింది. సూసియాంగ్‌చీణ ఉపసర్వసేనా నిగా సైన్యాలను నడుపుతూ ఆ ప్రాంతీయ జమీందారు గూండాసైన్యాలైన మింటువాన్‌తో ఎడతెరిపిలేకుండా పోరాటం సాగిస్తుండగా చియాంగ్ కేంద్ర సోవియట్లపై సలిపినరీతిగానే నాలుగు కమ్యూనిస్టు నిర్మూలన యుద్ధాల్ని సాగించాడు. ఆ యుద్ధాలలో కొమింటాంగు సేనాధిపతులైన సియాటోయిన్, హోచీన్ ప్రభృతులు కమ్యూనిస్టు సానుభూతి పరులున్నారని అనుమానించిన గ్రామాలన్నిటినీ విధ్వంసంచేశి ప్రజలను చిత్రహింసలపాలుజేసారు. కమ్యూనిస్టులందరూ కొండలకు పారిపోయి దాగుకొనేవారు. చియాంగ్ ప్రభుత్వంయొక్క దారుణహింసాకాండ హెచ్చినకొద్దీ ప్రజల్లో కమ్యూనిస్టు ఉద్యమంపై సానుభూతి హెచ్చి 1930 నాటికి విరివిగా రైతు కూలీలు సోవియట్ సైన్యాల్లో జేశారు. ఎర్ర సైన్యాలు మరఫిరంగులను తుపాకులను పట్టుకున్నారు. టెలిఫోనులు, రేడియోలు కూడా వారికి ప్రభుత్వ సైన్యాలనుండి లభించాయి. 1930 నాటికి ఎర్రసైన్యంలో 6000 మంది సైనికులున్నారు. వారి ప్రభుత్వ పాలనలో 10 లక్షల ప్రజలుండేవారు. ఆ ఎర్రసైన్యానికి నాల్గవ ఎర్రసైన్యమని పేరు పెట్టబడింది.

1931 లో జరిగిన రెండుమూడు యుద్ధాలలో నాలుగవ ఎర్ర సైన్యానికి అఖండవిజయాలు, యుద్ధసామగ్రులు లభించాయి. వారి రాజ్యంకూడా బాగా విస్తరించింది 20 లక్షల ప్రజలు ఆ సోవియట్ పాలనలో నివసించేవారు. కాని నాల్గవయుద్ధంలో మాత్రం ఎర్రసైన్యాలకు తేలికగా విజయాలు లభించలేదు. అందువలన మిగుల జనసమ్మర్దయుక్తల జెక్వాన్ రాష్ట్రంలో వేరొక సోవియట్‌ను స్థాపించేందుకు సోవియట్ సమావేశంలో నిర్ణయించి సూసియాంగ్ నాయకత్వాన ఎర్రసైన్యాలను పంపారు. ఓయువాన్ సోవియట్ మాత్రం సూహెయుంగ్ రక్షణలో వుంది.

సూసియాంగ్ హోపే, హోనాన్, షెన్సీ రాష్ట్రాలనుదాటి 1932 డిసెంబరులో జెక్వాన్ రాష్ట్రానికి వచ్చాడు ఆ రాష్ట్రంలో పాలకవర్గం యొక్క పీడనను సహించలేని ప్రజాసామాన్యం వీరికి అఖండ స్వాగత మిచ్చింది. త్వరలోనే వారు టుంగ్‌చియాంగు, నాన్చియాంగ్. పామా లను ఆక్రమించుకున్నారు. వారి సైన్యాలు బాగా అభివృద్ధి చెందాయి జెక్వాన్ ప్రభుత్వ సైన్యాలలోని 20 దళాలను 1933 మే 11 వ తేదీనాడు వారు నాశనం చేశారు. ఆ రాష్ట్రంలో స్థాపింపబడిన సోవియటులో 10 లక్షల ప్రజలు నివసించేవారు. వారినుండి ఎన్నుకొనబడిన 3000 మంది ప్రతినిధుల సమావేశంలో సోవియటు కాంగ్రెసు సమావేశం జరిగింది. యాంగ్‌పేంగ్, లియూచెంగ్‌హూ సేనానులను ఓడించిన తర్వాత 14 జిల్లాలకు సోవియటు విస్తరించింది త్వరలోనే చాంగ్‌క్వోటో యొక్క రాజకీయ నాయకత్వంక్రింద జెక్వాన్-షెన్సీ సోవియటు స్థాపించబడింది. వారిఎర్రసైన్యంలో 60 వేలమంది సైనికులు 170 రెజిమెంట్లలో వున్నారు. వీరిని నాశనం చేసేందుకు ఆ రాష్ట్రాల్లోని సైనిక ప్రభువులందరూ జేరి దండెత్తిరాగా పది నెలలపాటు యుద్ధం జరిగినతర్వాత ఎర్రసైన్యాలు వారిని ఓడించాయి. ఈ యుద్ధంలో చియాంగ్ ప్రభుత్వ సైన్యాలలో ఒక

లక్షమంది హతులయ్యారు. ఈ సమయంలోనే చియాంగ్ సాగించిన ఐదవ నిర్మూలన యుద్ధం ముమ్మరంగా సాగింది.

## ఐదవ కమ్యూనిస్టు నిర్మూలన యుద్ధం.

ఈ ఐదవ కమ్యూనిస్టు నిర్మూలన యుద్ధకాలంలో సంపూర్ణ ఆర్థిక దిగ్బంధమూ, అనుదిన విమానదాడులూ, విదేశ సామ్రాజ్యవాదుల ఆర్థిక, రాజకీయ, యుద్ధశాస్త్రజ్ఞుల సహకారమూ, సోవియట్ ప్రాంతాల చుట్టూ సిమెంటు కోటలను కట్టి సామాన్య పౌరులనూ, గ్రామాలనూ సంపూర్ణంగా ధ్వంసం చేయడం ప్రభుత్వ సైన్యాల అనుదిన చర్యలు అయాయి. కమ్యూనిస్టుల వాస్తవమైన బలం ప్రజాసామాన్యంలో కలదని గుర్తించిన చియాంగు ప్రజలలో భయోత్పాతం కల్గించేందుకు గ్రామాలను పౌరులను క్రూరంగా నాశనం చేయమని ఆజ్ఞలిచ్చారు. నాంచాంగ్, నాంకింగు, సైనిక కళాశాలల్లో "కమ్యూనిస్టులు" మానవులు కారు కాబట్టి వారిని విధ్వంసం చేయడమే పవిత్ర కర్తవ్య"మని బోధించారు. సోవియటు ప్రాంతాల్లో జీవితావసర వస్తువులకు, ముఖ్యంగా ఉప్పుకు గొప్ప కరువు యేర్పడింది.

విమానదాడులలో అనేకవేలమంది వికలాంగులూ, విగతజీవులూ అవుతున్నారు. ఎర్రసైన్యంలోనే సుమారు 60 వేలమందివరకూ చని పోయారు. సామాన్య పౌరుల్లో 10 లక్షలవరకూ ప్రాణాలను కోల్పో యారు. అనేక ఫిర్కాల్లో గ్రామాలకు గ్రామాలే తుడిచివేయబడ్డాయి. ఇట్టి భయానక పరిస్థితులను కల్పించి చియాంగ్ కమ్యూనిస్టులను నాశనం చేయడంలో కృతార్థుడనయ్యానని సంతృప్తితో ప్రపంచానికి వెల్ల డించాడు.

ఇట్టి విపత్కర పరిస్థితుల్లో కూడా కమ్యూనిస్టుల దృఢసంకల్పం, చైనాప్రజల ఉజ్వలభవిష్యత్తుపందు విశ్వాసం వడలలేదు. ఎర్రయుద్ధ

శాస్త్రజ్ఞుల సమావేశం జూయికిన్‌లో జరిగింది. పరిస్థితుల తీవ్రత, ప్రమాదం కూలంకషంగా చర్చింపబడ్డాయి. రహస్య సమావేశంలో ఎర్ర సైన్యంలో అత్యధిక భాగాన్ని ఉత్తరరాష్ట్రాలకు పంపివేసేందుకు నిర్ణయించబడింది. ఆ దీర్ఘయాత్ర ఒక సంవత్సరంకాలం పడుతుందని అంచనా వేయబడింది. ఈ మహాప్రస్థానమునకు చేయవలసిన ఏర్పాట్లన్నీ బహు జాగ్రత్తగాను, దూరదృష్టితోను సమగ్రంగా చేయబడ్డాయి. విజయోన్మత్తులై ముందుకు చొరుచుకపోయే సైన్యాలను నడపడానికి, అడుగడుగునా ఆటంకాలూ, నిరోధాలూ, పోరాటాలూ, సల్పుతుండే శత్రుసైనికవలయాలను ఛేదించుకుని ఆధునిక రవాణా సౌకర్యాలుగాని మోటార్లు, లారీలుగాని లేకుండా బహు దీర్ఘదూరం ఉత్తరంచైనాకు అధిగమించరాని మహా పర్వతాలమీదుగా తిరోగమనాన్ని సాగించడం, మహాప్రస్థానం ఆత్మవినాశకరం కాకుండా విజయవంతమయేట్లా ఏర్పాట్లు చేయడం చరిత్రలో కనీవినీ ఎరుగని ఒక అపూర్వసైనిక సంఘటన.

# 21 వ అధ్యాయం.

## దీర్ఘ యాత్ర.

ఉత్తరరాష్ట్రాల్లో నూతన సోవియట్లను స్థాపించుటకు నిర్ణయించిన వెంటనే కియాంగ్సీ సోవియట్ ప్రభుత్వం మాచే మోసీయాంగ్‌ల నాయకత్వంలో ఈ మహా ప్రస్థానానికి సన్నాహాలను అతివేగంగా పూర్తి చేశారు. కొమింటాంగు సైనిక కార్యాలయానికి ఈ సమాచారం తెలిసినప్పటికీ అనేక రోజులక్రితమే 90 వేల ఎర్రసైన్యం ఈ దీర్ఘయాత్రను ప్రారంభించింది. యుద్ధభూమిలో గెరిల్లాలను, రైతుభటులను వుంచి శత్రువులకు అనుమానం కలుగకుండా సుశిక్షితులైన ఎర్రసైనికులను వెనుకకు రప్పించి కియాంగ్సీలోని యూటూవద్ద కేంద్రీకరించారు. ఈ దీర్ఘయాత్ర 1934 అక్టోబరు. 16 వ తేదీనాడు ప్రారంభమైంది.

ఎర్రసైన్యాలు మూడు రాత్రులు పడమరగానూ దక్షిణాభిముఖంగానూ మహాప్రస్థానం చేశాయి నాలుగవరోజున అకస్మాత్తుగా హూనాన్, క్వాంగ్‌టంగ్ రక్షణలపైబడి ఛేదించాయి. చియాంగ్ సైన్యాలు దిక్కుతోచక పారిపోయాయి. ఈ విధంగా ఎర్రసైన్యాలు పశ్చిమ దక్షిణ దిశలకు మార్గాన్ని నిష్కంటకం చేసుకుని నడవనారంభించాయి.

ఎర్రసైనికులేగాక రైతులు, కూలీలు, స్త్రీలు, వృద్ధులు, బాలురూ కూడా యీ యాత్రలో కలిశారు. ఎర్రసైనికులు వారి ఫాక్టరీలలోని యంత్ర సామగ్రులను, మందుగుండు యంత్రాగారాలలోని యంత్రసామగ్రులను గాడిదలమీద వేసి తమతో తీసుకొనిపోవ మొదలుపెట్టారు. అనేకవేల రైఫిళ్ళను, తుపాకులను వారు మార్గాల్లో శత్రువుల చేతిలో పడకుండా పాతిపెట్టారు. శ్రామికులు నేడు ప్రభుత్వ సైనికులకు జంకిపోయినప్పటికీ భవిష్యత్తులో వారు యీ ఆయుధాలనే తీసి తిరుగబడి చియాంగ్ ధనిక ప్రభుత్వాన్ని కూలదోస్తారని వారు ఆశించారు.

ప్రధానమైన ఎర్రసైన్యాలు తిరోగమించిన అనేక వారాలకుగాని ప్రభుత్వ సైన్యాలు ఎర్రపట్టణాలను ఆక్రమించుకో లేకపోయాయి. అనేక వేల రైతులు, కూలీ వలంటీర్లు, ఆత్మత్యాగులైన ఎర్రసైనికులు యీ సైన్యాలను ప్రతిఘటించి చాలా వారాలవరకూ పోరాడారు. కియాంగ్సీ, ఫూకీన్, క్వీచౌలలో సోవియట్ విధానాలను అమలు పరచుకునే గ్రామసీమలను సంపూర్ణంగా చియాంగ్ నాశనం చేయలేకపోయాడు.

ఒక సంవత్సరం కాలం యీ దీర్ఘయాత్ర సాగింది. 18,088 'లీ'లు లేక సుమారు 6000 మైళ్ల దూరాన్ని ఎర్రసైన్యం అధిగమించింది. ఈ దీర్ఘయాత్ర అంతాకూడా కాలినడకనే సైనికులు సాగించారు. మహోన్నతమైన పర్వతాలనూ, దుర్గమారణ్యాలనూ దాటారు. దాట శక్యముగాని పెద్దలతో ప్రవహించే నదులను సాహసంతో దాటివెళ్ళారు. అడుగడుగునా, పదునైన ప్రభుత్వ సైన్యాలతో పోరాడుతూ యీ యాత్రా మార్గమంతటా రక్తం చిందించి చైనాపటానికి తుడిచివేయరాని రక్త వర్ణాన్ని పూశారు

1934 అక్టోబరు 21 వ తేదీనాడు చియాంగ్ యొక్క సిమెంటు దుర్గవలయాన్ని ఛేదించారు. హూనాన్‌లోని రెండవదుర్గ వలయాన్ని నవంబరు 3 నాడు, ఒకవారం పోరాటం తర్వాత మూడవ దుర్గపంక్తిని ఘోర యుద్ధానంతరం ఛేదించారు క్వాంగ్సీ, హూనాన్ ప్రభుత్వ సైన్యాలు నవంబరు 29 వ తేదీనాడు చిట్టచివరి వలయాన్ని రక్షించుకో లేకపోయాయి ఈ విజయానంతరం సోవియట్ సైన్యాలు ఉత్తరాభిముఖంగా యాత్రను సాగించి జెక్‌వాన్ రాష్ట్రంలోని సోవియట్ జిల్లాలకు వెళ్ళి సూసియాంగ్‌చెన్ యొక్క నాల్గవ ఎర్రసైన్యంతో కలవాలని పథకం వేసుకున్నాయి. ఈలోగా 110 ప్రభుత్వ రెజిమెంట్లు యీ యెర్రసైన్యంపై తొమ్మిది పర్యాయాలు యుద్ధం చేశాయి. రాష్ట్రసైనిక ప్రభువులైన చెన్ చీటాంగ్, హోచీన్ పేచుంగ్సీలు యీ యుద్ధాల్ని జరిపారు. కాని ఎర్రసైన్యాలను మాత్రం నాశనం చేయలేకపోయారు.

కియాంగ్సీ, క్వాంటంగు, క్వాంగ్సీ, హూనాన్ రాష్ట్రాలగుండా దీర్ఘయాత్రను సాగించిన కాలంలో ఎర్రసైన్యాలు చాలా నష్టపడ్డాయి. క్వీచౌరాష్ట్ర సరిహద్దుకు జేరుకునేటప్పటికి మూడవవంతు సైనికుల్ని పోగొట్టుకున్నారు. వారి సామగ్రుల్ని జేరవేసేందుకే 5000 మంది కావాలి. కియాంగ్సీనుండి వాయువ్య దిశగా యాత్ర సాగించడం వలన శత్రువులకు వారి మార్గం తెలిసి వారికి చాలా నిరోధాలు కల్గించి వేధింప జొచ్చారు.

క్వీచౌ జేరుకున్నాక ప్రభుత్వసేనలు సునిశ్చితంగా ఊహించేం దుకు వీలులేకుండా ఎర్రసైన్యాలు అనేక వంకరటింకర మార్గాలుగా యాత్రలు సాగించాయి. ఈ క్రొత్తవిధానం వలన కొమింటాంగు విమాన ములకు పర్యవేక్షణ చేయడం, ఎర్రసైన్యాలు యాత్రను సాగిస్తున్న మార్గం, వారిలక్ష్యం కనిపెట్టడం దుస్సాధ్యమైంది. ప్రధాన ఎర్రసైన్యా లను కేంద్రంలోనుంచి ఒక్కొక్కప్పుడు నాల్గు భాగాలుగా చీలి నాల్గు దిశలకు పోతున్నట్లుగా ఎర్రసైన్యాలు కొన్ని తిరిగేవి. ఎర్రసైన్యపు యుద్ధ తంత్రంగాని, వ్యూహరచన గాని, సాంకేతికంగాని, గమ్యస్థలం గాని, మార్గంగాని తెలియక ఏది ఎర్రసైన్యమో ఏ దిక్కునకు పోతు న్నదో తెలియక ప్రభుత్వగస్తీ విమానాలు దిగ్భ్రమ చెందేవి. ఎర్రసైన్యం ఈ యాత్రలో అత్యవసరమైన తేలికవస్తువులను మాత్రమే తీసికొని వెళ్ళేవారు. రాత్రిసమయాల్లోనే అత్యధికంగా అతివేగంగా ప్రయాణం సాగించారు.

ఎర్రసైన్యాలు యాంగ్‌జీనదిని దాటి ఉత్తరదిశగా వెడతాయని చియాంగ్ నిర్ధారణ చేసికొని హూపే అన్‌హ్వీ, కియాంగ్సీ రాష్ట్ర ప్రభుత్వ సైన్యాలను యాంగ్జీనది వొడ్డునకు పంపాడు. నదినిదాటే మార్గాలన్నిచోట్ల సైనికులను బందోబస్తుగా వుంచాడు. వారికి కావలసిన మారణయంత్రాలనిచ్చాడు. బాటలన్నిటిని మూయించివేశాడు. చాలా

ప్రాంతంవరకూ చుట్టూ ఎక్కడా ధాన్యంలేకుండా చేశాడు. క్వీచౌ గవర్న రైన నల్లసుందుభాయి వాంగ్ చియాలీ సైన్యాలకు మద్దతుగా అనేక వేలమంది సైనికుల అదనపు బలగం సహాయమొచ్చింది.

ఎర్రసైన్యాన్ని యాంగ్‌జీ దాటకుండా నిరోధించి నాశనం చేసేందుకు సుమారు 2 లక్షల ప్రభుత్వ సైన్యాలు క్వీచౌలో వేచివున్నాయి. అందువలన నాలుగు మాసాలవరకూ క్వీచౌలోనే ఎర్రసైన్యాలు ఆగి అనేక పన్నాగాలను పన్ని 5 శత్రుసైనిక భాగాలను ఓడించి వాంగ్ గవర్నరుయొక్క 'నుస్సీ' వసంత బంగాళాను పట్టుకుని ఆ రాష్ట్రంలోని అనేక పల్లెలకు పట్టణాలకు వెళ్ళి ప్రజల సమావేశాల్లో వారి ఆశయాలను ప్రచారం చేయజొచ్చారు. ఈకాలంలో వారికి చెప్పుకోతగ్గనష్టాలు కలుగక పోయినా యాంగ్‌జీనిసూత్రం దాటవలసిన గడ్డుసమస్యను పరిష్కరించవలసివుంది. చియాంగ్‌కేషేక్ సేనానులందరికీ చైనా జాతియొక్క కొమింటాంగు పార్టీయొక్క భవిష్యత్తు ఎర్రసైన్యాలను సంపూర్ణంగా చుట్టుముట్టి, బంధించి, హతమొనర్చడంపైనే ఆధారపడి వుందని హెచ్చరిక చేశాడు.

1935 మే మాసపు తొలి రోజుల్లో ఎర్రసైన్యాలు యూనాకాలో బర్మా ఇండోచైనాల సరిహద్దులు కలిసే ప్రాంతంకు హుటాహుటి ప్రయాణం సాగించాయి. నాల్గు రోజులలో యూనాన్ రాజధానీనగరమైన యునాన్‌పూకు పదిమైళ్ళ దూరంలోకి వచ్చాయి. చియాంగ్ సేనలు వాటిని తరుముకువచ్చాయి. చియాంగ్ దంపతులుకూడా అక్కడే వున్నారు. ప్రభుత్వ విమానాలు బాంబులవర్షం కురిపిస్తున్నాయి. ఎర్రసైన్యాలలో ప్రధానభాగం అంతా పశ్చిమంగా వెడుతోందనీ, కొద్దిమంది ప్రభుత్వ సైన్యాలను మభ్యపెట్టి వారిమార్గంనుంచి తొలగించి వేసేందుకు యీ యెత్తు వేయబడిందనీ వెల్లడి అయింది వెంటనే పడవల నన్నిటినీ నది ఉత్తరంగట్టుకు తీసుకొనిపోయి తగులవేయుటకు చియాంగ్ ఆజ్ఞ

లిచ్చారు. ఎర్రసైన్యాలు లెంగ్‌కేకు వెళ్ళి ఒక కర్రవంతెనను నిర్మింప జొచ్చారు. చియాంగ్ పన్నిన ఉచ్చులో ఎర్రసైన్యాలు చిక్కుకున్నట్లే కొమింటాంగువారు సంతోషించారు.

ఈ సంకట పరిస్థితుల్లో ఎర్రసైన్యాలు ఒకరాత్రి ఒకపగలు హుటాహుటీని 85 మైళ్ళు నడిచి యాంగ్‌సీనది రేవుకు చేరుకున్నారు. ఆ రేవు గట్టునున్న చౌపింగు దుర్గంలోనికి ప్రభుత్వ సైనికబందీల యూనిఫార ములను తొడుగుకొని ఎర్రసైనికులు ప్రవేశించి అచ్చటి రక్షక భటులను బంధించి వేశారు అక్కడవుండే పడవలన్నీ ఉత్తరగట్టున వున్నాయి. కాని చియాంగు ఆజ్ఞల ప్రకారం ధ్వంసం చేయబడలేదు ఎర్రసైనికులు కొందరు నాన్కింగు సైనికుల ఉడుపులు ధరించి రేవు అధికారిని వెంట బెట్టుకుని ఉత్తర గట్టునున్న అధికారితో ప్రభుత్వ సైన్యాలు నదిని దాటేందుకు పడవలు కావాలని చెప్పారు. పడవలు దక్షిణపు గట్టుకు వచ్చాయి. మారువేషాలతో వున్న ఎర్రసైనికులు కొందరు నదిని దాటి 'పులి మేక ఆట' ఆడుతూవున్న నది కాపలాదార్లను ఆకస్మికంగా పట్టుకుని నిరాయుధుల్ని చేశారు. 6 పెద్ద పడవలతో 9 రోజుల్లో ఎర్రసైన్యాలు యాంగ్సీనదిని దాటి ఆ పడవల్ని తగులబెట్టారు. రెండు రోజుల అనంతరం చియాంగు సైన్యాలు రేవుకు వచ్చి జరిగిన ప్రమాదాన్ని గుర్తించాయి. కోపోద్రిక్తుడైన చియాంగ్‌కేషేక్ టట్టూనదిని ఎర్రసైన్యాలు దాటకుండా కాపు పెట్టాడు.

## టట్టూనదీతరణం.

ఎర్రసైన్యం జరిపిన దీర్ఘయాత్రలోకెల్ల రోమాంచమును, సాహసోపేతమూ అయిన ఉదంతము దుర్గమమైన టట్టూనదిని తరించుట. ఆ టట్టూనది గట్టువద్దనే తైపింగు విప్లవవాదులు మంచూసైన్యాలచే చుట్టుముట్టబడి సర్వనాశనం చేయబడ్డారు. చియాంగ్‌కేషేక్ సైనిక ప్రభువు

లైన లియూసియాంగ్, వెన్‌హ్సీలకు ఎర్రసైన్యాలకు కూడా సైపింగుల గతే పట్టించవలసిందని హుకుం జారీచేశాడు.

యాంగ్జీనది ఉత్తరగట్టునే ఎర్రసైన్యాలు విశ్రాంతి నెరుగని యాత్ర సాగించి జెక్‌వాన్‌లోని లోలో అనే ఆదిమతెగనివాస భూమి అయిన లోలోనాడులో ప్రవేశించారు. ఈ మన్యప్రాంత మింతవరకూ చైనావారికి సంపూర్ణంగా లొంగియుండలేదు. ఘోరాటవులతో గూడిన దుర్గమారణ్య భూముల్లోనికి జొరబడిన ఎర్రసైన్యాలు చాలవరకు క్షీణిస్తా యని చియాంగ్ ఎంచి టట్టూనది వుత్తరగట్టున బలగాల్ని జేర్చి బందో బస్తుగా పహరా కాయించాడు.

లోలోలకు చైనావారియందు ద్వేషమపరిమితము. వారి దేశంలో కాలిడిన చైనాసైన్యాలత్యమితంగా నష్టపడకుండా పాటలేదు. కాని ఎర్ర సైన్యాలపద్ధతి వేరు. వారింతకుముందు మియోషాన్ తెగవారు నివశించే ప్రాంతాలను క్వీచౌ, యునాన్ రాష్ట్రాలలో అధిగమించారు. ఎర్రసైనికు లలో రాజకీయపరిజ్ఞానమున్నవారు కొందరు ముందుగానే లోలో నాయ కులతో సౌహార్ద్ర సంబంధాలను నెలకొల్పేందుకు వెళ్ళి వారిలో కొంద రిని తమ సైన్యంలో కూడా జేర్చుకున్నారు. జెక్‌వాన్ రాష్ట్రవాసియైన లోపిచెంగ్ ఎర్రసేనాని లోలోలకు వారి భాషలోనే కమ్యూనిస్టు భావా లను బోధించి కొమింటాంగు సైన్యాలవలె ఎర్రసైన్యాలు పీడకులు కారని తెలియజెప్పాడు. లోలోలు వారి స్వాతంత్ర్యాన్ని కాపాడుకునేం దుకు తుపాకుల నీయవలసిందని కోరగా లోపిచెంగ్ వారికి తుపాకుల నిచ్చి వారి విశ్వాసాన్ని చూరగొన్నాడు.

లోలోలందరూ ఎర్రసైనికులతో సహకరించుటవలన లోలోనాడు అంతా సుగమమైంది. చెట్లమాటున పర్వతాలలో ప్రయాణం సాగించే ఎర్రసైనికులు గస్తీవిమానాల కంటబడలేదు. లిన్‌పియో నాయకత్వాన ఎర్రసైనిక అగ్రశ్రేణి టట్టూనది రేవుపట్టణమైన అంజెన్‌చాంగ్ చేరాడు.

ఆ పట్టణంలో నాన్కింగు ప్రభుత్వసైన్యాలు ఒక రెజిమెంటుమాత్రమే వున్నాయి. జెక్‌వాన్ రాష్ట్రసైన్యాలు తీరుబడిగా ఈ రేవుపట్టణానికి వస్తున్నాయి ఈలోగా ఎర్రసైన్యాలు ఆ పట్టణంపై ఆకస్మికంగా దండెత్తి వశపరచుకున్నాయి. అక్కడవున్న ఓకే ఒక పడవపై 16 మంది త్యాగధనులైన ఎర్రసైనిక వీరులు టట్టూనదిని దాటి ఉత్తరపుగట్టునుండి పడవలను తీసుకొని వచ్చేందుకు వజ్రసంకల్పంతో బయల్దేరారు. అది మే మాసం. టట్టూనదిలో వరదలువస్తున్నాయి. మహావేగంగా సుళ్లు తిరిగి ప్రవహిస్తోంది. ఎర్రసైన్యాలు నదిఒడ్డున వున్న కొండచరియపైన శతఘ్నులను పెట్టి పడవపై వెడుతున్న ఆత్మత్యాగులకు రక్షణగా అవతల ఒడ్డునవున్న శతృస్థావరంపై అగ్నివర్షాన్ని గురిపిస్తున్నారు. ఆ పడవను ప్రవాహానికి, ఎదురుగా రెండుమైళ్ళు పైనుంచి నడిపించి అంజెన్ చాంగ్‌కు ఎదురుగా అవతలిగట్టు చేరారు. ఆ గట్టుపై శతృవుల ఫిరంగి స్థావరాలున్నాయి. ఎర్రఫిరంగులు తెల్లశతఘ్నులు భీషణంగా గర్జిస్తూ అగ్నిగోళాలను విరజిమ్ముతున్నాయి. ఆ 16 మంది వీరులు ఒక చిన్న గుట్టయెక్కి మెషీన్ గనులతో గుండ్లను, చేతి బాంబులను తెల్లసైనికుల స్థావరాలపై కురిపించారు.

దిక్కుతెలియక తెల్లసైనికులు వారి ప్రథమరక్షణ శ్రేణినివదలి రెండవశ్రేణికి, దానిని విడచిపలాయనం చిత్తగించారు. వెన్వెంటనే మొదటిపడవ మరిరెండు పడవలతో దక్షిణపుగట్టుకు వచ్చి పడవకు 80 మంది సైనికులచొప్పున అవతలిగట్టుకు చేరారు. ఆ విధంగా రెండు రోజుల్లో ఒక ఎర్రసైనిక డివిజన్ ఉత్తరగట్టుకు చేరింది.

కాని నదివరదలు పెరిగాయి. ప్రవాహ వేగంమూలాన్ని మూడవ రోజున ఒక్కసారి దాటేందుకు 4 గంటలకాలం పట్టజొచ్చింది. ఈ విధంగా ఐతే ఎర్రసైన్యం, వారిగుర్రాలు, గాడిదలు, సామానులు దాటేందుకు చాలాకాలం పడుతుంది. పైగా ప్రభుత్వ విమానాలు కూడా

వీరి చర్యలను కనిపెట్టి బాంబులను కురిపించాయి. ప్రభుత్వసైన్యాలు మహావేగంగా వస్తున్నాయి. ఈ విషమపరిస్థితుల్లో లిఛాపియో, చూ టే, మోసీయంగ్, చౌఎన్‌లే, పెంగ్ టేహ్వాలు సమాలోచనలు చేసి ఒక నిర్ణయంచేసి అతిశీఘ్రంగా అమలుజరిపారు.

అంటెస్ చాంగ్ రేవుపట్టణానికి సుమారు 130 మైళ్ళ దూరంలో టట్టూనది రెండు ఎత్తైన పర్వతాలమధ్య యిరుకైన ప్రదేశంలో జోరుగా ప్రవహిస్తుంది. "లియూటింగ్‌చియో" అను పేరుగల యినపవంతెన నదికడ్డంగా వుంది. ఈ వంతెన టిబెట్టుకు తూర్పుదిశగా వుంది. ఈ వంతెనవద్దప పర్వతాలమీదుగా యిరుకుత్రోవల్లోంచి ఎర్రసైన్యాలు నడిచాయి. టట్టూ ఉత్తరంగట్టున నదిని దాటిన ఎర్రసైనికులు నడుస్తున్నారు. వీరు ఒకరికొకరు కనుపడుతూనేవున్నారు. కాని మధ్య అగాధమైన, అగమ్యమైన టట్టూనది. నిద్రాహారాలు సరిగాలేక అనుదినమూ యెకాయెకీని బహుదూరం ప్రయాణంచేసి బడలిపోతున్న సైనికులతో ఎర్రసైనిక రాజకీయప్రచారకులు ఈ నదిని దాటుటకు వారి యావచ్ఛక్తులూ వినియోగించాలనీ ఈ మహత్తర కార్యాన్ని బోల్షివిక్ దీక్షతో, కమ్యూనిజమందు వారికి గల అచంచల విశ్వాసంతో కొనసాగించవలశిందనీ పదేపదే బోధింపజొచ్చారు. విజయమే జీవితమూ, ఉజ్వల భవిష్యత్తూ; ఓటమి సర్వనాశనము.

రెండవనాడు ప్రభుత్వ సైన్యాలు ఉత్తరపు గట్టున వస్తున్న ఎర్రసైన్యాలను ఎదుర్కొని అడుగడుక్కీ పోరాటం సాగించాయి. కొన్ని కొమింటాంగు సైన్యాలు వంతెనను జేరుకునేందుకు వెళ్ళజొచ్చాయి. కాని ఎర్రసైన్యాలతో సమంగా విశ్రాంతి లేకుండా నడవలేక పోయాయి.

లియూబ్రిడ్జి అనేక శతాబ్దాలక్రిందట కట్టబడింది. 16 బరువైన యినుప గొలుసులు గట్లపైని సిమెంటు దిమ్మలలో తాపడం చేయబడ్డాయి. ఆ గొలుసులపైన వేసిన సిమెంటును చాలభాగం ఊడగొట్టేసి

ఉత్తర దిక్కున కొమింటాంగు సైన్యాలు శతఘ్నులనుంచి ఎర్రసైన్యాలు దాటకుండా కాస్తున్నారు. ఎర్రసైన్యాలు యీ బ్రిడ్జియొక్క దక్షిణ ముఖానికి వచ్చి చేరుకున్నాయి. వారిముందు యీ యినుప గొలుసులు ఎదురుగా శతఘ్నులు, తెల్లసైన్యాలు వున్నాయి. చైనాలోని 18 రాష్ట్రాలనుండి సేకరించిన ధనంతో యీ బ్రిడ్జి కట్టబడినందున దానిని వారు పూర్తిగా ధ్వంసం చేయలేదు.

కొమింటాంగు సేనలకు అదనపు బలాల సహాయం రాకుండానే యీ బ్రిడ్జిని దాటేందుకు ఎర్రసైన్యాలు నిశ్చయించాయి. ఎర్రసైనికులలో ఒక్కొక్కరే ఆ బ్రిడ్జిని దాటే ప్రయత్నంలో ప్రాణాలను బలి యిచ్చేందుకు ముందుకు వచ్చారు. చేతి బాంబులను, మర తుపాకులను, వీపులకు కట్టుకొని ముప్పదిమంది సైనికులు ఆ గొలుసులను చేతులతో పట్టుకొని ప్రాక జొచ్చారు. ఎర్రసైనికులు ఫిరంగులను బారుచేసి అవతల గట్టునున్న తెల్లఫిరంగులపై కాలుస్తున్నారు. వాటినుండికూడా తీవ్రంగా సమాధానం వస్తున్నది. ఆ బ్రిడ్జిని దాటుతున్న మృత్యువునకు జంకని ఆ సైనికులలో ముందున్న ముగ్గురు ఫిరంగి గుండ్లకు గురియై టట్టూనదిలో పడిపోయారు. కాని వెనుకనున్నవారు ముందురు సాగిపోతున్నారు ; వారు రెండవ తీరాన్ని సమీపించినకొలది ఫిరంగి గుండ్లు వారిపైగా పోతున్నాయి.

జెక్వాన్ రాష్ట్రవాసులు వారి జీవితంలో పొట్టకూటికొరకై జేరిన సైనికులనే చూచారు కాని యీ మాదిరిగా ఆశయం కొరకై ప్రాణాలను తృణప్రాయంగా త్యజించేందుకు సిద్ధపడిన అమర వీరులను చూడలేదు. క్రమంగా ఆ బ్రిడ్జియొక్క ఉత్తర ముఖానికి చేరిన ఎర్రసైనిక వీరుడు ఒక చేతిబాంబును గురిచూచి తెల్లఫిరంగి స్థావరంపైకి విసిరాడు. అతని వెనుక వచ్చిన మిగతా సైనికులుకూడా ఒడ్డుచేరుకుని చేతిబాంబులను విసరారు. మర తుపాకులను ఎడతెరపి లేకుండా కాలుస్తూ వీరావేశంతో

ముందుకు సింహ కిశోరాలవలె చొరుచుకు వెళ్ళారు. ఈ తెల్లసైనికులు ఆ బ్రిడ్జిమీద పారఫిణా పోసి మంటలు పెట్టి పారిపోయారు. ఇంకా ఎక్కువ మంది ఎర్రసైనికులు "టట్టూవీరులకూ జై" అంటూ విజయ ధ్వానాలు సల్పుతూ బ్రిడ్జి దాటుతూ మంటలను ఆర్పి తెల్లసైన్యాలను తరిమి కొట్టారు. మిగిలిన ఎర్రసైనికులు పాడుతూ విజయోల్లాసంతో బ్రిడ్జినిదాటి రెండు మూడుగంటల్లో జెక్‌వాన్‌రాష్ట్రంలో యాత్రచేస్తున్నారు. చియాంగ్ విమానాలు ఆకాశంలో తిరుగుతూ కొన్ని బాంబులను వేశాయి. కాని ఫలితం శూన్యం. ఎర్రసైన్యాలన్నీ బ్రిడ్జిని సురక్షితంగా దాటాయి.

## మైదాన ప్రాంతాల మీదుగా మహా ప్రస్థానం.

టట్టూనదిని దాటి పశ్చిమ జెక్‌వాన్ రాష్ట్రంలో ఎర్రసైన్యాలు ప్రవేశించి స్వేచ్ఛా వాయువుల్ని పీల్చసాగాయి. ఈ ప్రాంతంలో చియాంగు కేషేక్ సిమెంటు దుర్గాల్ని నిర్మించలేదు. ఐనప్పటికీ వారి ముందురెండు వేలమైళ్ళ సుదీర్ఘయాత్ర, ఏడు పర్వతశ్రేణుల అధిగమనం వున్నాయి.

16 వేల అడుగుల యెత్తుగల హిమాచ్ఛాదిత మహాపర్వతాన్ని వారు దాటారు. జూన్‌మాసంలో వారు టిబెట్ పీఠభూమిని సమీపించారు. దక్షిణచైనా వాసులైన ఎర్రసైనికులలో చాలమంది పర్వత ప్రాంతంలో అవిరళ అవిరామయాత్రకు తట్టుకోలేక చనిపోయారు. టాస్యూషాన్, పోటంగ్‌కాంగ్ దుర్గమ పర్వతాలపై ఎర్రసైన్యాలు తుప్పలను, పొదలను నరికి బాటలను నిర్మించుకుంటూ బహుకష్టంతో యాత్రను సాగించారు. అనేకమంది యోధులు ఆ పర్వత సానువులపై దీర్ఘనిద్ర చెందారు.

చూంగ్‌లే, డ్రీమ్‌పెణా, బిగ్‌డ్రమ్ పర్వతాలను దాటి 1935 జూలై 20 వ తేదీనాడు సస్య శ్యామలమైన మోర్‌కే ప్రాంతంలో అడుగు పెట్టారు. ఓయువాన్ సోవియట్‌నుండి మాసియాంగ్‌చీణా నాయకత్వాన నాల్గవ ఎర్రసైన్యం వచ్చి యీ కేంద్ర సోవియట్ ఎర్రసైన్యాలతో కలి

సింది. అక్కడ వారందరూ చేరి విశ్రాంతి తీసుకుని వారి కష్ట నష్టాలను గూర్చి చర్చించుకుని ఎర్ర సైన్యాలను పునర్నిర్మించుకున్నారు.

తొమ్మిది మాసాలక్రితం కియాంగ్సీలో బయల్దేరిన 90,000 ఎర్ర సైనికులలో సురక్షితంగా చేరినవారు 45,000. మిగిలిన వారందరూ నష్టపడలేదు. మార్గమధ్యంలో హూనాన్, క్వీచౌ, యూనాన్ రాష్ట్రాల్లో కొన్ని ఎర్రసైనికదళాలను రైతుకూలీల్లో ప్రచారంచేశి సోవియట్లను నిర్మించుటకు వదిలారు. మార్గమధ్యంలో వర్గచైతన్యంకల శ్రామికులకు ఆయుధాలను పంచారు. ఉత్తరహూనాన్‌లో హోలుంగ్ ఆధిపత్యాన సోవియట్ పనిచేస్తోంది. నాన్కింగు ప్రభుత్వం ఒక సంవత్సరకాలం దానిని నాశనం చేసేందుకు ప్రయత్నించి విఫలులయారు.

ఈ దీర్ఘయాత్రాకాలంలో వారికి చాలామంది మిత్రులయ్యారు. చాలమంది శత్రువులయ్యారు. దీర్ఘయాత్రా మార్గంలో శ్రీమంతుల జమీందార్ల, పెట్టుబడిదార్ల నిల్వలను జప్తుచేసి ఎర్రసైనికులు సోవియట్ చట్టాల ప్రకారంగా స్వాధీనపరచుకున్నారు. ఈ విధంగా స్వాధీనం చేసుకున్న ధనధాన్యములతో సైన్యములకు కావలశిన సామగ్రులన్నీ సరఫరా చేయబడ్డాయి. ఏ సైనికుడూ స్వార్థంకొరకు వ్యక్తిగతంగా పూచికపుల్ల కూడా ప్రజలనుంచి తీసుకోలేదు. పేదలకు, శ్రామికులకు సంపూర్ణరక్షణ ఇవ్వబడింది. జప్తుచేసిన సామగ్రులు మోసికొనిపోలేనంత హెచ్చుగా మున్నపుడు వారికి పంచిపెట్టేవారు.

ఎర్రసైన్యాలు వస్తున్నవార్తలు వ్యాపించగానే బీదకూలీ, రైతుల ఆహ్వానసంఘాలను వెలకొల్పి, తమ ప్రాంతాలను కూడా "విముక్తం" చేసి సోవియట్ సమాజాన్ని స్థాపించవలసిందని రాయబారివర్గాలను పంపి ప్రార్థించేవారు. చైనాప్రజాసామాన్యానికి ఎర్రసైన్యాలు పేదప్రజల సైన్యాలనీ ధనికరైతు పీడకుల బారినుండి వారిని విముక్తిచేసి భూమిని తమకిచ్చేవారి స్థిరంచేస్తాయని తెలుసును. అంతే.

సూయున్ సోవియట్ నుండి సూసియాంగ్‌చేన్, చాంగ్ క్వోటోల నాయకత్వాన నాల్గవ ఎర్రసైన్యం హోనాన్, జెక్వాన్ రాష్ట్రాల్లో దీర్ఘయాత్ర సాగించి 50000 సైన్యంతో చూ, మోల ఎర్రసైన్యంతో కలిసింది. 1935 జూలై నాటికి మరల ఎర్రసైన్యాలు 1,00,000 వరకూ పెరిగాయి.

భవిష్యత్ కార్యక్రమం నిర్ణయించుకోవడంలో ప్రధాన నాయకుల్లో భేదాభిప్రాయాలు కలిగాయి. చూ, మోలు దీర్ఘయాత్రను ఇంకా వాయవ్యదిశగా సాగించి షెన్సీరాష్ట్రం చేరుకోవాలనీ, చాంగ్‌క్వోటో, సూసియాంగ్‌చీన్‌లు జెక్వాన్‌లోనే ఆగి సోవియట్ ప్రాంతాలను విస్తరింపజేయాలనీ వాదించారు. కాని ఈలోగా చియాంగ్‌కేషేక్ సైన్యాలు తూర్పుదక్షిణ దిక్కులనుండి కమ్ముకొని వస్తున్నాయి. జెక్వాన్ నదిలో వరదలు వస్తున్నాయి.

చూటే సూసియాంగ్‌సీన్‌ల నాయకత్వాన నాలుగవ ఎర్రసైన్యం జెక్వాన్‌లో వుండిపోయింది. ఆ రాష్ట్రంలో వారొక సంవత్సరంపాటు వుండి హోలుంగ్ సైన్యాలతో కలుసుకున్న తర్వాత అన్ని సైన్యాల తోమా వచ్చి ప్రధాన ఎర్రసైన్యాలతో చేరుటకు నిశ్చయింప బడింది. 30,000 సైనికులతో కూడిన ప్రథమ సోవియట్ సైన్యం లిఊపియో, హౌఎన్‌లే, మోసీయంగ్, పెంగ్‌టేహ్వాల నాయకత్వంలో 1935 ఆగస్టులో దీర్ఘయాత్రను సాగించింది.

జెక్వాన్, టిబెట్టుల సరిహద్దులోనున్న పచ్చిక బయళ్ళలో వారి యాత్ర సాగింది. మంజూ, శిఫాన్ ఆటవిక జాతులు నివసించే అడవి ప్రాంతాల్లో వారు వెళ్ళేటప్పుడు అంతకు ముందు కంటె దారుణమైన కష్టాలను పడ్డారు. వారివద్ద డబ్బు వుందికాని ఆహార పదార్థాలు దొరకలేదు. వారివద్ద తుపాకు లున్నాయి. కాని ఆ ఆటవికులు తుప్పలు పొదల మాటునుండి బాణాలను కురిపించేవారు. ఎర్రసైన్యాలు నడిచేబాటను

వదలి 50 గజాలు వెళ్ళిన సైనికుడు పర్వతాలపైనుండి మంజూలచే దొర్లించబడిన ఏ పెద్ద బండరాతిక్రింద పడో ప్రాణాలు పోగొట్టుకొనే వాడు. కమ్యూనిస్టుల అల్ప సంఖ్యాకజాతుల విధానం మంజూలకు చెప్పేందుకే సావకాశం లేకుండా మంజూలు చైనావారిపై గల ద్వేషంతో ఎర్రసైనికులపై పగపూనారు. ఒక గొర్రెను సంపాదించేందుకు ఒక ఎర్ర సైనికుడు ప్రాణం బలి యివ్వవలసి వచ్చేది. వారి పల్లెలను వదలివేసి మంజూలు పశువులను, గొర్రెలను, మేకలను తోలుకొని అడవుల్లోనికి పోయేవారు. ఎర్రసైనికులు మంజూల పంటభూముల్లోని పచ్చిధాన్యాన్ని దుంపలను తినేవారు.

ఈ పచ్చికబీడు ప్రాంతాల్లో వర్షాలు అత్యధికం. ఊబి ప్రాంతాలు హెచ్చు. కాలిబాటను బహుజాగ్రత్తగా నడిచివెళ్ళాలి. దారితప్పి ఊబిలో కూరుకుని కొందరు సైనికులు అసువులను కోల్పోయారు. నీడనిచ్చే పెద్ద చెట్లుకూడా లేవు పట్టుబడిన మంజూలు వారికి సురక్షితమైన బాటలను జూపి ఆ ప్రాంతాన్ని దాటించారు. వారిని తరుముకొని వచ్చిన నాన్కింగు ప్రభుత్వ సైన్యాలు దారి తెలియక చాలమందిని పోగొట్టుకొని వెనుకకు మళ్ళారు. ఎర్రసైన్యాలు కన్సూసరిహద్దుకు జేరుకున్నాయి.

దక్షిణ కన్సూరాష్ట్రంలో టంగ్‌పీ ముస్లిం సైనికులను జేర్చుకుని ప్రభుత్వ సైనికులు ఎర్రసైనికులను అడుగడుగునకు ప్రతిఘటించారు. కాని ఎర్రసైన్యం ముందుకు సాగిపోయింది. ఎర్రసైన్యాన్ని రూపుమాపేందుకు చియాంగ్ చేసిన ప్రయత్నాలన్నీ అకుంఠిత దీక్షాపరులూ మహా త్యాగధనులూ నగు ఎర్రసైనికుల అచంచల విశ్వాసం ముందు ప్రయోజన శూన్యమయాయి. 1935 అక్టోబరు 20 నాటికి ఎర్రసైన్యాలు చైనాగోడక్రింద నున్న ఉత్తర షెన్సీరాష్ట్ర సరిహద్దుల్లో అడుగు పెట్టారు. అక్కడ 25, 26, 27 ఎర్రసైన్యాలు 1933 వ సంవత్సరంలోనే ఒక చిన్న సోవియట్ రాజ్యాన్ని ప్రతిష్ఠించారు. ఊహాతీతమైన కష్టాలకులోనై

రోమాంచలమైన సాహస కృత్యాలను సల్పి ప్రపంచమంతా దిగ్భ్రమ చెందగా ఆత్మబలిదానంతో అరుణారుణం చేయబడిన ఎర్రజెండాల నెగుర వైచుచూ, 6000 మైళ్ళ దీర్ఘయాత్రను ముగించిన మహాశూరులగు ఎర్రసైన్యానికి ఆ సోవియట్ ప్రజలందరూ ఘనమగు స్వాగత మిచ్చారు. దీర్ఘయాత్రను ముగించి ప్రాణాలతో షెన్సీజేరిన వారు 20,000 మంది మాత్రమే.

ప్రపంచ చరిత్రలో ఒక మహదాశయం కొరకై యింతటి కష్ట నష్టాలకోర్చి సాహసం, శౌర్యం, ధైర్యం, శక్తియుక్తులు, కష్ట సహిష్ణ తలు జూపి, ఆశయసిద్ధికై యింత దీర్ఘయాత్రను చేసిన శౌర్యధనులు కానుపించరు. సగటున రోజుకొక్కొక్క తుముల సంగ్రామము చొప్పు నను, పదిహేను రోజులపాటు ప్రచండ యుద్ధాన్ని యీ దీర్ఘయాత్రా కాలంలో ఎర్రసైన్యాలు చేశాయి. 368 రోజుల యాత్రలో 235 రోజులు పగటికాలంలోనూ, 18 రోజులు రాత్రులకాలంలోనూ వారు హుటాహుటీ యాత్ర సల్పారు. మిగిలిన 100 రోజుల్లోను చాల రోజులు చిన్న చిన్న పోరాటాల్లో గడిచింది. 56 రోజులకాలం వాయువ్య జెక్‌వానాలోనూ మిగిలిన 44 రోజులూ 5000 మైళ్ళయాత్రలోనూ వారు విశ్రాంతి తీసు కున్నారు. రోజుకు 24 మైళ్ళదూరం వారు పర్యటించారు.

ఎర్రసైనికులు మొత్తంమీద యీ యాత్రలో 18 పర్వత శ్రేణులను దాటారు. అందులో 5 పర్వత శ్రేణులు నిరంతర హిమాచ్ఛాదిత నగాలు. 24 నదులను, 12 రాష్ట్రాలను గడిచారు. 62 పట్టణాలను పట్టుకున్నారు. 10 మంది సైనిక ప్రభువుల సైన్యాలతోను, చియాంగ్ సైన్యాలతోను పోరాడుతూ వారి చక్రబంధాలనుంచి తప్పుకుంటూ ముందుకు సాగిపోయి గమ్యస్థానాన్ని జేరుకున్నారు. మొత్తంమీద 6 ఆదిమవాసుల మన్య ప్రాంతాల్లో ప్రవేశించి బహు కష్టనష్టాలకు లోనై బయటకు వచ్చారు. ఈ దీర్ఘయాత్రముందు ఆల్ప్స్ పర్వతాలను దాటిన హానిబల్ సాహసో దంతం వెలవెలబోతుంది.

ఎర్రసైన్యాలు సల్పిన యీ దీర్ఘయాత్ర సైనిక రాజకీయదృష్ట్యా మహత్వపూర్ణమైనది. ఆక్రమితప్రాంతాలకు సమీపంలో జపానును ప్రతిఘటించే ఉద్దేశ్యంతో జపాను వ్యతిరేక సోవియట్ రాజ్యాలను నిర్మించేందుకు యింతటి మహాత్యాగాన్ని చేశామనే విశ్వాసమూ, దీక్ష, సంకల్పబలమూ ఎర్రసైనికుల్లో వ్యాపించి వున్నాయి. 20 కోట్ల జనాభాగల రాష్ట్రాలగుండా సాగిన దీర్ఘయాత్రామార్గంలో వారు ప్రజలకు యీ దేశభక్తిప్రపూరిత సందేశాన్నే వినిపించారు. కార్యదక్షులై చైనాను రక్షించుటకు సామ్రాజ్యవ్యతిరేక యుద్ధంలోకి సింహకిశోరులవలె దూకవలసిందని ప్రబోధించారు. దున్నేవానికే భూమి అన్న సన్‌యట్‌సేన్ యొక్క పవిత్ర తృతీయ సూత్రాన్ని ఆచరణలో పెడుతూ శ్రామికవర్గపు భక్తివిశ్వాసాలను చూరగొన్నారు. దీర్ఘయాత్రా మార్గంలో వున్న పల్లెల్లోను, పట్టణాల్లోనూ బహిరంగసభలు జరుపుతూ జపానువ్యతిరేక, వర్గపోరాట భావాలను వెదజల్లే నాటకాలు, విచిత్రవేషాలు, డక్కీకధలు ప్రదర్శించారు. ఎర్రసైన్యాన్ని కండ్లారా చూచిన కోట్లకొలది ప్రజలు చియాంగు ప్రభుత్వం చేసిన "కమ్యూనిస్టులు పెనుభూతాలు, దుండగీండ్రు, బందిపోట్లు"అను ప్రచారం బూటకమని గ్రహించారు. ఎర్రసైన్యంతో కూడా వచ్చిన వేయిమంది పైగా 11 నుండి 17 సంవత్సరాల వయస్సుగల బాలురు మొగనర్సులుగా పనిచేశారు. వారు చూపిన ఓర్పు, ఎర్రసైనికులకు సల్పిన సేవలో నేర్పు, యాత్రను కాలినడకతో సాగించిన దీక్ష వారికి దీర్ఘయాత్రాచరిత్రలో సుస్థిరమైన స్థానాన్ని గడించాయి. 'సియోక్వే' (చిన్న భూతాలు) అను వాత్సల్యంతో పిలువబడే చిన్నబాలురు ఎర్రసైనికులకు అపారమైన సేవచేశారు. వీరందరూ కౌమారదశలోనే యెన్నో కడగండ్లకు లోనై ఎర్రసైన్యంతోపాటు ఈ దీర్ఘయాత్రను సాగించి మహావీరులని పొగడ్తను గడించారు.

# 22 వ అధ్యాయం.

## షెన్సీసోవియట్లు : ప్రాథమిక సోవియట్ విధానాలు.

### షెన్సీ సోవియట్ల జననం.

కియాంగ్సీ, ఫూకీన్, హూనాన్ రాష్ట్రాల్లో చూ-టే మోసీయంగ్‌లు కేంద్రసోవియట్ ప్రభుత్వాన్ని నిర్మించి, నాన్కింగు ప్రభుత్వాన్ని తీవ్రంగా ప్రతిఘటిస్తున్న పోరాటకాలంలో, చైనాలో పలురాష్ట్రాల్లో వర్గ చైతన్యం కలిగిన శ్రామికులతో కూడిన ఎర్రసైన్యాలు పలుప్రాంతాల్లో సోవియట్లను నిర్మించి సోవియట్ విధానాలను అమలుపరచ జొచ్చారు. సూహేయంగ్, సూషియాంగ్‌చీన్‌లు బహు సారవంతమైన మధ్య యాంగ్జీలోయలో 20 లక్షల జనాభాగల హోనాన్—అన్‌హ్వే—హూపే సరిహద్దు సోవియట్‌ను నెలకొల్పారు. 1933 సంవత్సరంలో వాయవ్య చైనాలో షెన్సీ కన్సూ నింఘసియా సరిహద్దు సోవియట్ లియూజూటాన్ నాయకత్వాన నెల కొల్పబడింది.

### లియూజూటాన్ జీవితవిశేషాలు.

ఉత్తరషెన్సీలోని పర్వతప్రాంతంలో పోయాన్ పట్టణంలో మధ్యతరగతి రైతుకుటుంబంలో లియూజూటాన్ జన్మించాడు. మంగోలియాతో ఒంటెలపైన వ్యాపారం సాగించే గొప్ప కేంద్రమైన యూలిన్‌లో ఉన్నత విద్యాభ్యాసం చేసి, కాంటన్‌లోని వాంపో సైనిక కళాశాలలో విద్యార్థిగా చేరి 1926 లో పట్టం పుచ్చుకున్నాడు. ఆ కళా శాలను వదలగానే కొమింటాంగు సైన్యంలో ఉద్యోగం దొరికింది. ఆనాటికే ఆ యువకుడు కమ్యూనిస్టుపార్టీలో సభ్యుడు.

1927 లో కొమింటాంగు ప్రభుత్వం కమూనిస్టులపై దాడి సాగి స్తున్నపుడు ఆయన షాంఘైకు వెళ్ళి రహస్యంగా పార్టీ కార్యకలాపా

లను సాగించాడు. 1928 లో పాతస్నేహితులైన కామ్రేడ్సుతో సంబంధాలు కల్పించుకుని 1929 లో దక్షిణషెన్సీలోని హ్వాసీన్ అనుచోట రైతు తిరుగుబాట్లను తీసుకుని వచ్చాడు. కాని బహు క్రూరంగా ఆ తిరుగుబాటు అణచివేయబడింది. ఆ తిరుగుబాటుదార్లలో కొందరు తప్పించుకుని రైతు గెరిల్లాదళాల నేర్పరచారు.

1929–1931 మధ్యకాలంలో ఆయన మృత్యువుతో చెలగాటాలాడుతూ బహు సాహసోపేతమైన జీవితాన్ని గడిపాడు. ఒక పర్యాయం ఆయనను జమీందార్లు పోయాన్‌లో మింటువాన్ సైన్యాలకు అధిపతిగా నియమించారు. కాని ఆ పదవిని పెద్ద ధనికభూస్వాములను, వడ్డీ వ్యాపారస్థులను నిర్బంధించి ఉరితీసేందుకుపయోగించాడు. త్వరలోనే అతని పదవీచ్యుతునిగాజేసి తరుమగా వేరొక జిల్లాకు ముగ్గురు అనుచరులతో పారిపోయాడు. ఫెంగ్‌యూసియాంగు సేనానాయకుల్లో ఒకడు లియూకు అతని అనుచరులకు ఒకవిందు చేశాడు. ఆ విందుమధ్యలో లియూ అనుచరులు ఆ సేనానిని, ఆతని సైనికులను అకస్మాత్తుగా నిరాయుధులను జేసి, 20 తుపాకులను పట్టుకుని దగ్గరనున్న పర్వతాల్లోకి పారిపోయారు. అక్కడ లియూజూటాణాకు 300 మంది అనుచరులు చేరారు.

కాని త్వరలోనే ఆతని చిన్నసైన్యం చుట్టు ముట్టివేయబడింది. ఆ విషమపరిస్థితుల్లో లియూ వారితో రాజీపడి కొమింటాంగు సైన్యంలో చిన్న కలొనెల్‌గా పనిచేశాడు. కొద్ది కాలంతర్వాత ఆయన భూస్వాములకు వ్యతిరేకంగా ఉద్యమం లేవదీశాడు. ఈ పర్యాయం ఆతన్ని నిర్బంధించారు కాని ఆయనకు సైనికుల్లోగల పలుకుబడివలన మరల వదలివేయబడ్డాడు. మూడవ పర్యాయంకూడా ఆయన పాతవిధానాన్నే సాగించాడు. పన్నుల పీయ తిరస్కరించిన జమీందార్ల నాయన నిర్బంధించాడు. ఈ చర్యను సహించలేక జమీందార్లు, ధనికభూస్వాములు ఆయన్ను శిక్షించాలని కొమింటాంగు ప్రభుత్వ ప్రతినిధులను కోరారు. లియూ

సైన్యాలు నిరాయుధాలు చేయబడ్డాయి. లియూ కొందరు కమ్యూనిస్టు సైనికులతో షోయాన్‌కు పారిపోయాడు.

1931 లో ఆయన స్వతంత్రించి చిన్న ఎర్రసైన్యాన్ని చేర్చి షోయాంగ్, చుంగ్‌యాంగ్ తాలూకాలను ఆక్రమించి ఉత్తరషెన్సీలో సోవియట్ ప్రాంతాలను విస్తరించ మొదలుపెట్టాడు. ఆయన సైన్యాలను నాశనంచేసేందుకు ప్రభుత్వసైన్యాలెన్నిసార్లో పంపబడ్డాయి. అనేక పర్యాయాలు కొమింటాంగు దళాలు లియూతో చేరాయి. ఆయనను చంపినవారికి గొప్ప బహుమానం యిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. ఆయన నిర్భయత్వం, సాహసం, శక్తియుక్తులు వాయవ్యచైనాలో గొప్ప పలుకుబడిని సంపాదించాయి. తుపాకిగుండ్లకాయన శరీరం చెక్కుచెదరదనే విశ్వాసం ప్రజలలో వ్యాపించింది.

మొదటి రెండుసంవత్సరాల్లోను యుగాలతరబడి జమీందార్ల, ఉద్యోగుల సాహుకార్ల యినుపపాదాలక్రింద చిత్రహింసలపాలై, కూటికి గుడ్డకు కరువైన రైతుకూలీలు వారిని పట్టుకుని చంపేవారు. కాని 1932 నాటికి లియూకు 11 తాలూకాలు లోబడ్డాయి. లియూసైన్యాల్లో ఒక రాజకీయశాఖను యేర్పరచి కమ్యూనిస్టులు నెలకొల్పి యెర్రసైనికుల్లో విద్యావ్యాప్తి చేశారు. 1933 సంవత్సరం ప్రారంభంలో ప్రభుత్వం నెలకొల్పబడి సోవియట్ ప్రభుత్వం, సోవియట్ విధానాలు కేంద్ర సోవియట్ రాజ్యాంగంలోవలెనే అమలుజరుపబడ్డాయి. 1934, 1935 లలో యీ షెన్సీ సోవియట్లు బాగా విస్తరించాయి షెన్సీరాష్ట్ర సోవియట్ ప్రభుత్వం ప్రతిష్ఠింపబడింది అన్‌టింగులో కేంద్రసైనిక కార్యాలయం నెలకొల్పబడింది. సోవియట్లు వారి ప్రభుత్వ తపాలాశాఖ, బ్యాంకులను స్థాపించారు. స్టాంపులు, డబ్బు, కరెన్సీలను వారిటంకశాలలో ముద్రింపజొచ్చారు. సోవియట్ ఆర్థికవిధానం అమలుజరుపబడింది. జమీందారీ భూములను పునర్విభజించి, భూమిని సాగుదార్లపరం చేశారు. కోఆప

రేటివ్ సంస్థలు నెలకొల్పబడ్డాయి. గ్రామాలన్నిటిలోనూ ప్రాథమిక వయోజన పాఠశాలలు తెరువబడ్డాయి.

ఈ లోగా లియూజూటాన్ దక్షిణ షెన్సీరాష్ట్రంలోకూడా అనేక తాలూకాలను వశపరచుకున్నాడు. కాని కొమింటాంగు సేనానియైన యాంగ్‌హూచెంగ్ సైన్యాలతో పోరి కొన్నిసార్లు ఓడిపోయాడు లియూ సైన్యాల్లో శిక్షణ, రాజకీయ ప్రచారం హెచ్చినకొద్దీ వారికి రైతుల్లో పలుకుబడి హెచ్చింది. 1935 సంవత్సర మధ్యంలో ఎర్రసైన్యాల పాలనకు లోబడి షెన్సీ, కన్సూలలో 22 తాలూకాలుండేవి. లియూజూటాన్ సైన్యంలో 5000 మంది సైనికులు చేరారు. కియాంగ్సీ, ఫూకీన్ కేంద్ర సోవియట్లతో వారు రేడియో సంబంధాలను నెలకొల్పారు. ఈ విధంగా బలపడుతున్న ఎర్రసైన్యాలను నాశనం చేయవలసిందని ఉపసేనాధ్యక్షుడైన చాంగ్‌సూలియాంగ్‌కు మార్షల్ చియాంగ్‌కేషేక్ హుకుం జారీ చేశాడు.

1934 వ సంవత్సరాంతంలో సూహేయంగ్ 3000 ఎర్రసైనికులతో దక్షిణషెన్సీకివచ్చి జనరల్ యాంగ్‌హూచెంగ్ సైన్యాలతో పోరాడి 5 తాలూకాల్లోని కూలిరైతులను సాయుధులను జేసాడు. ఈ సోవియట్‌కు ఒక తాత్కాలిక ప్రభుత్వం నెలకొల్పి కన్సూరాష్ట్రం లోనికి సైన్యాలను నడిపించాడు.

1935 జూలై 25 తేదీనాడు ఉత్తరషెన్సీలోని యుంగ్‌చాంగ్ వద్ద సూహేయంగ్ లియూజూటానుల ఎర్రసైన్యాలు కలుసుకున్నాయి. ఆ ఎర్రసైన్యాలను 15 వ ఎర్రసైన్యంక్రింద పునర్నిర్మించారు. షెన్సీ—కన్సూ—షెన్సీ విప్లవ సైనిక సంఘానికి సూహేయంగ్ అధ్యక్షుడుగానూ, లియూజూటాన్ ఉపాధ్యక్షుడుగాను ఎన్నుకోబడ్డారు. 1935 ఆగష్టులో ఈ ఎర్రసైన్యాలు టుంగ్‌పీ సైన్యాల నోడించి చాల తుపాకులను మందుగుండు సామగ్రిని పట్టుకున్నాయి.

ఆగస్టు మాసంలో షెన్సీ సోవియట్‌కు కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సంఘసభ్యుడైన చాంగ్‌చింగ్‌పూ ఈ సోవియట్ సైన్యాలను, ప్రభుత్వాన్ని పునర్నిర్మించేందుకు వచ్చాడు. లియూజూటాన్ పార్టీపంథాను అనుసరించ లేదని చాలా సాక్ష్యాన్ని ప్రోగుచేసి లియూనుపార్టీ పదవులన్నిటినుండి రాజీనామా నీయవలసిందని కోరాడు. పార్టీ శిక్షణకు లోబడి లియూజూటాన్ అన్ని అధికారాలను వదలుకొని వోయాన్‌కు వెళ్ళిపోయాడు. ఆయన అనుచరుల్లో 100 మందిని విప్లవప్రతికూలురను నిందలుమోపి నిర్బంధించాడు.

ఈ కల్లోల పరిస్థితుల్లో మోసేయంగ్, లిన్‌పియో, చౌఎన్‌లే, పెంగ్‌టేహ్వాలు వారి సైన్యాలతో 1935 అక్టోబరు మాసంలో యీ షెన్సీ సోవియట్ రాజ్యంచేరారు. చాంగ్‌చింగ్‌పూ తన అధికారాన్ని దుర్విని యోగపరిచి లియూజూటాన్‌ను సోవియట్ రాజ్యపదవులనుండి తొలగించి వేశాడనీ, అతడు తనకులేని అధికారాన్ని చెలాయించాడనీ గ్రహించి అతనిని విచారించి కేంద్రసంఘాన్నుంచి తొలగించి పార్టీలో ఎట్టి బాధ్యతా లేని తక్కువ పనులలో వినియోగించారు.

1936 తొలిమాసాల్లో బహు ప్రసిద్ధిగాంచిన ఎర్రసైన్యాలు జరిపిన జపాను వ్యతిరేకదండయాత్రలో లియూజూటాన్ మరల సేనాధిపత్యం వహించాడు. ఆయన తన సైన్యాలను షన్సీరాష్ట్రంలోనికి నడిపించి ఆ కొమింటాంగు ఆధిపత్యరాష్ట్రంలో రెండునెలల్లో 18 తాలూకాలను ఆక్రమించాడు. 1936 మార్చి మాసంలో అతిసాహసంతో శత్రు సైనికస్థావరంపై దండెత్తినప్పుడు క్షతగాత్రుడయ్యాడు. ఆయనను షెన్సీ తీసుకొనివచ్చిన కొద్దికాలంలో ఆయన జీవితాశయమైన సోవియట్ చైనానిర్మాణ పవిత్రోద్యమ సాధనలో ప్రాణాలను విడిచాడు. ఒక ఎర్రజిల్లాకు జూటాన్ అను పేరుపెట్టి కమ్యూనిస్టులు లియూజూటాన్ యెడగల తమ భక్తిప్రపత్తులను వెల్లడించారు.

## సోవియట్ల ప్రాథమిక విధానాలు.

1. కార్మిక కర్షకుల మహత్తర త్యాగాలచే సాధింపబడిన సోవియట్ నియంతృత్వాన్ని సుదృఢ మొనర్చుట.

2. సోవియట్ నియంతృత్వాన్ని దేశవ్యాప్త మొనర్చుట.

3. దేశంలోని కార్మిక కర్షకులకు సోవియట్ సందేశాన్నందించుట.

4. సోవియట్లను నిర్మించి ప్రజానీకాన్ని సాయుధులను జేయుట.

5. సాయుధులగు కార్మిక కర్షకులచే నిర్మింపబడిన యెర్రసైన్యాలచే విప్లవ పోరాటాన్ని సాగించి అభివృద్ధి నిరోధక కొమింటాంగు ప్రభుత్వాన్ని కూలద్రోయుట.

6. బూర్జువా ప్రజాతంత్ర విప్లవదశను సోవియట్ దశలోనికి క్రమంగా మార్చుట. అనునవి సోవియట్ల ప్రధానాశయాలు.

### (అ) సాయుధ ప్రజలు : ఎర్రసైన్యం.

కొమింటాంగు ప్రభుత్వ దాడుల నెదుర్కొని సోవియట్ ప్రాంతాలను విస్తరింప జేయుటకు ఎర్రసైన్యాలు ప్రజలను సాయుధులను చేయాలి. విప్లవోత్సాహ పూరితులగు రైతుకూలీలకు ఆదర్శప్రాయమైన శిక్షణనిచ్చి "ఉక్కు తునకల" సైన్యాలను నిర్మింప ప్రారంభించారు, ఈ సైన్యాలలో వర్గచైతన్యం గల కూలీ రైతుల నిష్పత్తి బాగా పెంచారు. సైనికులలో రాజకీయ ప్రచారాన్ని వృద్ధిపరచారు. ప్రజాసామాన్యంతో ఎర్రసైనికులు గౌరవ మర్యాదలతో ప్రవర్తించునట్లు కట్టుదిట్టాలు చేశారు. సైనిక నిర్మాణ, యుద్ధతంత్ర, వ్యూహరచన పోరాట విధానాలను పరిస్థితుల కనుగుణ్యంగా మార్చారు. క్రమ శిక్షణ, విజ్ఞాన సంస్కృతులు, సైన్యాలలో వృద్ధియగుటకు కృషి చేశారు. వలంటీరు దళాల్లో ప్రజలు ఐచ్ఛికంగా చేరుటకు అనువగు వాతావరణాన్ని కల్పించారు. సైన్యాలకు కావలసిన

ఆహార మందుగుండు సామగ్రుల సరఫరాకు బాటలను నిర్మించి రవాణా సౌకర్యాలు కల్గించుటకును, వైద్య, ఆరోగ్య వసతులను కల్గించుటకును సోవియట్ ప్రభుత్వం గొప్ప శ్రద్ధ చూపింది. కూలీ రైతుల్లో సహకార భావం పెంపొందించి వారికి వర్గచైతన్యం కల్గించి, వ్యావసాయక విప్లవాన్ని వ్యాపింపచేసి వారి సైనిక శక్తిని విజృంభింప జేయడమనే మహత్తర కార్యాన్ని సాధించుటకు విరామంలేని కృషిని కమ్యూనిస్టులు సాగించారు.

## (ఆ) సోవియట్ ప్రజాతంత్రము.

కార్మిక కర్షక నియంతృత్వ ప్రాతిపదికపై నెలకొల్పబడిన సోవియట్లు ప్రజలచేత ప్రజలకొరకు నిర్మింపబడిన ప్రజాప్రభుత్వాలు. కూలి రైతులకు చరిత్రలో కనీవినీ యెరుగని ప్రజాతంత్ర హక్కులను యీ విధానం కల్గించింది. సోవియట్ ఎన్నికలు ఈ క్రింది పద్ధతులమీద జరుపబడుతున్నాయి :

(1) ఎన్నికల నిమిత్తమై ఓటర్ల సమావేశం జరుగుతుంది. ఒక ఎర్రకాగితంపైని వ్రాయబడిన ఓటర్ల జాబితా వ్రేలాడగట్టబడి వుంటుంది. దోపిడీదార్లు నా సమావేశంలో పాల్గొననీయరు.

(2) ప్రతి పదిహేను కార్మిక కుటుంబాలనుంచి ఒక్కొక్కరున్నూ, ఏభైమంది రైతుల కొక్కొక్కరున్నూ, ప్రతినిధులు యెన్నికొనబడతారు. ఇట్టి ప్రతినిధులతో గ్రామ, పట్టణ సోవియట్లు యేర్పడతాయి.

3. కేంద్ర సోవియట్ సంఘంచే 1933 సెప్టెంబరులో చేయబడిన యెన్నికల చట్టం ప్రకారంగా రైతులకు గ్రామ నియోజక వర్గా లేర్పాటు చేయబడ్డాయి.

4. 1932, 1933 యెన్నికల్లో రోగులు, ముఖ్యమైన రక్షణ సన్నాహాల్లో పాల్గొనేవారూ తప్ప మిగతావారందరూ అనగా 100 కి 80 మందిపైనే పాల్గొన్నారు.

5. 1932 యెన్నికల్లో నామినేషన్ పద్ధతి ప్రవేశపెట్టబడింది.

6. 100 కి 25 కంటె అధికంగా స్త్రీలు యెన్నికల్లో పాల్గొన్నారు. ఫూకీన్‌లో కొన్ని గ్రామాల్లోనూ, పట్టణాల్లోనూ నూటికి 60 మంది స్త్రీలు కూడా ఓట్లు వేశారు.

(7) ఎన్నికలతేదీ ముందుగా రెండుమూడు ఓటర్ల సమావేశాల్లో అభ్యర్థులు వారు లోగడ చేసిన సేవను వివరిస్తారు. ప్రజలు వారికినచ్చిన దేశ, సంఘసేవకుని ఎన్నుకునే సావకాశం లభిస్తుంది.

(8) ఘోంతప్పిదాలను చేసిన ప్రతినిధులను 10 మంది ఓటర్ల కోరికపైని సగంకంటె హెచ్చుఓటర్ల మెజారిటీతో తొలగించిపేయ వచ్చును.

ప్రభుత్వాన్ని యెదుర్కొనే సమస్యలన్నీ ప్రజాభిప్రాయంవలన పరిష్కరింపబడతాయి. విప్లవ ప్రజానీకానికి వాక్స్వాతంత్ర్యం, పత్రికా, సమ్మె స్వాతంత్ర్యాలీయబడ్డాయి. ప్రజలకు వారి భావవ్యక్తీకరణకు అనువుగా నుండునట్లు సమావేశ, ప్రచురణ సావకాశాలను ప్రభుత్వం కలిగించింది. సోవియట్ ప్రభుత్వోద్యోగుల యొక్క లోటుపాట్లను వెల్లడించే సావకాశాలు ప్రతి పౌరునికీ కల్గించబడ్డాయి. పరిపాలనా సౌలభ్యమునకై తాలూకా, జిల్లాప్రాంతాల విప్పుడు చిన్నవిగా యేర్పాటు చేశారు.

## (ఇ) ధనిక భూస్వాములయెడ సోవియట్ వైఖరి.

ప్రజాపీడకులు, దోపిడిగాండ్రునగు ధనికభూస్వామి, జమీందారు, వడ్డీవ్యాపారస్థులకు సోవియట్ ప్రజాతంత్ర హక్కులనీయదు. ఆర్థిక జీవితంలో వ్రేళ్లు పాతుకొనిపోయి, యుక్తిప్రయుక్తులలో నారితేరి కూట నీతి విశారదులగు ఈ దోపిడీగాండ్రు సోవియట్లను కూలద్రోసేందుకు పన్నని పన్నాగముండదు. కాన వారికి సైన్యంలో జేరుటకు ఓటుచేయు టకు హక్కుండదు. విప్లవన్యాయస్థానాలలో వారు ప్రజలచే మోపబడిన

నేరాలకు విచారింపబడతారు. ఈ న్యాయస్థానాల తీర్పులను విప్లవసైన్యం అమలుజరుపుతుంది. బోల్షివిక్ వ్యతిరేకసంస్థ, సోషల్‌డెమాక్రాటులు, పునర్నిర్మాణసంస్థ ట్రాట్స్కీ—చెన్ వాదులు సాగించిన కుట్రల నెదుర్కొని పూర్తిగా అణచివేశారు. ఈ విప్లవ న్యాయస్థానాలలో ప్రజాసామాన్యం పాల్గొంటారు. ఖైదీలను సంస్కరణాలయాలలో నుంచి కమ్యూనిస్టు సంస్కారం కలిగించి సుశిక్షితులైన పౌరులుగా తయారుచేస్తారు. అత్యధిక సంఖ్యాకులైన శ్రామికులకు ప్రజాతంత్ర హక్కులను కలిగించి వారి పాలకశక్తిని సుదృఢంచేశి పరిపాలనాసౌష్ఠవాన్ని పెంపొందించుటయే యీ విప్లవ న్యాయస్థానాల కర్తవ్యం.

## వ్య వ సా య క వి ప్ల వ ం.

చైనాలో భూస్వాముల దౌర్జన్యమునకు వ్యతిరేకముగా జరుపబడిన వ్యావసాయక విప్లవంనుండి యెర్రసైన్యమూ, సోవియట్లు ఉద్భవించాయి. రైతు శ్రమ ఫలితంలో 100 కి 50 నుంచి 80 పాళ్ళవరకూ మక్తారూపంలో భూస్వామి తన పాలుగా తీసికోవడం నూటికి 30 నుంచి 100 పాళ్ళవరకూ వడ్డీలు నాముల రూపంలో భూస్వాములు, షాహుకార్లు గుంజడం వెట్టిచాకిరీ 1700 ల రకాల పన్నులూ చేరి రైతులనుండి భూమిని వారి పీడకుల వశం చేశాయి. సహనశక్తి పూర్తిగా పోయి నిరంతర శోషపీడితులగు రైతులు వ్యవసాయ విధానానికి రూపంకల్పించి అమలు జరిపారు. భూవిభజన పరిశీలన యీ క్రింది సూత్రాల ననుసరించి జరుగుతున్నది :

1. భూవిభజన, పరిశీలన విధానాలను అమలు జరిపే ఉద్యమంలో జమీందారు, ధనిక భూస్వాములకు వ్యతిరేకంగా పేదరైతులు, వ్యవసాయకూలీలు పోరాటంలో పాల్గొనునట్లు చూడాలి. వ్యవసాయంపై ఆధారపడే పేద ప్రజానీకమంతా ఉత్సాహంతో పట్టుదలగా యీ భూపున

ర్విభజనను కట్టుబాటుతో అమలు జరుపుటకు నిశ్చయించిన తర్వాతనే చేయాలి కాని కొద్దిమంది కమ్యూనిస్టులు ప్రజల సహాయ సానుభూతులు లేకుండా చేయరాదు.

2. భూస్వాముల జమీందార్ల యొక్క పశువులు, బండ్లు, పని ముట్లు మున్నగు సామాన్లను జప్తు చేసినపుడు వాటిలో అత్యధికభాగం పేదరైతులకు పంచాలి. లేక కొద్దిమంది పెత్తందార్లు కాజేస్తే, స్వార్థం చూపుతే, ప్రజల్లో అసంతృప్తి కలిగి సోవియట్ విప్లవమందు విముఖత యేర్పడుతుంది.

3. భూవిభజన సాధ్యమైనంత త్వరలో ముగియాలి. భూమిని పదే పదే విభజిస్తూంటే వ్యవసాయోత్పత్తి పడిపోయి రైతుల సైనిక తత్వం నశిస్తుంది. ఈ అవకాశాన్ని వినియోగించుకుని దోపిడీదార్లు పోరాటానికి ఆటంకాలు కల్పించి విప్లవ శక్తులలో విరోధాలు పెంచుతారు.

4. దోపిడిదార్లను పట్టుకొనుటయే పరిశీలక సంఘం యొక్క ప్రధాన కర్తవ్యం. గాన పొలాన్ని దున్ని పండించుకునే కృషీవలులను తరచుగా యేదో ఒక సాకుమీద వారికి పంచిన పొలాల నుండి తప్పించరాదు.

5. భూవిభజన, పరిశీలన కార్యాలను విరోధించే విప్లవ వ్యతిరేక శక్తులను తీవ్రంగా అణచివేయాలి. ప్రజాసామాన్యం వారిని విచారించి శిక్షిస్తుంది. కుల మత విభేదాలను, వంశాభిమానాలను పురస్కరించు కొని విప్లవ శక్తులలో కలతలు తెచ్చేందుకు చేసే ప్రయత్నాలను కఠినంగా అణచాలి.

6. వర్గసంఘర్షణను అభివృద్ధిపరస్తూ కులకక్షలను రేపేవారిని తీవ్రంగా శిక్షించాలి. సోవియట్ సంస్కరణల పేరుతో వ్యక్తిగత ప్రాబల్యాన్ని వృద్ధిపరచేందుకు గాని కుటుంబ తగాదాలను తీర్చుకునేందుకు గాని ప్రయత్నించేవారిపై కన్నువేసి అప్రమత్తతగా మెలగాలి.

7. గ్రామ ప్రజల నిర్మాణశక్తిపైనా వర్గచైతన్యంపైనా సోవియట్ విప్లవశక్తి ఆధారపడి వుంది. కాబట్టి సోవియట్ నిర్వాహకులు వ్యవసాయదార్లలో రాజకీయ, వర్గ ప్రచారాన్ని, వయోజన, ప్రాథమిక విద్యాలయాలు, బహిరంగ సభలు, పత్రికలు, దక్కీకథలు, విచిత్రవేషాలు నాటక ప్రదర్శనల ద్వారా ప్రచారం చెయ్యాలి.

ప్రజల చొరవ నధికంచేసి ఉత్పత్తిని హెచ్చించడం సోవియట్ల విధి సోవియట్ విప్లవాత్పూర్వం వస్తులతోను, గంజి, సంకటి, చెట్లు బెరడు, దుంపలతోను బ్రతికే రైతుల జీవితంలో సోవియట్ పాలనలో అమోఘమైన మార్పు తీసుకొనివచ్చుటే సోవియట్ల మహదాశయం.

## (ఉ) ప్రభుత్వాదాయం.

విప్లవయుద్ధాన్ని, కార్యక్రమాన్ని కొనసాగించేందుకు కావలసిన ధనం పుష్కలంగా సోవియట్లనుసరించే విధానంవలన లభించేది. కొమింటాంగుప్రభుత్వంతో పోల్చిచూస్తే సోవియట్ప్రాంతం చాలా చిన్నది. ప్రజలపై పన్నులు రుద్దకుండా వుండే సోవియట్కంటె రోజు రోజుకూ ప్రజలపై క్రొత్తపన్నుల భారంమోపే కొమింటాంగుకు అతి స్వల్పకాలంలో దివాళాపరిస్థితి కల్గింది. సోవియట్లు (1) ఫ్యూడల్ దోపిడీదార్ల ఆస్తిపాస్తులను జప్తుచేయడం, (2) స్వల్పపన్ను, (3) జాతీయార్థికాభివృద్ధులద్వారా ఆదాయాన్ని వృద్ధిచేశారు.

కొమింటాంగు పన్నులభారాన్ని పేదలపై మోపుతే సోవియట్లు దోపిడీదార్లైన జమీందారు, వర్తకవ్యాపారస్తుడు, పెట్టుబడిదారులనుండి ప్రభుత్వాదాయం సేకరించారు. వ్యవసాయ వ్యాపార రాబడులపై క్రమానుగతమైన పన్ను ధనికులపై విధించారు. దిగుమతి సుంకములు, అమ్మకపుపన్నులు అని వ్యాపారపుపన్నులు రెండు విధాలు. దిగుమతిసుంకం చెల్లించిన తర్వాత సరుకులు యధేచ్ఛగా సోవియట్ ప్రాంతంలో అమ్మ

బడవచ్చును. వ్యాపారపు హెచ్చుతగ్గులనుబట్టి క్రమానుగతమైన పన్ను విధిస్తారు. 400 రూపాయలకంటె తక్కువ పెట్టుబడిగల వ్యాపారముల పైన, సొంత ధాన్యాదుల నమ్ముకునే రైతుల సరుకులపైన, సహకార సంస్థలపైన పన్ను వెయ్యరు ఈ విధంగానే ధనికరైతుల, టుహోలపైన హెచ్చుపన్ను, రైతులపైన తక్కువ, చాలమందిపైన అసలు పన్ను లేకుండాను చేస్తారు.

కొమింటాంగుప్రభుత్వం టీనట్సిన్‌లో 1933 మార్చి 21 తేదీ నాడు 1756 పన్నులను, జెక్‌వాన్ సైనికప్రభువులు 1987 పన్నులను వసూలుచేశారు. షెన్సీలో భూమిపన్నును 25 రెట్లు పెంచారు

సోవియట్ ప్రభుత్వ ఆర్థిక ఆదాయశాఖలు జాతీయాదాయాన్ని వృద్ధిపరచేందుకు స్టేటుబ్యాంకును నెలకొల్పి నోట్లను నాణ్యాలను ముద్రిస్తున్నారు. అన్ని ప్రభుత్వశాఖల్లోనూ, రంగాల్లోనూ, విప్లవయుద్ధం విజయవంతంగా నిర్వహించేందుకు ప్రభుత్వోద్యోగులు పార్టీనాయకులు పొదుపుగా డబ్బు ఖర్చుపెడుతున్నారు

కియాంగ్సి, అన్‌హ్వీ, జెక్వాన్ సోవియట్లలో ముందు వెండి నాణ్యాలు ముద్రింపబడ్డాయి. కాని కొమింటాంగు ప్రభుత్వము 1935 నవంబరులో వెండిని జప్తుచేయడం ప్రారంభించినతర్వాత వెండిఖరీదు విపరీతంగా పెరిగింది. అప్పటినుండి షెన్సీ సోవియట్లప్రభుత్వం వెండి నాణ్యాలను ముద్రించక తమ కరెన్సీ నోట్లకు "రిజర్వు" గా వెండిని నిల్వజేస్తున్నారు. వారి నోట్లపై "అంతర్యుద్ధం విరమించండి" "జపానును ప్రతిఘటించండి" మున్నగు నినాదాలను అచ్చువేస్తున్నారు. సోవియట్ ప్రాంతంలో సోవియట్ కరెన్సీని ప్రజలు అమితమైన విశ్వాసంతో చెలామణి చేస్తున్నారు. కొమింటాంగు డాలరు ఒకటికి 1.21 సోవియట్ డాలర్లు మారకపురేటుగా నిర్ణయించి, ఆ ప్రకారమే కొమింటాంగు పాలనలో నున్న వర్తకులకు కొమింటాంగు కరెన్సీనే చెల్లిస్తున్నారు. షెన్సీ

సోవియట్ ఫైనాన్సు కమీషనరు పయోవృద్ధుడైన లిన్‌పేచూ. ఆయన 1922 లో కమ్యూనిస్టుపార్టీలో సభ్యుడుగా జేరాడు. డాక్టర్ సన్‌యట్‌సేన్‌తో సన్నిహితంగా పనిచేస్తూ కొమింటాంగుపార్టీ కోశాధికారిగా పనిచేశాడు. సన్ నిర్యాణానంతరం కొమింటాంగు కేంద్ర కార్యనిర్వాహక వర్గంలో సభ్యుడుగాను, కాంటన్ రైతు మంత్రివర్గాధ్యక్షుడుగాను పని చేశాడు. కమ్యూనిస్టులను చియాంగ్ వేటాడటం మొదలుపెట్టగానే లిన్‌పేచూ బహిరంగంగా ఖండించి సోవియట్ రష్యాకు పారిపోయి అచ్చట నాల్గు సంవత్సరాలకాలం ఎఱ్ఱవిశ్వవిద్యాలయంలో అర్థశాస్త్ర మభ్యసించి కియాంగ్సీకి తిరిగివచ్చి ఫైనాన్సు కమీషనరుగా పనిచేస్తున్నాడు. ఆయన ప్రభుత్వాదాయ వ్యయపట్టికలను తయారుచేయు విధానమును గ్రంథాన్ని వ్రాశాడు. సోవియట్ ప్రాంతంలో లంచగొండితనం కరువుకాటకాలు నిర్మూలింపబడ్డాయి.

## (ఊ) సోవియట్ల ఆర్థిక విధానం.

కొమింటాంగు ప్రభుత్వం సోవియట్ ప్రాంతాలను చుట్టుముట్టి ఆర్థిక దిగ్బంధం చేసి సోవియట్ ప్రభుత్వానికి అర్థబలం లేదనీ, దివాలా కోరుదనీ, స్తోమతు లేక కృంగిపోతూందనీ, ప్రచారం చేసేవారు. దీనికి తోడు అనుదినమూ కొమింటాంగు సేనలతో ఆస్తిత్వంకొరకు యుద్ధం కొనసాగించాలి. సోవియట్ ప్రాంతంలో ఆర్థిక పునర్నిర్మాణం చెయ్యాలి. ప్రజలకు వైద్య విద్యా సౌకర్యాలు కలుగజెయ్యాలి. సోషలిస్టు ఆర్థిక విధానా న్నమలు పరచాలి.

ఈ కేంద్ర ఆశయసిద్ధికై వ్యావసాయిక, పారిశ్రామిక ఉత్పత్తిని హెచ్చించి విదేశ వ్యాపార వాణిజ్యాలను, సహకారోద్యమాన్ని వృద్ధి పరచడానికి పూనుకున్నారు. వ్యవసాయరంగంలో 1932 కంటె 1933 లో మాత్రికి 15 పాళ్ళు ఉత్పత్తి హెచ్చింది. బంజరుభూములు సాగులోనికి

వచ్చాయి. రైతుల సహకార సంఘాలేర్పడ్డాయి. స్త్రీలు షాక్ దళాల్లో చేరి భూమిని సాగుచేసి ఉత్పత్తి సధికం జేయుటకు అవిరళకృషి చేయు జొచ్చారు. నూతనంగా భూమిని పొందిన వ్యవసాయకూలీలు పేద రైతులు అత్యుత్సాహంతో అడవులను పెంచడం, ధాన్యాలను, ప్రత్తి, నూనెగింజలను పండించడం చేస్తున్నారు. పశువులను, గుఱ్ఱాలను, గొఱ్ఱెలను, మేకల మందలను ఎక్కువ శ్రద్ధతో పెంచుతున్నారు ఎరువులను విత్తనాలను, అధికంగా ఉపయోగించి పంటకాల్వల మరమ్మత్తుల విషయంలో ఎక్కువ శ్రద్ధ చూపుతున్నారు. ఆదర్శ వ్యవసాయ క్షేత్రాలను రీసెర్చి యిన్‌స్టిట్యూట్లను ప్రతిజిల్లాలోను ఏర్పరచారు.

పుగాకు, ఉప్పు, కాగితాలను రాకుండా కొమింటాంగు చేసిన దిగ్బంధంవలన సహకార పారిశ్రామికోత్పత్తి వినిమయసంఘాలను నెలకొల్పి కావలసిన వస్తువుల సధికంగా ఉత్పత్తిచేయజొచ్చారు. భారీ పరిశ్రమలన్నిటినీ సోవియట్ ప్రభుత్వమే నడుపుటకు ఏర్పాట్లు చేస్తోంది. 1933 లో కియాంగ్సీనుండి టంగ్‌స్టన్, ఆహారపదార్థాలను ఎగుమతి చేశారు. 1933 సెప్టెంబరునాటికి 1423 సహకార ఉత్పత్తిసంస్థలు 17 జిల్లాలలో పనిచేస్తున్నాయి. త్వరత్వరగా పెరుగుతున్నాయి. ప్రభుత్వము పరిశ్రమలకొరకై 30 లక్షల డాలర్ల బాండ్లను జారీచేసింది. బొగ్గు, కాగితం, వస్త్రములు, ఇనుము, సున్నం, వ్యవసాయపు పనిముట్లు, పుగాకు, పంచదార ప్రైవేటు కో ఆపరేటివ్ ఉత్పత్తిసంస్థలద్వారా తమదేశ అవసరాలకు మించి తయారుచేసి కొమింటాంగు ప్రాంతాలకు ఎగుమతి చేయుటకు కార్మికులకుత్సాహం కల్పిస్తున్నారు.

పరపతిసంఘాలద్వారా అప్పులిచ్చుట మూలకంగా వడ్డీవ్యాపారానికి తావులేకుండా చేయడం, బాండులు, చందాలు, వాటాలమూలకంగ [illegible] పరిశ్రమల స్థాపనకు రాబట్టడం ప్రభుత్వం ప[illegible] [illegible]కార్యక్రమం.

## సోవియట్ సంస్కృతి.

సోవియట్ విప్లవాన్ని విజయవంతం చేసేందుకు, సోవియట్లను సుప్రతిష్ఠం చేసేందుకు సోవియట్ పాలితులను ప్యూడల్, కాపిటలిస్టు సంస్కృతినుంచి ఉద్ధరించి సోవియట్ సంస్కృతిని వ్యాప్తిచేయుటకు సోవియట్ ప్రభుత్వం అవిరళ కృషి చేసింది. సోవియట్ విద్యాలయాలన్నీ శ్రామికులచేత శ్రామిక సంస్కృతీ వ్యాప్తికై ఉపయోగపడుతున్నాయి. కియాంగ్సి, ఫూకీన్, యేకాంగ్ రాష్ట్రాలలోని 2931 గ్రామాల్లోనూ 3052 లెనిన్ ప్రాథమిక విద్యాలయాలు నెలకొల్పబడ్డాయి. అందులో 89710 మంది బాలబాలికలు చదువుకుంటున్నారు 94517 మంది వయోజనులు 64,612 రాత్రిబడులకు వెళుతున్నారు. 1,55,371 మంది 32,388 బోధనాలయాలకు; 1656 క్లబ్బులకు 49,668 మంది రైతులు హాజరవుతున్నారు. ఈ పైన చెప్పిన సంఖ్యలు కేంద్ర సోవియట్కు చెందినవి మాత్రమే వీరిలో చాలవరకు స్త్రీలున్నారు. స్త్రీలు విద్యాసంస్థలలో ఉన్నత పదవుల నాక్రమిస్తున్నారు.

నిరక్షరాస్యతను నిర్మూలించేందుకు సోవియట్లు తీవ్రకృషి చేస్తున్నాయి. వార్తాపత్రికల ప్రచురణ, ప్రచారం అత్యధికంగా పెరిగింది. కొన్ని పత్రికలు — సంఘర్షణ, యువ, అరుణతార అను పత్రికలు 40 వేలు 28 వేలు, 27 వేలు ప్రతులు - చెల్లుతున్నాయి. పత్రికాపఠనమందు ఆసక్తి చాల హెచ్చింది.

ఆటల పోటీలు, నాట్య సంఘాలు, నాటక కంపెనీలు విరివిగా నెలకొని ప్రజల్లో విజ్ఞానవ్యాప్తిని కల్గిస్తున్నాయి. 1932 నాటికి ఎర్రవిశ్వవిద్యాలయాన్ని కమ్యూనిస్టులు స్థాపించారు. ఉన్నత పాఠశాలలు, కళాశాలలు ఉత్తమ పౌరులను, విప్లవ నాయకులను తయారుచేసే ఉత్తమ సంస్థలుగా విలసిల్లుతున్నాయి. శ్రామికుల్లో నూతన మేధావులు తయారౌతున్నారు. చారిత్రక, సాహిత్య, వివిధ శాస్త్రవిజ్ఞానం కమ్యూనిస్టు దృక్పథంతో ప్రచారం చేయబడుతోంది.

మహాప్రస్థానానంతరం షెన్సీ రాష్ట్రంలో కమ్యూనిస్టులు సోవియట్లను స్థాపించినవెంటనే సూ టేలీ అను అత్యుత్సాహి, దీక్షాపరుడు, విజ్ఞానవేత్తయగు 60 యేండ్లవయస్సు గల నిత్య యౌవనుడు విద్యాశాఖ డైరెక్టరుగా నియమింపబడ్డాడు. ఈయన 1876 లో జన్మించి మంచూ చక్రవర్తి యువాన్ విద్రోహి, కొమింటాంగు ప్రభుత్వాల కాలంలో అనేక విద్యాలయాల్లో ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. చాంగ్షా విద్యాలయంలో మోసీయంగ్ యీాయనయొక్క విద్యార్థి. ప్రజలకు పార్లమెంటును మంజూరు చేయవలసిందని చక్రవర్తిని కోరుతూ విజ్ఞప్తిని పంపిన సమయంలో ప్రజావాంఛా తీవ్రతను ప్రదర్శించుటకు యీాయన తన చిటికన వ్రేలిని ఖండించి ఆ రక్తంతో సంతకం చేసిన మహాసాహసి, త్యాగి. విద్యార్థులను కొందరిని తీసుకుని ఫ్రాంసుకు వెళ్ళి పారిస్ విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేసి 1923 లో హూనాన్‌కు తిరిగివచ్చాడు. 1927 లో కమ్యూనిస్టుగా మారేవరకూ ఆయన రెండు శిక్షాశాలలను స్థాపించి నడిపించాడు. అటుతర్వాత బహిరంగంగా విద్యార్థులకు మార్క్సిజం బోధించాడు. ఆయనకు 50 సంవత్సరముల వయస్సులో ఒక కమ్యూనిస్టు పార్టీలోనికి ఆహ్వానింపగా ఆనందబాష్పాలను రాల్చాడు. నూతన ప్రపంచ నిర్మాణానికి తానుకూడా తోడ్పడ కలుగుతున్నాను కదా అనే సంతోషంతో ఆయన రిష్యాకు వెళ్ళి విద్యా పునర్నిర్మాణ సమస్యలను క్షుణ్ణంగా అభ్యసించి మహాప్రస్థానకాలంలో చైనాకు తిరిగి వచ్చాడు. షెన్సీ సోవియట్‌కు ఆయన ముందు సహాయ విద్యాశాఖాధికారి, అటుతర్వాత ప్రధాన విద్యాశాఖాధికారి అయ్యాడు.

కమ్యూనిస్టులు సోవియట్ స్థాపించేముందు వాయువ్య చైనాలో 100 కి 95 మంది నిరక్షరాస్యులు. ధనిక భూస్వాములు, జమీందార్లు, ఉద్యోగస్థులు మాత్రమే తమ బిడ్డలను చదివించేవారు. ప్రపంచంలో విజ్ఞాన భాస్కరుడు ప్రకాశించని చీకటి ప్రాంతాల్లో ప్రధానమైనదీ ప్రాంతం.

పుట్టినపుడూ, వివాహ సమయంలోనూ యీ రెండుపర్యాయాలు మాత్రమే యిచ్చటి ప్రజలకు స్నానం చేసే అలవాటు. కియాంగ్సీలోకన్న యిచ్చట సంస్కృతి చాల తక్కువ.

గొప్ప ప్రచారం చేసినతర్వాత యిచ్చటి ప్రజలుకూడా చాలవరకు మూఢాచారాలను మానుకొంటున్నారు. స్త్రీలు ఇనుపచెప్పులను ధరించడం మానుకున్నారు. చాలమంది ఉత్సాహంగా బడులకు వెడుతున్నారు. కమ్యూనిస్టు యువజనసంఘాలలోను, బాలసంఘాలలోను జేరుతున్నారు.

సోవియట్ విద్యావిధానం (1) సాంస్థిక (2) సైనిక (3) సాంఘికతరగతులుగా విభజింపబడింది. విద్యాసంస్థలను సోవియట్లూ, సైనికశిక్షణను ఎర్రసైన్యమూ, సాంఘికవిజ్ఞాన ప్రచారాన్ని కమ్యూనిస్టుపార్టీయూ నిర్వహిస్తున్నాయి. వాయువ్యసోవియట్‌లో 200 ప్రాథమికబడులు, వ్యవసాయ వస్త్ర కార్మికోద్యమ కళాశాలలును, ఉపాధ్యాయ శిక్షణాలయమున్నూ నెలకొల్పబడ్డాయి.

ఎర్రసైనిక శిక్షణాలయంలో సైనికశిక్షణ రెండు సంవత్సరాల పాటు యివ్వబడుతుంది. అందులో అశ్వికపదాతి తరగతులు వేరుగా వున్నాయి. రేడియో వైద్యకళాశాలలు కూడా కలవు. నర్సుల శిక్షణాలయం కలదు. ఒక యింజనీరింగు కళాశాల నెలకొల్పబడింది.

పయోజన విద్యాలయాల్లో రైతుకూలీలకు 'షీణా' అను బహు తేలికభాషద్వారా విద్యాప్రదానం చేస్తున్నారు. బహు కష్టతరమైన చైనా లిపి నుపయోగించుట మాని లాటిన్ లిపిలో చైనాభాషను బహు సులభంగా బోధిస్తున్నారు. వారిప్రాథమిక వాచకాల్లోనే ఎర్రజెండా, కమ్యూనిస్టుపార్టీ, వారి ఆశయాలు, అంతర్యుద్ధం, వర్గపోరాటం, దేశద్రోహులు మున్నగు పాఠాలను చెప్పడంద్వారా రాజకీయవిజ్ఞానాన్ని కూడా ప్రసాదిస్తున్నారు. "పోరాడుతూ విద్యాభ్యాసం చేయండి" అనే నినాదం ఎర్రసైన్యంలో అమలు జరుపబడుతోంది.

## సోవియట్ సమాజం.

సోవియట్‌రాజ్యం విస్తరించిన దక్షిణ, వాయువ్యప్రాంతాలు తూర్పుచైనాకంటె పారిశ్రామికంగా బహు వెనుకబడిన ప్రాంతాలు. పూర్తిగా వ్యవసాయంపైని ఆధారపడిన ఆ గ్రామీణ చైనాప్రాంతంలో "శక్తిసామర్ధ్యములనుబట్టి ప్రతివానినుండి, అవుసరాలనుబట్టి ప్రతివానికి" అను మార్క్సిస్టుసూత్రంపై కాక, "దున్నేవానిదే పొలం" అను సన్‌యట్‌సేన్ సూత్రంపైన సోవియట్ గ్రామీణసమాజం నిర్మింపబడుతోంది. "భూపునర్విభజన", "వడ్డీవ్యాపార నిషేధం", "పన్నులరద్దు", "దోపిడీదార్ల నిర్మూలనం" అను నాలుగు సూత్రాలపై నాధారపడి యీ సమాజం రూపొందింది.

గ్రామీణ సమాజాన్ని ధనికభూస్వాములు, చిన్నభూస్వాములు, ధనికరైతులు, మధ్యతరగతి, పేదరైతులు, కౌలుదార్లు, వ్యవసాయ కూలీలు, వృత్తిపనివారు, ముష్టివాండ్రు, జూయోచీ, యోచీలను బుద్ధి జీవులు—ఉపాధ్యాయులు, వైద్యులు, సాంకేతిక నిపుణులక్రింద విభాగించారు. ఈ విభజన రాజకీయ ఆర్థిక పరిస్థితులనుబట్టి చేయబడింది. సోవియట్ల ఎన్నికలలో కౌలుదార్లకు, వ్యవసాయకూలీలకు, రైతులకు సంపూర్ణంగా ఓటింగు అధికారమివ్వబడింది విద్య, వైద్యసౌకర్యాలకును, సైనికరాజకీయ శిక్షణ నిచ్చుటకు, పరస్పర వ్యవసాయపని సహాయమునకు గ్రామ, తాలూకా, జిల్లాసంఘాలు నెలకొల్పబడ్డాయి.

సోవియట్‌ప్రాంతాల్లో కూలీ, రైతు, కమ్యూనిస్టు, యువజన మహిళా బాలసంఘాలు నిర్మించబడ్డాయి రైతురక్షణ సంఘాలు, గెరిల్లా దళాలు, జపాను వ్యతిరేకసంఘాలలో సభ్యత్వం చాలా హెచ్చుగావుంది. ప్రతిపౌరుడూ ఏదోవొక సంఘానికి చెంది సుశిక్షితుడుగా నుండునట్లు జేయుటయే సోవియట్ ప్రభుత్వాభిమతం. అధికోత్పత్తివిధానంలో

సాగుకు లాయకీయైన బంజర్లను సాగుచేయుటకు స్త్రీపురుషులధికంగా తోడుపడుటకుగాను ప్రభుత్వం చాలా సదుపాయాలు చేసింది.

నిర్మాణం, శిక్షణ, సాముదాయిక మనోప్రవృత్తులను చైనారైతు లేవగింపకుంటాడని సామ్రాజ్యవాదులు చేసే ప్రచారం అజ్ఞాతకల్పన అని చైనాసోవియట్ ప్రజలు రుజువుచేశారు. ఎర్రసైన్యాలు యుద్ధ రంగాల్లో నున్నపుడు సోవియట్ రైతురక్షణదళాలవారే వారి ప్రాంతాల్లో గస్తీతిరిగి కాపాడుకునేవారు.

షెన్సీ సోవియట్లలో ప్రతిపౌరునకూ అతని కుటుంబపోషణకు సరిపోవునంత ఆదాయం వచ్చు భూమిని పంచియిచ్చారు. వడ్డీలేకుండా అప్పులనిచ్చారు. వ్యవసాయపు పనిముట్లు ప్రభుత్వ యంత్రాగారాలలో తయారుచేయబడి రైతులకు విరివిగా సరఫరా చేయబడుతున్నాయి. సహకారసంఘాలు నెలకొల్పబడ్డాయి. సమిష్టిభావన, సమిష్టిజీవనము ప్రజలకు అలవాటు చేయబడుచున్నవి. ప్రజలు పరస్పరసహకారం చేసి కొనుట గౌరవప్రదమైన విధిగా భావిస్తున్నారు. నల్లమందును వాడటం సంపూర్ణంగా మానారు. ఉద్యోగస్థులలో లంచగొండితనమే కాన్పించదు. భిక్షుకులు, నిరుద్యోగులు, సోమరిపోతులు కానరారు. శిశుహత్యలు, బాల బాలికల దాస్యము, పడుపువృత్తి లేకుండా జేశారు. బహు భార్యాత్వము, బహు భర్తృత్వమూ నిషేధింపబడ్డాయి.

"సోవియట్ సమాజంలో భార్యలుకూడా సమాజపరం చేయబడ తారు; కుటుంబ జీవన ముండదు; నీతి నియమాలుండవ"నే దుష్ప్ర చారం కేవలం అభూతకల్పనయని ఆచరణలో నిరూపించారు. ఐతే వివాహవిధానం సంస్కరింపబడింది. కన్యాశుల్క, వరశుల్కములు నిషేధింప బడ్డాయి. స్త్రీలను అమ్మడం, కొనడం, అత్తగారి పెత్తనం శిక్షాపాత్రం చేయబడ్డాయి. స్త్రీపురుషుల ప్రేమపైన వివాహములు జరుగు పద్ధతి ప్రవేశపెట్టబడింది. పురుషునకు 20, స్త్రీకి 18 ఏండ్లు వివాహము

నకు యుక్తవయస్సుగా నిర్ణయింపబడింది. రిజిస్టర్డు వివాహములు, విడాకులపద్ధతి అమలులోనికి వచ్చాయి. వివాహమైనా కాకపోయినా దాంపత్య జీవితంగడిపే స్త్రీ పురుషుల బిడ్డలను శాస్త్రీయమైన సంతానంగానే చట్టం గుర్తిస్తున్నది.

రిజిస్ట్రేషన్ ఆఫీసువద్ద భార్యాభర్తలలో ఎవ్వరైననూ గట్టికోర్కెపైన విడాకులు పొందవచ్చును. కాని యెర్రసైనికుల భార్యలు భర్తల యొక్క సమ్మతి లేనిదే విడాకులను కోర రాదు. విడాకులు పొందిన భార్యా భర్తలకు ఆస్థి సమముగా చెందుతుంది. ఇద్దరూ పిల్లలయందు సమాన బాధ్యత వహించాలి. కాని అప్పులమమాత్రం భర్తే భరించాలి.

ఉచితమైన సర్వజనీన విద్యా సిద్ధాంతాన్ని సోవియట్లు ఆచరణలో పెట్టేందుకు ప్రయత్నిస్తున్నాయి. కాని బాల బాలికల తల్లిదండ్రులే భోజన వసతుల నేర్పాటు చెయ్యాలి.

## కమ్యూనిస్టు యువజనోద్యమం.

సోవియట్ సమాజంలో బాల బాలికలకు ప్రముఖస్థాన మీయబడు చున్నది. కమ్యూనిస్టు ఉద్యమంతోబాటుగా యువజనోద్యమం కూడా పుట్టి పెరిగింది. 1918 లో సోషలిస్టు యువజన సంఘంగా జన్మించిన యీ వుద్యమం 1920 నాటికి కమ్యూనిస్టు యువజన సంఘంగా రూపొంది చైనా జాతీయ జీవనరంగంలో ప్రముఖపాత్ర ధరింప నారంభించింది. ఫాంగ్ వెణపింగ్, చాంగ్ చేలీ, షీపెంగ్ యంగ్ మున్నగు ప్రముఖులు యీ ఉద్యమ నిర్మాతలు. ఆగస్టు 1923 నాటికి వుద్యమం అన్ని రాష్ట్రాల లోనికి వ్యాపించింది. విద్యార్థులందరూ యిందులోని కాకర్షింపబడ్డారు. ఈ ఉద్యమానికి శ్రామిక స్వరూప మివ్వాలని నిర్ణయించిన తరువాత 1925 ఫిబ్రవరి నాటినుంచి కార్మిక కర్షకులనుగూడ చేర్చుకొన నారంభించారు.

1927 ఆగస్టులో నాల్గవ కమ్యూనిస్టు యువజనసభ సమావేశం జరిగింది. అందులో చెన్‌టూస్యూయొక్క సమయానుకూల వాదాన్ని ఖండించారు. కొమింటాంగు కమ్యూనిస్టు ఐక్యతకు స్వస్తి చెప్పమన్నారు. ఆ సంవత్సరంలోనే కమ్యూనిస్టులపై నిర్బంధం హెచ్చినతర్వాత, మాస్కోలో సమావేశమై కమ్యూనిస్టుపార్టీ తీర్మానాలను బలపరుస్తూ తీర్మానించారు. 1930 లో లిలీసాన్ పంథా ననుసరించి కమ్యూనిస్టు యువజనోద్యమాన్ని రద్దుచేసి, కమ్యూనిస్టుపార్టీలో ఒక శాఖగా చేరి పనిచేసిన కాలంలో యీ ఉద్యమం చావుదెబ్బ తింది. కాని 1931 జనవరిలో కేంద్రకమిటీ జరిపిన నాల్గవ సమావేశంలో యువజనోద్యమం ప్రత్యేక నిర్మాణం కలిగి పనిచేసేందుకు తీర్మానించి, కేంద్ర సోవియట్ జిల్లాల్లోను యెర్రసైన్యంతోను పనిచేయ ప్రారంభించింది.

కమ్యూనిస్టు యువజన సంఘ సభ్యులు 1933 లో వీరోచితమైన కార్యక్రమాన్ని కొనసాగించారు. ఎర్రసైన్యాన్ని విస్తరించే ఉద్యమాన్ని గొప్ప దీక్షతో సాగించి 70,000 మంది కొత్త సైనికులను జేర్చారు. 1934 జనవరినుంచి ఆగస్టు వరకు బ్రహ్మాండమైన ప్రచారం చేసి 60,000 మందిని సైన్యంలోనికి తీసుకొనివచ్చారు. 1933 లో యీ సంఘంలో 60,000 మందిన్ని 1934 లో 1,00,000 మందిన్నీ సభ్యులుగా వున్నారు. సోవియట్లలో మూడురకాలైన యువజన సంఘాలున్నాయి.

1. కమ్యూనిస్టు యువజన సంఘంలో 16 నుండి 23 సంవత్సరాల వయస్సు కలవారు సభ్యులు.

2. పురోగామి యువకులు ; 16 నుండి 23 సంవత్సరాల వయస్సు కలవారు సభ్యులు.

3. ఎర్‌యంగ్‌వాన్ అను బాలసంఘం : 8 నుండి 15 సంవత్సరాల వయస్సు కలవారికి సభ్యతం.

పురోగామి యువక సంఘంవారికి నాటక, నృత్య, వినోద, ఆట

పాటల శాఖలు కలవు. ఎర్రసైన్యాలు గ్రామాలమీదుగా వెళ్ళునపుడు యీ సంఘంవారు గ్రామీణులను ప్రోగుచేసి వినోదం ద్వారా విజ్ఞానం కలిగిస్తూ గొప్ప ప్రచారం చేస్తారు ప్రతి యెర్రసైనిక దళంలోను యువక బాల సంఘాలుంటాయి. వారు విద్యా, వైద్య, విజ్ఞాన రాజకీయ ప్రచారసేవ జేస్తుంటారు. కేంద్ర సోవియటు జిల్లాలలో వారి సంఖ్య 4,00,000 వరకున్నా, బాలసంఘ సభ్యుల సంఖ్య 4,00 000 వరకున్నా పెరిగింది. షెన్సీ—కన్సూ—నింగ్‌సియా వాయువ్య సోవియట్లలో కమ్యూనిస్టు యువ జన సంఘంలో 2,00,000 సభ్యులు కలరు పెకింగ్, చాంగ్షా, హాంకో, షాంఘే, కాంటన్‌లలో బాలసంఘములు వెలసి వర్ధిల్లుతున్నాయి. 80,000 మంది బాలబాలికలు బాలసంఘంలో వున్నారు.

దీర్ఘయుద్ధానంతరం కమ్యూనిస్టు యువజనోద్యమం ప్రజాసామాన్యంలో వ్రేళ్ళు పాతుకొనిపోయింది. బాలసంఘాలు ఆటల్లో, పాటల్లో, విద్యాసముపార్జనలో, సమిష్టిజీవితంలో కమ్యూనిస్టు జీవితవిధానాన్నవలంబిస్తూ నవ్య సోవియట్ పౌరులుగా తయారౌతున్నారు. "క్రమశిక్షణ నలవరుచుకోండి! ప్రజారోగ్యాన్ని కాపాడండి! వినయంగా ప్రవర్తించండి!" అనునవి వారందరూ తప్పక చేయవలసిన విధులు. "మద్యపానం నిషేధించండి: సిగరెట్లను ముట్టకండి! పన్నీళ్ల త్రాగకండి!" అనునవి 'వారు చేయకూడని' విధులు. అంతర్యుద్ధజ్వాలలలో భస్మీభూతమైన చైనాలో అవతరించిన నవనవోన్మేషమైన నవ్యజీవిత ప్రతినిధు లీ యువజన, బాలసంఘ సభ్యులు.

## చైనాలో వర్గపోరాటం.

సూహేయంగ్‌యొక్క సన్నిహిత బంధువులు 27గురిని, దూరపు బంధువులను 39 గురిని చియాంగ్ చంపించివేశాడు. సూ అను యింటి పేరు కలవారి నెవరినీ ప్రాణాలతో మిగలనీయ లేదు. పారిపోయిన

13 గ్గురు సూ వంశీయులను లిసియాంగ్ తాలూకాలో అరెస్టు చేసి, మొగ వారినందరినీ ఉరిదీసి, పిల్లలను తుపాకిగుండ్ల కెంజేశారు. చిరకాలంగా సోవియట్ పాలనలోనున్న పౌరులలో యెవ్వరు బందిపోటుగా దెవడో మంచిపౌరు డెవడో చెప్పడం కష్టం. గనుక పౌరుల నందరినీ తుడిచి పెట్టివేయ వలసిందని నాన్కింగు అధికారులు ఐదవ కమ్యూనిస్టు విచ్ఛిన్న యుద్ధకాలంలో కొమింటాంగు సైనికులకు ఆర్డర్లు యిచ్చారు. తమ పొలాలను పోగొట్టుకున్న ధనిక భూస్వామి సేనానులు సోవియట్ పౌరులను ప్రాణాలతో వదలలేదు. ఐదవ నిర్మూలన యుద్ధానంతరం కియాంగ్సీ, ఫూకీన్ సోవియట్లలోని ప్రజలలో 6 లక్షలమంది హతులయ్యారు. శత్రు సైన్యాలు రైతుల్లో బలవత్తరంగా పాదుకుపోతున్నాయి. గనుక గ్రామాలను ధ్వంసంచేసి మానవ నివాసానర్హంగా చేసివేశారు. దొరికిన రైతులను నాశనంచేశారు. వేలకొలది బాలబాలికలను బందీలుగా తీసుకొనిపోయి హాంకౌ మున్నగు పట్టణాలలో అమ్మివేశారు. స్త్రీలను ఫాక్టరీ కూలీలుగాను, పడుపు గృహాలకును విక్రయించారు. పైగా వారు కమ్యూనిస్టులచే హింసింపబడిన శరణార్థులని కొమింటాంగు సైనికులు చెప్పేవారు. ఈ వ్యాపారం చాలా లాభదాయకంగా పరిణమించింది. క్రిష్టియన్ సర్వ సేనాధ్యక్షుడైన చియాంగ్‌కేషేక్ యీ మానవ విక్రయ వ్యాపారాన్ని కొంతకాలం తర్వాత నిషేధించాడు.

1933 డిసెంబరు నాటికి ఒకప్పుడు బహు ఫలవంతమైన ఓయువాన్ ప్రాంతంలో సగభాగం నిర్జనమై బీడుపడింది. కొద్ది యిండ్లుమాత్రమే మిగిలాయి. పశువులు తోలుకొనిపోబడ్డాయి. తెల్లసైనికు లాక్రమించిన 12 తాలూకాల్లో కొద్దిమంది ముసలివాండ్లు మాత్రమే ప్రాణాలతో మిగిలారు. తెల్లసైనికులు స్త్రీలను, బాలికలను, ఉద్యోగస్తుల హోదాల ననుసరించి పంచుకున్నారు. ఈ స్త్రీల పంపకం సందర్భంలో కొమింటాంగు సేనానులు తమలో తాము తరుచుగా కలహించుకునేవారు. టాంగ్‌ఎకావో,

వాంగ్‌చూన్, షాటోయిజా, లియాంగ్‌క్వాన్‌యిన్‌లను సేనానాయకుల సైన్యాలిట్టి ఘోరాల నపరిమితంగా చేశాయి.

1933 జులై మాసంలో హూపేరాష్ట్రంలోని హ్వాన్‌కాంగ్ తాలూకాలో సూయిూజాచే అను పట్టణంలో పెద్దబజారు వీధి అంతా నేలమట్టం చేయబడింది. కొద్దిమంది వృద్ధులుమాత్రం కొమింటాంగు సైనికులచే ప్రాణాలతో విడువబడ్డారు. దగ్గరనున్న లోయలో 17 గురు చెరచబడిన యువతుల అర్ధనగ్నదేహాలు విగతజీవములై పడివున్నాయి. ఓకుంగ్‌చే అను గ్రామంలో 400 శవాలు పడివున్నాయి. ఒక్కడుమాత్రమే ప్రాణాలతో మిగిలాడు. ఇట్టి ఘోరచర్య లసంఖ్యాకములు.

చైనాలో వర్గ సామరస్యం కలదనీ, వర్గపోరాట సిద్ధాంతం కమ్యూనిస్టులచే దిగుమతి కాబడిన విపత్కర వినాశన వస్తువని చెప్పేవారికీపదియేండ్ల అంతర్యుద్ధ రక్తపాతం, ఘోర హింసాకాండ ఉచిత సమాధానా విస్తాయి.

## అల్పసంఖ్యాక జాతుల సమస్య.

చైనా రాజకీయ రంగంలో అల్పసంఖ్యాక జాతుల సమస్య ప్రముఖపాత్ర వహించి బహుకంటకప్రాయంగా వుంది. డాక్టరు సన్‌యట్ సేన్ ఉదారమైన జాతుల స్వయంనిర్ణయసూత్రాన్ని ప్రచారం చేశాడు. కాని ఆయన మరణానంతరం కొమింటాంగు ప్రభుత్వం ఆ విధానాన్ని విడనాడింది. కాని దీర్ఘయాత్రా మార్గంలోనూ, వాయువ్య చైనాలోని షెన్సీసోవియట్ల స్థాపన, పరిపాలనాకాలంలోనూ అడుగడుగునా యీ విషమ సమస్య కమ్యూనిస్టుల నెదుర్కొంది. చైనాలోని అన్నిజాతులకు అంగీకార యోగ్యమగు ప్రజాతంత్ర సూత్రాలపై పరిష్కరించడం పైనే కమ్యూనిస్టుల విజయమో, పతనమో ఆధారపడటం వలన వారికిది ప్రధాన సమస్యగా పరిణమించింది.

పర్వత మయమైన యూనాన్ రాష్ట్రంలోని ఒక కోటి పదిలక్షల జనాభాలో మూడింట రెండువంతుల ప్రజలు లోలో, లిసూ, ముసూ, మియోజూ, మంజూలు మున్నగు ఆదిమవాసులు. క్వీచౌ, క్వాంగ్‌టంగ్, క్వాంగ్సీ, జెక్‌వాన్, హూనాన్, హోనాన్‌లలో సుమారు ఫ్రాన్సుదేశమంత పరిమితిగల ప్రాంతంలో 15, 16 విభిన్న జాతులవారు నివసిస్తున్నారు. వీరుగాక మహమ్మదీయులు ఏడవ శతాబ్దంలో చైనాకువచ్చి స్థిరపడ్డారు. వీరి జనాభా ఒకకోటి ఏబది లక్షలకు మించివుంటుంది.

ఈ జాతులవారందరూ చైనాప్రభుత్వంపై తరతరాలుగా తిరగబడుతూనే వున్నారు. యూనాన్‌రాష్ట్రంలో పాంథే తిరుగుబాటు 1855 నుండి 1873 వరకూ సాగింది. మహమ్మదీయులు టాలిఫూను రాజధానిగా చేసుకొని స్వతంత్ర సుల్తాను పాలనను 1873 లో రుధిర స్రవంతులలో ముంచెత్తివేయబడువరకూ సాగించారు. 1861 నుండి 1877 వరకూ వాయువ్య చైనాలో జరిగిన మహమ్మదీయుల తిరుగుబాటుకూడా అణచివేయబడింది. మరల కన్సూలో 1889, 1905 లలో రెండు చిన్న తిరుగుబాట్లు జరిగాయి. కాని క్రూరంగా అణచివేయబడ్డాయి. 1926 నుండి 1928 వరకు మరల తిరుగబడ్డారు. కాని ఫెంగ్‌యూసియాంగ్ కొమింటాన్ కన్సూరాష్ట్రం ప్రవేశించి అణచివేశాడు.

సాంప్రదాయకంగా మహమ్మదీయులు, మంజూతెగవారు, చైనావారికంటె సాహసోపేతులైన యోధులు. లోలోలు దృఢకాయులు; ఆజానుబాహులు. ఆదిమవాసులందరూ అతిభయంకరమైన గెరిల్లాయుద్ధం చేస్తారు. చైనీయులన్న వారికి పగ, అపనమ్మకం హెచ్చు.

ప్రప్రథమంగా హోలుంగ్ తన రెండవ సైన్యంతో క్వీచౌ ప్రవేశించినప్పుడు మియోజూలతో స్నేహ సంబంధాలేర్పరచుకున్నాడు. అటుతర్వాత క్వాంగ్సీ, క్వీచౌ, యూనాన్ రాష్ట్రాలగుండా ఎర్రసైన్యం మహాప్రస్థానం సాగించినప్పుడు స్వతంత్ర లోలోదేశాన్నధిగమించవలసివచ్చింది. లోలోలందరూ గెరిల్లాయుద్ధం చేయసాగగా లోపింగ్

హ్వాని పంపి కమ్యూనిస్టుల ప్రజాతంత్ర సూత్రమైన విడిపోయేందుకు హక్కుతో జాతుల స్వయంనిర్ణయ సూత్రాన్ని లోలోనాయకులకు బోధించారు. ముందు వారు సందేహించినా తరువాత వారితో శాంతిసంధి చేసుకున్నారు. ఈ విధంగా అతి భయంకర శత్రువులైన ఆదమవాసుల స్నేహాన్ని వారు సంపాదించారు. మంజూలు, లోలోలుకూడా ఆకస్మికంగా చిన్న సైనికదళాలపై బడి మట్టుపెట్టుట గ్రామాలకు గ్రామాలనే ఖాళీచేసి శత్రువుల కాహారపదార్థాలు దొరకకుండా చేయుట. సైనికుల జాడ తెలియనీయకుండా గుట్టలు చెట్లు పొంచటమాటున నక్కి తుపాకి గుండ్లను కురిపించి ప్రాణాలను తీయుట. ఎర్రసైనికు లలసి సొలసి నిద్రించినపుడు వారిని హతమార్చుట, అతివేగంగా కొండ్లలోనూ, వారికి మాత్రమే తెలిసిన దారులగుండాను మాయమగుట మున్నగు వీరి యుద్ధ పద్ధతుల వలన మున్ముందు ఎర్రసైనికులు చాలమంది బలి అయ్యారు. అశ్విక భటులైన మంజూలు తమ గురి తప్పని తుపాకివేట నైపుణ్యంతో అరిభీకరులుగా ప్రవర్తిస్తారు.

చూటే, లోపింగ్‌హ్వాలు సికాంగ్‌లో 1935 శీతాకాలంలో ఆగిపోయారు. నాలుగవ ఎర్రసైన్యం సూసియాంగ్‌చీన్, ఛాంగక్వోటోలు కూడా ఇన్నర్ టిబెట్‌లోనే ఆగారు. వారు వెంటనే రాజకీయ ప్రచారకులను బంపి, తమ జాతుల స్వయంనిర్ణయ సూత్రాన్ని, కమ్యూనిస్టు విధానాలను బోధించారు. "ప్రత్యేక అల్పసంఖ్యాక జాతుల స్వతంత్ర సోవియట్ ప్రభుత్వాన్ని ఎర్రసైన్యాలు నెలకొల్పాయి. ఆ ప్రభుత్వ పాలనకు లోబడి రెండు లక్షల ప్రజలు నివసించే ప్రాంతముంది. దేఘేవద్ద టిబెటన్‌తెగ నాయకులతో ఎర్రసైన్యాలు తీవ్రంగా పోరి సియాకేటోటే అను గొప్ప సేనాధిపతిని, ఒక లామాను పట్టుకున్నారు. సియాకే క్షతగాత్రుడై ఔషధసేవ చేస్తున్నపుడు ఎర్రసేనానాయకులు చాలా దయగాజూచి అతని విశ్వాసాన్ని చూరగొన్నారు. సోవియట్ల మైనారిటీల సమస్యా పరిష్కార మార్గాన్నంగీకరించి ఆక్రాంత్ర సోవియట్ ప్రభుత్వంలో కార్యనిర్వాహక

వర్గంలో పనిచేయజొచ్చారు ఆ ప్రభుత్వపు రాజధాని కాంగ్‌టింగ్. ఆ రెండవ ఎర్ర సైన్యం వచ్చి చూ-టే సైన్యాలతో కలుసుకొని అందరూ కన్సూకు వెళ్ళిపోయేవరకు నాలుగు మాసాల పర్యంతం ఆ ప్రభుత్వం పరిపాలన సాగించింది. మంజూ, టిబెటను తెగవారు సుమారు ఒక వెయ్యిమంది ఎర్రసైన్యంతో జేరి వాయువ్య చైనాలోని షెన్సీ సోవియట్లకు వెళ్ళారు.

యాంగ్‌ట్సీనది ఎగువభాగం నీడుగున్ సన్నగా యూనాన్, జెక్వాన్ రాష్ట్ర సరిహద్దుల్లో 11000 చదరపుమైళ్ళ ప్రాంతంలో స్వతంత్ర లోలోజాతివారు నివసిస్తున్నారు. ఆ లోలోనాడులో చైనావారెవ్వరూ అడుగిడుటకు సాహసింపరు. స్వభావ ప్రవృత్తులలో వారు ధీరులు. స్వతంత్రులు. ప్రత్యేక వేషభాషలు, సాంప్రదాయములు, నాగరికత కలవారు. వారిలోకూడ నలుపు, తెలుపు లోలోలు అను రెండు తరగతు లున్నాయి. నల్లలోలోలు పాలకులు; తెగ నాయకులు. వారిలో ఒక్కొక్కరికి 50 మంది తెల్లలోలో బానిస లుంటారు. ఆ దానిసలను కొట్టినను, చంపినను ఫిర్యాదు లేదు. వారు తమ ప్రభువులకు వ్యవసాయం, వేట మున్నగు పనులు చేయాలి. అందువలన సోవియట్ వర్గపోరాట సిద్ధాంతం వారిలో గొప్ప భావసంచలనం కలిగించింది.

నింగ్‌సియా, సూయువాన్ కన్సూరాష్ట్రాలు జేరి మంగోలియా దేశమైంది. ఆ ప్రాంతంలోనూ, జెహోల్, చెహార్ రాష్ట్రాల్లోనూ కలిపి మంగోలు జాతివారు 20 లక్షలకంటె హెచ్చులేరు. మంచూ వంశ వినాశనం మంగోలు జాతికి స్వేచ్ఛను ప్రసాదించలేదు. పైగా చైనీయులు మంచూరియాకు పోయినట్లే మంగోలియాకుకూడా తండోపతండాలుగా వలసకుపోయి పంటభూముల నాక్రమించుకుంటున్నారు. నింగ్‌సియా, కన్సూలలో హెచ్చుగానున్న మహమ్మదీయులు, చైనీయులు సారవంతమైన ప్రాంతాన్నాక్రమించి మంగోలులను నికృష్టంగా జూచుచుండుట

వలన స్వపరిపాలన నిస్తామని జపానువారు చేసే ప్రచారం అమృతోపమానమైంది. చైనాగోడ పరిసర ప్రాంతాల్లో మాత్రమే కమ్యూనిస్టులు వారి సూత్రాలను బోధించ గలుగుతున్నారు.

మోసీయుంగ్, పెంగ్‌టేహ్వాలు మొదటి యెర్రసైన్యంతో మహా ప్రస్థాన గమ్యస్థలమైన వాయువ్యచైనా ప్రవేశించిన నాటినుండీ మహమ్మదీయ సమస్య నెదుర్కోవలసి వచ్చింది. పెన్సీ సోవియట్లను స్థాపించిన వెంటనే ముస్లిములలో కమ్యూనిస్టులు ప్రచారం చేయ మొదలుపెట్టారు. మొదటి మాసాల్లో చాల ముస్లిం గ్రామ ప్రజ ఉత్సాహంతో గ్రామ సోవిట్లను నెలకొల్పి ప్రజాకాంగ్రెసులను సమావేశపరుస్తున్నారు. 1936 లో ముస్లిమ్ సోవియట్ ప్రభుత్వ కమిటీకూడా నెలకొల్పబడింది. ముస్లిం యోధులతో అనేక సైనిక దళములుకూడా నిర్మింపబడ్డాయి. కాని ముస్లిం ప్రజావీకంలో కలిగిన యీ అపూర్వ వర్గచైతన్యం ముస్లిం సర్వసేనానులకు కంటకప్రాయమైంది. కొమింటాంగుతో చేరి కమ్యూనిస్టుల నణచుటకు వారు తీవ్రంగా ప్రయత్నాలు చేయజొచ్చారు. ఫెంగుయాసియాంగు వాయువ్యచైనాకు గవర్నరుగా నున్నపుడు 1928 లో ముస్లిముల నందరనూ మాహాంగ్‌క్వీ, మాహంగ్‌పింగ్, మాపూఫాంగ్, మాపూచింగ్, మాచుంగ్‌యింగ్ అను ఐదుగురు సామంత ప్రభువుల పాలన క్రిందకు తీసికొనివచ్చాడు. కాని త్వరలోనే మాచుంగ్‌యింగ్‌ను అనేక కుట్రలు పన్ని పదభ్రష్టుని చేసివేశారు.

కన్సూ, దక్షిణనింగ్‌సియాలలో సంపూర్ణంగా ముస్లిం వాతావరణం వుంది. అచ్చట మతానికి అన్నిజీవిత రంగాల్లోను ప్రాధాన్యత వుంది. ముల్లాలు, మౌల్వీలు, అమీరులు అధికారం చెలాయిస్తారు. మసీదుల్లో రోజుకు ఐదుపర్యాయాలూ నమాజు చేస్తారు పండుగలు, ఉత్సవాలు సాగిస్తారు. ఐనప్పటికీ వారుచైనీయులను వేషభాషల్లో అనుసరిస్తారు. చైనీయులతో పెండ్లిండ్లు చేసుకుంటారు.

కొమింటాంగు ప్రభుత్వం వారిందరినీ ప్రత్యేక జాతిగా గుర్తించి స్వపరిపాలనాధికార మివ్వ నంగీకరించదు. అందువలన ముస్లిములు పాత, క్రొత్త ఆధునిక భావాలతో సంఘాలను స్థాపించుకున్నారు. ఆధునికులు ఆధునిక శాస్త్రీయ విజ్ఞానంపై విశ్వాసముంచి, పాత మూఢ నమ్మకాలను, ఆచారాలను వదలివేయవలెనని ప్రచారం చేస్తున్నారు. కాని పాత, కొత్త సంఘాలవారు యీ నాస్తికులకు వ్యతిరేకంగా ఐక్య సంఘటనను నెలకొల్పుకున్నారు. క్రొత్త సంఘంవారు 'పాన్ హానిజమ్' అనగా "అల్పసంఖ్యాక జాతులవారు చైనాజాతితో కలిసి పోవలయు"నని కొమింటాంగు ప్రభుత్వానుకూలమైన ప్రచారం సాగిస్తున్నారు. నలుగురు 'మా'నాయకులు, ప్రభుత్వోద్యోగులు, వారి జోహుకుందార్లు యీసంఘంలో ప్రముఖులు. ఈ 'మా' ప్రభువులు పెండ్లిండ్లు, ఆహార పదార్థాలు, భూమి, పశువులు, గుర్రాలు, ఉప్పు, పడవలు, ఇండ్లు, కాయగూరలు, ఒంటెలు, పావురాలు, నల్లమందు, పుగాకు, సారాయి, స్టాంపులు మున్నగు వాటిపై అమ్మకపు పన్నులు వేసి ప్రజాపీడకులుగా నుండి ఒక్కొక్కరు అరవైమందినిపైగా పెండ్లియాడి, విషయ లోలురైయుండుటవలన వారెట్టి సంస్కరణోద్యమాన్ని నడిపించలేక పోతున్నారు.

మాహాంగ్ క్వే ఉప్పువ్యాపారాన్ని తన గుత్తచేసుకున్నాడు. ప్రత్యేక వ్యక్తులు ఉప్పువ్యాపారం చేయకుండా నిషేధించడమేకాక, ప్రతి పౌరుడూ తన కొట్టులవద్ద అర్ధశేరు ఉప్పు కొనితీరాలని శాసించాడు. గొర్రెలు, ఆవులు, గుర్రాలు అమ్మితే నూటికి 30 పాళ్ళు, గోధుమల నమ్మితే నూటికి 40 పాళ్ళు పన్నుచెల్లించాలని ఘోరనియమం చేశాడు. అంతేకాకుండా సరిహద్దుల రక్షణకని కుటుంబమునకొక యువకుని సైన్యంలోనికి పంపితీరాలి. లేకపోతే 150 డాలర్ల సుంకాన్ని చెల్లించాలి. ఆ డబ్బును నూటికి 40 నుండి 60 వరకు వడ్డీ రేటుపైన పేదప్రజలు అప్పుతెచ్చి చెల్లించాలి. రైతుల్లో నూటికి 70 మంది అప్పుల్లో ఉన్నారు.

నూటికి 60 మంది అప్పుచేసి తెచ్చిన ధాన్యంతో బ్రతుకుతున్నారు. ఈ దుర్భరపరిస్థితులకు రైతాంగము ప్రభుత్వముపైన తీవ్రమైన అసంతృప్తి జెందియున్నారు

1936 సంవత్సర ప్రారంభదినాల్లో నింగ్‌సియా, కన్సూలనుదాటి ఎర్రసైన్యం యెల్లోనది పద్దకు వెళ్ళినపుడు ముస్లిములలో ఈ దిగువ ప్రచారం చేశారు :

"అక్రమపు పన్నులను రద్దుచేస్తాము. చైనా, సింకియాంగు, బౌటరుమంగోలియాలలోని ముస్లిములను ఐక్యపరుస్తాము. బొట్టి న్యంగా సైన్యంతో చేర్చేపద్ధతిని రద్దుచేస్తాము. పాతఋణాలను రద్దుచేస్తాము ముస్లిము సంస్కృతిని రక్షిస్తాము. మతస్వాతంత్ర్యాన్ని కాపాడుతాము. జపాను వ్యతిరేక సైన్యాల్ని నిర్మించి సాయుధులను జేస్తాము"

ఈ ప్రచారం ముస్లిము లందరియొక్క ఆశయాలను ఆశలను కలిగివున్నందున, "మా" ప్రభువుల వ్యతిరేకులందరికీ యుద్ధనినాదాలయ్యాయి. "మాహంగ్‌క్వే నశించాలి ! మాహంగ్‌క్వే కొమింటాంగు ప్రభుత్వం నశించాలి ! జపాను వ్యతిరేక ముస్లిమ్‌సైన్యాలను నిర్మించండి! స్వతంత్రముస్లిం ప్రభుత్వాన్ని నిర్మించండి !" అను నినాదాలను చేస్తూ ముస్లింయువకులు ప్రబోధిస్తున్నారు. కమ్యూనిస్టుపార్టీలో అనేక ముస్లిం యువకులు చేరి వారివద్ద రాజకీయశిక్షణ పొందుతున్నారు. ముస్లిం సైనికులు విద్యాభ్యాసం చేస్తున్నారు. ముస్లిం కమ్యూనిస్టు ప్రచారకదళాలు ప్రతి గ్రామంలోనూ, ప్రతి గృహమునకూ పోయి విప్లవ సందేశాన్ని వినిపిస్తున్నారు. పీడితప్రజలైన ముస్లిములు హన్‌జాతివారు కలిసి యీ విప్లవాన్ని సాగించాలని, ఉభయులకూ శత్రువైన జపాను సామ్రాజ్యవాదులతో పోరాడాలని బోధిస్తున్నారు. ఈ విధంగా కమ్యూనిస్టులకు అనుకూల వాతావరణం సృష్టింపబడినందున యెల్లోనదిగట్టున ఉన్న

మూపూఫాంగ్ రాజ్యంనుండి 200 మైళ్ళ దూరం నాలుగవ ఎర్రసైన్యం యాత్రసాగించినప్పుడు ముస్లిములు వారికెట్టి కష్టనష్టములు కలిగింప లేదు. పైగా అనేక గ్రామాల్లో గ్రామసోవియట్లను నెలకొల్పుకొని సెప్టెం బరుమాసంలో ప్రథమసోవియట్ ప్రతినిధులసభ జరుపుకున్నారు.

లీసంగ్యీ నాయకత్వాన మాహంగ్క్వే కొమింటాంగు సైన్యాలు, మాచు, పెంగ్ టేహ్వై సైన్యాలతో కలియకుండా నిరోధించు టకు పంపబడ్డాయి. కాని ఆ సైన్యంలోని 3000 మంది విడిపోయి లూంగ్సీవద్ద చూటే సైన్యాలతో జేరిపోయారు. ఆ చేరిన సైన్యంలో ఒక ఆశ్వీక పటాలంకూడావుంది. మాహంగ్క్వే మాహంగ్పింగ్ల ఆశ్వికసైన్యాలతోను, నాన్కింగు ప్రథమ ఆశ్వికసైన్యంతోనూ ఎర్ర సైన్యాలు పోరి 3000 గుర్రాలను పట్టుకున్నాయి. షెన్సీలో యెర్ర సైన్యాలు ప్రవేశించగానే, ముస్లిం రౌతుసైనికులు వారిని ముక్కలక్రింద తరుగుతాయని కొమింటాంగు సేనానులు ఆశించారు కాని 1935 లో షెన్సీలో సైనికకళాశాలను తెరిచి అందులో ఒక నూతనపోరాటవిధా నాన్ని భటులకు బోధించారు. 1936 లో ప్రథమంగా అందులో శిక్షణ పొందిన యెర్ర ఆశ్వికపటాలం యుద్ధరంగంలోనికి వచ్చి అనేక విజయా లను సాధించింది.

ముస్లిములు గొప్ప రౌతులుకాని గుఱ్ఱపుస్వారిచేస్తో తుపాకులను కాల్చుటను వారు అభ్యసింపలేదు. లీచె పేనాని ఎర్ర ఆశ్వికభటులకు గుఱ్ఱపుదండులతో తుపాకియుద్ధం చేయుట నేర్పాడు. అందువలన సుశి క్షితులైన వీరికి, ముస్లి ఆశ్వికపటాలాలు ఓడిపోతూవచ్చారు.

# 23 వ అధ్యాయం.

## ఐక్యత కొరకు పోరాటం.

కమ్యూనిస్టులు దక్షిణ చైనాలోని సోవియట్ రాజ్యాన్ని వదలి, వాయువ్య చైనాకు మహా ప్రస్థానం సాగిస్తున్న కాలంలో, జపానువారు రాజకీయ కుట్రలు, ఒత్తిడివలన ఉత్తర చైనాలోని ఐదు రాష్ట్రాలను కబళింప ప్రయత్నాలు తీవ్రంగా చేశారు. జపానుయొక్క యీ కుట్రలే సఫలమైతే చైనాదేశమంతా వారికి పాదాక్రాంత మగుటకు ఆట్టేకాలం పట్టదు.

ఈ జాతీయ విపత్కర, వినాశన పరిస్థితులను గమనించిన కమ్యూనిస్టుపార్టీ కేంద్రకార్యనిర్వాహక వర్గంవారు చైనాప్రజల కీ క్రింది విధంగా 1935 అగస్టు 1 నాడు విజ్ఞప్తిచేశారు.

"చైనాపౌరులారా! సోదర సోదరీమణులారా!

జపానును ప్రతిఘటిస్తిమా, మనం ప్రాణాలతో నిలుస్తాం. లేక దానోహం చేస్తిమా, సర్వనాశనమౌతాం!

జపానుతో పోరాటాన్ని సాగించేందుకు, జాతీయరక్షణకు పూనుకునే అఖిలచైనా ప్రభుత్వాన్ని నెలకొల్పేందుకు, చైనా సోవియట్ ప్రభుత్వం చొరవతీసికొనేందుకు సిద్ధంగావుంది దేశరక్షణకు పూనుకొనే అన్ని రాజకీయ పక్షాలతోను, ప్రజా సంస్థలతోను, స్థానిక, సైనిక, రాజకీయ బృందములతోను, ప్రముఖ ప్రజాసేవకులతోను కలిసి పనిచేయుటకు సర్వసంసిద్ధులుగా వున్నాం!"

చైనా కమ్యూనిస్టుపార్టీ వారు అట్టి ప్రజాప్రభుత్వం యీ క్రింది ప్రాథమిక విధులను నెరవేర్చాలని కూడా ప్రకటించారు.

1. జపాను దురాక్రమణను ప్రతిఘటిస్తో, వారి ఆక్రమణక్రింద నున్న ప్రాంతాలను స్వాధీనపరచుకోవాలి.

2 ప్రజాజీవనోపాధిని అభివృద్ధిచేయాలి. నీటివసరులను కలిగించి, కరువుప్రాంతాలలో పంటభూములకు సౌకర్యాలను చేయాలి. పన్నులు తగ్గించాలి. ఉచితసార్వజనీనవిద్య, వైద్యసౌకర్యాలు. వేతనాభివృద్ధి కలిగించాలి.

3. జపానువారియొక్క, జపాను అనుకూలురైన దేశద్రోహుల యొక్క ఆస్థులను జప్తుచేయాలి.

4. ప్రజాతంత్ర సూత్రములను అమలుపరచి, రాజకీయ నిర్బంధితు లను వదలాలి

5. జపాను సామ్రాజ్యవాదులకు వ్యతిరేకులగు అందరు ప్రజలతోను స్నేహసంబంధాలను నెలకొల్పాలి.

జపాను సామ్రాజ్యవాదులు తీరనితృష్ణతో చైనాను కబళించుటను సహించలేని దేశభక్తులు, చియాంగ్ కేషేక్, వాంగ్‌చింగ్‌వీల లొంగుబాటు విధానాన్ని సహించలేకపోతున్నారు 1934 ఆగస్టు 2 నాడు సన్‌యట్ సేన్ సతీమణి ఆధిపత్యమున మూడువేలమంది, వివిధజాతీయ రంగా ల్లోను ప్రసిద్ధికెక్కినవారు సమావేశమై, నాన్కింగుప్రభుత్వం ఇకమీదట ఒక్కక్షణంకూడా ఆలసించకుండా, జపాను దురాక్రమణపరులను ప్రతి ఘటించాలని "జపాను వ్యతిరేకయుద్ధంకొరకు, చైనాప్రజలకొక ప్రాథ మిక కార్యక్రమాన్ని ప్రకటించారు. ఈ కార్యక్రమంలో నాన్కింగు ప్రభుత్వం సేవలన్నిటినీ వెంటనే యుద్ధసన్నద్ధం చెయ్యాలనీ, ప్రజల నందరిని సాయుధులను చెయ్యాలనీ, జపానువారి పరిశ్రమలను, వ్యాపార బ్యాంకింగుసంస్థలను జప్తుచెయ్యాలనీ, జపాను వ్యతిరేకులందరితోను మైత్రిచేసుకోవాలనీ, చైనాప్రజలచేత యెన్నుకొనబడిన జాతీయప్రభుత్వం ఏర్పరచాలనీ కోరారు.

ఈ ఉభయవిజ్ఞప్తులూ ఐక్యతకొరకు చైనాప్రజలు జరిపే పోరా టానికి నాందీ ప్రస్తావనచేశాయి. "చైనీయులతో చైనీయులు పోరాద

రాదు" అనే వివాదం యీ పోరాటంలో ప్రధాన వివాదమైంది.

పట్టణాల్లోని కార్మికులకు మాత్రమే రాజకీయ చైతన్యమూ, నిర్మాణానుభవమూ, సాంప్రదాయములూ ఉన్నాయి కాని వాయవ్య చైనాలోని సోవియట్ ప్రాంతాల్లోమాత్రమే కార్మికకర్షక సంఘా లున్నాయి. తక్కినప్రాంతాల్లో కార్మికసంఘాలు రహస్యంగా పనిచేయ డమో, కొమింటాంగుకు లోబడి నామమాత్రావశిష్టంగా వుండటమో జరుగుతోంది. కొమింటాంగు పాలితప్రాంతాల్లో, పల్లెపట్టుల్లోనూ, రైతులలోనూ రాజకీయప్రబోధం తక్కువ. ప్రజాతంత్ర హక్కులు నిరాకరింపబడ్డాయి. ఈ పరిస్థితుల్లో ప్రజాసామాన్యంలో జపాను వ్యతిరేక భావాలను కలిగించి, చైనా దాస్యాంధకారంలో మునిగిపోకుండా రక్షించే మహత్కార్యాన్ని నెరవేర్చడానికి కమ్యూనిస్టులు, సకాయట్ పేఁ సతీ మణి మున్నగువారు పూనుకున్నారు.

చైనా పారిశ్రామిక పెట్టుబడిదార్లు, సోవియట్ విప్లవభీతితో దిక్కుతెన్ను కానరాని పరిస్థితుల్లో ఉన్నారు. బ్యాంకర్లూ వ్యాపారస్థులూ, విదేశపెట్టుబడిదార్లు, వ్యాపారస్థులతోను లాలూచీ అయ్యారు. జపాను వ్యతిరేకోద్యమంవచ్చి, ప్రజలు సాయుధులైతే రైతాంగశక్తి విజృంభి స్తుందని జమీందార్లు పెద్ద భూస్వాములు భయపడుతున్నారు.

సైనికప్రభువులందరూ సంపూర్ణంగా నాన్కింగు ప్రభుత్వానికి లోబడక యింకా శక్తివంతులుగానే వున్నారు. చెన్‌చీటింగు, లీసంగ్ జేన్, పేచుంగ్‌సీలు 1931 నుండీ నైఋతి రాజకీయ సంఘాన్ని నెల కొల్పి బలోద్ధతతో యించుమించుగా స్వతంత్రులవలె వ్యవహరిస్తున్నారు. రైతుపీడనము, నల్లమందు వ్యాపారాన్ని నిరాఘాటంగా సాగిస్తున్నారు. ఆ సైనిక ప్రభువులకు వారి స్వంతసైన్యాలున్నాయి. వారే పన్నులను వసూలుచేసుకొని, అందులో కొద్ది భాగాన్ని కేంద్ర నాన్కింగు ప్రభు త్వానికిచ్చారు. ఇట్టి వీరిని జపానువ్యతిరేక సంయుక్త సంఘటనలోనికి తీసుకొని వచ్చుటెట్లు ?

మేధావుల్లో చాలమంది జపానును ప్రతిఘటించాలని యెంచినా, పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన జపానుతో పోరాటానికి చైనాకు శక్తిలేదని నమ్ముతున్నారు. కాని విద్యార్థులు మాత్రం యీ దశలో సంపూర్ణంగా జపానువ్యతిరేక భావాలను ప్రచారంచేస్తో, ఊరేగింపులు చేస్తున్నారు. ప్రథమంనుంచి చైనాయొక్క సంపూర్ణస్వాతంత్ర్యానికి, ఐక్యతకూ ఒక్క సోవియట్ రష్యా తప్ప మరియేయితర విదేశప్రభుత్వమూ తోడ్పడలేదు. 1930 లో ఫెంగ్‌యూసియాంగ్ తిరుగుబాటు చేసినప్పుడు కూడా గ్రేటుబ్రిటన్ ప్రభుత్వం ఆతనితో స్నేహంగానే వుంది.

ఈ పరిస్థితులను సావుకాశంగా తీసుకుని జపాను ఏజెంట్లు, చైనారాజకీయ నాయకులలోగల వ్యక్తిగత ద్వేషాలను, పదవీవ్యామోహాన్ని రెచ్చగొట్టి, అంతర్యుద్ధాగ్ని ఆరకుండా ప్రజ్వలింపచేస్తోనే వున్నారు. చైనీయుల్లో ఐకమత్యం కలిగితే జపాను సామ్రాజ్యవిస్తరణ అరికట్టబడుతుంది. గనుక వారు నాన్కింగ్‌ప్రభుత్వ ప్రధాన నాయకుల్లో ముఖ్యుడైన వాంగ్‌చింగ్‌వీ, అతని అనుచరులద్వారా అంతర్యుద్ధం ఆగకుండా చూస్తున్నారు. ట్రాట్స్కీ అనుయాయులను జపానువారు లంచములు పెట్టి వారిచే కార్మికులలో పెట్టుబడిదారీ వ్యతిరేక వినాదాలను ప్రచారంచేయించి, అంతర్యుద్ధానికి దోహదం చేయిస్తున్నారు. ఈవిధంగా సాధ్యమైన నన్నివిధాలా జపానుఏజెంట్లు ఐక్యసంఘటన జరుగకుండా ప్రయత్నించారు.

1934 లో వాంగ్‌చింగ్‌వీ ప్రభుత్వంవారు ప్రత్తి దిగుమతిపై అధికసుంకములను విధించి, వస్త్రములపై తగ్గించి, జపాను దిగుమతులకు సదుపాయం చేశారు. జపాను పారిశ్రామికులకు లాభం కల్గించునవీ, బ్రిటిషు చైనా పారిశ్రామికులకు నష్టం కల్గించునట్టి అనేక కృత్యాలను చేశారు. 1935 లో వాంగ్‌చింగ్‌వీ, హొయింగ్‌చిన్‌లు, హోవుమేజూ

సంధిని చేసికొని, హోపే, చహార్ రాష్ట్రాలను జపానువారి పలుకుబడిక లోనగునట్లు చేశారు.

కాని యీ చిద్రోహానికి సహించలేక 1935 డిశెంబరు 5 వ తేదీ నాడు పెకింగువిద్యార్థులు, సైనికులు యెక్కుపెట్టిన తుపాకులతో వారిస్తో న్నప్పటికీ లక్ష్యపెట్టక, "అంతర్యుద్ధాన్ని ఆపండి! ప్రజలారా, సాయు ధులుకండి! జపాన్‌పై యుద్ధం ప్రకటించండి! హోపుమేజూ ఒడం బడిక రద్దుఅవ్వాలి!" అంటూ గొప్ప ప్రదర్శనం చేశారు టీన్‌ట్సిన్ విద్యార్థులు కూడా పీరిననుసరించారు చైనాదేశంలోని నలుమూలలనుండీ నాన్కింగుకు విద్యార్థిదళాలు యాత్రలు సాగించాయి. ప్రతిచోటా సైనికు లతో విద్యార్థులు స్నేహసంబంధాలను నెలకొల్పకొచ్చారు. జపానువ్యతి రేక ప్రచారకదళాలు తుపాను ప్రచారంచేస్తున్నాయి. దేశమంతటా "జాతీయవిముక్తి సంఘాలు" నెలకొల్పబడ్డాయి. పోలీసులు, సైనికులూ అడ్డగించాలని ప్రయత్నించినా, యీ ప్రచారం పెనువెల్లువవలె దేశాన్ని ముంచెత్తింది. "చైనీయులతో చైనీయులు పోరాడరాదు, అనే వినాదాన్ని ప్రభుత్వోద్యోగులు అణచివేయలేకపోయారు.

'మంచూరియా స్వచ్ఛంద సేవకులయాత్ర' అను వీరగేయం ప్రజల్లో శౌర్యాన్ని రేకెత్తించి, జపాను వ్యతిరేక భావాల్ని కలిగించ కొచ్చింది. కర్మాగారాల్లో కార్మికులు, పంటపొలాల్లో రైతులు గొంతెత్తి వీరావేశంతో "బానిసలుగా బ్రతుకు నిరాకరించే భవ్యులందరూ లేవం డోయ్! మన రక్తమాంసాలతో అభేద్య కుడ్యాల నిర్మించ నారండోయ్!" అని పాడ కొచ్చారు, ప్రభుత్వ నిషేధం యీ గేయాన్ని పాడకుండా ఆప లేకపోయింది. ఒక యునాన్‌వాసియగు కూలీచే వ్రాయబడిన యీ గేయాన్ని చైనాకమ్యూనిస్టులు తమ మహాప్రస్థానమార్గంలో పాడి ఉత్సాహ పరవశు లయ్యారు. చైనా విముక్తసంఘ సభ్యులచే ప్రచారం చేయబడిన యీగీతం లక్షలాది ప్రజలను ఉద్రిక్తులను చేసింది.

1934 లో టీగా-మాన్ అను రచయితచే మంచూరియన్ గెరిల్లా దళం వారు జపానును ప్రతిఘటించిన ఉదంతాన్ని యితివృత్తంగా తీసి కొని వ్రాసిన 'ఆగస్టులో ఒక గ్రామం' అను నవల ప్రజల్లో గొప్ప సంచ లనం కలిగించింది.

దేశమంతా జపాను వ్యతిరేక ధావాలతో ఉడికిపోతున్న యీసమ యంలో 1935 నవంబరు మాసంలో నాన్కింగు ప్రభుత్వ ప్రధానమంత్రి విదేశాంగమంత్రిమైన వాంగ్‌చింగ్‌వీపై ఒకరు తుపాకిని పేల్చి గాయ పరిచాడు. వాంగ్ కూడా తనపై ప్రజల్లో ద్వేషాగ్ని రగుల్కొనడం చూచి యూరప్ పర్యటనకు వెళ్ళిపోయాడు. చియాంగ్‌కేషేక్ కార్యనిర్వాహక సంఘానికి కూడా అధ్యక్షుడయ్యాడు.

ఉత్తర చైనాలో అంతులేని దాహంతో జపాను ప్రవర్తించుటను చూచి, అప్పటి ప్రబలుడైన ఫెంగ్‌యూసియాంగ్, మంచూరియాను కోల్పోయిన చాంగ్‌మూలియాంగ్ నాన్కింగు ప్రభుత్వంయొక్క యీ లొంగుబాటు విధానానికి అసంతృప్తులయ్యారు. చైనా పారిశ్రామికులు నూతన పరిశ్రమలను స్థాపించనివ్వకుండా మంచూరియా ఆక్రమణవలన లబ్ధిపొందిన జపాను పారిశ్రామికులు అరికట్టటంవలన, జపానువారిమీద అసంతృప్తి హెచ్చింది. మంచూకోలోని అమెరికను, బ్రిటిషు నూనె వ్యాపారాన్ని జపానువారు అరికట్టినందున ఉత్తర చైనాలోని బ్రిటిషు, అమెరికను వ్యాపారస్తులు కూడా అసంతృప్తులై యున్నారు.

1936 మే 5 నాడు చైనా కమ్యూనిష్టుపార్టీ నాయకులు వెంటనే అంతర్యుద్ధంమాని జపానుతో యుద్ధం ప్రారంభించవలెనని నాన్కింగు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. జూన్ ఒకటవ తేదీనాడు అఖిలచైనా విముక్తసంఘం ఏర్పడింది. దానికి సన్‌యట్‌సేన్ సతి, మాసియాంగ్‌పే మున్నగు ప్రముఖులు, నాయకులు అంతర్యుద్ధం వెంటనే ఆపివేసి, ఎర్ర సైన్యంతో యుద్ధవిరామసంధి చేసుకోవాలనీ, జపాను వ్యతిరేక ప్రభుత్వ

సాగించాలనీ వారు ప్రకటించారు ఈ సంఘానికి అత్యమితమైన పలుకుబడి కలిగింది.

ఇదే సమయంలో జపాను కీలుబొమ్మ సైన్యాలు సూయువాన్‌పై జూన్‌మాసంలో దండెత్తాయి. చైనా దేశభక్తులకు మితిమీరిన ఆగ్రహం కలిగింది. ఆ వెనువెంటనే యెర్రసైన్యాలు వారిని ప్రతిఘటించుటకు దండు వెడలాయి. కాని ఐక్య సంఘటనకొరకు సర్వ ప్రయత్నాలు చేస్తోన్న యెర్రసైన్యాలకు కొమింటాంగు సైన్యాలతో సంఘర్షణ వస్తుందనే జంకుతో సియాన్ లాంచౌ రాజబాటకు పశ్చిమ దిశగా మళ్ళారు.

జపాన్ కీలుబొమ్మసైన్యాలు సెప్టెంబరు మాసంలో తిరిగి సూయువాన్‌పై దండెత్తాయి. అప్పుడు ఫూనోయీ సేనాని వారిని యెదిరించాడు. ఫూ సైన్యాలకు ప్రజాసామాన్యం అండగా నిలిచింది వేలకొలది విద్యార్థులు షాంఘే, సింగ్‌టో, టీన్‌ట్సిన్‌లలోని జపాను బట్టలమిల్లులలో పనిచేసే కార్మికులు ఒకలక్షమంది పైగా సమ్మెకట్టి గొప్ప ప్రదర్శనలు చేశారు. ఈ సంఘటన చైనాప్రజల్లో అపూర్వ సంచలనం కలిగించింది. ఈ సమ్మె ఒకమాసం రోజులు సాగింది. జపాను యుద్ధనౌకలు సింగుటోకు వెళ్ళాయి. కాని యీ ఉద్యమాన్ని అణచలేకపోయాయి. ఈ సమ్మెదార్లకు సహాయం చేయుటకుగాను జాతీయ విముక్తి సంఘంవారు ఒక విశ్వవిద్యాలయాధ్యాపకుడు, ఒక ప్రచురణకర్త, ఒక బ్యాంకరు తదితరులతో కూడిన సహాయక సంఘాన్ని షాంఘేలో యేర్పరచారు. ఈ కమిటీ సభ్యులలో యేడుగురిని నాన్కింగ్ ప్రభుత్వం జైల్లో పెట్టారు. చైనా సైన్యాలకు యిన్‌స్పెక్టరు జనరలుగా నియమింపబడిన ఫెంగ్‌యూసియాంగ్ సేనాని యీ ప్రభుత్వ చర్యను బహిరంగంగా ఖండించాడు.

ఇదే సమయంలో నైఋతిచైనా రాజకీయ సంఘంవారు లోపాయికారీగా జపానువారితో సంప్రతింపులు సాగిస్తోనే బహిరంగంగా జపానుతో పోరాడేందుకు వస్తున్నామని సైన్యాలను నడిపించ నారంభించారు.

నాన్కింగు ప్రభుత్వం జపాను సామ్రాజ్యవాదానికి విరుద్ధంగా తాము దేశభక్తితో యీ తిరుగుబాటును సాగిస్తున్నామని వారు ప్రకటించారు.

ఈ ప్రమాదాన్ని గుర్తించి కమ్యూనిస్టు పార్టీవారు వెంటనే కొన్ని సామాన్య సూత్రాలను నిర్వచించారు. "నైఋతిచైనా రాజకీయ సంఘం వారు యథార్థంగా, జపాను వ్యతిరేక పోరాటం కావాలని కోరితే, వారు పాలించే ప్రాంతంలో బహిరంగంగా జపాను వ్యతిరేక ప్రచారం సాగిస్తూ ప్రజాసామాన్యాన్ని సాయుధులను చెయ్యాలి. వారు యెఱ్ఱసైన్యంతో సహకరించాలి." కాని యీ తిరుగుబాటుదార్లకు యీ భావాలు లేనందున వారితో పరిపూర్ణంగా సహకరించ లేదు. నాన్కింగు ప్రభుత్వ సైన్యాలు మెల్లగా వారిని ఓడించాయి. చెన్‌చీటంగ్ పారిపోయాడు. లీసంగ్‌జెన్ పెచెంగ్‌సీలు ప్రభుత్వంతో రాజీపడ్డారు.

జాగృతిపొందిన ప్రజలు, జపాను వ్యతిరేకాందోళన జరుపుతున్నందున హెచ్చుకాలం నాన్కింగు ప్రభుత్వంవారిని విరోధించలేకపోయింది. ఈ లోగా కాంటన్‌హాంకో రైల్వేపని పూర్తిఅయింది విమాన రహదార్లు కూడా యేర్పడ్డాయి. క్రమంగా కేంద్రప్రభుత్వంయొక్క బలం హెచ్చింది. కాని చాంగ్‌చింగ్‌షే అనుయాయులు మాత్రం అంతర్యుద్ధాన్ని కొనసాగించాలనే పట్టుబడుతున్నారు. అందువలన కేంద్రప్రభుత్వంలో జపాను ప్రతిఘటనకంటె, సోవియట్ల నిర్మూలనే ప్రధానంగా కన్పించింది. ఐతే సకాఫో, టి. వి. సూంగ్, ఫెంగుయూసియాంగులు మాత్రం జపాను ప్రమాదాన్ని గుర్తించారు.

1936 అక్టోబరు 9 వ తేదీని హాయినింగ్‌వద్ద నాలుగవ ఎఱ్ఱ సైన్యం చూతే, సూసియాంగ్‌చీన్, హోలుంగ్, చాంగ్‌క్వోటోల నాయకత్వాన వచ్చి ప్రధమ ఎఱ్ఱసైన్యంలో కలిసింది. కన్సూరాష్ట్రంలోని ఈశాన్యభాగమంతా ఎఱ్ఱసైన్యాలకు లోబడింది. వాయువ్యప్రాంతాలను కూడా లోబరుచుకునేందుకు నాలుగవసైన్యం వెళ్ళింది. ఎఱ్ఱసైన్యాలు

మొత్తం తొంబదివేలను మించాయి. వీరందరూ యుద్ధాలలో ఆరితేరిన వీరులు. ఎర్రసైన్యాలకు షోయాన్ ప్రధానకేంద్రంగా వుంది. ఎర్రసైనికు లందరూ ఉజ్వల భవిష్యత్తునందు అచంచలమైన విశ్వాసంతో ఐక్య సంఘటనా విధానాన్ని ప్రచారం చేస్తున్నారు.

## సియాన్ తిరుగుబాటు ఉదంతం.

ఈ సమయంలో నార్త్వెంగు ఉపసర్వసేనాధ్యక్షుడైన చాంగ్‌సూలి యాంగ్ అధిపత్యాన టుంగ్‌పే సైన్యాలు. ఎర్రసైన్యాలను, షెన్సీ, కన్సూ, నింగ్సియాంగ్ సోవియట్లను నాశనం చేసేందుకు పంపబడ్డాయి. సుమారు ఒకలక్ష ముప్పదివేలమంది యీ సైన్యంలో వున్నారు. చాంగ్ సూలియాంగ్ 1931 సెప్టెంబరులో మంచూరియాను పోగొట్టుకున్న నాటినుండీ తన సైన్యాలతో చియాంగ్‌కేషేక్ అజ్ఞానువర్తియై జపానును ప్రతిఘటించకుండా ఉన్నాడు. ఉత్తరచైనాను జపాను క్రమక్రమంగా కబళిస్తోండగా చియాంగ్ లొంగి ఊరుకోవడంతో చాంగ్‌సూలియాంగ్‌కు, ఆయన టుంగ్‌పే సైన్యాలకు అసంతృప్తికలిగింది. అంతేకాక వారి యిష్టవ్యతిరేకంగా అంతర్యుద్ధాన్ని కూడా సాగించవలసివచ్చింది. పైగా యెర్రసైన్యాలు దేశభక్తిని ప్రబోధిస్తూ ఐక్యసంఘటనను కోరుతున్నారు. 1935 అక్టోబరు, నవంబరు మాసాలలో యెర్రసైనికులతో పోరాడే టుంగ్‌పే సైనికుల్లోని మూటతొమ్మిదవ సైనికదళం ఎర్రసైన్యంలో చేరిపోయింది. అనేకమంది అధికార్లు కూడా ఎర్రసైన్యానికి పట్టుబడ్డారు. కాని జపాను వ్యతిరేక విధానం బోధించి వారిని వదిలివేయగా తిరిగివచ్చి చాంగ్‌సూలియాంగ్‌తో ఎర్రసైనిక నాయకులయొక్క జపాను వ్యతిరేక తను, దేశభక్తిని గూర్చి వింతగా చెప్పనారంభించారు. అందువలన చాంగ్‌కు, టుంగ్‌పే సైన్యాలకు యెర్రసైన్యాలయెడ ఆదరగౌరవా లేర్పడ్డాయి. "జపానీయులను మంచూరియానుండి తరిమివెయ్యండి." అని యెర్రసైనికులు చేస్తోన్న ప్రచారం వారికి నచ్చింది.

చాంగ్‌సూలియాంగ్ కూడ క్రమంగా అతివాదిగా మారాడు.
ఆయన చైనాలో జపాను వ్యతిరేక ఆందోళన జరిపే విద్యార్థుల కంద
రకూ సియాంగాపూలో రక్షణ యిచ్చాడు. షెన్సీరాష్ట్రంలోని జపాను వ్యతి
రేక సంఘాలు బహిరంగంగా పనిచేయజొచ్చాయి. క్రమంగా యెర్ర
సైన్యాలతో టుంగ్‌పే సైన్యాలు పోరాడ్డం మానివేశాయి. కమ్యూనిస్టు
లనేకులు టుంగ్‌పే సైనిక దుస్తులను ధరించి వారిలో రాజకీయ ప్రచారం
చేయ నారంభించారు. ఆర్థిక, సాంఘిక, రాజకీయ విషయాలపై బోధన
తరగతులను నడిపారు. చాంగ్‌సూలియాంగ్ కూడ విప్లవ భావాలను కలి
గిన యువకులకు సైన్యంలో ఉన్నత పదవుల నిచ్చి స్వయంగా ఉపన్యా
సాల్లో జపాన్ వ్యతిరేక భావాలను ప్రచారం చేస్తున్నాడు. కాని యీచర్య
లన్నీ అతి రహస్యంగా మాత్రమే జరుగుతున్నాయి.

షన్సీ, షెన్సీ, నింగ్సియాలలోమాత్రం నాన్కింగు సైన్యాలు
యెర్రసైనికులతో యుద్ధం చేస్తూనే వున్నారు. సియాన్‌లోవున్న చియాం
కేషేక్ గూఢచారులు మాత్రం అనుమానపడుతూనే వున్నారు. కాని
టుంగ్‌పే సైన్యాలకు, యెర్రసైన్యాలకు పరస్పరంమైత్రి యెంత దృఢంగా
వున్నదీ కనిపెట్టలేకపోయారు.

సెప్టెంబరు మాసంలో సూయువాన్‌ను ఆక్రమించేందుకు జపాన్
ప్రోద్బలంతో ప్రయత్నం జరుగుతున్నప్పటికీ దేశప్రజల ఆందోళనను
పెడచెవిని పెట్టిన చియాంగ్‌కేషేక్ యెడల ఉపసర్వసేనాధ్యక్షుడైన
చాంగ్‌సూలియాంగ్‌కు తీవ్రమైన అసంతృప్తి కలిగింది. 'ప్రజల కోర్కెను
మన్నించని యే ప్రభుత్వమూ నిలువ లేదు. జపానును ప్రతిఘటించుట
వల్లనే చైనా ఐకమత్యం నిలుస్తుందిగాని అంతర్యుద్ధం విరమించి సహాక
రిస్తామనే వారితో యుద్ధం కొనసాగించుటవలన కాదు.' అని చాంగ్
ప్రకటించాడు.

చియాంగ్‌కేషేక్ మాత్రం పెడచెవినిపెట్టి కన్సూలో యెర్ర
సైన్యాలతో యుద్ధం సాగించేందుకు సైన్యాలను పంపి స్వయంగా పర్య

వేశించుటకు అక్టోబరులో సియాన్‌ఫూ వచ్చాడు. అచ్చట వంద బాంబరు విమానాలుండేందుకు విమానాశ్రయం కట్టించాడు. టన్నుల కొలది టార్పెడోలను తెప్పించాడు. రెండువారాల్లో కమ్యూనిస్టనే శబ్దం వినపడకుండా చేస్తానని చియాంగ్ దంభాలు పలికాడు. కాని టుంగ్‌పే సైన్యాలలో కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం పనిచేయక పోవడాన్ని గుర్తించ లేదు. చియాంగ్‌తో చాంగ్‌సూలియాంగ్ జపానువ్యతిరేక జాతీయైక్య సంఘటనను గూర్చి ప్రస్తావించాడు గాని యెర్రసైన్యమింకా నాశనం కాకుండా ఆపనిని తాను తలపెట్టనని సమాధానమిచ్చి లోయాంగ్‌లోని ప్రధాన సైనిక కార్యాలయానికి వెళ్ళాడు చాంగ్‌సూలియాంగ్ మరల లోయాంగ్‌లో కలుసుకుని జపాను సైన్యాలతో పోరాడేందుకు టుంగ్‌పే సైన్యాలకు అనుజ్ఞ నీయవలసిందిగా కోరాడు కాని చియాంగ్ నిరాకరించాడు.

నవంబరు 21 వ తేదీన సుప్రసిద్ధమైన నాన్కింగు ప్రభుత్వ ప్రథమసైన్యం యెర్రసైన్యంచే ఓడింపబడింది. కాని యుద్ధంలో యెర్ర సైన్యాలు జపాన్ వ్యతిరేక ప్రచారంచేసి అనేకవిధాల అంతర్యుద్ధం విరమించాలని ప్రభుత్వ సైన్యాలకు విజ్ఞప్తులుచేశాయి. అందువలన ఒక పెద్ద పటాలం యెర్రసైన్యాలతో జేరింది. అనేక వేల రైఫిళ్ళు, మెషీన్ గన్లు యెర్రసైన్యానికి లభించాయి. హో సేనాని తిరోగమనం సాగించి చియాంగ్ ఆజ్ఞలకై వేచియున్నాడు.

ఈ పరిస్థితుల్లో 1936 డిసెంబరు 7 వ తేదీనాడు చియాంగ్ సర్వ సేనాధ్యక్షుడు సియాన్ వచ్చాడు. ఈ లోగా టుంగ్‌పే సేనానులు, యాంగ్‌హూచెంగ్ సైన్యంలోని సేనానులు సమావేశమై అంతర్యుద్ధం విరమించి జపాను సైన్యాన్ని ప్రతిఘటించాలని చియాంగ్‌ను కోరుటకు తీర్మానించుకున్నారు.

సైనికుల్లో వ్యాపించియున్న యీ భావాలు చూచాయగా గూఢ చారులవలన చియాంగ్ సేనాధ్యక్షునకు తెలిసియే యుండవచ్చును.

ఆయన మేనల్లుడైన చియాంగ్‌సియోపీన్ అధికారంక్రింద 1500 మంది గూఢచారిదళం సియాన్‌లో మకాంవేసి అనేక దురాగతాలు చేస్తున్నారు సియాన్ సంపూర్ణంగా వారి అధీనంలోవుంది. రెండురోజుల తర్వాత 9 వ తేదీనాడు అనేకవేలమంది విద్యార్థులు ఒక గొప్ప జపాన్‌వ్యతిరేక ప్రదర్శనం చేశారు షెన్సీగవర్నరు షోకుజూ అజ్ఞలపై తుపాకులను కాల్చి యిద్దరు ప్రదర్శకులను గాయపరిచారు

చియాంగ్‌కేషెక్ సేనానాయకుల రాయబార వర్గాన్ని చూమటకు నిరాకరించి. తన ఆరవ కమ్యూనిస్టు నిర్మూలన యుద్ధానికి ప్రణాళికను పూర్తిచేశాడు పైగా చాంగ్, యాంగ్‌లు యీ యుద్ధాన్ని కొనసాగించక పోతే వారి సైన్యాలను నిరాయుధంచేస్తానని కూడ బెదిరించాడు.

ఈ పై కారణాలవలన టుంగ్‌పే సైన్యాలకు, యాంగ్ సేనాని సైన్యాలకు మొత్తం ఒలక్ష, డెబ్బదివేలమంది అంతర్యుద్ధాన్ని తుద ముట్టించి, జపాన్‌తో యుద్ధం చెయ్యాలని కృతనిశ్చయులయ్యారు. ఈ విధానానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్న చియాంగ్‌ను నిర్బంధించాలని కూడ వారు నిశ్చయించారు.

## చియాంగ్ కై షేక్ నిర్బంధం.

డిసెంబరు 12 వ తేదీ ఉదయం 6 గంటలకు గవర్నరు షోను, బ్లూషర్టులను, పోలీసులను సంపూర్ణంగా నిరాయుధులను చేసి టుంగ్‌పే సైనిక తిరుగుబాటుదార్లు నిర్బంధంలో వుంచారు తెల్లవారుఝాము 3 గంటల సమయాన చియాంగ్‌కైషేక్ మకాంచేసిన లిన్‌టంగ్ అతిథి గృహాన్ని తిరుగుబాటుదార్లు చుట్టుముట్టారు. చియాంగ్ అంగరక్షకులు కొలదిసేపు వారిపై తుపాకులు కాల్చారు. గాని త్వరలోనే లొంగిపోయారు. ఈలోగా చియాంగ్‌కైషేక్ శయనగృహంనుంచి పారిపోయి పక్కనున్న కొండమీది కెక్కాడు. ఆయనకాలు తెగి గాయమైంది.

తిరుగుబాటు నాయకుడైన నణా ఆయనను వెదికి పట్టుకున్నాడు. "చైనా ప్రజల ఏకైక నాయకుడను. నేను చైనాజాతి ప్రతినిధిని. నేను చేస్తున్నదే సరైనదని యని నా నమ్మకం" అంటున్న చియాంగ్‌ను చాంగ్‌సూలి యాంగ్ గృహంలో నిర్బంధంలో వుంచారు.

వెంటనే చాంగ్‌సూలియాంగ్ కేంద్రప్రభుత్వానికి, రాష్ట్రనాయకులకు, చైనాప్రజ లందరకూ ఒక తంతి విజ్ఞాపన చేశాడు. "చియాంగ్ కై షేక్ యొక్క దేశభక్తిని రగుల్కొలిపేందుకు సియాన్‌లో మా అతిథిగా వుంచాము. ఆయన సురక్షితంగానే వుంటాడని దేశానికి హామీ యిస్తున్నాము. ఈ క్రింది అంశాలను అంగీకరించాలని వారికి మనవి చేశాం :

1. నాన్కింగు ప్రభుత్వాన్ని అన్నిపార్టీల ప్రాతినిధ్యంకోసం పునర్నిర్మించాలి.
2. అంతర్యుద్ధాన్ని తుదముట్టించి జపాను సైన్యాలను ప్రతిఘటించాలి.
3. షాంఘేలో నిర్బంధింపబడిన జాతీయ విముక్తి సంఘ నాయకులేడుగురినీ విడుదల చేయాలి.
4. ఎట్టిషరతులూ లేకుండా రాజకీయ ఖైదీలందరినీ విడుదల చెయ్యాలి.
5. ప్రజలకు సమావేశ స్వాతంత్ర్యాన్ని కలిగించాలి.
6. రాజకీయ స్వాతంత్ర్య నిర్మాణ స్వేచ్ఛాహక్కుల నివ్వాలి.
7. డాక్టరు సన్‌యట్‌సేన్ యొక్క మరణశాసనం అమలు వరచాలి.
8. జాతీయ విముక్తి సమావేశం వెంటనే జరపాలి."

ఈ ప్రకటనకు వెంటనే సోవియట్ ప్రభుత్వం తన సహకారాన్ని తెలిపింది. చాంగ్‌సూలియాంగ్ పంపిన విమానంపై చౌఎన్‌లే, ఏచీన్ యంగ్, పోకూలను ముగ్గురు ప్రధాన కమ్యూనిస్టు నాయకులు సియాన్ వచ్చారు. టుంగ్‌పే, సిపే సోవియటు ప్రతినిధుల సంయుక్త సమావేశం

జరిగింది. వారందరూ మిత్రమండలిగా జేరారు. వారి సైన్యాలు మొత్తం రెండు లక్షల అరవై వేలు. చాంగ్‌సూలియాంగ్ యీ జపాన్ వ్యతిరేక సైనిక సంఘానికి అధ్యక్షుడుగాను, యాంగ్‌హూచెంగ్ ఉపాధ్యక్షుడుగాను యెన్నుకోబడ్డారు. కన్సూలోనున్న నాన్కింగు ప్రభుత్వసైన్యాలను యీ సైన్యాలు చుట్టుముట్టాయి.

చియాంగ్‌కైషేక్ నిర్బంధపు వార్త చైనా ప్రజలకు అత్యంతాశ్చర్యాన్ని కలిగించింది. నాన్కింగులో గొప్ప కలవరం చెలరేగింది. అనేక విరుద్ధవార్తలు వ్యాపించాయి. వివిధ పక్షాల నాయకులు ప్రభుత్వాధికారాన్ని చేజిక్కించుకోవాలని ప్రయత్నించసాగారు. జపాన్ అనుకూలుడగు యుద్ధమంత్రి హోయింగ్‌చింగు తక్షణమే సియాన్‌ను ముట్టడించి యుద్ధ విమానాలతో బాంబులను గుమ్మరించి నేలమట్టం చెయ్యాలని బెదిరించనారంభించాడు. ఆయనకు తోడుగా వాంగుచింగువీ ముఠావారుకూడ యీ అంతర్యుద్ధాన్ని రెచ్చగొట్టాలని చూశారు. కాని చియాంగుకైషేక్ సతి, టి. వి. సూంగులుమాత్రం తొందరపడి చియాంగును బలిచెయ్యకూడదని తీవ్రంగా వాదించారు. పైగా హోయింగుచింగుకు తదితర సైనిక ప్రభువు లెవ్వరూ తోడుపడునట్లు కనిపించనందున యుద్ధప్రయత్నం విరమించాడు.

ఈలోగా సియాన్‌లో యాంగుహూచెంగు సైన్యాల్లోని తీవ్రవాదులు చేతికి దొరకిన చియాంగును వెంటనే చంపివేయవలసిందని కోరనారంభించారు. కాని కమ్యూనిస్టు నాయకులు యీవిధానాన్ని వ్యతిరేకించారు. చౌఎన్‌లే చియాంగుకైషేక్‌తో సంప్రతింపులు సాగించాడు. జాతీయైక్య సంఘటన నిర్మాణావశ్యకతను నొక్కిచెప్పాడు. పైగా చియాంగుకైషేక్ సురక్షితంగా నాన్కింగు చేరి, దేశద్రోహులైన తదితర నాయకులను తొలగదీసి, దేశాన్నంతటినీ జపాన్ ప్రతిఘటనా కార్యక్రమంలో ఐక్యపరచాలని ప్రబోధించారు. వేలకొలది కమ్యూనిస్టులను హతమార్చిన

చియాంగుకై షేక్ విడుదలను కోరడం అతివాదులందరికీ కూడా ఆశ్చర్యాన్ని కలిగించింది. కాని జాతీయైక్యతను కమ్యూనిస్టులు గాఢంగా వాంఛించి, చియాంగు జపానుతో పోరాడాలని కోరారు.

సోవియట్ ప్రభుత్వనాయకులు సోయాంలో సమావేశమై దేశభక్తి పూరితులై జపానువ్యతిరేక యుద్ధాన్ని కొనసాగించునట్లు చియాంగును ప్రోత్సహింపచెయ్యడమే సియాన్ నాయకుల ఉద్దేశమనీ, అంతర్యుద్ధాన్ని హోయింగుచిన్ ప్రేరేపించి జపాన్ సామ్రాజ్యవాదులకు తోడుపడుతున్నాడనీ వెల్లడించారు.

డిశెంబరు 14 నాడు చియాంగు సలహాదారుడైన డోనాల్డుసన్ అను ఆస్ట్రేలియన్ సియాన్ వచ్చాడు. చాంగుసూలియాంగు ఆయనను ఆహ్వానించాడు. 15 వ తేదీనాడు డోనాల్డుసన్ లోయాంగుకు తిరిగివెళ్ళి చియాంగు సురక్షితంగా వున్నాడని, ఆయని స్వదస్తూరిలోనున్న జాబును నాన్కింగు ప్రభుత్వానికి పంపుతున్నాడని ప్రకటించాడు. చాంగుసూలియాంగు కోరికపైని 20 వ తేదీని టి. వి. సూంగు సియాన్ వచ్చాడు. ఈ లోగానే చియాంగుకై షేక్, ఎర్రసేనానులు, చాంగుసూలియాంగులతో సంభాషించి వారితో కొన్ని నిర్ణయాలకు వచ్చాడు. వారు కోరిన ఎనిమిది కోరికల్లో అంతర్యుద్ధాన్ని ఆపి, ప్రజలకు యొక్క ప్రజాస్వామ్య హక్కులనిచ్చి, జపానుతో యుద్ధం చేయుటకు అంగీకరించాడు. చియాంగు సతి 22 వ తేదీనాడు వచ్చి యీ రహస్య సంభాషణల్లో పాల్గొంది. వారు చేసుకున్న ఒడంబడికలను మాత్రం పైకి వెల్లడిచేయకుండా చియాంగు దంపతులు డిసెంబరు 25 వ తేదీనాడు నాన్కింగుకు బయల్దేరారు. తిరుగుబాటుదారైన చాంగుసూలియాంగు తనంతట తానే లోబడి చియాంగుకైషేక్‌తో బాటుగా ప్రభుత్వం విధించబోయే శిక్ష ననుభవించుటకు నాన్కింగుకు మరియొక విమానంలో వెళ్ళాడు.

# 24 వ అధ్యాయం.

## అంతర్యుద్ధసమాప్తి.

రక్తప్లావిత అంతర్యుద్ధనాటకంలో ఆఖరి అంకం ప్రారంభ మైంది. సియాన్ ఉదంతం ముగిసిన తీరు ఆశ్చర్యం కొల్పుతుంది. చియాంగు, చాంగులు నాన్కింగునగరం జేరగానే "అవమాన భారంతో క్రుంగిపోతో క్రమశిక్షణను భంగపరచిన మహాపరాధానికి శిక్ష ననుభ వించుటకు తమతో వచ్చాను" అని చాంగ్‌సూలియాంగు అపరాధివలె చియాంగు ముందు మోకరిల్లాడు. "నా క్రింది ఉద్యోగస్తులయొక్క విశ్వాసం చూరగొనలేని నా అసమర్థత వలన అపూర్వమైన తిరుగుబాటు జరిగింది. పశ్చాత్తప్తుడనై క్షమార్పణ కోరావు కనుక కేంద్ర అధికారు లను తగుచర్యలు తీసికొనవలసినదిగా కోరుతున్నాను." అని చియాంగు కేషేక్ అన్నాడు.

చియాంగు నాన్కింగు జేరగానే తన ప్రధానమంత్రి పదవికి రాజీ నామా యిచ్చి, అంగీకరించవలసినదిగా కేంద్రప్రభుత్వాధికారులను కోరాడు. కాని మూడు పర్యాయములుకూడా వారు అంగీకరించక అయి ననే సర్వాధికారాలు యథారీతిగా పుచ్చుకొనవలసిందని ప్రార్థించారు. షెన్సీలోని ప్రభుత్వసైన్యాలన్నిటినీ వెనుకకు రప్పించి, అంతర్యుద్ధాన్ని ముగిస్తానని చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకున్నాడు. డిశెంబరు 29 తేదీ నాడు కేంద్రకార్యనిర్వాహకవర్గాన్ని సమావేశపరచి, "చాంగ్‌సూలి యాంగును విచారణచేసి శిక్ష విధించాలని. వాయవ్యసైనాసమస్యా పరిష్కారమును సైనికసంఘానికి వప్పగించాలనీ, తిరుగుబాటుదార్లపై దండయాత్రను ఆపవలసిందనీ, హోయింగ్‌చిన్ యొక్క ప్రధాన సైనిక కార్యాలయాన్ని రద్దుచేయాలనీ కోరి, వారిచే అంగీకరింపచేశాడు.

డిశెంబరు 31 తేదీనాడు చాంగ్‌సూలియాంగుకు పదిసంవత్స రముల కఠినవటుకము విధింపబడింది. కాని మరునాడు ఆఘాతా

క్షమింపబడ్డాడు. ఈ లోగా ఆయన టి. వి. సూంగ్ యొక్క అతిధిగా వున్నాడు. 1937 జనవరి 6 వ తేదీనాడు కమ్యూనిస్టు వ్యతిరేకయుద్ధాల్ని కొనసాగించేందుకు సియాంగులో నెలకొల్పబడిన ప్రధాన సైనికకార్యాలయం రద్దుచెయ్యబడింది. జపాను అనుకూలుడైన విదేశాంగమంత్రి యగు చాంగ్‌చూన్ రెండు రోజుల అనంతరం తొలగింపబడి, ఆ పదవి జపాను వ్యతిరేక "యూరపియన్ - అమెరికన్" ఓమీపే అను సంఘ నాయకుడగు డాక్టర్ వాంగుమంగ్‌హీ్వాకి యివ్వబడింది. ఈయన చాంగు షూలియాంగుకూ, ఎర్ర సేనానులకూ యిష్టుడు.

1937 ఫిబ్రవరి 10 నాడు కొమింటాంగు ప్రభుత్వానికి కేంద్రసోవియట్ ప్రభుత్వ మొక చరిత్రాత్మకమైన టెలిగ్రాం పంపింది. సియాన్ ఉదంతాన్ని శాంతియుతంగా పరిష్కరించినందుకూ, జాతీయైక్యతను సమకూర్చినందుకూ, అభినందిస్తో, డాక్టర్‌సన్ మూడు ప్రజాసూత్రాలనూ వాక్సభా పత్రికా సమావేశ స్వాతంత్ర్యాలను, జపాను వ్యతిరేక యుద్ధ విధానాలనూ అమలు పరుస్తో, అంతర్యుద్ధాన్ని పరిసమాప్తిచేయ ప్రార్థించారు. ఈ సూత్రా లంగీకరింప బడితే (1) సోవియట్లుకూడా నాన్కింగు ప్రభుత్వాన్ని కూలద్రోసే ప్రయత్నాలను విరమిస్తామనీ, (2) ఎర్రసైన్యం పేరుమార్చి జాతీయ విప్లవ సైన్యమని పేరు పెడతామనీ, (3) సోవియట్ ప్రభుత్వానికి చైనా ప్రజాస్వామికపు ప్రత్యేక ప్రాంతీయ ప్రభుత్వమని పేరు పెడతామనీ, (4) భూమి జప్తు విధానాన్ని ఆపివేసి, దేశ స్వాతంత్ర్యం కొరకు జపాను వ్యతిరేక యుద్ధాన్ని సాగించేందుకు సర్వ శక్తులనూ కేంద్రీకరిస్తామనీ విజ్ఞప్తి చేశారు.

ఫిబ్రవరి 15వ సమావేశమైన విస్తృతసమావేశంలో యీ టెలిగ్రాం విషయం యెవ్వరూ యెత్తుకొవలేదు. కాని వాంగుచింగ్వీ కూడ కమ్యూనిష్టుల నణచిన తర్వాతనే జపాను ప్రతిఘటన అను వాదాన్ని విరమించి -ఒనే పోగొట్టుకొన్న ప్రాంతాలను తిరిగి స్వాధీనపరచుకోవడం ప్రధాన

కర్తవ్యమని ప్రకటించాడు. తూర్పుహోపే, ఉత్తర చహార్ ప్రాంతాలను పునరాక్రమించాలనే తీర్మానంకూడా ఆమోదించబడింది. ఎంతకాలం నుంచో వాయిదా వేయబడుతోన్న ప్రజాకాంగ్రెస్సును నవంబరు 12 నాడు తప్పక సమావేశ పరచాలని నిర్ణయింపబడింది. ప్రభుత్వ శాఖ లన్నిటిలోను అన్ని రాజకీయ పక్షాలవారికి తగిన ప్రాతినిధ్య మివ్వాలని కూడా తీర్మానించారు. సమావేశంలో తుది దినంనాడు ఒక దీర్ఘమైన ప్రకటన చేశారు. గత పది సంవత్సరాల బందిపోటు జీవితంలో కమ్యూనిస్టులు సల్పిన ఘోర దురంతాలను యేకరువుపెట్టి, ఒకప్పుడు కొమింటాంగులో సద్గుణ పుంజముల వలె నుండిన ఆ కమ్యూనిస్టులు తర్వాత హంతకులుగా యెట్లు మారారోనని ఆశ్చర్యాన్ని వెల్లడించారు కమ్యూనిస్టులపై జాలి తలచి, వారి జీవితాన్ని సంస్కరించుకొని యీ దిగువ నుదహరించిన షరతుల నంగీకరించి జాతీయ ఐక్య సంఘటనలో జేరవచ్చునని తెల్పారు. (1) ఎర్రసైన్యాన్ని రద్దుపరచి, ప్రభుత్వ సైన్యాల్లో కలపాలి. (2) సోవియట్ ప్రజాస్వామ్యాన్ని రద్దు చెయ్యాలి. (3) సన్‌యట్‌సేన్ ప్రజాసూత్రాలకు విరుద్ధమైన కమ్యూనిస్టు ప్రచారాన్ని విరమించాలి. (4) వర్గపోరాటాన్ని మానుకోవాలి. ఈ ప్రకటనలో కమ్యూనిస్టుల ప్రధాన షరతులను అంగీకరించారు.

కొమింటాంగు మితవాదులు చియాంగుకై షేక్‌పై తిరుగబడకుండా యీ తంతు అంతా నడిపారు. ప్రతిపక్షమువారి ఐకమత్యాన్నికూడా చియాంగు చెడగొట్టి తన వ్యక్తిగత ప్రాబల్యాన్ని నిలుపుకున్నాడు. టుంగుపే, సిపీ కమ్యూనిస్టు సైన్యాల ఐక్యసంఘటన పోయి. నాన్కింగు ప్రభుత్వసైన్యాలు బలపడ్డాయి. దేశంలో చియాంగు, కమ్యూనిస్టు, చాంగు సూలియాంగులయొక్క పలుకుబడి అనేకరెట్లు పెరిగింది.

షెన్సీరాష్ట్రంలోని వీనదికి ఉత్తరాన వున్న భాగమంతా కమ్యూనిస్టుల పాలనలో వుంది. అరవై దెబ్భైవేల మైళ్ళ ప్రాంతమూ, ఇరవై

లక్షల ప్రజలూ సోవియట్ పాలనలో వున్నారు. 5,55,000 చదరపు మైళ్ళ విస్తీర్ణం కల చైనా తురుష్కస్థానంలో సగంకంటె పైగానే సోష లిస్టు భావాలు కలిగి కమ్యూనిస్టులయెడ సానుభూతి కలవారి పరిపాల నలో వుంది. తొమ్మిది లక్షల చదరపుమైళ్ళ విస్తీర్ణంగల బాహ్య మంగో లియా ప్రజాస్వామ్యంకూడా సంపూర్ణంగా మంగోలియను కమ్యూనిస్టుల ప్రాబల్యంలో వుంది. ఈ మూడు ప్రాంతాలూ కలిపి చైనా సామ్రాజ్యంలో మూడవవంతు విస్తీర్ణం వున్నాయి. కాని యీ ప్రాంతాలన్నీ బాగా వెనుక బడి వున్నాయి ఆర్థికంగానూ, పారిశ్రామికంగానూ చాలా అభివృద్ధి చెందవలసి వున్నాయి.

1937 ఏప్రిల్, మే, జూన్ మాసాల్లో చౌఎన్‌లే, జనరలిజ్మో చియాంగ్ రాయబారియైన చాంగ్‌చుంగు సేనానులు సల్పిన సంభాషణల ఫలితంగా సోవియట్ ప్రాంతాలపైగల ఆర్థికనిర్బంధాలన్నీ తొలగింప బడ్డాయి. కొమింటాంగు కమ్యూనిస్టు ప్రాంతాలకు రాకపోకలు, ఉత్తర ప్రత్యుత్తరాలు నిరాఘాటంగా సాగుతున్నాయి. సరిహద్దుల్లో కొమింటాంగు కమ్యూనిస్టు పతాకాలు రెండూ ప్రక్క ప్రక్కనే యెగురుతొచ్చాయి. ఈ విధంగా ఒక దశాబ్దం సాగిన అంతర్యుద్ధజ్వాలలు క్రమంగా చల్లారాయి.

అమెరికనుల వద్దనుండి బస్సులను కమ్యూనిస్టులుకొని బస్సు ప్రయాణం యేర్పాటు చేశారు. వారికి కావలసిన చిన్న యంత్ర పరికరా లన్నీ సేకరించుకొన సాగారు. గ్రంధాలు, పత్రికలు విరివిగా లభ్యమై కమ్యూనిస్టుల విజ్ఞానతృష్ణను తీర్చసాగాయి. ఉత్తరషెన్సీలో కమ్యూ నిస్టులు యేనానును రాజధానిగా చేసుకున్నారు. మే మాసంనాటికి చైనా లోని వివిధరాష్ట్రాలనుండి 2000 మంది విద్యార్థులు లూసూణా యెర్ర విశ్వవిద్యాలయంలో జేరారు. కమ్యూనిస్టు పార్టీస్కూలులో మంగోలులు, టిబెటన్లు, ముస్లిములు, పార్మోజావారు, మియోలు, లోలోలు, చైనీయులు కలిసి 500 మంది మార్క్సిజం అభ్యసిస్తున్నారు. అనేక సాంకేతిక విద్యాలయాలు తెరవబడ్డాయి.

ఏనానులోని కష్టపరిస్థితులను కూడా లెక్కచేయకుండా జూలై నాటికి 5000 మంది విద్యార్థులు వచ్చి చేరారు. అనేక సాంకేతిక విద్యా నిపుణులు పునర్నిర్మాణ కార్యక్రమం కొనసాగించేందుకు వివిధప్రాంతాల నుండి వచ్చారు. సుశిక్షితులైన విద్యార్థులనేకులు జపాను వ్యతిరేక ప్రచారాన్ని, సందేశాన్ని వాయవ్య చైనాలో వెదజల్లుతున్నారు.

కొమింటాంగు ప్రభుత్వం కలిగించిన యీ సదుపాయములకు ప్రతిగా కమ్యూనిస్టులు కూడా తమ ప్రభుత్వానికి ప్రత్యేకప్రాంత ప్రభుత్వమనీ, ఎర్రసైన్యానికి జాతీయ విప్లవసైన్యమనీ పేర్లుపెట్టారు. బహిరంగ సమావేశాల్లోను, స్థలాల్లోను, సన్‌యట్‌సేన్, చియాంగ్‌కైషేక్, మోసీ యాంగ్, చూతే, మార్క్సు, లెనిన్‌ల చిత్రపటాలు వ్రేలాడదీయబడు తున్నాయి. సన్‌యట్‌సేన్ యొక్క మూడు ప్రజాసూత్రాలను కమ్యూనిస్టులు ప్రచారం చేయసాగేరు. ధనికభూస్వాముల జమీందార్ల భూము లను జప్తుచేయుమానారు. యుక్తవయస్కులగు పౌరులందరకూ వివక్షత చూపకుండా ఓటింగు అధికారమిచ్చారు.

జనరల్ జోమ్కో చియాంగ్ పంపిన విమానంలో చౌఎన్‌లే కూలింగు వెళ్ళి జూన్ మాసంలో సంప్రదింపులు సాగించాడు. నవంబరు మాసంలో జరుగనున్న కొమింటాంగు కాంగ్రెసు సమావేశంలో కమ్యూనిస్టులకు కూడా ప్రాతినిధ్యమివ్వమని చౌఎన్‌లే కోరాడు. వారికి తొమ్మిది స్థానాలిచ్చేందుకు చియాంగ్ అంగీకరించాడు."

చైనారాజకీయ పక్షాలు అంతర్యుద్ధం ముగించి జాతీయైక్య సంఘటనలో సంఘటితపడటం, జపాను సామ్రాజ్యవాదుల కెంతమాత్రమూ యిష్టంలేదు. 1937 సంవత్సర ప్రారంభంలో బ్రిటను, జపాను ప్రభుత్వాలు రహస్య మంతనాలు సల్పారు. టైమ్సు పత్రిక మే 3 వ తేదీ సంచికలో "చైనాదేశంలో జపాను ఆక్రమించిన ప్రత్యేకస్థలాన్ని బ్రిటను గుర్తించుటకు సిద్ధంగా మున్నదని" ప్రకటింపబడింది. కాని

జపాను దురాశకు అంతులేకపోవుటచే ఆ ఉభయదేశాలకు అంగీకారం కుదరనందున ఆగస్టు 20 సంచికలో త్రైమాసపత్రిక "తూర్పు ఆశియాలో తోచినరీతిగా ప్రవర్తించేందుకు కోరే స్వేచ్ఛను జపాను, బ్రిటిషు వాణిజ్య బ్యాంకింగు సంస్థలకు నష్టం కలుగురీతిని వినియోగించేందుకు యెట్టి పరిస్థితులలోను బ్రిటను అంగీకరించదు" అని ప్రకటించింది. పిరికారి కొమింటాంగు పార్టీలోని జపాను అనుకూలురు ఐక్యసంఘటన యేర్పడకుండా ఆటంకాలు కల్పించేందుకు ప్రయత్నిస్తోనేవున్నారు. కాని ప్రజా ఒత్తిడికి జపాను దురాక్రమణ విధానానికి నాన్కింగుప్రభుత్వం జంకి యుద్ధసన్నాహాలు చేస్తోంది చైనాప్రభుత్వ ఉపప్రధానియైన డాక్టర్ హెచ్. హెచ్. కంగు యూరప్ పర్యటన సాగించి, అంతర్జాతీయ రంగంలో చైనాపలుకుబడిని అభివృద్ధిపరుస్తున్నాడు. ఆయన ఆయుధాలు, అప్పులు సంపాదించేందుకు విదేశ ప్రభుత్వాలతో రాయబారాలు సాగించాడు.

తీరని సామ్రాజ్యతృష్ణతో జపాను మరల చైనా భూభాగాన్ని కబళింప బూనుకుంది. జూలై 7 వ తేదీ అర్ధరాత్రి వాన్‌పింగ్ పట్టణంలో జపాను సైనికులు విన్యాసాలు జరుపుతోండగా చైనా రైల్వేగార్డు వారిపై తుపాకి కాల్చారని, నిందమోపి అదనపుసైన్యాలను తీసుకొనివచ్చారు. లుకోషియో ఉదంతమని యీ సంఘటన చరిత్రప్రసిద్ధికెక్కింది. జపాను వారు జూలై మాసాంతాన్ని పీకింగ్, టీన్‌ట్సినులను ముట్టడించగానే చైనాసైన్యాలు వీరోచితంగా పోరాడాయి. ఆ సందర్భంలో చైనాజాతి తరఫున జనరలిజ్మో చియాంగ్‌కేషేక్ "మానహానాన్ని కూడా హద్దూపద్దూ వున్నాయి. ఇక చేయవలసిన ఒకేఒక కృత్యం... జాతినంతా సంఘటితపరచి వీరోచితంగా పోరాడటమే! అంత్యవిజయం మాదేననే దృఢవిశ్వాసం నాకుంది!"

జూలై 31 వ తేదీనాడు జాతీయవిముక్తి సంఘనాయకులు ఖైదు నుంచి విడుదల చేయబడ్డారు. తదితర రాజకీయ కార్మిక నాయకులు

కూడా విడుదలచేయబడ్డారు. చైనాలోని వివిధ ప్రాంతాలనుండి జపానును తీవ్రంగా ప్రతిఘటించవలసిందని ప్రభుత్వాన్ని ప్రజలు కోరజొచ్చారు. షన్సీనుంచి యెన్సీషాన్, క్వాంగ్సీనుంచి పేచుంగసీ, యునాన్‌నుండి లూంగ్‌యూన్ మున్నగు సైనికనాయకులు నాన్కింగువచ్చి, జపాను వ్యతిరేకయుద్ధంలో ప్రభుభక్తి పరాయణతతో పాల్గొంటామని ప్రతిజ్ఞలు చేశారు. ఆగస్టు 11 వ తేదీనాడు జపానువారు షాంఘేను ముట్టడించి నందున జాతీయప్రభుత్వం యుద్ధం సాగించ జొచ్చింది.

1937 సెప్టెంబరు 23 వ తేదీనాడు కమ్యూనిస్టుల యొక్క సంధి షరతులను చియాంగ్‌కై షేక్ బహిరంగంగా అంగీకరించి అంతర్యుద్ధాన్ని సమాప్తిచేసి జపాన్ వ్యతిరేకయుద్ధాన్ని సాగించాడు.

